# ఆంధ్ర ప్రబంధాలు
# శృంగారం - ప్రయోగాలు

హైదరాబాదు విశ్వవిద్యాలయం
డాక్టరేట్ పట్టం కొరకు సమర్పించబడ్డ
సిద్ధాంత వ్యాసం


రచయిత

**డా. బి. జయరాములు**

**Andhra Prabandhalu**
**Sringaram - Prayogalu**

**ఆంధ్ర ప్రబంధాలు**
**శృంగారం - ప్రయోగాలు**

First Edition, 500 Copies
March, 1991

ప్రథమ ముద్రణ 500 ప్రతులు
మార్చి, 1991

Price Rs. 75/-

వెల : రూ 75/-

Copies Can be had of :

ప్రాప్తి స్థానం :

1) Gayathri Publishers
Andhra Saraswatha Parishat
Tilak Road, Hyderabad

1) గాయత్రి పబ్లిషర్స్
ఆంధ్ర సారస్వత పరిషత్
తిలక్‌రోడ్, హైదరాబాద్

2) Abhyudaya Oriental College
Jiaguda, Hyderabad-6

2. అభ్యుదయ ప్రాచ్య కళాశాల
జియాగూడ, హైదరాబాద్.

Printed at : **Gayathri Art Printers**
5-9-33, Near New MLA Qurt
Basheerbagh, Hyderabad - 500 029.
Phone No. 230 210

ముద్రణ : గాయత్రి ఆర్ట్ ప్రింటర్స్
5-9-33, న్యూ ఎం ఎల్. ఏ. క్వార్టర్స్ దగ్గర
బషీర్‌బాగ్, హైదరాబాద్ - 500 029.
ఫోన్ : 230 210.

---

**తెలుగు విశ్వవిద్యాలయం వారి ఆర్థిక సహాయంతో ముద్రింపబడింది.**

---

# అంకితం

గురుత్రయానికి,



బ్రాహ్మణపల్లి - రాధాకృష్ణయ్య

కష్టాన్నే నమ్ముకొని
కమనీయ హృదయంతో
కని పెంచిన కన్న తండ్రి
ప్రథమ గురువు



కె సోమేశ్వరశర్మ M. O. L.

నియమబద్ధ జీవనుడు,
నాజీవన్మార్గ దర్శకుడు
నా పినతండ్రి
ద్వితీయ గురువు



కీ॰ శే॰ బి సత్యనారాయణ

నా సాహిత్య విద్యకు
నారు, నీరు పోసిన
నిష్కల్మష హృదయుడు
నాసోదరుడు
తృతీయ గురువు

# ముందుమాట

తెలుగు సాహిత్యంలో ప్రబంధ యుగానికి ఓ ప్రత్యేక ప్రతిపత్తి ఉంది. తెలుగులో 11వ శతాబ్దంలో కావ్యరచన ఆరంభం అయినా 16వ శతాబ్దంలోనే స్వతంత్ర కావ్యరచన ప్రారంభమైందని చెప్పొచ్చు. 'ప్రబంధం' అనేది సాధారణ కావ్యవాచిగా 15వ శతాబ్దం వరకూ ఉండి 16వ శతాబ్దంలో అది ఒక విశిష్ట ప్రక్రియగా రూఢి అయింది మహాకావ్య లక్షణాల్ని ఎన్నిటినో తనలో ఇముడ్చుకొని శృంగారమే ప్రధాన రసంగా భాసించింది అలంకార శాస్త్రకారులు నిర్మించిన అన్ని ప్రస్థానాలలో ప్రబంధ కవులు పయనించినా, రస ప్రస్థానానికి తక్కినవి బాసటగా నిల్చేట్లు, అందునా శృంగార రసమే ప్రబంధ లక్ష్మికి తిలకాయ మానంగా ఉండేట్లు తీర్చిదిద్దారు ఆ దిద్దడంలో కవులు అపురూపమైన పోకడలు పోయారు అందువల్ల యుగం అంతా ఒకే రసం (శృంగారం) రాజ్యం చేసినా వైవిధ్యం కొరవడలేదు

ప్రబంధాలు, ప్రబంధ సాహిత్యం అనగానే శృంగారం, అంగాంగ వర్ణన గుర్తుకొస్తుంది ప్రబంధాల్లోని రసం గురించి పరిశోధించిన వారు అనేకులు విభావాది సామగ్రిని విశ్లేషించి, శృంగారరసం పోషింపబడ్డ తీరును గురించే విమర్శించారు ప్రబంధాల్లో - ప్రపంచించ బడ్డ శృంగారాన్ని సూక్ష్మదృష్టితో చూస్తే కవులు శృంగారంలో అనేక రకాల ప్రయోగాలు చేసినట్లు మనం గుర్తించగలం ఆలంకారిక మార్గంలో చక్కగా శృంగారాన్ని ప్రయోగించిన వారివి సాంప్రదాయిక ప్రయోగాలని, ఈ మార్గంలో నడుస్తూ కొంత పక్కకు జరిగి, నూత్నత్వాన్ని మేళవించిన వారివిమిశ్ర ప్రయోగాలని, ఆలంకారిక మార్గాన్నుంచి పూర్తిగా పక్కకు తొలగి, నూతనంగా కొత్త తరహాలో ప్రయోగాలు చేసిన వారివి నవ్య ప్రయోగాలని గుర్తించాను నవ్య ప్రయోగ ప్రయోక్త పింగళి సూరన, తన కళాపూర్ణోదయంలో వినూత్న (సుగాత్రీశాలీనులు) విచిత్ర (కలభాషిణీ, మణి కంధర; రంభానలకూబరులు), విపరీత (సుముఖాసత్తి, మణిస్తంభులు) పద్ధతులలో మూడు నవ్య ప్రయోగాలు చేసారు అల్లసాని పెద్దనగారు 'రసాభాసం' అనే ఆలంకారిక పద్ధతిలో పయనిస్తూ, తత్పరిహారం, నిరంతర శృంగారం అనే కొత్త పద్ధతిలో మిశ్రప్రయోగాల్ని చేసారు. తిమ్మన, రామరాజ భూషణాది కవులంతా వైవిధ్యం కలిగిన సాంప్రదాయిక ప్రయోగాల్ని చేసారు ప్రయోగం ద్వారా రసానందం కలుగుతుందా? అనే శంక కొందరిలో ఉంది. ప్రయోగం ప్రయోగం లాగా మిగిలిపోతే రసానందం లభించక పోయేదేమో కాని ప్రబంధ కవులు తమ తమ ప్రయోగాల్ని రస పర్యవసాయులనుగా చేసారు. ఈ ప్రయోగాల్ని వెలికి తీయాలనే నేను నా పరిశోధనలో ప్రయత్నం సాగించాను. దానికి భూమికగా శృంగారమే రసరాజం, అంగిరస చర్చ, శృంగార పోషణం - అనే విషయాల్ని విమర్శించాను

శృంగార రసానికి కవులు, ఆలంకారికులు అత్యంత ప్రాధాన్యాన్ని ఇచ్చారు. రస సామగ్రిని వివరించేప్పుడు శృంగార సాధనాల్ని విశ్లేషించి చూపినంతగా మిగిలిన రసాలకు

చూపలేదు విమర్శకులచే, అలంకారికులచే దీని ప్రాధాన్యం అత్యంతంగా వివరించబడింది. దీని ఉత్పత్తి లక్షణాలు, సాధన సామగ్రి విపులంగా వివరించబడ్డాయి. చతుర్విధ పురుషార్థాలలోని 'కామమే' శృంగారానికి మూలం అనవచ్చు. లౌకికం, అలౌకికం అనే భేదం మాత్రం రెంటికీ ఉంది భోజుడు శృంగారానికి అహంకారం మూలం అన్నాడు. ఇది గర్వంకాదు. సాత్త్వికాహంకారం అలంకారికులు శృంగారంలో అనేక భేదాల్ని చెప్పారు. కొందరు విమర్శకులు శృంగారాన్ని శాస్త్రీయంగా మనో విజ్ఞాన శాస్త్రాన్ననుసరించి విశ్లేషించారు ఈ శృంగారం ఇహపర సాధకమైంది. 'అద్వైతం' అనే తాత్త్విక సిద్ధాంతం దీంట్లో భాసిస్తుంది ఈ లక్షణాలన్నిటి వల్లా, దాని ఇతర గుణాల వల్లా 'శృంగారమే రసరాజం' అని మొదటి అధ్యాయంలో నిర్ణయించాను

ఆముక్తమాల్యద, మనుచరిత్ర మున్నగు ప్రబంధాలలో 'అంగిరస' విషయంలో అభిప్రాయ భేదాలున్నాయి వాటిని పరిశీలించి వాటిలోని అంగిరసం శృంగారమే అని నిర్ణయించాను. అది అంగిరసం కాని చోట్ల వేరొక దాన్ని నిర్ణయించాను ఆ తర్వాత ఒక్కొక్క ప్రబంధంలో ఆ శృంగారం విభావాది సాధన సామగ్రిచే పోషించబడ్డతీరును పరిశీలించాను వల్లాదుర్గయ్యా గారు తమ 'ప్రబంధ వాఙ్మయ వికాసము'లో ఇచ్చిన 16వ శతాబ్ది ప్రబంధాల క్రమ పట్టికను అనుసరించి ఒక్కొక్కదాన్ని పరిశీలించాను. ఈ పరిశీలనలో ద్వ్యర్థి కావ్యాలు, శాస్త్ర కావ్యాలు గ్రహించలేదు. రెండవ తరగతికి చెందిన ప్రబంధాలలో ఒకటి, రెండు మాత్రం గ్రహించి, స్థాలీ పులాక న్యాయంగా పరిశీలించాను. కళా పూర్ణోదయం లాంటి ప్రబంధాలలో విభావాది యుక్తమైన శృంగార పోషణ కానరాదు అలాంటి వాటిలో ఘట్టాల వారిగా శృంగారం పోషింపబడ్డతీరును పరిశీలించాను. ఈ పరిశోధన అంతా 'ఆంధ్ర ప్రబంధాలు - శృంగారం' అనే రెండవ అధ్యాయంలో చేసాను.

ఇక మూడవ అధ్యాయం అయిన 'ప్రబంధ శృంగారం-ప్రయోగాలు' అనే దాంట్లో ప్రయోగ శబ్దాన్ని నిర్వచించి, ఏయే ప్రయోగాల్ని ఏయే కవులు చేసారో విమర్శించాను విశేష ప్రయోగాలు చేసిన వారు పెద్దన, సూరన గారలు వారిలో పెద్దవాడూ, మిశ్ర ప్రయోగాలకు ఆద్యుడూ అయిన పెద్దన గారి ప్రయోగాలను ముందు విశ్లేషించాను. తర్వాత సంప్రదాయ ప్రయోగ కర్తల్లో పెద్దవారైన తిమ్మనగారి ప్రయోగాల్ని పరిశీలించాను. ఆ తర్వాత నవ్య, సాంప్రదాయిక ప్రయోగాలు రెండూ చేసిన సూరన గారి ప్రయోగాల్ని పరిశీలించాను. అనంతరం సంప్రదాయ మార్గంలో ప్రయోగాలు చేసిన కవి పోషకుడు, అయిన రాయలు, సంప్రదాయ ప్రయోగమూర్తి భట్టుమూర్తి ప్రయోగాలను విమర్శించి, తదనంతరం వారి మార్గంలో పయనించిన ప్రబంధ శృంగార ప్రయోగ కర్తలందర్నీ వరుస క్రమం లేకుండానే పరిశీలించాను ఇందు వారి వారి ప్రధాన ప్రయోగాలు మాత్రమే విమర్శించ బడ్డాయి.

**రచయిత**

# కృతజ్ఞతా నివేదనం . ... ... .

ఆంధ్ర సాహిత్యాన్ని ఆపోశనం పట్టిన అపరఅగస్త్యులుమాగురువర్యులు ఆచార్య జి వి. సుబ్రహ్మణ్యంగారు. విమర్శకులుగా, మంచి వక్తలుగా ఆంధ్ర సాహిత్య లోకంలో వీరిని ఎరుగని వారుండరు వీరు నాకు పరిశోధనాంశాన్ని సూచించడమే గాక నన్ను అడుగడుగునా ప్రోత్సహిస్తూ అన్ని విషయాలలో నాకు మార్గదర్శకులుగా ఉన్న వీరికి నాకృతజ్ఞతా పూర్వక నమస్సుమాంజలులు.

గుణ విశేషాల్నిబట్టి విద్యార్థుల వెన్నుతట్టే స్వభావంగల ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావుగారు నాకు పరిశోధనావకాశం కలిగించారు. వీరికి, హైదరాబాదు విశ్వవిద్యాలయ అధికారులకు హృదయ పూర్వక ధన్యవాదాలు

పుస్తకం అచ్చువేసే వేళ ప్రూఫులు దిద్దడంతోబాటు, తదితర విషయాల్లో సహాయ సహకారాలందించిన సహృదయులు, మంచి మిత్రులు, సహాధ్యాపకులు అట్లా వేంకటరామిరెడ్డి గారికి ప్రత్యేక కృతజ్ఞతలు.

అడిగిన వెంటనే ఆప్యాయతతో, అమృత హృదయంతో తమ అమూల్య అభిప్రాయాల్ని వ్రాసిచ్చిన ఆచార్య రవ్వా శ్రీహరిగారికి, ఆచార్య జి వి. సుబ్రహ్మణ్యంగారికి భక్తిపూర్వక కృతజ్ఞతలు

వ్రాత కాపీని సిద్ధం చేయడంలో తోడ్పడ్డ వారు మోత్కూరు సత్యనారాయణశాస్త్రి,ఎం వేంకటేశ్వరరావు, వై నరసింహమూర్తి, నరసింగరావు గారలకు ప్రేమ పూర్వక కృతజ్ఞతలు.

కవరు పేజి ఆర్ట్ వేసిన అంజన్‌బాబుగారికి,అందంగా అచ్చువేసిచ్చిన గాయత్రీ ఆర్ట్ ప్రింటర్స్ అధిపతి యం. గోపాలకృష్ణమూర్తిగారికి, నాపుస్తక రచనకు ప్రత్యక్షంగా, పరోక్షంగా తోడ్పడ్డ వ్యాస రచయితలకు, పుస్తక రచయితలకు నా కృతజ్ఞతలు

రచయిత

# అముద్రితాల గురించి. .. .. .. .. .

నా విద్యార్థి దశలో 'గబ్బిలం' గురించి (M.O.L. ఫైనల్‌లో ఉన్నప్పుడు) ఒక చిన్న పరిశోధనా వ్యాసం వ్రాసాను దానిలోని వస్తువును, రచనా విధానం, కవన పద్ధతుల్ని పరిశీలించి గుఱ్ఱం జాషువాగారు సంప్రదాయ, భావ, అభ్యుదయ మార్గాలలో పయనించి ఉండడం వల్ల 'మార్గత్రయ సమన్వయి - జాషువా' అని సిద్ధాంతీకరించి ఉంటిని. 'గబ్బిలం'లో కవి ఆత్మీయతను వివరించాను ఈ గ్రంథం పేరు 'గబ్బిలం - ఒక పరిశీలన'.

నేను ఎం ఫిల్‌లో 'సాంత్వన కావ్యాలు - శృంగార నాయికలు' అనే సిద్ధాంత వ్యాసాన్ని వ్రాసాను దానిలో సాంత్వనకావ్య స్వరూప స్వభావాల్ని పరిశీలించాను. నాయిక ప్రవృత్తిని బట్టి సాంత్వన విధానం మారుతుందా? అనే విషయాన్ని చర్చించాను సాంత్వన కావ్యాలపై 'పారిజాతాపహరణం' యొక్క ప్రభావాన్ని వివరించాను అష్టవిధ శృంగార నాయికలలాగానే ప్రత్యేక లక్షణాలు కలిగి ఉన్న సాంత్వన కావ్యాలలోని నాయికల్ని పరిశీలించి, 'సాంత్వన నాయికాను ఒక ప్రత్యేక నాయికగా ప్రతిపాదించాను

ఈ పై రెండు గ్రంథాలు త్వరలోనే వెలుగు చూడగలవని ఆశిస్తున్నాను

**రచయిత**

**G. V. Subrahmanyam**
M A , Ph D ,
Professor of Telugu &
Dean, School of Humanities

UNIVERSITY OF HYDERABAD
Central University PO
Hyderabad – 500 134

# పరిశోధనలో ఒక మంచి ప్రయోగం

తెలుగువారు సగర్వంగా చెప్పుకొనే కావ్యప్రక్రియ 'ప్రబంధం' దాని అస్తిత్వాన్నీ, వ్యక్తిత్వాన్నీ ఎంతో కాలంనుంచి అనుభవిస్తున్నా, దాన్ని ఆవిష్కరించటానికి కడచిన నూరునూటయాభైయేళ్లుగా ఆంధ్రకవులు, విమర్శకులు, సాహిత్యచరిత్రకారులు విశేషమైన కృషి చేస్తున్నారు ఇందులో గమనించదగిన ప్రత్యేకత ఒకటి ఉంది 'ప్రబంధం' ఒక ప్రత్యేక వ్యక్తిత్వం గలిగిన ఆంధ్ర కావ్యవిశేష ప్రక్రియ అని అందరూ గుర్తించారు అయితే, ఆ విశిష్ట వ్యక్తిత్వాన్ని ఎలా నిరూపించాలి? ఎలా విలువకట్టాలి? ఎలా విశ్లేషించాలి? అనే మార్గాలలో భిన్నభిన్నమైన దృక్పథాలను, ప్రమాణాలను, విమర్శ సూత్రాలను ఆశ్రయించారు ఏ మార్గంలో నడిచిన వారైనా ప్రబంధం ఆంధ్ర సాహిత్య వికాసంలో నిర్వహించిన ప్రత్యేకపాత్రను గుర్తించి వర్తించక తప్పటంలేదు ప్రబంధాన్ని పడతిట్టే విమర్శకవర్గం కూడా ప్రబంధ ప్రశస్తిని మరుగుపరచ లేక పోతున్నది దాదాపు ఈ ఇరవయ్యో శతాబ్దమంతా ప్రబంధ ప్రక్రియను గురించి పండితులు పరిపరివిధాల పరిశీలనలు, వాగ్వివాదాలు, చర్చోపచర్చలు, వ్యాసపరంపరలు సాగించినా దాని సమగ్రతత్త్వాన్ని దర్శించలేకపోయారు ఇంకా, దానివైపు ఆసక్తితో ప్రస్థానం సాగిస్తూనే ఉన్నారు. డాక్టర్ బి జయరాములుగారి ఈ సిద్ధాంత వ్యాసం ఆధునిక విమర్శక పరిశోధకులు ప్రబంధ తత్త్వదర్శన ప్రస్థానంలో సాగించే రసయాత్రలో ఒక విలువైన యానపాత్రం

ప్రబంధం' కావ్యప్రక్రియ కావ్యప్రక్రియ ఒక సాహిత్య దర్శనం నుండి ఉద్భవిస్తుంది. ఒక విశిష్ట అనుభూతి నందించే కవితాశైలిలో జీవిస్తుంది జీవించే స్వభావానికి అనుగుణమైన వస్తువును సంతరించుకొంటుంది తదితర కావ్యార్థ సంభార మంతా తదనుగుణంగా అమర్చుకొంటుంది. ప్రక్రియ యొక్క

అనుభూతిని నిర్ణయించే ద్రవ్యాలు ప్రధానంగా మూడు ఒకటి: దర్శనం; రెండు: రసం; మూడు  కవిత్వాశైలి తెలుగు సాహిత్యంలో ప్రబంధ స్వరూపస్వభావ వివేచనంలో ఈ మూడింటిని గురించిన వివేచన విరివిగా సాగింది అయితే, అందులో ముఖ్యంగా మూడు మార్గాల ఆలోచనలు కనపడతాయి

1. సంస్కృత సాహిత్య ప్రక్రియాదృష్టితో ప్రబంధ వ్యక్తిత్వాన్ని నిరూపించే మార్గం తెలుగులో వెలువడే సాహిత్య ప్రక్రియలన్నీ సంస్కృతంలో వెలువడిన వాటికి ప్రతికలో, ప్రతిబింబాలో అని భావించే ప్రవృత్తి దీని పునాది ప్రక్రియా లక్షణాలన్నీ సంస్కృత లక్షణ గ్రంథాలలోనుంచి గ్రహించటం, వాటికి అనుగుణంగా తెలుగులో కావ్య ప్రయోగాలు ఉన్నాయా? లేదా? అని పరిశీలించటం ఈ పద్ధతిలో కనపడే విమర్శసూత్రం సంస్కృత లక్షణ గ్రంథాల ననుసరించి ప్రబంధమన్నా, కావ్యమన్నా, మహాకావ్య మన్నా ఎటువంటి స్వరూప స్వభావాలుగల ప్రక్రియను భావించటానికి వీలున్నదో దానినే ఆంధ్ర ప్రబంధ లక్షణ ప్రమాణంగా గ్రహించటం ఈ విమర్శసూత్రాన్ని పాటించేవారి పద్ధతి. వారి దృష్టిలో కావ్య, మహాకావ్య, ప్రబంధ ప్రక్రియలకు భేదమంతగా కానరాదు తెలుగువారికి కావ్యాలన్నా, ప్రబంధాలన్నా ప్రత్యేక ప్రక్రియలనే స్ఫూహ నైజంగా ఉంది ఈ మార్గంలో ఆ అనుభవసత్యం పరిగణనలోకిరాదు. అందువల్లనే ప్రబంధ ప్రత్యేక ప్రతిపత్తిని గుర్తించని సంస్కృతలక్షణ ప్రమాణవాదుల విమర్శలు 'ప్రబంధ' ప్రక్రియ వ్యక్తిత్వాన్ని నిర్ణయించటంలో తోడ్పడిందాని కంటే దానిని గురించి దురవగాహనను పెంచటంలో తమ శక్తియుక్తులను వినియోగించాయి

2. 'ప్రబంధం' తెలుగువారి సొంత సాహిత్య ప్రక్రియ అనిభావించి నిరూపించే మార్గం. తెలుగు సాహిత్యం మీద సంస్కృత ప్రాకృతాది సాహిత్యాల ప్రభావం ఉండవచ్చునుగాని దానిని కూడా ఒక అస్తిత్వం, వ్యక్తిత్వం, పరిణామగతి సూత్రం, వికాస విధానం ఉంటుందని నమ్మేవారు ఈ మార్గానికి చెందుతారు వీరి దృష్టిలో ప్రబంధం తెలుగులో వెలువడిన ప్రత్యేక ప్రక్రియ ఈ సత్యాన్ని గుర్తించింది. ఈ శతాబ్ది పండితులే తెలుగులో మరే ప్రక్రియకూ ప్రత్యేక లక్షణాలను రూపొందించుకొనటానికి ముందుకురాని మన విమర్శకులు ప్రబంధ

లక్షణాలంటూ ఏర్పరచుకొన్నారు ఈనాడు ప్రబంధ లక్షణాలంటే లక్షణ గ్రంథాలలోని లక్షణాలు తెలుగువారు చెప్పుకోరు విమర్శకు లేర్పరచిన సాపేక్ష సూత్రాలనే ప్రమాణాలుగా గ్రహిస్తున్నారు. ప్రబంధాలను తెగడేవారికీ, పొగడే వారికీ కూడా ఈ ప్రమాణాలు ప్రాతిపదికలుగా నిలవటం గమనిస్తే ప్రబంధ ప్రక్రియ యొక్క తెలుగుదనం కొట్టవచ్చినట్లు కనపడుతుంది

3 ఒక విశిష్ట సాహిత్య ప్రక్రియ ఆవిర్భవిస్తున్నదంటే దానివెనుక ఒక విశిష్ట సాహిత్యదర్శన మార్గం సాహిత్యక్షేత్రంలో తన ప్రభావానికి ప్రయత్నం చేస్తున్నదన్న మాట! సాహిత్యదర్శనంలో వచ్చే పరిణామమే సాహిత్య వికాసంలో అంతర్గతి సూత్రాన్ని నిర్దేశిస్తుంది అది అవగాహనం చేసుకోకపోతే సాహిత్య ప్రగతిలోని పరమార్థం తెలియదు తెలుగు సాహిత్యంలో నన్నయ కావ్య ప్రయోగాల తరువాత శివకవుల రచనలు, తిక్కన, ఎఱ్ఱన, శ్రీనాథాదుల రచనలు ఆయా కాలాలలో ఆయాప్రక్రియలలో అటువంటి ప్రయోగాలుగా ఎందుకు వెలువడ్డాయి? అది వట్టి చారిత్రకంగా ఏర్పడిన సన్నివేశక్రమమా? లేదా కాలక్రమంగా సాహిత్య దర్శనంలో వచ్చిన పరిణామ ప్రభావమా? అన్నది నేడు విమర్శకులు ఆలోచిస్తున్న వైఖరి. దాదాపు 1960వ సంవత్సరం నుండి నేను ఈ మార్గంలో ఆలోచిస్తున్నాను. కొన్ని క్రొత్త సమన్వయాలను ప్రతిపాదించాను కూడా ప్రబంధానికి తెలుగు విమర్శకులు చెప్పే లక్షణాలూ, అవి అన్ని ప్రబంధాలకూ అన్వయం కాక విమర్శకులు చేస్తున్న చర్చలూ నన్ను కలవరపరిచాయి. దర్శనం దాకా మౌలికంగా ఆలోచించవలసిన అవసరం ఉన్నదని అనుకొంటూండేవాణ్ణి. ఈ మార్గంలో నడుస్తున్న నేను కనుగొన్న కొన్ని సత్యాలను పేర్కొంటాను

1 ప్రబంధాలు ప్రతీకాత్మక ప్రవృత్తి కలిగిఉంటాయి.

పబంధాలు రసపోషణలో ఎన్నిరకాల ప్రయోగాలు చేయటానికి వీలుందో అన్నింటినీ తెలిసి చేసి చూపించిన ప్రౌఢకావ్య ప్రయోగాలు.

3. కవిత్రయ దర్శనం ధ్వనిప్రస్థానం; శ్రీనాథ దర్శనం రసానుకూల రీతి ప్రస్థానం, అలాగే ప్రబంధకవులది అలంకార ప్రస్థానం అంటే, ప్రబంధ ప్రక్రియకు ప్రాతిపదిక అలంకార ప్రస్థానం. ఆ ప్రస్థానంలో శిఖరప్రాయమైనది ' వక్రోక్తి

జీవితం' ప్రబంధ ప్రయోగాలన్నీ 'వక్రోక్తి జీవిత' తత్త్వాన్ని జీవచైతన్యంగా ఫలచుకొన్నవే ఇది నేను ప్రతిపాదించి వివరించిన ఆధునిక సత్యం (చూడు వివరాలకు నాగ్రంథం సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు: తెలుగు అకాడమీ ప్రచురణ 1991). నేను ప్రతిపాదించిన నవ్య సమన్వయాల వలన 'ప్రబంధం' కావ్యం కంటే సాహిత్యదర్శన రీత్యా ఎలా భిన్నమైనదో స్పష్టమౌతున్నది ప్రబంధాల్లోని ఆలంకారిక శైలుల వెనుకనున్న సైద్ధాంతిక ప్రాతిపదికలు స్పష్టమౌతున్నాయి; ప్రబంధ కథలు అలా ఎందుకున్నాయి, వర్ణనల కటువంటి ప్రత్యేకస్థానం ఎందు కేర్పడింది, పాత్రల చిత్రీకరణంలో సాహిత్యచరిత్రలో ఏయుగంలోనూ లేనంత ప్రశస్తిని ప్రబంధయుగం ఎలా సాధించ గలిగింది? చివరకు, రసపోషణ విధానంలో ప్రబంధ కవులు ఇన్ని అపూర్వప్రయోగాలు ఎలా చేయగలిగారు? ఇటువంటి మౌలికమైన కావ్యనిర్మాణ రహస్య విశేషాల కన్నింటికీ సహేతుకమైన, శాస్త్రీయమైన సమన్వయాన్ని, సమాధానాన్ని ఇవ్వటానికి నా ప్రతిపాదనలు ఈనాడు సాహితీ జగత్తుకు తోడ్పడుతున్నాయి ఈ మూడవ మార్గమే నాకు తెలిసినంతవరకు నిజమైన నిండైన విమర్శసూత్రం

డా బి జయరాములు సంస్కృతాంధ్ర సాహిత్యాలను బాగా చదువుకొన్నవారు అధ్యయన అధ్యాపన కుశలురు వారు హైదరాబాదు విశ్వవిద్యాలయంలో పరిశోధన చేయటానికి సంకల్పించటం, వారికి ప్రబంధ సాహిత్యం మీద అభిమానం ఉండటం, చర్చల తరువాత వారికీ, నాకూ కొన్ని అభిప్రాయాలు సజాతీ యాలుగా ఉన్నట్లు స్పష్టం కావటం; ఏ క్రొత్త విషయాన్నైనా సత్యాన్వేషణ దృష్టితో గ్రహించే నిష్పాక్షిక దృక్పథం వారికి సహజంగా ఉండటం - ఇవన్నీ సమకూడటంతో ఈ పరిశోధన ప్రణాళిక రూపొందింది; డాక్టరేట్ పట్టా వచ్చింది; నేడీ గ్రంథంగా వెలువడింది

ఇందులో మూడు అధ్యాయాలున్నాయి. పరిశోధనాంశాన్ని పరిపుష్టం చేయటానికి అవసరమున్న అంగాలను మాత్రమే ఎన్నుకొని అధ్యాయాలుగా రూపొందించు కొన్నారు డాక్టర్ జయరాములు వారి ఔచిత్యదృష్టికి అధ్యాయ విభాగం నికషోపలం మొదటి అధ్యాయంలో 'శృంగారమే రసరాజ' మన్నసత్యం సాంగంగా, ఆధునిక దృష్టితోకూడా, సాధికారికంగా నిరూపించబడింది

ప్రక్రియకు అనుభూతిశక్తిని కలిగించే కావ్యతత్త్వం రసం ప్రబంధకవులు శృంగారాన్ని రసరాజంగా భావించి ప్రయోగాలను నిర్వహించారు. లాక్షణికులు కూడా శృంగార రసభేదాలను సోదాహరణంగా నిరూపించి, మిగిలిన రసాలను సహృదయులా పద్ధతిలోనే భావించాలని సూచించి వదిలివేసే ఒక రచనా పద్ధతిని పాటించారు ఆ సంప్రదాయాన్ని ప్రబంధ ప్రయోగాలలో శృంగార రస పోషణపట్ల ప్రబంధకవులు ప్రపంచించారు ఈ అవగాహనకు ప్రాతిపదికను బలంగా కలిగించేది మొదటి అధ్యాయం

రెండవ అధ్యాయం ప్రబంధ స్వభావ చైతన్యాన్ని ప్రగాఢంగా ప్రదర్శిస్తున్నది. ప్రసిద్ధాంధ్ర ప్రబంధాలన్నీ యిందులో పరిశీలింపబడ్డాయి రసపరంగా ప్రబంధాలమీద పరస్పర విరుద్ధాభిప్రాయాలను విమర్శకులు వ్యక్తంచేసి ఉన్నారు. వస్త్వైక్యం లేదన్నారు కొందరు; ఏకవాక్యత ఉంటుందన్నారు కొందరు; ప్రబంధకవులకు రసదృష్టిలేదని పాండిత్య దృష్టిమాత్రమే ఉందని కొందరు వాదించారు ప్రబంధకవులు శృంగార రసైక ప్రియులని కొందరు ప్రశంసించారు ఆకు కొక్కువాదం, పోకకొక్కువాదంగా ఉన్న ప్రబంధ రస విమర్శను త్రిదళాత్మకంగా సంభావించి సంవదించి సమీక్షించటం ఈ అధ్యాయంలోని అంతశ్శిల్పం.

మొదట ప్రబంధ స్వరూప స్వభావాలను వివేచించి, అందులో అంగిరస నిర్ణయం చేయటం, రసపరంగా శృంగారానికి ఒక్కొక్క ప్రబంధంలో ఉన్న స్థానాన్ని వివేచించటం, దాన్ని పోషించిన శిల్పాన్ని సమీక్షించటం. రస నిర్వహణంలో ఆయా ప్రబంధకవులు ప్రదర్శించిన రమ్యమైన ప్రయోగ నైపుణ్యాలను వ్యాఖ్యానించటం మొదలైన అంశాలు ఈ అధ్యయనంలో విస్పష్టంగా వ్యక్తీకరింపబడ్డాయి ఇది గతానుగతికంగా వస్తున్న పద్ధతికంటె విలక్షణంగానూ, ప్రతిపాద్యాంశాలకు అనుకూలంగానూ సాగిన విచారధార

మూడవ అధ్యాయం ప్రబంధరస ప్రయోగాల వ్యక్తిత్వ శక్తిమత్త్వాలను సోదాహరణంగా వివేచించిన విమర్శవివేకం. విశ్లేషణ, వివేచన, వివరణ, సమన్వయం అనే గుణాలు స్నేహసౌగంధ్యంతో జీవించిన గ్రంథభాగం ఈ

పరిశోధనసారం ఈ మూడు అధ్యాయాలూ చదువుతూ ఉంటే 'ఉత్తరోత్తరాలు బలీయాలు' అని పరితలకు అనిపిస్తుంది

ఈ పరిశోధన వలన ప్రబంధ యుగంలో వెలువడిన కావ్యప్రయోగాలు గతానుగతికంగా వెలువడినవి కావనీ మూసలో పోసిన అచ్చులవంటివి, కావనీ ఒక్కొక్కటీ ఒక్కొక్క వ్యక్తిత్వం గలిగిన సాహిత్య ప్రయోగ మనీ, స్పష్టమౌతుంది ఈ యుగ ప్రయోగాలలో శృంగారరసం ఎన్ని రకాలుగా కావ్యజీవితంతో రంగరించుకొని ఉన్నదన్న వివేకం విదితమౌతుంది ప్రబంధాలను గురించీ, శృంగారరసాన్ని గురించీ, ప్రబంధపాత్రలను గురించీ క్రొత్తగా వెలువడుతున్న శాస్త్రీయ వివేచనలో ఈ పరిశోధన ఒక మైలు రాయి పరిశోధనలో ఒక మంచి ప్రయోగం చేసిన డా జయరాములుగారిని అభినందిస్తున్నాను.

హైదరాబాదు, జి. వి. సుబ్రహ్మణ్యం.

11 4.1991.

**Dr. R. SRIHARI**
M A., Ph D ,
Professor
Dept. of Telugu

UNIVERSITY OF HYDERABAD
Central University PO
Hyderabad – 500 134

# ఆమోదం

రసాలన్నింటిలోనూ ప్రధానమైంది శృంగారరసం. అందుకే రస పరిగణనంలో దీనికి ప్రథమస్థానం ఈయబడింది. దీనికి కారణం ఈరసం సమస్త ప్రాణులకూ ఆనందాన్ని కలిగించేది కావడమే 'శృంగార ఏవ మధురః పరః ప్రహ్లాదనోరసః' అని ఆనంద వర్ధనుడు శృంగారరసాన్ని పరమ ప్రహ్లాదన రసంగా ప్రశంసించినాడు. బృహదారణ్యకంలో సాధారణంగా అనుభూతి కందని బ్రహ్మానందానికి ఉపమానంగా శృంగారానందం పేర్కొబడింది. "తద్యథా ప్రియయాస్త్రియా సంపరిష్వక్తోన బాహ్యం కించన వేద నాంతరమేవ అయం పురుషః ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తో నబాహ్యం కించనవేద నాంతరమ్" రసలక్షణాన్ని వివరించే సందర్భాల్లో లాక్షణికులు విభావానుభావాది రససామగ్రిని ప్రధానంగా శృంగార రస పరంగానే ఉదాహరించడం ఈ రసానికున్న ప్రాధాన్యాన్ని తెలియజేస్తుంది. నన్నయాది ప్రాచీన కవుల రచనల్లోనూ శృంగారం యథోచితంగా పోషింపబడింది ఐతే ప్రబంధాల్లో మాత్రం శృంగారం విభావాది సర్వసామగ్రీ సముల్లసితమై సమగ్రతను సంతరించుకొన్నదని చెప్పవచ్చు.

మిత్రులు డా. జయరాములుగారు 'ఆముక్తమాల్యద మొదలుకొని చంద్రభానుచరిత్ర వరకు మొత్తం పద్దెనిమిది ప్రబంధాలను పరిశీలించి వాటిలోని శృంగార రసపోషణను గురించి " ఆంధ్ర ప్రబంధాలు - శృంగారం - ప్రయోగాలు" అన్న మంచి పరిశోధన గ్రంథాన్ని రచించి మనకు అందిస్తున్నారు. విషయ వివేచనకు వీరు వేసుకున్న ప్రణాళిక ఎంతో సముచితంగా ఉంది శృంగారరసానికి గల రసరాజత్వ గౌరవనిరూపణం ప్రబంధాల్లోని అంగిరస చర్చ, విభావాను భావవ్యభిచారి భావాలచే పరిపుష్టమైన శృంగారరస సమాలోచనం, సంయోగ విప్రయోగ శృంగారాల పరిశీలనం, శృంగారరస నిర్వహణలో ఆయా ప్రబంధకవులు చేసిన ప్రయోగాలు - ఈ క్రమంలో సాగిన పరిశీలన పరిశోధన

విషయాన్ని సమగ్రంగానూ, ప్రామాణికంగానూ నిరూపించేదిగా ఉంది ఆయా ప్రబంధాల అంగిరస నిర్ణయంలో చేసిన చర్చ, విభావాను భావాది రస సామగ్రిని పద్దెనిమిది ప్రబంధాలకు అన్వయిస్తూ వాటిలోని శృంగారరస పోషణను నిరూపించిన పద్ధతి డా జయరాములు గారి పాండిత్యాన్ని, పరిశీలన శక్తిని వ్యక్తం చేస్తున్నాయి

భారతీయ అలంకార శాస్త్రాలను అధ్యయనం చేసి వాటిలో ప్రతిపాదితమైన సిద్ధాంతాలను తెలుగు కావ్యాలకు సమన్వయం చేయగల పండిత పరిశోధకులు క్రమంగా తగ్గుతున్న ఈ కాలంలో డా. జయరాములుగారు ఈ పరిశోధన గ్రంథాన్ని రచించినందుకు వారిని హృదయ పూర్వకంగా అభినందిస్తున్నాను. ఇకముందు కూడా వారు ఈ దిశలోనే పరిశోధనను కొనసాగించి కొత్త విషయాలను విద్వల్లోకానికి తెలియజేయవలెనని ఆశిస్తున్నాను భగవంతుడు డా జయరాములుగారికి మంచి భవిష్యత్తును ప్రసాదించవలెనని ఆకాంక్షిస్తున్నాను

హైదరాబాదు **ఆర్. శ్రీహరి**

17.4.1991.

# విషయ సూచిక

# శృంగారమే రసరాజం

"వాగర్థావివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే,

జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ " 1.

ఆది దంపతుల అర్ధనారీశ్వర తత్త్వం సంయోగ వియోగాత్మక మైన శృంగార తత్త్వాన్ని వ్యంజింప జేస్తుంది

## 1. శృంగార ప్రాదాన్యం

సృష్టికి మూలం శృంగారం అది లౌకిక మైతే కామం సత్త్వగుణ సంపత్తితో ఆదర్శీకరణం పొందితే శృంగారం కామం ఒక జీవన విధాయినీ శక్తి దీని తో సమస్త ప్రాణి జగత్తు అనుప్రాణిత మౌతుంది. మానవుని ఈషణలను నడిపేది కామమే జీవిత సౌందర్యానికీ, మాధుర్యానికీ ఇది మూలం. లౌకిక ఆధ్యాత్మిక సాధనలకు ఇది ఆలవాలం. దీనిపై సామాజిక జీవిత అఖండత్వం ఆధారపడి ఉంది సృష్టి యొక్క ఉత్పత్తి, స్థితి, లయాలు దీని ప్రేరణా ఫలాలే దీని సామర్థ్యం అజేయం. స్త్రీ పురుష మూలకమై కుటుంబ వృక్షాన్ని పెంపొందించి, సాంస్కృతిక వికాసాన్ని కలుగ జేస్తుంది. ఇది ఆధ్యాత్మికంగా భక్త హృదయాన్ని ఉద్వేలపరచి, ఈశ్వరోన్ముఖం చేసి, బ్రహ్మానంద ప్రాప్తిని కలిగింప జేస్తుంది మానవుని మూలప్రవృత్తుల్లో 'కామప్రవృత్తి' అన్నిటికంటె బలవత్తరమైంది కాబట్టే సాహిత్యానికి మూలాధారమైంది. ప్రపంచ సాహిత్యంలో దీనికి అత్యంత ప్రాధాన్యం ఉంది సాహిత్య శాస్త్రమే దీనికి బలవత్తరమైన ప్రమాణం సార్వజనీనమైన, సర్వప్రాణికమైన ప్రవృత్తి కామం ఇదే కావ్యాల్లో శృంగార రసంగా ప్రాధాన్యం పొందింది.

"శృంగార రసము నిండు యౌవనములో ఉన్న ఉత్తమ స్త్రీ-పురుష ప్రకృతులకు సంబంధించి యుండు"2 నని భరతుడు చెప్పాడు ఆలంకారికులంతా రసాల గురించి చెప్పేటప్పుడు శృంగారాన్నే మొదట పేర్కొన్నారు అందువల్ల గూడ దీని ప్రాధాన్యం వ్యక్తమౌతుంది. కామం సకలజాతి సులభం అత్యంత పరిచితం నిఖిల జనులకు హృద్యం. కాన శృంగారం మొదట నిర్దిష్టమైంది

"తత్రకామస్య సకలజాతి సులభతయాత్యంతపరిచి

తత్వేన సర్వాన్ ప్రతిహత్యేతి (హృద్యతేతి) పూర్వం శృంగారః" 3

అని అభినవ భారతి చెప్పాడు.

"బహువక్తవ్యహేతోః సకలాహ్లాదనాదపి,
రసేషు తత్ర శృంగారః ప్రథమం లక్ష్యతే స్ఫుటమ్. 4

అని రసార్ణవసుధాకరకారుడు చెప్పాడు. శారదాతనయుడు తన భావప్రకాశంలో శృంగార ప్రాధాన్యాన్ని ఇలా చెప్పాడు

"మానసోఽహ్లాదజననః స్వాదోరస ఇతిస్మృతః
శృంగారస్య సయుజ్యేత తస్యాహ్లాదాత్మకత్వతః
అన్యేషాం రసతాప్రాయః సిద్ధా కేనాపిహేతునా'

'మనసున కాహ్లాద మొదవించు స్వాదమును రసమందురు శృంగారమునకె యారస వ్యవహారము యుక్తముగ నుండును శృంగారమునకె హ్లాదజనకత యున్నది శృంగారేతరములకు రసత్వము సామాన్యముగా సిద్ధమగును ఏదేని యితర కారణమున నితరములకు రసత్వము సిద్ధమగుచున్నది. రస్యమానతా ధర్మమున రసత్వమనునది శృంగారమునకె' 5

దీని వల్ల రసనామం శృంగారానికే తగివుందనీ, శృంగారమే ప్రధానరసమనీ తెలుస్తుంది

"గృహస్థ జీవితమున ప్రవేశించి, దాంపత్యసుఖజీవనము చేయుటయే కావ్యములోని శృంగార రసమునకు మూలప్రకృతి" 6 అనే పింగళి లక్ష్మీకాంతంగారి మాటల వల్ల మనజీవితంలో శృంగారరసం ఎంతప్రాధాన్యం వహించి వుందో తెలుస్తుంది ఈ జగత్తు యొక్క అవిచ్ఛిన్నతకు భోగేచ్ఛ ప్రధానమైంది. "ప్రజాతంతుం మావ్యవచ్ఛేత్సీః", 7 అని వేదవాక్కు "సంతతి శ్శుద్ధవంశ్యాహి పరత్రేహచశర్మణే" కాబట్టి సంసార సాధనం అయిన సంభోగం ఉపాదేయం. ఈ శృంగారానికి అధిదైవతం సాక్షాత్ శ్రీ మహావిష్ణువే, కాబట్టి శృంగార ప్రాముఖ్యాన్ని మనం ఊహించవచ్చు ఈ శృంగారం ధర్మబద్ధంగా అవలంబింప బడ్డపుడులోకకళ్యాణ హేతువౌతుంది ధర్మవిరుద్ధం గాని కామం లేదా శృంగారం ఉపాదేయమైనట్టిదే. భగవద్గీతలో భగవానుడు "ధర్మావిరుద్ధో భూతానాం కామోస్మి భరతర్షభ," 9 (నేను మనుష్యులయొక్క ధర్మా విరుద్ధమగు కామమును) అని చెప్పాడు

పురుషార్థాల్లో మూడో స్థానంలో ఉన్నకామం ఈ లోకంలో, కావ్యలోకంలో అత్యంత ప్రాధాన్యం కలిగివుంది

. ఐహిక లక్ష్యములగు ధర్మార్థ కామములలో ధర్మము ప్రధానమైనది ధర్మము ధర్మబద్ధమగు నర్థమును, ధర్మార్థ బద్ధమగు కామమును లక్ష్యములు. అర్థకామముల నణచిన ధర్మమే లోక కళ్యాణహేతువగును. కావున ధర్మాను బంధియగు శృంగారమే యత్యుత్తమము అదియే యానంద జనకము అట్టి శృంగారమే కావ్య నాటకములలో గ్రాహ్యమని అలంకార శాస్త్రవేత్తలు దానికి ప్రాధాన్యమొసగిరి " 10. అని సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి గారు చెప్పారు

"శృంగార ఏవమధురః పరః ప్రహ్లాదనోరసః,

తన్మయంకావ్యమాశ్రిత్య మాధుర్యం ప్రతితిష్ఠతి "11

ఆనంద వర్ధనుడు శృంగారం పరమప్రహ్లాదహేతువైన రసమని, శృంగారానికి పట్టంగట్టాడు భోజుడు తన గ్రంథాల్లో శృంగారప్రాధాన్యాన్ని ముక్తకంఠంతో నొక్కివక్కాణించాడు. తిప్పాభట్లరామకృష్ణమూర్తి గారు ఈ క్రిందివిధంగా సెలవిచ్చారు.

"అలంకార గ్రంధ రచయితలు గూడ వ్యభిచారి సాత్త్వికాదుల నుదాహరించుచు శృంగారమునకే అంగములు మిక్కుటముగ చూపుట శృంగార ప్రాధాన్యమునే వ్యక్తీకరించును దశరూపకములలో ప్రకృతియైన నాటకము నందు శృంగార వీరములలో నొక్కటియే ప్రధానరసమని నిర్ణయించుట, అందును వీరరస ప్రధానములు అత్యల్పములై శృంగారరస ప్రధానములే అతిశయించుట కూడ శృంగార ప్రాధాన్యమును ప్రకటిత మొనర్చుచున్నది.

పాశ్చాత్యులు ట్రాజెడీ కిచ్చినంత ప్రాధాన్యమునితరములకివ్వలేదు. శృంగారరస ప్రాధాన్యము ట్రాజెడీయందు సయితము గోచరించుచున్నది. ఏలన "నవినా విప్రలంభేన శృంగారః పుష్టిమశ్నుతే" అని ఆలంకారికులు శృంగారమున సయితము విప్రలంభశృంగారము ప్రధాన మని అదిలేక శృంగారమునకు పుష్టిలేదని వచించియున్నారు కాన సుఖ దుఃఖోభయ మిశ్రణము వలన నేర్పడిన శృంగారము అత్యంత ప్రధానము, పర్యంత రమణీయము అనవచ్చును " 12

శృంగారంలో మరో విశేషం ఉంది శృంగారేతర రసాలన్నింటికి (ఆలంబన) విభావం ప్రకృతిలో ఒక వస్తువే, పురుషుడో, స్త్రీయో అయితే సరిపోతుంది ఆరసాల్లో స్త్రీ పురుషులు పరస్పరాలంబనాలుగా ఉండాల్సిన అవసరంలేదు కాని శృంగారంలో అది అనివార్యం. ఇందు నాయికా నాయకులు ఆలంబన విభావాలు ఈ స్త్రీపురుష ఆలంబన విభావత్వంవల్ల ఐహిక సుఖదాంపత్య జీవితం స్ఫురించడమే గాక ప్రకృతి పురుషుల ఐక్యత వల్ల "అద్వైతసిద్ధి" కల్గి ఆముష్మికమార్గంలో గూడ ఈ శృంగారం ప్రాధాన్యం వహిస్తుందని తెలుస్తుంది. జీవితసారభూతమైన ఈ శృంగారాన్ని కావ్యనాట్యాలలో దర్శించినపుడు మనల్ని మనమే

దర్శించినట్లు అనుభూతి నొందుతూ ఆత్మసాక్షాత్కారం పొందుతూ బ్రహ్మానంద సహోదరమైన ఆనందాన్ని అనుభవిస్తాం

ఇంతటి ప్రాధాన్యంగల శృంగారం యొక్క పుట్టుక స్వరూప స్వభావాల్ని,వ్యాపకాల్ని, సాధన సామగ్రిని, కామ శృంగారాలకు గలభేదసాదృశ్యాల్ని, శృంగారభేదాల్ని, దాని తత్త్వం, పారలౌకిక తత్త్వం, అది రసమూర్ధన్యమవటాన్ని సాకల్యంగా దర్శించి, దాని శత్రుమిత్రులను గమనించి, దాని ఆభాసరూపాల్ని గూడ ఆవిష్కరిస్తాను అపుడు దాని సమగ్ర స్వరూపం స్పష్టమై 'శృంగారమే రసరాజం' అనే సిద్ధాంతం ఏర్పడుతుంది

## 2. శృంగార శబ్దవ్యుత్పత్తి - నిర్వచనం.-

శృంగ, శృంగార శబ్దాలకు అర్థాలు, వ్యుత్పత్తి శబ్దకల్పద్రుమంలో ఈ క్రింది విధంగా ఇవ్వబడ్డాయి

"శృంగమ్ - శృహింసే + "శృణాతేర్ హ్రస్వశ్చ" , ఉణాం, ఇతిగన్, ధాతోర్ హ్రస్వత్వం కిత్త్వం నుట్‌చ ప్రత్యయస్య , పర్వతోపరిభాగః తత్పర్యాయః కూటమ్, కూటః, శిఖరమ్-ఇత్యమరః.. దంతః ప్రాగ్భారః ఇతి జటాధరః శైలాగ్రమ్ ఇతి త్రికాండశేషః సానుః ఇతినానార్థే అమరః. ప్రభుత్వమ్, చింగమ్, క్రీడాజలయంత్రమ్, విషాణమ్ (యధారఘువంశే) ఉత్కర్షః - ఇతి మేదినీ తీక్ష్ణమ్, పంకజమ్ - ఇతి శబ్దరత్నావళి స్తనమ్ యధాభాగవతే కామోద్రేకః - యధాసాహిత్య దర్పణే

శృంగారమ్ - శృంగం ప్రాధాన్యం ఋచ్ఛతీతి, శృ+అణ్ లవంగమ్, సిందూరమ్, చూర్ణమ్ - ఇతిమేదినీ

ఆర్ద్రకమ్ - ఇతిశబ్ద చంద్రికా కాలాగరుః ఇతిరాజ నిర్ఘంటః"

శృంగారః- పుం శృంగం కామోద్రేకం ఋచ్ఛతీతి, ఋగతౌ + "కర్మణ్యణ్", ఇత్యణ్ యద్వా, శృహింసాయామ్ + భృంగార శృంగారౌ ఉణాం, ఇతి ఆరన్ ప్రత్యయేన సాధుః,

సురతః, నాట్యరసః, గజభూషణమ్ - ఇతిమేదినీ.

అన్యత్ మైధున శబ్దే ద్రష్టవ్యమ్" 13

డా॥ శంకర్ దేవ్ అవతరేగారు తమ "रस प्रक्रिया" లో శృంగార శబ్దానికి వ్యుత్పత్తి అర్థాలను ఇలా చెప్పారు

'शृंग' शब्द के साथ 'आ' उपसर्ग – पूर्वक दानार्थक 'रा' धातू से भी 'शृंगार' शब्द निष्पन्न होता है। "शृंगमू आ· समन्तातू राति ददाति इति शृंगारः। अर्थ होगा – वह शृंगार जो "मन्मथोदूभेद" (शृंग) को पूर्ण परिपोषण दे सके । इसलिए विश्वनाथ ने कहा है शृगमू ही मन्मथो दूभेदस्तदागमन हेतुकः (शृंगार) । ( सा. द-3-2-&-6) अर्थातू 'शृग' का नाम है 'मन्मथोदूभेद' (काम की सम्भोगेच्छा का अकुर) ऐसे 'मन्मथोदूभेद' की प्राप्ति कराने वाले को शृंगार कहते है"14

"వ్యావకార్థమున కామమునకు "ఆకాంక్ష" పర్యాయపదము ఈ "ఆకాంక్ష"లో బోగేచ్ఛ కూడ సమ్మిళితమైయున్నది" 15 అని డా రాజేశ్వర ప్రసాద్ చతుర్వేదిగారు చెప్పారు.

పై వ్యుత్పత్త్యర్థాల్ని బట్టి శృంగారం యొక్క స్వరూపస్వబావాలు తెలుస్తున్నాయి

"పుంసఃస్త్రియాంస్త్రియాః పుంసి సంయోగం ప్రతి యాస్పృహా

స శృంగార ఇతిఖ్యాతో రతి క్రీడాది కారణమ్" 16

రతిక్రీడకు కారణమయిన స్త్రీ పురుమల సంయోగేచ్ఛయే శృంగారమని ఇందు చెప్పబడింది

"సుఖప్రాయేష్ట సంపన్న ఋతుమాల్యాది సేవకః

పురుష ప్రమదాయుక్తః శృంగార ఇతి సంజ్ఞితః" 17

స్త్రీ పురుమలు సుఖాన్ని ఇచ్చే ఇష్టసంపన్న ఋతుమాల్యాదులను సేవించడమే శృంగారం. హృద్యం ఉజ్జ్వలం అయిన వేషం కలది కావున "శృంగారరసం" అనే పేరు ఆచార సిద్ధమైంది. "జాయాపత్యోర్మిథో రత్యాం వృత్తిః శృంగార ఉచ్యతే" 18అని వాగ్భటుడు,

"శృంగంహిమన్మథోద్భేదస్త దాగమనహేతుకః,
ఉత్తమ ప్రకృతి ప్రాయోరసః శృంగార ఇష్యతే 19
అని విశ్వనాథ కవిరాజు

"రతి స్థాయిభావఃశృంగారః "20

రతి దేనికి స్థాయిభావమో అది శృంగారం అని భానుసూరి,

"విభావైరను భావైశ్చ సాత్త్వికైర్వ్యభిచారిభిః
నీతాసదస్య రస్యత్వం రతిః శృంగార ఉచ్యతే" 21
అని సింహభూపాలుడు.

"రమ్యదేశ కళా కాల వేషభోగాది సేవనైః
ప్రమోదాత్మారతిః సైవ యూనో రన్యోన్య రక్తయోః,
ప్రహృష్యమాణా శృంగారో మధురాంగ విచేష్టితైః" 22
అని ధనంజయుడు,

"రసోzభిమానో zహంకారః శృంగార ఇతిగీయతే"23

"ఆత్మస్థితంగుణ విశేషమహంకృతస్య
శృంగార మాహురిహ జీవితమాత్మయోనేః" 24
అని భోజుడు,

"వ్యక్తాస్త్రీ - పుంస - మాల్యాది విభావైరాశ్రితా రతిః,
వ్యభిచారిభిరాలస్య - జుగుప్సౌగ్ర్య వివర్జితైః.
సంభోగ విప్రలంబాత్మా శృంగారాబ్యోరసోభవేత్" 25
అని నరేంద్ర ప్రభవసూరి,

"బాహ్యార్థాలంబనవతో మనసోరజసి స్థితాత్
సాహంకారాద్వికారో యః సశృంగార ఇతీరితః "26
శృంగారం అహంకార సహితం, రజోగుణస్థితం అయిన మనస్సుకు బాహ్యార్థం అవలంబించి ఉండేదానికి కలిగే వికారం శృంగారం.

బోగస్తత్సుఖసాధనమ్
బోగస్స ఏవశృంగార విశేష ఇతిగీయతే" 27
అని శారదాతనయుడు

"అతులానందాత్మికయగు
రతియెవిభావాది భావరంజనముల సం
వృతయై శృంగార రసా
కృతిజెందు మనోనురాగ కీలితగతులన్" 28- అని విన్నకోట పెద్దన,

"యావజ్జీవ లక్షణమైన సుఖేచ్ఛేరతి తత్ రసస్థితే శృంగారం"29 - అని బి చంద్రమౌళిశాస్త్రి మొదలైన వారు శృంగారాన్ని నిర్వచించి ఉన్నారు

విభావ అనుభావ, సంచారీ భావాలతో 'రతి' స్థాయిభావం ఏకీకరణం పొంది, రసావస్థనొంది కామిజనుల మనస్సుల్లో కామాన్ని వృద్ధి చేస్తుంది. అందువల్ల అది శృంగారం అనబడుతుంది.

## 3. శృంగార ఉత్పత్తి - లక్షణాలు :-

"ఇది 'రతి' అనెడు స్థాయి భావమునుండి జనించును ఉజ్జ్వల వేషము కలిగి ఉండును ఈ శృంగార రసము నిండు యౌవనములో ఉన్న ఉత్తమ స్త్రీ పురుష ప్రకృతులకు సంబంధించి ఉండును." 30

"ఋతుమాల్యాలంకారైః ప్రియజనగాంధర్వకావ్యసేవాభిః
ఉపవనగమన విహారైః శృంగారరసః సముద్భవతి." 31

ఋతు, మాల్య, అలంకారాలచే; ప్రియజనుల్ని, సంగీత సాహిత్యాల్ని సేవించడంచేతను, ఉపవనాలకేగడం, విహారాలు మొదలైన వాటిచే శృంగారరసం ఉద్భవిస్తుంది .

వ్యాసభగవానుడు 'అగ్ని పురాణం'లో శృంగార ఉత్పత్తి గురించి ఇలా చెప్పాడు

"అగ్ని రువాచ :-

అక్షరం పరమం బ్రహ్మ సనాతన మజం విభుమ్,

వేదాంతేమ వదం త్యేకం చైతన్యం జ్యోతిరీశ్వరమ్

అగ్ని ఇట్లు చెప్పెను

ఆపరబ్రహ్మ పరమేశ్వరుడు అక్షయమైనవాడు అతడు శాశ్వతుడు, జన్మలేనివాడు మరియు విశ్వమంతట వ్యాపించియున్నవాడు వేదాంత గ్రంధములలో అద్వితీయమైన జ్యోతిష్మంతుడుగా, సమర్ధవంతుడుగా చెప్పబడియున్నాడు.

ఆనందః సహజస్తస్య వ్యజ్యతే స కదాచన,
వ్యక్తిః సా తస్య చైతన్య చమత్కార రసాహ్వయా

అతని ఆనందము సహజమైనది కాని అది అప్పుడప్పుడు అభివ్యక్తమగును. ఆ అభివ్యక్తి పేరే చైతన్యచమత్కారము లేదా రసము

ఆద్య స్తస్య వికారో యః సో஽హంకార ఇతిస్మృతః,
తతోభి మాన స్తత్రేదం సమాప్తం భువనత్రయమ్..

ఆ పరబ్రహ్మయొక్క మొదటి వికారమే 'అహంకార' మనబడును ఆ అహంకారమునుండి అభిమాన ముద్భవించినది. ఆ అభిమానము మూడు లోకములలో పరివ్యాప్తమైయున్నది.

అభిమానాద్రతిః సాచ పరిపోష ముపేయుషీ,
వ్యభిచార్యాది సామాన్యా చ్ఛృంగార ఇతి గీయతే.

ఆ అభిమానమునుండి 'రతి' పుట్టును ఆ రతి వ్యభిచార్యాది భావములతో పరిపుష్టమైనపుడు అది 'శృంగారరస'మనబడును "32

ఈ విధంగా అగ్నిపురాణంలో అభిమానం నుండి రతి ఏర్పడి తద్వారా శృంగారం పుడుతుందని చెప్పబడింది.అలంకారమహోదధిలో -

"స్త్రీ-పుంసాభ్యాం పరస్పర మాలంబన విభావాభ్యాం మాల్యాదిభి. ర్మాల్యర్తు-శైల-హర్మ్యతల-మలయానిల-కౌముదీ కానన-దీర్ఘికాజల క్రీడాదిభి-రుద్దీపన విభావైర్వ్యక్తావ్యం జితా తథాక్వచిత్కైశ్చిదాలస్య - జుగుప్సోగ్ర్యరహితైః వ్యభిచారిభిరాశ్రితా పరివృతాకామినోః పరస్పరాస్థా బంధాత్మికా రతిః స్థాయీ భావశ్చర్వణాగోచరం గతః శృంగార నామారసః"33 అని శృంగార ఉత్పత్తి గురించి చెప్పబడింది.

"రాగాద్భవతి శృంగారః" 34 అని కూడా కలదు. రసరత్న ప్రదీపికాకారుడు ధనంజయున్ని అనుకరిస్తూ ఇలా చెప్పాడు

"రమ్యదేశ కళాకాల వేషభోగాది సేవనైః
ప్రమోదాత్మారతిః సైవ యూనోరన్యోన్య రక్తయోః,
ప్రకృష్యమాణా శృంగారో రసోనామ హి జాయతే"35

శారదా తనయుడు శృంగార ఉత్పత్తి గురించి ఇలా చెప్పాడు.

"దేశకాల వయోద్రవ్యగుణ ప్రకృతి కర్మణాం
భావానాముత్తమం యత్తు తచ్ఛృంగం శ్రేష్ఠముచ్యతే
ఇయర్తిశృంగం యస్మాత్తు తస్మాచ్ఛృంగార ఉచ్యతే" 36

శృంగార పదం ఇలా వ్యుత్పన్న మౌతుంది శృంగం ప్రధానం శ్రేష్ఠం అట్టి దాన్ని పొందేది శృంగారం దేశం, కాలం, వయస్సు, ద్రవ్యం, గుణం, ప్రకృతి కర్మ అనే భావ పదార్థాలలో ఉత్తమంగా ఉండే దాన్ని 'శృంగం' అంటారు. అంటే శ్రేష్ఠం అని అర్థం. అట్టి ప్రాధాన్యాన్ని, శ్రేష్ఠతను పొందింది కావున 'శృంగారం' అనబడుతుంది

"శృంగార ఉదభూత్సామ్నో వీరోz భూద్వితతోఋచః
అథర్వవేదతోరౌద్రో బీభత్సోయజాషఃక్రమాత్
సామానిస్మరత స్తస్య స్వరూపవ్యక్తి రాత్మనా
యాచేయ మిచ్ఛా జగతాం సిస్సృక్షోః పరమాత్మనః

విషయాక్తా రతిస్సైవ శృంగార ఇతిగీయతే
ఇచ్ఛాక్రియాత్మికాజ్ఞప్తి స్తస్యైవ స్మరతో ఋచః" 37

సామవేదంలో శృంగారం, ఋగ్వేదంలో వీరం, అథర్వవేదంలో రౌద్రం, యజుర్వేదంలో బీభత్సం ఉదయించాయి. శృంగార వీర రౌద్రబీభత్సరసాలు ప్రకరసాలు. వీటి వల్ల ఇతర రసాలు పుట్టాయి. "రసానాథర్వణాత్" అథర్వ వేదం నుండి రసాలను బ్రహ్మ ఆహరించాడని నాట్యవేదంలో ఉంది. నాలుగు వేదాలనుండి నాలుగు రసాల్ని ఆహరించడం ఇందున్నది. సామాల్ని స్మరించే బ్రహ్మకు స్వయంభువగు స్వరూప వ్యక్తి కలిగింది. జగాల్ని సృష్టించ వలెననే ఇచ్ఛకలిగింది "సిసృక్షాస్రష్టుం ఇచ్ఛా" ఇట్టి అతని ఇచ్ఛ విషయసంబంధం కలదైంది. అలా విషయాక్తం అయిన ఆ సిసృక్ష విషయ సంవలితం అయిన ఆ ఇచ్ఛయేరతి ఆరతియే శృంగారంగా విఖ్యాతం అయింది ఇచ్ఛాశక్తి శృంగార మూలం అని భావం

"యదాzభినీతో భరతైః సంభోగః శివయోస్తదా
కైశికీ వృత్తితో జజ్ఞే శృంగారః పూర్వతో ముఖాత్" 38

భరతులు పార్వతీ పరమేశ్వరుల సంభోగాన్ని అభినయింపగా బ్రహ్మపూర్వముఖం నుండి కైశికీ వృత్తిసహితంగా శృంగారం సముత్పన్నమైంది. భోజుడు తన శృంగార ప్రకాశంలో "శృంగారోహినామ విశిష్టదృష్టచేష్టాభివ్యంజకానా మాత్మగుణ సంపదా ముత్కర్ష బీజం బుద్ధి సుఖదు ఖేచ్ఛా ద్వేష ప్రయత్న సంస్కారాతిశయ హేతుః ఆత్మనోzహంకార విశేషః సచేతసా రసమానః రస ఇత్యుచ్యతే" 39

శృంగారం అనగా తన ఇచ్ఛా విషయమైన విశేషంతో కూడిన చేష్టలచే అభివ్యక్తాలు, చేష్టల్ని వ్యక్తీకరించేవి అయిన ఆత్మగుణ సంపదలను (రత్యాదులను) ఇతర వ్యక్తిలో గ్రహించిన స్వవిషయాలుగా భావించడం వల్ల తన రత్యాదులకు అతిశయం కలుగుతుంది. ఈ అతిశయానికి హేతు భూతం అహంకార విశేషం. ఆ అహంకారమే శృంగారం అని భావం.

'ప్రేమ' అనేది జడ చేతనాలన్నిటిలో పుట్టుకతోనే ఉంటుంది. మనుషులేకాదు ఏ ప్రాణి అయినా ప్రేమచే ప్రభావితం అవుతుంది. ఇది సర్వవ్యాపకమైంది. ఈ సర్వవ్యాపకం అయిన ప్రేమనుండి శృంగారం పుడుతుంది.

ప్రేమమయి, ఆసక్తిమయి, రమణశీల, క్రీడాకళ అయిన రతి కామంయొక్క సహధర్మిణి. కామం సౌందర్యసారసమైతే రతి దానిశోభ. కామం చంద్రుడైతే రతి దాని వెన్నెల. శృంగార రసానికి ఈ రెంటితో ఆధారాధేయ సంబంధం ఉంది. శృంగార రసరూపం అయిన శిశువుకు ఒకటి జనకుడు, రెండోది జనని. భావహృదయం కామరతి పరాయణమైనట్టిది. అందువల్ల దీని ప్రాంగణాన శృంగార రసమనే శిశువు ఆనందిస్తూ ఉంటుంది.

మానసిక క్షేత్రం కామసంకల్పంతోటే వ్యక్తమౌతుంది ఈ సంకల్పం యొక్క పుత్రుడే కామం ఈ కామమే శృంగారానికి ప్రధాన హేతువు.

శృంగం అంటే కామోద్భేదంగదా, ఇది ఉత్తమ ప్రకృతి గల వాళ్ళలో ఉత్పన్నమైతే శృంగారం అనబడుతుంది. ఈ శృంగారం సామాజిక నిష్ఠం. సామాజికునిలో 'రతి' అంటే 'ప్రేమ' భావం బీజరూపంలో ఉంటుంది. అది విభావ అనుభావ సంచారి భావాలతో పరిపుష్టం అయి శృంగార రసపు పూర్ణపరిపాకానికి కారణమౌతుంది.

ఈ విధంగా నవరసాలలో ప్రధానమైన శృంగారోత్పత్తి గురించి ఆలంకారికులు విపులంగా చర్చించారు ఏ ఉత్పాదనకైనా సాధన సామగ్రి అవసరం అలాగే రసోత్పత్తికి విభావాది సామగ్రి అత్యంతావశ్యకం సాధనాలు లేకుంటే సాధించవలసింది అంటే సాధ్యాన్ని పొందలేం కాబట్టిశృంగారోత్పత్తికి హేతువైన సాధన సామగ్రిని పర్యాలోచిద్దాం

4. శృంగార రస సాదన సామగ్రి:-

రససిద్ధాంత స్థాపనలో ఆది ఆలంకారికుడైన భరతుడు రసోత్పత్తికి సామగ్రిని ఇలా తెలిపాడు

"నహి రసాదృతే కశ్చిదర్థః ప్రవర్తతే
తత్రవిభావాను భావ వ్యభిచారి సంయోగాద్రస నిష్పత్తిః

రసహీనమై యే యర్థమును ప్రవర్తింపదు అట్టిరసము విభావ అనుభావ, వ్యభిచారి భావముల సంయోగము వలన నిష్పన్న మగును" 40

ధనంజయుడు దశరూపకంలో,
"విభావైరనుభావైశ్చ సాత్త్వికైర్వ్యభి చారిభిః
ఆనీయమానః స్వాద్యత్వం స్థాయి భావో రసస్మృతః" *41*

అని పేర్కొన్నాడు ఇలాగే తదితరాలంకారికులూ చెప్పారు రత్యాది స్థాయి భావాలు ఉపచితమై రసంగా మారడానికి విభావాలు, అనుభావాలు, సాత్త్వికభావాలు, వ్యభిచారిభావాలు అనేసామగ్రికావాలి. ఈ సాధన సామగ్రితో రసస్థితి నొందేది స్థాయి భావం అది ఈ భావాలన్నింటిలో ప్రధానమైంది. దాని లక్షణం తెలుసుకొని శృంగార స్థాయి గురించి తర్వాత మిగిలిన సామగ్రి గురించి పరిశీలిస్తాను

"భావస్య స్థాయిత్వంనామ సజాతీయ విజాతీయానభి భూత

తయా యావదనుభవ మవస్థానంతథాచోక్తం దశరూపకే,

"సజాతీయై ర్విజాతీ యై రతిరస్కృత మూర్తిమాన్
యావద్రసం వర్తమాన స్థాయిభావ ఉదాహృతః", 42

సజాతీయ విజాతీయ భావాలచే భంగపడక రసస్ఫూర్తి పర్యంతం సహృదయుల హృదయాలలో స్థిరంగా నిల్చేది స్థాయిభావం శృంగార స్థాయికి 'రతి' అని పేరు.

**A. రతి:-**

ఇది విభావాదులచే ఉపచితమై ఆస్వాద్యతను పొంది శృంగారరస రూపాన్ని పొందుతుంది.

"రతిర్మనోzను కూలేzర్థే మనసః ప్రవణాయితమ్"43 అని విశ్వనాథుడు.

"స్త్రీ పురుష యోరన్యోన్యాలంబనః ప్రేమాఖ్యశ్చిత్తవృత్తివిశేషోరతిః స్థాయిభావః- స్త్రీ పురుషులలో పరస్పరావలంబనము కలిగిన ప్రేమ అనబడే చిత్త వృత్తి విశేషానికి రతి స్థాయిభావము అని పేరు - " 44 అని జగన్నాథుడు.

"రతియనగా సంభోగ విషయ కేచ్ఛారూప చిత్తవృత్తి విశేషము" 45 అని రసమంజరీటీకాకర్త వేదం వారు.

"యూనో రన్యోన్యవిషయా స్థాయినీచ్ఛా రతిర్భవేత్ ।నిసర్గేణాభియోగేన సంసర్గేణా భిమానతః" 46 అని సింహభూపాలుడు.

"రతిర్నామ ఆమోదాత్మకో భావః ఋతు మాల్యానులేప నాభరణ ప్రియజన వరభవ నానుభవ నాప్రాతి కూల్యాదిభిర్విభావైః సముత్పద్యతే స్మితవచన మధురవచన భ్రూక్షేపకటాక్షాదయస్త త్రాను భావాభవంతి. (ఆమోదాత్మకమగు భావము రతి ఋతువులు, మాల్యములు, అనులేపనములు, ఆభరణములు, ప్రియజనులు, మంచియిల్లు-వీని అనుభవము అప్రాతికూల్యము మున్నగు విభావముల వలన 'రతి' ఉదయించును స్మితవచన మధురవచన భ్రూక్షేపకటాక్షాదులు అనుభావములు) " 47అని భరతుడు'రతి'ని నిర్వచించారు.

"దుఃఖ సంశ్లేష విద్వేషీ సుఖాస్వాదన సాదరః- అను న్యాయమున రిరంస (సుఖేచ్ఛ) రతి సర్వజన చిత్తముల నాక్రమించియుండునది సుఖేచ్ఛలేని మానవుడు లేడు

అందుకని స్థాయి భావములలో 'రతి'కి ప్రథమస్థానము లభించినది. "రతిర్దేవాది విషయా వ్యభిచారి తథాం జితః భావఃప్రోక్తః! ఆది శబ్దాన్మని, గురు, నృప, పుత్రాది విషయా, కాంతా విషయాతు వ్యక్తా శృంగారః" 48

ఈ రతే దేవగురు పుత్రాదులందు కలిగినట్లయితే వ్యభిచారి అవుతుంది.

రసాలు, భావాలు అన్నీ చిత్తవృత్తి విశేషాలే విభావాదులచే లెస్సగా పరిపుష్టాలైతే ఆ చితవృత్తి విశేషాలు రసాలనీ, అవరి పుష్టాలయితే భావాలనీ వ్యవహరింపబడతాయి. 'రతి' అనే ఈ స్థాయీ భావం కూడ ఒక చిత్తవృత్తి విశేషమే.

"భోజస్తు సంప్ర యోగేణ రతి మన్యా ముదాహరత్
సంప్రయోగస్య శబ్దాదిష్వస్త్ర్యావాన్న తన్మతమ్
అంకురర పల్లవ కళికాప్రసూన ఫల భోగభాగియంక్రమశః
ప్రేమ మానః ప్రణయః స్నేహో రాగోऽనురాగశ్చ" 49

దీనిలో పేర్కొనబడ్డవి 'రతి' అవస్థలు. ఈ రతి అంకురావస్థలో ప్రేమ అనీ, పల్లవావస్థలో మానం అనీ, కలికావస్థలో ప్రణయం అనీ, పుష్పావస్థలో స్నేహం అనీ, ఫలావస్థలో రాగం అనీ, భోగావస్థలో అనురాగం అనీ చెప్పబడతాయి. వీటిలో అంకురాది ఫలాంతమైన పంచావస్థలు గల రతి పూర్వరాగంలోను అంటే సంభోగావస్థకు పూర్వంలో, భోగావస్థగల రతి సంభోగంలోను ఉంటుంది.

ఈ రతి అవస్థల లక్షణాలను, శారదా తనయుడు విపులంగా చెప్పాడు.

"పరస్పర స్వసంవేద్య సుఖ సంవేదనాత్మికా
యాऽను భూతిర్మిథస్సైవరతి ర్యూనో స్సురాగయోః.
సంపన్నైశ్వర్య సుఖయోరశేషగుణయుక్తయో.ః
నవయౌవనయోః శ్లాఘ్యప్రకృత్యోః శ్రేష్ఠరూపయోః.
నారీపురుష యోస్తుల్యా పరస్పర విభావికా ,
స్పృహావ్యయా చిత్తవృత్తిః రతిరిత్యభిధీయతే.
రతిరిచ్ఛాభవేద్యూనోరుభయప్రార్థనాత్మికా,
యూనోః పరస్పరాహ్లాద రహోవిస్రంభకారితా
సుఖాత్మికామనోవృత్తిః రతిరిత్యభిధీయతే ,
ఆలాప లీలోపచార చేష్టా దృష్టి విలోకనైః!.
అన్యోన్యభోగ్యధీరేవ రహః స్త్రీ పుంసయోరతిః,

'రాగసహితులయిన స్త్రీ పురుమలకు పరస్పరము సుఖసంవేదనాత్మకమైన యొక యను భూతి యుండును ఆ యను భూతియే రతి వారియాసుఖ సంవేదనము వారలకు మాత్రమె గోచరించును. అది స్వసంవేద్యము. రాగయుక్తులయిన యానాయికానాయకులు ఐశ్వర్య సుఖసంపన్నులు, నానావిధ విశేషగుణ యుక్తులు నవయౌవనము కలవారు, శ్లాఘ్య

ప్రకృతి కలవారు, శ్లేష్మరూపము కలవారుగా నుందురు. వారిలో వారు పరస్పరము విభావముగా నుందురు. నారికి నరుడు విభావము, నరునకు నారి విభావము అట్టివారలకు స్పృహారూపమగు చిత్తవృత్తి యుండును అదియే రతి వారలకారతి యిచ్ఛారూపమై యుభయ ప్రార్థనాత్మకముగా నుండును పరస్పర మాహ్లాదమిచ్చునది రహోవిస్రంభమిచ్చునది సుఖాత్మకమగు మనోవృత్తి యుండును అదియె రతి స్త్రీ పురుషులకు ఆలాపములచే లీలోపచారములచే చేష్టలచే దృష్టి విలోకనములచే నన్యోన్యభోగ్యబుద్ధి యుదయించును నాకామెభోగ్య నాకీతడు భోగ్యుడు అని పరస్పర భోగ్యభావముదయించును. స్త్రీ పురుషుల కట్టి రహో భోగ్య బుద్ధియె రతి

ఇయమంకురితా ప్రేమ్ణా మానాత్పల్లవి తాపునః
సకోరకా ప్రణయతః స్నేహాత్కుసుమితాభవేత్
రాగాత్ఫలవతీ చేయ మనురాగేణ భుజ్యతే
రతి ప్రేమచే నంకురిత మగును మానమున పల్లవిత మగును
ప్రణయమున మొగ్గతొడుగును స్నేహమున కుసుమితమగును
రాగమున ఫలయుక్తమగును. అనురాగమున అనుభూతమగును" 50

a) ప్రేమ లక్షణము:-

"'ఇ' శబ్దవాచ్యో మదనోమాతి యత్రప్రకర్షతః
తత్ప్రేమ తదధిష్ఠానం రతిర్యూనోః పరస్పరమ్
పరస్పరాశ్రయఘనం నిరూఢం భావబంధనమ్
య దే కాపాయ తోzపాయి తత్ప్రేమేతి నిగద్యతే
ఇదం తదితి సంకల్పో యయోర్న క్వాపి దృశ్యతే
తద్భావ బంధన మితి కథయంతి మనీషిణః
ఏతత్ప్రేమ రతింపుష్యేత్తైర్విభావాదిభిః పునః
యదక్లిష్టం విగాహేత కౌటిల్యం ప్రీతికారకమ్
తదేవ ప్రేమ కౌటిల్యం యత్స్వాతంత్ర్యం మిథఃప్రియం
స్వాతంత్ర్యం తద్యదన్యస్య మనోరథ నిరోధనమ్!.

ప్రేమ పదమున ప్ర 'ఇ' మ అనుమూడు వర్ణములున్నవి ఇ వర్ణమునకు మదనుడని యర్థము ప్రకర్షముగా మదను డిమిడి యుండుట ప్రేమ పదార్థము. యువకులకు పరస్పరము కల రతి ప్రేమాధిష్ఠానము, పరస్పరాశ్రయ ఘనముగా యువకులకు భావబంధనము నిరూఢముగా నుండగా వారిలో నొకరు గతించినచో గతించునది యగునేని దానిని ప్రేమయని యందురు ప్రేమ కల యువకులకు "ఇది యది"

యను సంకల్ప మెచటను నుండదు అట్టి రీతిని భావబంధనమని అందురు. ఈ ప్రేమ విభావాదులచే రతిని పోషించును అప్పుడట్టి ప్రేమ ప్రీతి కారకమగు కౌటిల్యము నక్లిష్టముగా నవగాహించును ప్రేమ కౌటిల్యము రమ్యము ఒకరి స్వాతంత్ర్యము వేరొకరి కభీష్టముగా నుండును స్వాతంత్ర్య మనునది యితరుని మనోరథ నిరోధన రూపము. నాయిక తన మనోరథము నిరోధించినను నాయకుడిష్టపడును నాయకుడు తన మనోరథము నిరోధించినను నాయిక యిష్టపడును ఇట్లీ ప్రేమభావ బంధనమును ప్రేమ కౌటిల్యము కూర్చినదై రాణించును." 51

b) మాన లక్షణము:-

"స ఏవ మాన ఇత్యుక్తో మనోరథ నిరోధనం,
మానేతి వీప్సయా రోధోమాన ఇత్యుచ్యతేబుధైః
ఈర్ష్యా ప్రణయ రోధేన మానః స్త్రీ పుంసయోర్ద్విధా.
సపత్నీ దర్శన స్పర్శ శ్రవణాసహతా స్థిరా
ఈర్ష్యా స్త్రీణాం తయారోధ ఈ ర్ష్యామాన ఉదాహృతః.
మాన్యతే ప్రేయసాయేన యత్ప్రియత్వేన మన్యతే
మనుతే యోమిమీతే యస్సహి మానః ప్రకీర్తితః
మనోరథ నిరోధనమునకు మానమని వ్యవహార మున్నది మా = వలదు
న = వద్దు అని రెండు పర్యాయములు మనోతథమునకు రోధము = అడ్డుకలుగ జేయుట యుండును గావున 'మాన' మని వ్యవహరించుటను బుధులంగీకరించిరి స్త్రీ పురుమలకు మానము రెండు విధములు ఈర్ష్య వలన కలుగు మానము ఈర్ష్యా మానము. ప్రణయ నిరోధనమున గలుగు మానము ప్రణయ మానము ఈర్ష్య వలనను మనోరథ నిరోధనము గలుగుట ప్రసిద్ధమె స్త్రీలు సపత్నీ దర్శనమును స్పర్శనమును శ్రవణమును సహింప నందున ఈ ర్ష్య స్థిరమగును ఆ యీర్ష్యచే మనోరథ నిరోధ మేర్పడును అప్పుడది యీర్ష్యా మానమగును ప్రియునిచే మానిత మగుటచే ప్రియముగా నిష్టముగా సంభావిత మగుటచే, నిత్యము తలచుటచే, ఉచ్చావచముల విలుచుటచే మానమన్న వ్యవదేశము వ్యవహారము యుక్తమని ప్రకీర్తిత మయినది. మాన్యతే మనుతే మిమీతే అను మానపద వ్యుత్పత్తులను భావించునది " 52

c) ప్రణయలక్షణము:-

"ఉపచారైర్మిథోయూనో ర్యద్భావ్యా భ్యంతరాభిధైః
మాన ప్రకర్ష ప్రభవ రోషాస్వాద కషాయితం

ప్రేమనీతం ప్రకర్షం చేత్సఏవ ప్రణయస్స్మృతః
యేనేర్ష్యాసు ప్రసాదః స్యాత్స్వాభీష్టార్థాను కూలతః
ప్రియేణ స విధీయేత సమాన ప్రణయాత్మకే.
అయం ప్రణయమానస్తు వర్ణ నీయోద్వయోరపి
ఈర్ష్యామానస్తు కవిభి ర్యోషితామేవ వర్ణ్యతే
సపుంసాం యది వర్ణ్యేత వైరస్యాయైవ కల్పతే
స్వతోऽపి కుటిలంప్రేమ కిము మానాన్వయే సతి.

ప్రేయసీ ప్రియులకు బాహ్యోపచారములచే నాభ్యంతరోపచార విశేషములచే ప్రేమ ప్రకర్ష కలది యగును అది మాన ప్రకర్షము వలన గలిగిన రోషమున తదాస్వాదమున కషాయిత మగును ఇట్లు ప్రాప్త ప్రకర్షమయిన ప్రేమ ప్రణయ పదమున వ్యవహృతమగును ప్రణయమున్నచో నీర్ష్యా సమయములందు ప్రసాదము సులభమగును, అభీష్టార్థాను కూల్యము వలన ప్రియుడు ప్రియా ప్రసాదన మాచరించును. ప్రేయసీ ప్రియులు సమాన ప్రణయము కలవారు కావున సర్వము సంగతమగును అభీష్టసంగమ లాభమునకై ప్రియ యీర్ష్య విడనాడి ప్రసన్న యగును ప్రియుడును సంగమార్థి కావున వెంటనే ప్రియా ప్రసాదన మొనరించును ఇట్టి యీ ప్రణయ మానమును ప్రేయసీ ప్రియుల కిద్దరకును వర్ణనీయమె ఈర్ష్యా మానము స్త్రీలకే వర్ణించుట యుక్తము -ఈర్ష్యామానము పురుషులకు వర్ణించుట యుచితముకాదు అది వైరస్య మాపాదించును-అసలే ప్రేమ కుటిలము ఇక మానసంబంధమున్నచో నేమి చెప్పదగును? కావున ఈర్ష్యామానము స్త్రీలకే వర్ణింపవలెను" 53

d) స్నేహ లక్షణము:-

"మనసో యద్ర వార్ద్రత్వం విషయేమ మమత్వతా
భయశంకావసానాత్మా స ఏవ స్నేహ ఉచ్యతే।
ద్విధా(ద్రవః స్యాన్మనసో దర్శనా త్స్పర్శనాదపి,
జతువ ద్వహ్ని సంస్పర్శాద్దర్శనా చ్చంద్రకాంతవత్।
ఆర్ద్రతా శిశిరత్వం యత్సర్వావస్థాసు మానసం,
ద్విధాభవేత్సచ స్నేహః కృత్రిమా కృత్రిమాత్మకః,
సోపాధిః కృత్రిమః స్నేహో నిరుపాధి రకృత్రిమః
ఉపాధౌ వినివృత్తేతు తజ్జన్యో వినివర్తతే.
స్నేహః స్వభావజో యావద్ద్రవ్యభావీ భవిష్యతి,
శంకాస్యాత్కృతకే తత్తద్వి క్రియాన్వేషణాత్మికా.

స్వాభావికేభయం తత్త్ర ద్విషయాదేః ప్రమాదతః,
ఏ కాశ్రయః సచక్వాపి క్వాపి స్వాదు భయాశ్రయ,
ఏకాశ్రయస్తిర్యగాదౌ మర్త్యాదావు భయాశ్రయః
ఆశ్రయా ద్వాసనాతశ్చ జాయంతే తత్ర తత్రతు,
ఏకాశ్రయో వాసనాతో ద్వ్యాశ్రయో హేతుభిర్భవేత్

మనస్సునకు గలుగు ద్రవీభావము అర్ద్రత యనునది విషయములందలి మమతాభిమానము "ఇది నాది ఇది నాకు" అను మమత్వమె యా యార్ద్రత ఇది భయావసానాత్మకము. శంకావసానాత్మకము శంకాభయములున్న చో మమత్వ ముదయింపదు ఇట్టి యీ మమత్వమునకు స్నేహమని వ్యవహారము మనస్సునకు గలుగు ద్రవము రెండు విధముల నుండును దర్శనమున గలుగు ద్రవము, స్పర్శమున గలుగు ద్రవము అని వహ్ని సంస్పర్శమున లక్క వలె ద్రవించుట, చంద్రదర్శనమున చంద్రకాంత మాణిక్యమువలె ద్రవించుట ఇందు నిదర్శనముగ సంగ్రాహ్యము సర్వావస్థలలో మానసమయిన యీ యార్ద్రత శిశిరత్వము పై విధమున గ్రాహ్యము

ఆ స్నేహము రెండు విధములు కృత్రిమ స్నేహము, అకృత్రిమ స్నేహమునని. కృత్రిమ స్నేహము సోపాధికము అకృత్రిమ స్నేహము నిరుపాధికము ఉపాధినశించినచో స్వభావజన్యమగు స్నేహము యావద్ద్రవ్య భావిగా నుండును ఆ ద్రవ్యమెంతవఱకుండునో యది యంతవఱకుండును కృతక స్నేహమునందు ఆ యా విక్రియాన్వేషణ రూపమయిన శంక యుదయించును అకృత్రిమ మయిన స్నేహమున ఆయా విషయముల ప్రమాదమున బయము కలుగుచుండును

ఆ స్నేహమొకచో నేకాశ్రయముగా నుండును వేరొకచో నుభయాశ్రయముగా నుండును తిర్యగాదులలో నది యేకాశ్రయము మర్త్యాదులలో నది యుభయాశ్రయము ఆయా స్థలములందు స్నేహరీతులు ఆశ్రయమున గలుగుటయు సంస్కార విశేషమున గలుగుటయు నున్నది ఏకాశ్రయ స్నేహము సంస్కార విశేషమున గలుగుటయు, ఉభయాశ్రయ స్నేహము హేతువిశేషమున గలుగుటయు గ్రాహ్యము

స్నేహమున ప్రౌఢ మధ్య మందభేదములు, స్థిర గత్వర నశ్వర భేదములు గలవు

"సతుస్నేహస్త్రిధాప్రౌఢ మధ్యమంద విభాగతః
విదేశస్థే మృతేవాపి దుర్భలే ప్రతివేగిని
ధర్మిణః క్లేశకారీ యః సప్రౌఢః స్నేహఉచ్యతే
తత్ర ద్వియోగజం దుఃఖం తాదృశం ప్రతియోగినా

అనుభూయాతి వృత్తశ్చే త్స్నేహోమధ్యః ప్రకీర్తితః.
తదాత్వవ్యసనాపత్తి మాత్రకో మంద ఉచ్యతే"

ఆ స్నేహము ప్రౌఢము మధ్యము, మందము నని త్రివిధము. ప్రియుడు విదేశ గతుడయినను గతించినను, దుర్బలుడయినను ప్రతివేగియయినను స్నేహము కలవానికి క్లేశకారియగు స్నేహము ప్రౌఢ స్నేహము ఆ యా వియోగ జన్యమైన దుఃఖమును ప్రతియోగి విధానమున ననుభవించిన పిమ్మట నా స్నేహము తగ్గిపోవునేని యది మధ్యమ స్నేహము. తత్సమయమున వ్యసనాపత్తి మాత్రముగ నుండు స్నేహము మంద స్నేహమగును

"స్థిరశ్చగత్వరశ్చేతి నశ్వరశ్చేతి సత్రిధా
ఉత్తమే మధ్యమే నీచే తత్రత్కార్య వశాద్భవేత్
ఉత్తమే వృద్ధి మభ్యేతి నోపకారా నపేక్షతే
ఉపకారం నజానాతి సస్నేహః స్థిర ఉచ్యతే
బహూపకార ప్రభవ ఉపకారా నపేక్షతే
మధ్యమే వర్ధితః కించి త్సస్నేహోగత్వరో భవేత్
దోషశ్రవణ మాత్రేణ సౌమనస్యం విహాయ యః.
ప్రాతికూల్యే ప్రవర్తేత సస్నేహోనశ్వరో భవేత్
నీచాదావస్థిరః ప్రాయః స్నేహోజ్యాయసితుస్థిరః
ఏవం పుత్ర కలత్రాదౌ పిత్రాదావపి దృశ్యతాం.

స్నేహము - స్థిరము, గత్వరము, నశ్వరము నని మూడు విధములు ఉత్తమునందు స్థిరము స్నేహము స్థిరముగా నుండును. మధ్యమునందు గత్వరము, గతి స్వబావమున నుండును నీచునందు నశ్వరము, నాశ స్వభావమున నుండును.

ఉత్తమునందు స్నేహము వృద్ధి బొందును ఉపకారముల నపేక్షించదు ఉత్తముడు తానొనరించిన యుపకారమును గుర్తింపడు ఇట్టిది స్థిరస్నేహము మధ్యమునందలి గత్వరస్నేహము బహూపకార ప్రభవము ఇతరులు నానా విధములగు నుపకారముల నొనర్పగా మధ్యముడిట్టి స్నేహము కలవాడగును ఇది గత్వరము కొంతగా నుపకారముల వలన వృద్ధిపొందునుగాన గత్వరము నీచునందలి నశ్వరస్నేహము దోషశ్రవణ మాత్రమున సౌమనస్యము విడనాడి ప్రాతికూల్యమునందు ప్రవర్తించును. అది నశ్వర స్నేహము. నీచాదుల లోనిది సామాన్యముగా నస్థిరము, ఉత్తముని యందు స్థిరము. " 54

e) రాగము:-

"స ఏవ చే ద్గుణ ద్రవ్య దేశ కాలాదిభి ర్హృది
రజ్యతే దీవ్యతే చిత్తే సరాగ ఇతి కథ్యతే

సుఖదుఃఖాత్మకం భోగ్యం సుఖిత్వేనాభిమన్యతే
యేనరాగః స ఇత్యుక్తో రంజనా ద్విషయాత్మనః,

ఇట్లు నిరూపితమైన స్నేహమే గుణద్రవ్యదేశ కాలాదుల గూడినదై హృదయమున రాజితమగునేని చిత్తమున దీపితమగునేని రాగము అనుపేరుగల దగును. స్నేహము రాగసంపత్తికలదగును సుఖదుఃఖాత్మకముగా నున్న భోగ్యమును సుఖముగనె యభిమానించినచో రాగమని వ్యవహృతమగును రాగమున విషయరూపముగా నాయికానాయకుల నిది రంజింప జేయును గావునే రాగమగును

నీలీ కుసుంభ మంజిష్ఠా రాగౌపమ్యేన సత్రిధా
క్షాలితోయస్తు నాపైతియశ్చనాతీవ శోభతే
నీలీరాగస్స ఏవేతి కథితో రాగవేదిభిః
యోఽపైతిక్షాలితః క్షిప్రమధ్యక్షం యోఽపి శోభతే
కుసుంభరాగ ఏవైష ఇతి విద్వద్భిరీరితః
అతీవశోభతే యస్తు నాపైతి క్షాలితోఽపిసన్
సఏవకవిభిః సర్వైర్మంజిష్ఠారాగ ఉచ్యతే
జ్యేష్ఠో మంజిష్ఠారాగః స్యాన్నీలీ రాగస్తు మధ్యమః
కుసుంభరాగః కవిభిః అధమః పరికీర్తితః

రాగౌపమ్యమున రాగము నీలీరాగము, కుసుంభరాగము, మంజిష్ఠారాగమునని మూడు విధములు నీలీరాగము క్షాలిత మైనను పోదు అయినను శోభింపదు అట్టిదినీలీరాగము కుసుంభరాగము క్షాలితమైనచో పోవును త్వరగాపోవును కంటికదిశోభగాకన్పించును అది కుసుంభరాగము మంజిష్ఠారాగము అత్యంతము శోభాయమానముగా నుండును క్షాలితమైననుపోదు అదిమంజిష్ఠారాగము వీనిలో మంజిష్ఠారాగము జ్యేష్ఠము, నీలీ రాగము మధ్యమము, కుసుంభరాగ మధమము ఈ నీల్యాదిరాగముల సామ్యమున రతిరాగ స్వరూపములను గుర్తింపవచ్చును " 55

f) అనురాగము:-

"రాగోఽనువృత్తోఽవిచ్ఛిన్న మనురాగ ఉదాహృతః
అనురూపోఽథవా రాగ ఇతివా నిర్ణయోభవేత్
సతు ప్రాయస్స్యు సంవేద్యో యూనోరన్యోన్య రక్తమా
అన్యత్రైవ ప్రయుజ్యేత గౌణవృత్తి వ్యపాశ్రయాత్

రాగ మవిచ్ఛిన్నముగా ననువృత్తమయినచో ననురాగమందురు అనురూపమగు రాగముగావున అనురాగమను నిర్ణయము యుక్తము అనురాగము యువభావుల

యన్యోన్యరక్తిమ సామాన్యముగానిది స్వసంవేద్యము అనుభవైకగమ్యము. గౌణవృత్తినాశ్రయించి యీయనురాగపదము నన్యములందు నుపయోగింతురు. ముఖ్యవృత్తి ననుసరించి తరుణీ తరుణుల యన్యోన్య రక్తిమ నె యీపదమున జెప్పనగును

ఏతే ప్రేమాదయోభావాః శృంగారాలంబనాశ్రయాః
భట్టాభి నవ గుప్తార్య పాదైరేవ ప్రకాశితాః
అధాzయంవర్త్మనా తేషాం శృంగారోzపి ప్రదర్శ్యతే
రమ్యదేశ కలాకాలవేవభోగాది సేవనైః
ప్రమోదాత్మారతిస్సైవయూనో రన్యోన్య రక్తయోః
ప్రకృష్యమాణః శృంగారో మధురాంగ విచేష్టితైః

శృంగారాలంబనాశ్రయముగానున్నప్రేమాది భావములన్నియు నీభావముననె శ్రీమదభినవగుప్తపాదులచే ప్రదర్శితములైనవి శ్రీమదబినవుల మార్గమునె యనుసరించి యీశృంగారమును ప్రదర్శితమగును రమ్యములగు దేశ కాలకలావేష భోగాదుల సేవనమున, అన్యోన్యానురక్తులగు యువకులకు ప్రమోదాత్మకమయిన రతి యుదయించును అదియె మధురాంగ విచేష్టితములచే ప్రకృష్యమాణమై శృంగారమగును" 56

ఈ విధంగా 'రతి' ప్రేమ మొదలైన భావాలచే రసావస్థనొందడానికి విభావాదులు అత్యంత ఆవశ్యకాలు

B). విభావము:- శృంగార రసానికి స్త్రీ పురుషులు అంటే కావ్యంలోని నాయికా నాయకులు ఆలంబన విభావాలు చంద్రిక, వసంత ఋతువు, నానావిధ ఉద్యానాలు, పవనాంకురాలు, రహస్యస్థానం మొదలైనవి ఉద్దీపనవిభావాలు.

పరోఢాం వర్జయిత్వాతు 'వేశ్యాంచానను రాగిణీమ్,
ఆలంబనం నాయికాః స్యుర్దక్షిణా ద్యాశ్చ నాయకాః,
చంద్ర చందన రోలంబరుతాద్యుద్దీపనంమతమ్ " 57

శృంగారంలో పరోఢ, అనురాగం లేని వేశ్య-ఈ ఇద్దరు నాయికలుగా ఉండడానికి వీల్లేదు మిగతానాయికలు, దక్షిణాది నాయకులు ఆలంబనాలు. చంద్ర చందనాదులు ఉద్దీపనాలు

"విభావః కథ్యతే తత్ర రసోత్పాదన కారణం
ఆలంబనోద్దీపనాత్మా సద్విధా పరికీర్త్యతే

రస సమవాయి కారణ మాలంబనవిభావః, ఇతరత్కారణ జాతముద్దీపన విభావః" 58

"అర్థాన్విభావయంతీతి విభావాః పరికీర్తితాః" 59

చిత్తావస్థాపితాలయిన రత్యాది భావార్థాల్ని విశేషంగా భావింప జేసేవి విభావాలంటారు

1). ఆలంబన విభావం:- శృంగార రసం పుట్టడానికి ప్రథమ కారకులు నాయికా నాయకులు వీరిద్దరు లేకుంటే 'రతి' రసావస్థను పొందదు ఈ ఇద్దరు ఉత్తమ ప్రకృతి గలవాళ్ళై ఉండాలి వాగ్భటుడు శృంగార రస నాయకుని లక్షణాన్ని ఇలాచెప్పాడు

"రూప సౌభాగ్య సంపన్నః కులీనః కుశలోయువా,
అనుద్ధతః సూనృతగీః ఖ్యాతో నేతాత్ర సద్గుణః

అత్రశృంగార రసే రూపం సౌందర్యం, సౌభాగ్యంచ నాభ్యాంసంపన్నః యుక్తః, కులీనః సత్కులోద్భవః, కుశలః కామక్రీడాకోవిదః, యువా యౌవనసంపన్నః, అనుద్ధతః వినయోపేతః, సూనృతగీః సత్యమధుర భాషణశీలః, సద్గుణః సుగుణైః భూషితః నేతానాయకః, ఖ్యాతః కథితః-

అయంచ విబుధైరుక్తోzను కూలోదక్షిణః శఠః
ధృష్టశ్చేతి చతుర్ధాస్యాన్నాయి కాస్యాచ్చతుర్విధా " 60

శృంగార రసాశ్రయుడయిన నాయకుడు రూపవంతుడు, సౌభాగ్యవంతుడు, సంపన్నుడు, కులీనుడు, కుశలుడు అంటే కామక్రీడాకోవిదుడు, యువకుడు, అనుద్ధతుడు, సూనృతవాక్కు అయినవాడు కావాలి

పై మాటల్ని పరిశీలిస్తే ధీరోదాత్తాది చతుర్విధనాయకులలో ధీరోదాత్త, ధీరలలితులు శృంగార రసంలో నాయకులుగా ఉంటారని తెలుస్తుంది

"ఉత్తమ ప్రకృతి ప్రాయః రస శృంగార ఇష్యతే" 61
శృంగారం ఉత్తమనాయకుణ్ణి ఆశ్రయించి ఉంటుంది

"లోకోత్తరనాయకాశ్రయేణ శృంగారస్య పరిపోషాతిశయః" 62

లోకోత్తరుడైన నాయకుని అవలంబనం చేత శృంగార రసం పుష్టి నొందుతుంది

పైలక్షణాల్ని బట్టి ధీరోదాత్తుడే శృంగార రసంలో నాయకుడుగా ఉండడానికి అర్హుడని తెలుస్తుంది ధీరోదాత్తుడంటే,

"అవికత్థనః క్షమావానతి గంభీరో మహాసత్త్వః,
స్థేయాన్నిగూఢమానో ధీరోదాత్తో దృఢవ్రతః కథితః" 63

ఆత్మశ్లాఘలేనివాడు, సహనంగలవాడు, గంభీరుడు, మహాసత్త్వుడు, గూఢమానం గలవాడు, దృఢవ్రతుడూ అయిన వాడు పై లక్షణాలన్నీ ఉత్తమ నాయక లక్షణాలు

ధీరోద్ధతుడనేవాడు ప్రతి నాయక లక్షణాలు గలిగి ఉద్ధతుడు, కుహనాపరుడు, ఆత్మశ్లాఘాపరుడు, అయి ఉంటాడు కాబట్టి ఇతడు శృంగారంలో నాయకుడుగా ఉండ తగదు

ధీరశాంతుడుగూడా శమ ప్రధానుడు కాబట్టి అతడూ ఈ రసంలో నాయకుడు కాతగడు

ధీరలలితుడు మాత్రం ధీరోదాత్తుని మించిన భోగ పరాయణుడు శృంగారానికి ఇతడు తగిన నాయకుడుగా ఉంటాడు

"నిశ్చింతో మృదు రనిశం కలాపరో ధీర లలితఃస్యాత్"64

"రాజభోగేష్వనిశ్చింతో యౌవనా భోగ భూషితః
విలాసీ భోగరసికో లలితః స్యాద్రతిప్రియః". 65

ధీరలలితుడు రాజభోగాల విషయంలో నిశ్చింతుడై ఉంటాడుచక్కటి యౌవనాభోగంతో భూషితుడై ఉంటాడు విలాసియై భోగరసికుడై, రతి ప్రియుడై ఉంటాడు కోమల స్వభావుడు, నిశ్చింతుడు, .కళాపరుడు, భోగపరాయణుడు కాబట్టి శృంగారానికి ఇతడు మిక్కిలి తగి ఉంటాడు

ధీరోదాత్తుడు కేవలం శృంగారంలోనే కాక వీరంలో కూడ ఉండదగినవాడు, ధీరలలితుడు మాత్రం తన స్వభావాన్ని బట్టి కోమలమైన శృంగారంలోనే నాయకుడుగా తగిఉంటాడు ఉత్తమ గుణ సంపన్నులైన ధీరోదాత్త ధీర లలితులు ఇద్దరూ శృంగారంలో నాయకులుగా ఉండదగిన వారైనప్పటికీ వారివారి స్వభావాల్ని బట్టి శృంగారంలో ధీరలలితునికి ప్రథమస్థానం, ధీరోదాత్తునికి రెండోస్థానం ఇవ్వవలసి ఉంటుంది. కాని పూర్వకవులంతా ధీరోదాత్తునే శృంగారంలో నాయకునిగా గ్రహించారు హేమ చంద్రుడు కూడ తన కావ్యానుశాసనంలో,

"ధర్మ, యుద్ధ, వీరప్రధానః ధీరోదాత్తః; వీరరౌద్ర ప్రధానః ధీరోద్ధతః, వీర శృంగార ప్రధానః ధీరలలితః, దాన ధర్మ వీర ప్రధానః ధీరశాంతః" 66 అని అందరికీ వీరత్వం సాధారణంగా చెప్పాడు శృంగారానికి మాత్రం ధీరలలితుడే తగిన వాడని తెలిపాడు కాబట్టి శృంగారంలో ధీరలలితునిదే ప్రథమస్థానం అని నా అభిప్రాయం

a) శృంగారనాయకులు:-

"శృంగారాపేక్షయా తేషాం నాయికాసుచ వృత్తిభిః
అనుకూలాది భేదేన చాతుర్విధ్యం ప్రసిద్ధ్యతి
అనుకూలో దక్షిణశ్చ శరో ధృష్ట ఉదీర్యతే" 67

ధీరలలితాది నాయకులు శృంగార ధర్మానుసారంగా తమ తమ నాయికల విషయంలో వారి వృత్తి విశేషంతో నాలుగు రకాలుగా ఉంటారు అనుకూలుడు, దక్షిణుడు, శరుడు, ధృష్టుడు అని ఆ నాల్గు రకాలు

1) అనుకూలుడు:- "సార్వకాలిక పరాఙ్గనా పరాఙ్ము
ఖత్వే సతి సర్వదా స్వీయాయా మను రక్తోzను కూలః" 68
ఎల్లప్పుడూ పరస్త్రీ విముఖుడై తన నాయిక పై ప్రేమ గలవాడు అనుకూలుడు

2) దక్షిణుడు:- "సకలనాయికా విషయసమ సహజానురాగో దక్షిణః"69
నాయికలందరిపైనా సమానమైన స్వాభావిక ప్రేమ గలవాడు దక్షిణుడు.

3) ధృష్టుడు:- " భూయోనిశ్శఙ్క కృతదోషోzపి భూయో
నివారితోzపిభూయః ప్రశ్రయ పరాయణో ధృష్టః" 70

మాటిమాటికి నిర్భయంగా అపరాధం చేసిన వాడైనప్పటికీ మాటిమాటికి ధిక్కృతుడై నప్పటికీ, మళ్ళీ మళ్ళీ వినయం అవలంబించేవాడు

4) శరుడు:- "కామినీ విషయ కపట పటుః శరః" 71

కామిని విషయంలో ఆమెకు తెలియనీక కపటం చేసే నేర్పరి శరుడు.

వీళ్ళకు కామతంత్రాలు నెరవేర్చడంలో సహాయకులు కొందరుంటారు. వాళ్ళు విట, చేట, విదూషకులు

"శృంగారేzస్య సహాయా విట చేట విదూషకాద్యాఃస్యుః
భక్తా నర్మసు నిపుణాః కుపిత వధూ మానభంజనా శ్శుద్ధాః"72

b) నాయికలు:-

శృంగారంలో ప్రధానమైన ఆలంబనం నాయిక నాయికా నాయకులు అన్యోన్యాశ్రయులే అయినప్పటికీ నాయికకు శృంగార రసంలో అత్యంత ప్రముఖ స్థానం ఉంది. ఈ నాయిక స్వీయ, పరకీయ, సామాన్య అని మూడు విధాలు వీళ్ళలో పరకీయ,

అనురాగం లేని వేశ్య శృంగార నాయికలుగా తగరు స్వీయ, అను రాగిణి అయిన వేశ్య నాయికలుగా ఉండడానికి అర్హులు. వీళ్ళలో ఒక్క స్వీయయే ధర్మ శృంగారానికి తగిన నాయిక.

" సమానకుల శీలేనయోనోఢా వహ్నిసాక్షికంసాస్వీయా" 73

సమానకుల శీలాలుగల వరుడు అగ్ని సాక్షిగా పెళ్ళాడిన నాయిక స్వీయ

ఈమె ఆపదల్లోగాని, సంపదల్లోగాని ప్రియుని వదలి ఉండదు ఈమె శీలం సత్యం ఋజుత్వాలతో గూడి ఉంటుంది. రహస్సంభోగ లాలసగా ఉంటుంది. స్వీయలో ముగ్ధ, మధ్య, ప్రౌఢ అనే భేదాలు వయస్సును బట్టి ఉంటాయి ముగ్ధ నవ యౌవనంతో శోభిస్తుంది నవకామంతో భాసిస్తుంది రతి సమయంలో వామ వద్దు వద్దు అంటుంది కోపం కలిగితే కొద్దిగానే కలుగుతుంది అపరాధం కలిగితే దుఃఖిస్తుంది ప్రియుడు అప్రియాన్ని పలికినా మిన్నకుంటుంది

తానే స్వయంగా భోగ సంభోగాల్లో ప్రవర్తించేది మధ్య సురత శ్రమ అధికంగా ఉన్నా సహిస్తుంది ప్రియుడు కామాపరాధం చేస్తే కోపంతో మాట్లాడుతుంది

తానే స్వయంగా బాహ్యాభ్యంతర సంభోగాల్లో ఆయా చేష్టల్ని ఆరంభించేది ప్రౌఢ ప్రియుడు తప్పు చేస్తే రోషంతో కఠినంగా మాట్లాడుతుంది

c) (అష్టవిధ) శృంగారనాయికలు:-

ఈ నాయికలు శృంగారంలో ఒక్కొక్కరు ఎనిమిది విధాలుగా ఉంటారు స్వాధీన పతిక మొదలయిన అష్టవిధ శృంగార నాయికలు వాళ్ళే. ఈ అష్టవిధనాయికావిశేషాలు ఆయా అవస్థా స్వభావాలు వీళ్ళ మూలాన్నే శృంగారంలో అనేక భేదా లేర్పడతాయి.

1) స్వాధీనపతిక:- ఈమెభర్త నిత్యం ఆమెతో రతిరసాస్వాదంలో సంతుష్టుడై ఉంటాడు ఎప్పుడూ ఆమెతోటే ఉంటాడు భర్తను అలా అట్టి పెట్టు కొనే వనిత స్వాధీన పతిక

"స్వాధీనః భర్తావతి ర్యాయస్యాఃసాస్వాధీన భర్తృకా పతికావా" 74

ఈవిడ ఉద్యానవనంలో విహరించడం, సలిలక్రీడ, కుసుమావచయాల్లో ఆసక్తురాలై ఉంటుంది. ఇంద్రపూజ, వసంతోత్సవ, మదనోత్సవాల్ని జేస్తుంది

2) వాసకసజ్జిక:-

"వాసకం వాసస్థానం సజ్జయతీతి వాసక సజ్జా" 75

అన్నివిధాలయిన భోగ ఉపకరణాలతో అలంకరింపబడిఉన్న వాసభవనంలో భోగశయనాన్ని, నిద్రాశయనాన్ని అలంకరించితానూ అలంకరించుకొని పడకపై ప్రియుని రాకను ఎదురు చూసే వనిత వాసకసజ్జిక

3) విరహోత్కంఠిత:-తగినరోజు వచ్చినప్పటికీ ప్రియుడేదో కారణంతో రాకుంటే విరహవ్యథను అనుభవించే వనిత విరహోత్కంఠిత ఒక విషయాన్ని నిర్ధారించే శక్తి ఈమెకుండదు ఒళ్ళువిరుచుకుంటుంది వేదనపడుతుంది కంపిస్తుంది హృదయతాపంపొందుతుంది కంటనీరుపెట్టుకుంటుంది సఖులపైనమ్మకంతో తనబాధ వాళ్ళకు చెబుతుంది

4) విప్రలబ్ధ:- ప్రియుడు సమయ సంకేతాల్ని సూచించి దూతికను పంపి ఇతర వ్యాసంగంవల్ల రాకపోతే వంచిత అయిన నాయిక విప్రలబ్ధ చింత, నిశ్వాస భేదాలు ఈ నాయికకు కలుగుతాయి హృదయతాపంకలుగుతుంది ఇంకా ప్రలాపం, జాగరం, కృశత్వాలు కలుగుతాయి

5) ఖండిత:- ప్రియుడు నాయికకు ఇచ్చిన సమయసంకేతాన్ని అన్యవ్యాసంగం వల్ల అతిక్రమించి సమయానికి రాక ప్రాతఃకాలంలో అన్యస్త్రీ భోగ సంభోగ చిహ్నలతో కూడివస్తే అతన్ని చూసి కుపిత అయిన స్త్రీ ఖండిత ఈమె భయపడుతుంది చింతిస్తుంది పరధ్యానంలో ఉంటుంది బాధపడుతుంది భ్రమిస్తుంది మాటిమాటికీ నిట్టూరుస్తూ దుఃఖిస్తుంది

6) కలహాంతరిత:- "కలహేన అంతరితావ్యవహితా అర్థాత్ ప్రాణనాథతః" 76

ప్రణయాపరాధం చేసిన ప్రియుడు సకియల సమక్షంలోనే ప్రణతుడైతే ఈర్ష్యా మానంతో అతన్ని త్రోసిపుచ్చి, విడనాడి తర్వాత పశ్చాత్తప్త అయిన నాయిక కలహాంతరిత అధిక హృత్తాపం, సంభ్రమం కలుగుతుంది మోహం, ద్వేషం కలుగుతాయి నిశ్వసితమొనరిస్తుంది. ఈమెకు జ్వరంకూడా వస్తుంది

7) ప్రోషిత భర్తృక:- "ప్రోషితః భర్తా పతిర్యా"77

తగిన సమయానగాని, తానిచ్చిన సమయానగాని పతిప్రోషితుడై, దేశాంతరంపోయి అన్యవ్యాసంగంవల్ల రాలేక పోతే ఆనాయిక ప్రోషిత భర్తృక జాగరముంటుంది కృశిస్తుంది ప్రియునిరాకను నిరీక్షిస్తుంది. చింతా, జాడ్యాలు కలిగి ఉంటుంది ఎప్పుడూ పడకపై పడుకొనే ఉంటుంది

8) - అభిసారిక:- అభిసరించేది లేక అభిసరింపజేసేది అభిసారిక. తన కాంతున్ని అభిసరింపజేసే నాయిక తాను ఉన్నచోటికి అతన్ని రప్పిస్తుంది. ఇది స్వీయాంగన అభిసరణరీతి పరాంగన అభిసరణంలో పరాంగన తన ఇల్లు వదలి ప్రియుని ఇంటికేగి అభిసరిస్తుంది ఈమె వెన్నెల రాత్రులలో తెల్లటివి, చీకటి రాత్రులలో నల్లటివి అయిన అలంకారాల్ని ధరించడంచేత ఈమె జ్యోత్స్నాభిసారిక, తమిస్రాభిసారిక అని రెండు విధాలుగా పిలువబడుతుంది.

ఈ అష్టవిధనాయికలలో శృంగారం వైవిధ్యంతో భాసిస్తుంది. ధీరోదాత్తాది నాయకులు, స్వీయాది నాయికలు పరస్పరం ఆలంబనంగా ఉండి శృంగారరసం పుట్టడానికి కారకులౌతారు.

2) ఉద్దీవన విభావం:-

" చంద్ర చందన రోలంబ ఋతాద్యుద్దీపనంమతమ్" 78

" .... ఇతరత్కారణ జాతముద్దీపన విభావః, సచతు
ర్విధః - తథాచోక్తంశృంగారతిలకే-
ఆలంబన గుణశ్చైవ తచ్చేష్టా తదలంకృతిః
తటస్థశ్చేతి విజ్ఞేతి విజ్ఞేయశ్చతుర్ధోద్దీపనక్రమః.
ఆలంబన గుణోరూపయౌవనాది రుదాహృతః
తచ్చేష్టాయౌవనోద్భూత హావభావాది కామతాః
నూపురాంగదహారాది తదలంకరణం మతం
మలయానిలచంద్రాద్యా స్తటస్థాః పరికీర్తితాః " 79

ఉద్దీవన విభావం అంటే ఉద్దీపింపజేసే విభావం 'ఉద్దీవన విభావాస్తే రసముద్దీపయంతియే' యౌవనాదులు ఆరసాన్ని ఉద్దీపింపజేసేవి. ఈ ఉద్దీవన విభావం సహజం అనీ తటస్థం అనీ రెండురకాలు ఈ శృంగారంలో నాయికానాయకుల యౌవన, భూషణ, చేష్టలు మూడూ సహజాలైన అంటే ఆలంబనం యొక్క గుణాలైన ఉద్దీపన విభావాలు మలయానిలాదులు తటస్థ రూపమైన ఉద్దీవన విభావం సహజంగా ఇదితటస్థం. " మలయానిల చంద్రాద్యాస్తటస్థాః పరికీర్తితాః" అని ప్రతాపరుద్రీయకారుడు చెబితే భట్టుమూర్తి మదనున్ని కూడ ఉద్దీవన విభావాల్లో చేర్చాడు ఇతరాలంకారికు లెవ్వరూ 'మదను'న్ని ఉద్దీవన విభావంలో చేర్చలేదు

శృంగారానికి చేతన అచేతనాలన్నీ ఉద్దీవన విభావాలుగా వుంటాయి శృంగారానికి తగినట్టి ఉద్దీవనాలు ఈ క్రింది విదంగా ఉంటాయి

1. సముద్రతీరం, ఉద్యానం, నదీభాగం, శైలపరిసరం, పురప్రదేశం, రాష్ట్రభవనం, సముద్రం, అడవి, ఆశ్రమం, హర్మ్యాదులు.

2. సంగీత విద్యాదికళలు

3. శృంగారానికి కాలం ఇలా ఉంటుంది వసంతాది ఋతువులు, పగటి సమయం, రాత్రిసమయం, చంద్రాస్తమయం, సూర్యాస్తమయం, చంద్రోదయం, సూర్యోదయం.

4 కాలగుణాలు ఇలా ఉంటాయి:- చంద్రిక, కోకిల ఆలాపం హంసధ్వని, సారసధ్వని, తుమ్మెదలగీతం, సర్వసుఖావహాలైన గంధాలు, మయూరాల కేకారావాలు

5. ద్రవ్యాలు ఇలా ఉంటాయి - పరిమళ చందనాలు, మృదుల శిలాతలం, చంపక అశోక పున్నాగ చూతాలు, కురవకాదులు, పుష్పాలతో కూడుకొన్న మల్లికాదిలతలు, రమ్యాలైన భవనాదులు, మృదువుగా ఉండేశయనాలు, హేమమయరత్నమయభూషలు, సురభి పుష్పాలు, మృదుదుకూలాలు, మధురజలాలు మొదలైనవి

6 క్రియావిశేషాలు.- ఉద్యానయాత్ర, దేవేంద్రపూజ, మదిరాపాన కేళీ విశేషాలు, రతోత్సవ ఉపహారాలు, అలంకార వ్యాపారాలు మొ

7 వసంత ఋతువులో- పరిమళాలు, సురభివాతాలు, కుసుమాంచితాలైన తరువులు, తుమ్మెదలు, కోకిలలు, మంచిభవనం, మృదులశయ్య, సురాసవం మొ. ఉద్దీపనాలు

8 గ్రీష్మఋతువులో - ఉద్యాన వనవిహారం, జలక్రీడ, కిసాలయాలచే ఆస్తృతములైన ఛాయా ప్రదేశాలు, ఏలాలవంగ కర్పూరాలు, హిమజలాలు, చందనాదులు, చిత్రాలైనల తాగృహాలు, ప్రాచీనాలైన సురాసవాలు, ధారాగృహం హిమగృహాలు, తామరతూళ్ళు కూర్చిన కుట్టిమం, మణికుట్టిమం, వికసించిన కేసరాలు, కలకల్హార పాటల ఇందీవరాలు, ముక్తా సూత్రంగల భూష, గైరిక వర్ణ రూషితం అయిన వస్త్రం మొదలైనవి ఉద్దీపన విభావాలు

9. వర్షఋతువులో - కదంబ, కేతకి, లోధ్ర, కదలి, కుటజాది వృక్షాలు, నెమళ్ళు, శాద్వలం, ఇంద్రగోపాలు, గిరినిర్ఝరాలు, పూర్ణతటకాలు, ప్రవహించే నదులు, వారిదాలు, వారిధారలు, మెరువులు, మేఘగర్జితాలు, మదించిన మతంగజాలక్రీడలు, గోవృషభాల రంకెలు, హరిణాలు, శ్యామల వనాలు, బూరుగు దూది పరుపు కాలాగరు సముత్పన్నాలయిన ధూపాలు, కప్పుకోవడానికి తగిన మంజిష్ఠారాగరూషితం అయిన దుప్పటి, పద్మరాగమయమైన భూష, ఒకచో ఎర లాభరణం మొ. రాగదీపనాలు.

10. శరదృతువులో - చంద్రిక మందవాయువులు, హంసలతో కూడుకొన్న పద్మాకరాలు, ప్రసన్నమైన జలం, పులినం, నళినీ దళశయ్య, సరత్తటం, ఆరామాలు

బురదలేని భూములు, కస్తూరీ పరిమళ ప్రసారం, హంస సారసాల ధ్వనులు, మంచిముత్యాల చిమ్మే చెరకులు, పండిన పైరుపంటలు, లలితం, అతిశీతోష్ణంగానిశయ్యా, క్రీడాస్థలి, మరకత వైడూర్యఖచిత భూషలు, విమలాలైన వస్త్రాలు, గంధాలు, కస్తూరి మొ: రాగదీపనాలు.

11. హేమంతశిశిర ఋతువుల్లో - గంధపుష్పాలు, వస్త్రాలు, భూషణాలు, శయనాలు, నియతాలుగా ఉండక సంకీర్ణాలుగా అనుభూయ మానాల వడమే ఈ ఋతువుల్లో రాగదీపనాలు

ఈ పై ఉద్దీపనాలు దేశకాలోచితాలైనవి అన్నీతటస్థాలు నాయికా నాయకుల రూపయౌవనాదులు పరస్పర ఉద్దీపకాలు, భూషణాలు చేష్టలు కూడ ఆలంబనగుణాలైన ఉద్దీపనవిభావాలు ఇవిసహజాలు, తటస్థాలైన ఉద్దీపనాలు సహజంకానివి

యౌవనం వల్ల కలిగిన హావభావాదులే నాయికా నాయకుల చేష్టలు. ఈ శృంగార చేష్టలు నాయకునికి ఉద్దీపన విభావాలైతే నాయికకు అనుభావాలౌతాయి.

"యౌవనే సత్త్వజాస్తాసా మష్టావింశతి సంఖ్యకాః
అలంకారాస్తత్రభావహావ హేలాస్త్రయోంగజాః.
శోభాకాంతిశ్చ దీప్తిశ్చ మాధుర్యంచ ప్రగల్భతా
ఔదార్యం ధైర్యమిత్యేతే సప్తైవస్యురయత్నజాః.
లీలా విలాసో విచ్ఛిత్తిర్బిబ్బోకః కిలికించితం
మోట్టాయితం కుట్టమితం విభ్రమోలలితం మదః.
విహృతం తపనం మౌగ్ధ్యం విక్షేపశ్చకుతూహలం
హసితం చకితంకేళి రిత్యష్టాదశ సంఖ్యకాః
స్వభావజాశ్చ, భావాద్వాదశ పుంసాంభవంత్యపి" 80

భావం, హావం, హేల - అనే మూడూ మనస్సువల్ల పుడతాయి.-శోభ, కాంతి, దీప్తి, మాధుర్యం, ప్రగల్భత, ఔదార్యం, ధైర్యం, ఈ ఏడు అయత్నజాలు ఈ పై పదిభావాలు స్త్రీ పురుషులు ఇద్దరికీ కలుగుతాయి లీల, విలాసం, విచ్ఛిత్తి, బిబ్బోకం, కిలికించితం, మోట్టాయితం, కుట్టమితం, విభ్రమలం, లలితం, మదం, విహృతం, తపనం, మౌగ్ధ్యం, విక్షేపం, కుతూహలం, హసితం, చకితం, కేళి- అనే పద్దెనిమిదీ స్వభావజాలు.

" భావాది ధైర్యాంతమగు పదియు బురుషులకు గూడ గలుగునని చెప్పినను నివ్వన్నియు నాయికాశ్రితములయి యున్నపుడే రమణీయములుగా నుండును " 81

1. భావం - "నిర్వికారాత్మకే చిత్తేభావః ప్రథమ విక్రియా" 82
ఏవికారం లేని చిత్తంలో మొట్ట మొదటి సారికలిగిన వికారం భావం.

2. హావం:- "భ్రూనేత్రాది వికారైస్తు సంభోగేచ్ఛా ప్రకాశకః
భావ ఏవాల్ప సంలక్ష్యవికారో హావ ఉచ్యతే" 83

భ్రూనేత్రాది వికారాలచే సంభోగేచ్ఛను తెలిపే భావమే అల్పంగా పైకి కనబడే వికారం హావం (భావమే కొద్దిగా వ్యక్తమవడం హావం అని అర్థం)

3 హేల - ఆ మనో వికారం సువ్యక్తం అయితే హేల

4 విలాసం:-"యానస్థానాసనాదీనాం ముఖనేత్రాది కర్మణాం విశేషస్తు విలాసస్స్యాదిష్ట సందర్శనాదినా" 84

ఇష్టమైన వాన్ని చూడడంతో నడకలో, ఉనికిలో, కూర్చోవడంలో, మాట్లాడడంలో చూడడం మొ: కార్యాలలో కనబడే విశేషం 'విలాసం' (ఇదే ఒయ్యారం)

5. మాధుర్యం:-"సర్వావస్థా విశేషేమ మాధుర్యం రమణీయతా "85ఏ అవస్థలో ఉన్నా, ఎలా ఉన్నా రమణీయంగా కనబడడం మాధుర్యం

6 ధైర్యం - " ముక్తాత్మ శ్లాఘనాధైర్యం మనో వృత్తి రచంచలా"86 ఆత్మశ్లాఘలేని, అంచంచలమైన మనో వృత్తి ధైర్యం

7 విభ్రమం - "త్వరయా హర్ష రాగాదేర్దయితాగమనాదిమ, అస్థాన భూషణాదీనాం విన్యాసో విభ్రమోమతః" 87

ప్రియుడు రావడంతో కలిగిన హర్షరాగాదుల వల్ల తొందరతో భూషణాదుల్ని తారు మారుగా ధరించడం విభ్రమం

8 లీల - " అంగైర్వేషైరలంకారైః ప్రేమభిర్వచనైరపి
ప్రీతి ప్రయోజితైర్లీలాంప్రియస్యాను కృతింవిదుః" 88
చేష్టలతో, వేషాలతో, భూషణాలతో, ప్రేమ వచనాలతో ప్రియుణ్ణి అనుకరించడం 'లీల'

9 కిలికించితం - " స్మిత, శుష్క, రుదిత, హసిత, త్రాస, క్రోధ, శ్రమాదీనాం, సాంకర్యం కిలికించిత మభీష్టతమ సంగమాజాద్ధర్షాత్" 89

ప్రియసంగమ హర్షం వల్ల కలిగిన స్మిత, శుష్క,రుదిత, హసిత, త్రాస, క్రోధ, శ్రమ మొ: వాటిసాంకర్యం కిలికించితం.

10. మోట్టాయితం - "తద్భావ భావితే చిత్తే వల్లభస్య కథాదిమ మోట్టాయిత మితిప్రాహుః కర్ణకండూయనాదికం" 90

ప్రియుడితో రతిక్రీడల్లో తేలాలి అనే మనస్సు కలిగినపుడు అతని కథలు విని చేసే కర్ణకండూయనాదికమైన చేష్టమోట్టాయితం

11 లలితం - "సుకుమార తయాంగానాం విన్యాసో లలితం భవేత్"91

చేతులు, కాళ్ళు మొదలైన అవయవాల్ని సుకుమారంగా కదలించడం లలితం

12 విచ్ఛిత్తి - "స్తోకాప్యాకల్పరచనా విచ్ఛిత్తిః కాంతిపోషకృత్" 92

ఆభరణాలు కొద్దిగా ధరించినప్పటికీ కాంతిని పోషిస్తే అదివిచ్ఛిత్తి

13 బిబ్బోకం - "బిబ్బోకస్త్వతిగర్వేణ వస్తునీష్టేzస్యనాదరః" 93

అతిగర్వంచే ఇష్టమైన వస్తువుపై గూడ అనాదరంచూపడం బిబ్బోకం

14 విహృతం - "వక్తవ్యకాలేzవ్యవచో వ్రీడయావిహృతం మతం" 94

సిగ్గుతో వలుక వలసిన కాలాన పలుక కుండడం విహృతం

15 చకితం - "కుతోzపిదయితస్యాగ్రే చకితం భయవిభ్రమః" 95

ప్రియుడి ఎదుట ఏదో కారణంతో భయపడి తొట్రుపాటు నొందడం చకితం

16. హసితం - "హసితంతు వృధాహాసో యౌవనోద్భేద సంభ్రమః" 96

యౌవనోదయంచే అకారణంగా నవ్వడం హసితం

17 కుట్టమితం - "కేశస్తనాధరాదీనాం గ్రహే హర్షేzపిసంభ్రమాత్
ఆహుః కుట్టమితం నామశిరః కరవిధూననం" 97

ప్రియుడు తన కేశాలు, స్తనాలు, అధరాలు మొదలైన వాటిని గ్రహిస్తే లోలోపల హర్షిస్తూకూడ తత్తర పడతు తలను, చేతుల్ని విదల్చడం కుట్టమితం

18 కుతూహలం - "రమ్యవస్తు సమాలోకే లోలతాస్యాత్కు తూహలం "98
అందమైన వస్తువుని చూడాలనే చాపల్యం కుతూహలం
19 శోభ.- "రూపయౌవన లాలిత్య భోగాద్యైరంగ భూషణంశోభా"99
రూప, యౌవన, సుకుమార, భోగాలవల్ల అంగాలకు కల్గిన అందం శోభ.

20. కాంతి - "సైవ కాంతి ర్మన్మథాప్యాయిత ద్యుతిః" 100

మన్మథునిచే వర్ధిల్ల చేయబడ్డ ఆ శోభయే కాంతి

21.దీప్తి - "కాంతిరేవాతి విస్తీర్ణా దీప్తిరిత్య భిధీయతే" 101

అత్యంతమైన కాంతే దీప్తి

22 ప్రగల్భత - "నిస్సాధ్వసత్వం ప్రాగల్భ్యం"102

ప్రియుడు ప్రియురాలు పరస్పరం రమించేప్పుడు అప్రతిబంధకంగా వర్తిల్లడం ప్రగల్భత.

23 ఔదార్యం - "ఔదార్యం వినయస్సదా" 103 ఔదార్యం అంటే వినయం అంటే ప్రియుడి తప్పు తెలిసినా కోపగించకపోవడం

24 మదం - "మదోవికార స్సౌభాగ్య యౌవనాద్య వలేపజః' 104

సౌభగ్య, యౌవనాదుల గర్వం వల్ల కలిగిన వికారం మదం

25 తపనం - "తపనం ప్రియవిచ్ఛేదే స్మరావే గోత్థచేష్టితం" 105

ప్రియ విరహ సమయంలో మోహాతి రేకంతో కలుగు చేష్ట తపనం

26.మౌగ్ధ్యం.- "అజ్ఞానాదివయా పృచ్ఛాప్రతీతస్యా z పి వస్తునః

వల్లభస్యవురః ప్రోక్తం మౌగ్ధ్యంతత్త్వ వేదిభిః" 106

తెలిసిన వస్తువును గూర్చి తెలియని విధంగా ప్రియసన్నిధిలో ప్రశ్నించడం మౌగ్ధ్యం

27 విక్షేపం.-"భూషణామర్ధ రచనా మిథ్యా విష్వగవేక్షణం

రహస్యాఖ్యాన మీషచ్ఛ విక్షేపోదయితాంతికే "107

ప్రియుడి ఎదుట భూషణాలు సగందాల్చడం, ఊరకే అటు ఇటు చూడడం, రహస్యంగా మాట్లాడడం మొ చేష్ట విక్షేపం

28 కేళి - 'విహారే సహకాంతేన క్రీడితం కేళిరుచ్యతే" 108

ప్రియుడితో విహరించేప్పుడు చేసే చుంబన, ఆలింగనాది క్రీడ కేళి.

c. అనుభావం :-

శృంగారంలో ప్రియుడి ముఖం చూడటం, ప్రియ గుణాల్ని వినడం

కీర్తించడం మొదలైనవి, కంపం మొదలైన సాత్త్విక భావాలు అనుభావాలు.

. . భ్రూవిక్షేప కటాక్షాది రనుభావః ప్రకీర్తితః" 109

ఉద్బుద్ధం కారణైఃస్వైస్వైర్బహిర్భావం ప్రకాశయన్

లోకే యః కార్యరూపస్సో z నుభావః కావ్యనాట్యయో " 110

తమతమ కారణాలచే అంటే జనక పోషక రూపాలగు ఆలంబన ఉద్దీపన కారణాలచే లోకాన ఉద్బుద్ధం అయిన రత్యాదికమగు స్థాయిభావాన్ని బయటికి తెలిపే క్రియా విశేషం, కావ్యనాట్యాలలో అనుభావం అనబడుతుంది.

'అను = పశ్చాత్, భావః = ఉత్పత్తిః యేషాంతే అనుభావాః" అనీ

'అనుభావయతి రత్యాదికం' అనీ అనుభావానికి వ్యుత్పత్తులు

"ఉక్తాః స్త్రీణా మలంకారా అంగజాశ్చ స్వభావజాః
తద్రూపాస్సాత్త్వికాభా వాస్తథా చేష్టాః పరాఅపి"111

అంగజాలైన భావ, హావ, హేలలు మూడూ, అయత్నజాలైన శోభమొదలు ధైర్యం వరకు ఏడూ, స్వభావజాలైన లీల మొదలు కేళి వరకు పద్దెనిమిదీ, సాత్త్విక భావాలెనిమిదీ, ఇంకా సంభావ్య మానాలైన చేష్టలు శృంగారంలో అనుభావాలు

a) సాత్త్వికభావాలు:- "అభినయాదిముఖేన అన్యగత సుఖ దుఃఖాది బావనాయా మంతః కరణస్య అనుకూలత్వం సత్త్వం" 112

అభినయాదుల మూలాన పరగత సుఖదుఃఖాల ఎడ అంతఃకరణం సుముఖమవడం సత్త్వం అని "రజస్తమోభ్యామస్పృష్టం మనస్సత్త్వమిహోచ్యతే" 113 రజస్తమస్పుర్శలేని మనస్సు సత్త్వం అనీ, "స్వాత్మ విశ్రామ ప్రకాశకారీ కశ్చన ఆంతరో ధర్మస్సత్త్వం".114

తన ఆత్మలో విశ్రమించిన రత్యాదుల్ని ప్రకాశింప చేసే ఆంతర ధర్మంసత్త్వం అనీ, "బాహ్యాంతర నైర పేక్ష్యేణ రసాపరోక్షీ కరణత్వ లక్షణో బలవిశేషస్సత్త్వం"115 అనీ, రకరకాల లక్షణాలు సత్త్వానికి కనబడుతున్నాయి ఆసత్త్వంలో పుట్టాయి కాబట్టి సాత్త్విక భావాలని వ్యవహారం, లేక ఆసత్త్వ దశలో కలిగిన కార్యాలే సాత్త్విక భావాలు ఇవీ కార్యరూపాలవడం చేత అనుభావాలే అవుతాయి అయినా "సత్త్వైక మూలత్వాత్ సాత్త్విక ప్రథా"116కేవలం

సత్త్వం నుండే పుట్టాయి కాబట్టి సాత్త్వికాలు మిగిలిన అనుభావాలు శరీరజాలు సాత్త్విక భావాలు ఎనిమిది 1. స్తంభం, 2.ప్రళయం, 3 అశ్రువు, 4 స్వేదం, 5 వైస్వర్యం, 6.రోమాంచం, 7 కంపం, 8 వైవర్ణ్యం

భరతుడు మొదలైన ఆలంకారికులంతా ఎనిమిది సాత్త్విక భావాల్నే పేర్కొన్నారు కాని భానుదత్తుడు తన 'రసతరంగిణి'లో "జృంబాచనవమః సాత్త్వికో భావ ఇతి ప్రతిభాతి "117 జృంబ అనేది తొమ్మిదవ సాత్త్విక బావం అని, తొమ్మిది సాత్త్విక భావాలను పేర్కొన్నాడు

1 స్తంభం:-'స్తంభశ్చేష్టా ప్రతీమాతో భయహర్షామయాదిభిః "118

భయం, హర్షం, ఆమయం మొదలైన వాటివల్ల శరీరానికి కలిగే చేష్టాప్రతీఘాతం స్తంభం

2 ప్రళయం - "ప్రళయస్సుఖదుఃఖాభ్యాం చేష్టాజ్ఞాన నిరాకృతిః"119

అధికమైన సుఖ దుఃఖాలచే కలిగే అచేతనత్వం ప్రళయం

3.అశ్రువు -"అశ్రునేత్రోద్భవం వారి క్రోధ దుఃఖ ప్రహర్షజం"120

క్రోధం, దుఃఖం, హర్షం అనే వాటివల్ల కళ్ళలో పుట్టిన నీరు అశ్రువు

4 స్వేదం·- "వపుర్జలోద్గమ స్స్వేదో రతి ఘర్మ శ్రమాదిభిః" 121

రతి, వేడి శ్రమ మొదలైన వాటివల్ల కలిగే శరీరజలం స్వేదం

5 వైస్వర్యం - "మదసమ్మద పీడద్యైర్వైస్వర్యం గద్గదం విదుః" 122

మదం, సంతోషం, పీడమొ. వాటిచేకలుగు గాద్గద్యం వైస్వర్యం

6 రోమాంచం - "హర్షాద్భుత బయాదిభ్యో రోమాంచో రోమ విక్రియా" 123

హర్షం, అద్భుతం భయం మొ వాటివల్ల కల్గు రోమవికారం రోమాంచం

7 కంపం -రాగద్వేషశ్రమాదిభ్యః కంపోగాత్రస్య వేపథుః" 124

రాగం, ద్వేషం, శ్రమమొ వాటిచే కలిగిన గాత్ర వేపథువే కంపం.

8వివర్ణత -"విషాద, మద, రోషాద్యైర్వర్ణాన్యత్వం వివర్ణతా" 125

విషాదం, మదం, రోషం మొ వాటిచే కలుగు నవ్యవర్ణత వివర్ణత

D. సంచారి భావాలు :-

వి + అభితః + చరంతి = వ్యభిచారిణః
"విశేషాదాభి ముఖ్యేన చరంతో వ్యభిచారిణః
స్థాయిన్యున్మగ్న నిర్మగ్నాస్త్రయస్త్రిం శత్తుకీర్తితాః"126

విశేషించి అంటే విభావ అనుభావ సాత్త్విక భావాల కంటె అతిశయించి రసాను గుణంగా చరించేవి వ్యభిచారులు ఇవి స్థాయి అయిన రత్యాదులలో ప్రాదుర్భావ తిరోభావాల్ని పొందుతూ చరిస్తాయి సంచారులంటే (సమ్యక్ చారయంతి) రసాన్ని అంతటా వెదజల్లేవి ఇవి ముప్పై మూడు స్థాయి భావం సముద్రం లాంటిది సంద్రంలో తరంగాలు ఆవిర్భవిస్తాయి తిరోభావాన్ని పొందుతాయి. మళ్ళీ ఆవిర్భవిస్తాయి మళ్ళీ తిరోభావాన్ని పొందుతాయి అలాగే వ్యభిచారి భావాలు స్థాయి భావంలో మజ్జనోన్మజ్జనాలు చేస్తుంటాయి ఆవిర్భావ, తిరోభావ సామ్యాన్ని బట్టే వ్యభిచారులకు తరంగాలతో సామ్యం ఈ వ్యభిచారి భావాలు స్థాయి భావాల్ని లెస్సగా పోషించి వాటిని రస్యమానాలుగా చేస్తాయి

"త్యక్త్వౌగ్ర్య మరణాలస్య జుగుప్సా వ్యభిచారిణః" 127

ఔగ్ర్యం, మరణం, ఆలస్యం, జుగుప్స అనే నాలుగు కాక మిగిలిన సంచారి భావాలు శృంగార రసంలో ఉంటాయని విశ్వనాథుడు చెప్పాడు కాబట్టి శృంగారంలో ఇరువై తొమ్మిది వ్యభిచారులుంటాయి

అవి. 1. నిర్వేదం 2. శ్రమ 3. దైన్యం 4 జాడ్యం 5. గ్లాని 6. త్రాసం 7 శంక 8 ఆర్తి (వ్యాధి) 9 రోషం 10 గర్వం 11. ఆవేగం 12. ధృతి 13 స్మృతి 14 చాపలం 15 అవహిత్థ 16. త్రప 17 విషాదం 18 మదం 19 ఔత్సుక్యం 20 మతి 21 నిద్ర 22. మోహం 23 బోధ 24 ముదం (హర్షం) 25 వితర్కం 26 సుప్తి 27 అసూయ 28 చింత (ఆధ్యానం) 29 ఉన్మాదం 30 అపస్మారం

1 నిర్వేదం:- "నీచ పురుషేమ ఆక్రోశన, అధిక్షేప, వ్యాధి, తాడన, దారిద్ర్య, ఇష్ట విరహ, పరసంపద్దర్శనాదిభిః ఉత్తమేమతు అవజ్ఞాదిభిః జనితా విషయద్వేషాఖ్యా రోదన, దీర్ఘశ్వాస, దీనముఖ తాది కారిణీ చిత్త వృత్తిర్నిర్వేదః" 128

నిర్వేదం అంటే నీచులకు ఆక్రోశన, అధిక్షేప, వ్యాధి, తాడన, దారిద్ర్య, ఇష్టవిరహ, పరసంపద్దర్శనాదుల వల్ల, ఉత్తములకు పర తిరస్కారాదుల వల్ల పుట్టిన విషయ ద్వేష నామాంతరంగల చిత్తవృత్తి అది కలిగినపుడు రోదనం, దీర్ఘనిశ్వాసం, దీన ముఖత్వం మొ. కలుగుతాయి.

2 శ్రమ - "బహుతర శరీర వ్యాపార జన్మా నిశ్శ్వాసాంగ సమ్మర్ద నిద్రాది కారణీభూతః ఖేద విశేషః శ్రమః" 129

అనేక రకాలైన శరీర వ్యాపారాల వల్ల పుట్టినదీ, నిట్టూర్పు ఒళ్ళునలగడం, నిద్ర మొ॥ వాటిని కలిగించు ఖేదవిశేషం శ్రమ ఇటశరీర వ్యాపారం విభావం నిశ్వాస, అంగ సమ్మర్ద, నిద్రాదులు అనుభావాలు వీటితో వ్యక్తమయ్యే సంచారి శ్రమం

దైన్యం - "దుఃఖదారిద్ర్యాపరాధాది జనితః స్వాపకర్షభావ
ణాది హేతుశ్చిత్త వృత్తి విశేషోదైన్యం" 130

దుఃఖం, దారిద్ర్యం, అపరాధం మొ॥ వాటివల్ల పుట్టినట్టి, స్వాపకర్షం సూచించే సంభావణకు హేతుభూతమైన చిత్తవృత్తి దైన్యం దుఃఖాదులు విభావాలు స్వాపకర్ష భావణాదులు అనుభావాలు వీటిచే దైన్యం వ్యజ్యమాన మౌతుంది

4 జడత - "చింతోత్కంఠా, భయ విరహేష్టా నిష్టదర్శన శ్రవణాది జన్యా అవశ్య కర్తవ్యార్థ ప్రతి సంధాన వికలా చిత్తవృత్తి జడతా" 131

చింత, ఉత్కంఠ, భయ, విరహ, ఇష్టానిష్ట దర్శన శ్రవణాదుల వల్ల బుట్టినట్టీ, అవశ్య కర్తవ్యాలైన కార్యాలలో ఇతి కర్తవ్యతా మూఢత్వాన్ని కలిగించేదీ అయిన చిత్తవృత్తి విశేషం జడత చింతాదులైన విభావాలచే ఇతి కర్తవ్యతా మూఢత్వ రూపమైన అనుభావంచే జాడ్యం వ్యజ్యమాన మౌతుంది

5 గ్లాని - "ఆధివ్యాధి జన్య బలహాని ప్రభవో వైవర్ణ్య శిథిలాంగత్వ, దృగ్భ్రమణాది హేతుః దుఃఖ విశేషోగ్లానిః" 132

ఆధివ్యాధుల వల్ల బలం తగ్గడం వల్ల పుట్టినట్టి వైవర్ణ్యం, శిథిలాంగత్వం, దృగ్భ్రమణం మొ వాటిని కలిగించేదుఃఖవిశేష రూపమగు చిత్త వృత్తి గ్లాని

ఇట బలహాని విభావం, వైవర్ణ్య, శిథిలాంగత్వ, దృగ్భ్రమణాదులు అనుభావాలు.

6. త్రాస - భీరోర్ఘోర సత్త్వ దర్శన స్ఫూర్జథు శ్రవణాది జన్మా చిత్తవృత్తి విశేషస్త్రాసః" 133

పిరికి వాడికి వ్యాఘ్రాది ఘోరజంతు దర్శనం వల్ల, ఉరుములు మొ: వాటిని వినడం వల్ల గలుగు చిత్తవృత్తి విశేషం త్రాసం దీనివల్ల రోమాంచ, కంప, స్తంభ, భ్రమాదులు కలుగును

7 శంక - " కిమనిష్ట మను భవిష్యతీత్యాకారశ్చిత్త వృత్తి విశేషశ్శంకా" 134

తనకు అనిష్టం అవుతుందని కొదకడం శంక. దీని వల్ల ముఖ వివర్ణత, కంపాదులు కలుగుతాయి

8. ఆర్తి లేదా వ్యాధి - "రోగ విరహాది ప్రభవో మనస్తాపో వ్యాధిః" 135

రోగం, విరహం మొ వాటివల్ల పుట్టిన మనస్తాపరూపమైన చిత్తవృత్తి విశేషం వ్యాధి రోగ విరహాలు విభావాలు గాత్రశైథిల్యం, శ్వాసం మొ వి అనుభావాలు

9. రోషం(అమర్షం) - "పరకృతావజ్ఞాది నానాపరాధ జన్యః

మౌన వాక్యాది పారుష్యాది కారణీ భూతశ్చిత్త వృత్తి విశేషోz మర్షః" 136

ఇతరులు చేసిన అవమానం మొ వాటి వల్ల పుట్టింది, మాటలాడకుండడం, వాక్పారుష్యం మొ॰ వాటిని కలిగించు చిత్త వృత్తి విశేషమే అమర్షం

అవజ్ఞాదులు విభావాలు. మౌన వాక్పారుష్యాదులు అనుభావాలు వీటిచే రోషం వ్యక్త మౌతుంది

10 గర్వం -"రూపధన విద్యాది ప్రయుక్తాత్మోత్కర్షజ్ఞానాధీన పరావ హేలనం గర్వః" 137

రూపం, ధనం విద్య మొ వాటిచే పుట్టిన ఆత్మోత్కర్ష జ్ఞానం వల్ల కలిగిన పరావహేలనం గర్వం

11. ఆవేగం - "అనర్థాతిశయ జనితా చిత్తస్య సంభ్రమాఖ్యా వృత్తిరావేగః " 138

అనర్థాతిశయం వల్ల పుట్టిన మనస్సంభ్రమం అనేచిత్త వృత్తి ఆవేగం

12 ధృతి - "లోభశోక భయాది జనితోపప్లవ నివారణ కారణీ

భూతశ్చిత్త వృత్తి విశేషో ధృతిః" 139

లోభం, శోకం, భయం మొ. వాటివల్ల కలిగిన ఉపప్లవాన్ని నివారించే కారణం అయిన చిత్తవృత్తి విశేషం ధృతి

13 స్మృతి - "సంస్కార జన్యం జ్ఞానం స్మృతిః" 140

సంస్కారం వల్ల కలిగిన జ్ఞానం స్మృతి

14. చాపలం - "అమర్షాది జన్యావాక్పారుష్యాది కారణీ భూతా చిత్త వృత్తిశ్చపలతా" 141

అమర్షాదుల వల్ల పుట్టినట్టి, వాక్పారుష్యాదులు కలిగించునట్టి చిత్త వృత్తి చపలత.

15. అవహిత్థ.- "వ్రీడాది భిర్నిమిత్తైః హర్షాద్యనుభావానాం

గోపనాయ జనితో భావ విశేషోzవహిత్థం" 148

సిగ్గు మొ వాటివల్ల హర్షాది అనుభావాల్నిదాచే చిత్త వృత్తి అవహిత్థ

16. త్రప.- "స్త్రీణాం పురుషముఖావలోకనాదేః పుంసాంచ ప్రతిజ్ఞాభంగ, పరాభవాదేరుత్పన్నో వైవర్ణ్యాధోముఖత్వాది కారణీ భూతశ్చిత్త వృత్తి విశేషో వ్రీడా" 143

స్త్రీలకు పురుష ముఖావలోకనం వల్ల కలిగేది, పురుషులకు ప్రతిజ్ఞా భంగం, పరాభవం మొ వాటివల్ల కలిగేది, వైవర్ణ్యం అధోముఖత్వం మొ. వాటిని కలిగించేది అయిన చిత్త వృత్తి విశేషం వ్రీడ అదే త్రప

17 విషాదం - "ఇష్టాసిద్ధి, రాజగుర్వాద్య పరాధాది జన్యోzను తాపో విషాదః" 144

ఇష్టం సిద్ధింప కుండడం వల్ల రాజు, పెద్దలు మొదలగు వారి అపరాధం వల్ల కలిగిన అనుతాపం విషాదం

18 మదం:- "మద్యాద్యుపయోగ జన్మా ఉల్లాసాఖ్యః శయన హసితాది హేతుశ్చిత్త వృత్తి విశేషోమదః" 145

మద్య పానాదుల వల్ల కలిగినట్టి, శయన హసితాదుల్ని కలిగించునట్టి ఉల్లాస రూపమైన చిత్త వృత్తి మదం

19 ఔత్సుక్యం - "అధునైవాస్య లాభో మమాస్త్వితీచ్ఛా ఔత్సుక్యం" 146

ఇప్పుడే నాకు ఇది లభించుగాక అనే కోరికే ఔత్సుక్యం.

20 మతి - "శాస్త్రాది విచారజన్య మర్థ నిర్ధారణం మతిః " 147

శాస్త్రాదుల్ని విచారించడంచే కలిగిన కార్య నిశ్చయం మతి దీనిలో నిశ్శంక తదర్థానుష్ఠాన, సంశయోచ్ఛేదాలు మొ అను భావాలు

21. నిద్ర - "శ్రమాది ప్రయోజ్యం చేతస్సమ్మీలనం నిద్రా" 148

శ్రమాదుల వల్ల కలిగిన మనస్సమ్మీలనం నిద్ర శ్రమాదులు విభావాలు నేత్రనిమీలనం, గాత్రనిష్క్రియత్వం మొ: అనుభావాలు

22. మోహం - భయ వియోగాది ప్రయోజ్యా వస్తుతత్త్వానవధారిణీ చిత్త వృత్తిర్మోహః" 149

భయ వియోగాదుల వల్ల కలిగినట్టి, వస్తుతత్వాన్ని నిశ్చయింప జాలనట్టి చిత్తవృత్తి మోహం

23 బోధ - "నిద్రానాశోత్తరం జాయమానో బోధో విబోధః" 150

నిద్ర నాశనం అయిన తర్వాత కలిగే మెలకువే విబోధం లేదా బోధ

24 ముదం - "దేవ భర్తృగురుస్వామి ప్రసాదః ప్రియ సంగమః మనో రథాప్తి రప్రాప్య మనోహరధనాగమః

తథోత్పత్తిశ్చ పుత్రాదేర్విభావో యత్రజాయతే నేత్ర

వక్త్ర ప్రసాదశ్చ ప్రియోక్తిః పులకోద్గమః అశ్రు స్వేదా

దయశ్చాను భావాహర్షం తమాదిశేత్" 151

దేవ, భర్త, గురు, స్వామి ప్రభృతుల అనుగ్రహం, ప్రియ సంగమం, మనోరథ లాభం, అప్రాప్యుడైన మనోహరుడు ధనం మొ వాటిరాక, పుత్రులు కలగడం మొ॥ విభావాలు నేత్రప్రసన్నత, ముఖ ప్రసన్నత, ప్రియ భాషణం, పులకోద్గమం, అశ్రూదయం, స్వేదోదయం మొ అనుభావాలు వీటిచే ముదం వ్యక్త మౌతుంది

25 వితర్కం - "సందేహాద్యనంతరం జాయమాన ఊహో వితర్కః" 152

సందేహాదులు కలిగిన తర్వాత పుట్టిన ఊహ వితర్కం

26 సుప్తి - సుప్తి అంటే స్వప్నం "నిద్రాభావోత్థ జ్ఞానం సుప్తం" 153

నిద్ర వల్ల కలిగిన జ్ఞానం స్వప్నం

27 అసూయ - "పరోత్కర్ష దర్శనా దిజన్యః పరనిందాది కారణీ భూతశ్చిత్త వృత్తి విశేషః అసూయా" 154

ఇతరుల ఉత్కర్షాన్ని చూడడం మొ వాటివల్ల పుట్టినట్టి చిత్త వృత్తి విశేషం అసూయ

28 చింత లేక ఆధ్యానం - "ఇష్టాప్రాప్త్యనిష్టప్రాప్త్యాది జనితాz ధ్యానాపర పర్యాయావైవర్ణ్య, భూలేఖన అధో ముఖత్వాది హేతుశ్చిత్త వృత్తి విశేషశ్చింతా' 155 ఇష్టం లభించకపోవడం, అనిష్టం వచ్చిపడడం, మొ వాటివల్ల పుట్టినట్టి, ఆధ్యానం అనే నామాంతరం కలిగినట్టి, వైవర్ణ్యం, భూలేఖనం, అధోముఖత్వం, మొ॥ వాటిని కలిగించునట్టి చిత్తవృత్తి విశేషం చింత. దారిద్ర్యం, ఐశ్వర్య భ్రంశనం, ఇష్టార్థం సిద్ధింపకుండడం మొ. వి

విభావాలు నిట్టూర్పులు, తలవాల్చడం, సంతాపం, స్మరణం, కృశించడం, దేహసంస్కారం లేకుండడం, అధైర్యం అనేవి అనుభావాలు

29 ఉన్మాదం - "విప్రలంభ, మహావత్తి, వరమానందాది జన్మా అన్యస్మిన్నన్యావభాసః ఉన్మాదః" 156 విప్రలంభం, మహావద, వరమానందం మొ. వాటివల్ల పుట్టినట్టి, ఒక దాన్ని మరొక దాన్నిగా భ్రమింపచేసే చిత్తవృత్తి విశేషం ఉన్మాదం

30. "అపస్మారం - వియోగ, శోక, భయ, జుగుప్సాదీ నామతి శయాత్ గ్రహావేశాదేశ్చ ఉత్పన్నో వ్యాధి విశేషోzపస్మారః"157 వియోగ, భయ, జుగుప్సాదులు అతిశయించడం వల్ల పుట్టిన వ్యాధి విశేషం అపస్మారం (ఇదివ్యాధిలో అంతర్భవిస్తుంది )

మీద వివరింప బడ్డ విభావాలు, అనుజావాలు (సాత్త్విక భావాలు) వ్యభిచారి భావాలచే 'రతి' స్థాయి భావం ప్రేమాది అవస్థలచే పుష్టిని పొంది శృంగార రసమౌతుంది

ఆలంబన విభావాలైన నాయికా నాయకులలో 'ప్రేమ' భావం జాగృతం అయి, ఉద్దీప్తమైనపుడు ప్రియుని కలవాలనే కోరిక ఉత్కటమౌతుంది దీని ఫలితంగా చింత, శంక హర్ష, మోహాది మానసిక భావాలు పుడుతూ అస్తమిస్తూ ఉంటాయి ఈ మానసిక బావాలే సంచారి భావాలు నాయికా నాయకుల చిత్తంలో అనేక విరుద్ధ, అవిరుద్ధాలైన ప్రతికూల వృత్తులవల్ల ఈ సంచారి భావాలు జలతరంగాలవలె పుడుతూ, గిడుతూ స్థాయి భావమైన 'రతి' కి సహాయకరాలుగా వుంటాయి

నాయికా నాయకులలోని ఈ సంచారి ప్రక్రియ బహిర్గతం అయి కామేంద్రియాల ద్వారా ప్రకటితమౌతుంది అప్పుడు సామాజికునిలో 'రతి' అనుభవం కలుగుతుంది కామేంద్రియాల ద్వారా ప్రకటమయ్యే ఈ చేష్టల్నే ఆలంకారికులు శృంగార రసం యొక్క 'అనుభావా' (అనుభవం)లు అన్నారు అవయవ చలనాల వివిధ క్రియలు కటాక్ష భ్రూవిక్షేపాదులు, శృంగార రసం యొక్క అనుభావాలయినవి స్వేద రోమాంచాది సాత్త్విక భావాలు కూడ అనుభావాంతర్గతాలుగా భావింపబడినాయి

ఈ విధంగా 'రతి' స్థాయి భావం సహృదయునిలో ఆరంభంనుండి ఉండి, విభావాను భావ సంచారి భావాలచే పరిపుష్టమై 'శృంగారరస'పు పూర్ణ పరిపాకానికి కారణమౌతుంది

**5. కామం - శృంగారం**

" ప్రాయికముగా సర్వభావములును కామము నుండియే నిష్పన్నములగు చున్నవి ఆకామము ఇచ్ఛాగుణ సంపన్నమై బహువిధములుగా ఉండును ధర్మకామము, అర్థకామము, మోక్షకామము

"స్త్రీ పురుమల యొక్క సంయోగము 'కామము' అనబడును ఈ కామము సర్వలోకము యొక్క ఇతర సుఖ దుఃఖములను కప్పిపుచ్చి, అదియే అధికముగా కన్పట్టును. అది వ్యసన మందు కూడ సుఖముగానే ఉండును158 " అని పి యస్ ఆర్ అప్పారావుగారు నాట్య శాస్త్రం లోని తమ వ్యాఖ్యానంలో వివరించారు.

వాత్స్యాయనుడు కామం గురించి చెప్పిన విషయాల్ని చర్చిద్దాం

"శ్రోత్ర త్వక్చక్షు ర్జిహ్వాఘ్రాణానా మాత్మ సంయుక్తేన మనసాఽధిష్ఠి తానాం స్వేమ స్వేమ విషయేష్వానుకూల్యతః ప్రవృత్తిః కామః"159

శ్రోత్రం, త్వక్కు, చక్షువు, జిహ్వ, ఘ్రాణాలు తమతమ విషయాలలో అనుకూల ప్రవృత్తి కలిగి ఉండడమే కామం శ్రోత్రాది ఇంద్రియాలు మనస్సుతో, మనస్సు ఆత్మతో కలుస్తుంది. శబ్ద స్పర్శ రూప రస గంధాల్ని అనుభవించాలి అనే కోరిక ఆత్మలో జాగృతం అయినపుడు అది మనస్సుతో సంయోగం చెందుతుంది న్యాయ శాస్త్రానుసారం ఆత్మలో సుఖం, దుఃఖం ప్రయత్నాది గుణ సమవాయ సంబంధంతో ఉంటుంది వాటితో కలిసిన మనస్సు మళ్లీ ఇంద్రియాలతో కలుస్తుంది అపుడు ఇంద్రియాలు తమ తమ విషయాలలో అనుకూల ప్రవృత్తి కలిగి ఉంటాయి ఇదే కామం నిజానికి విషయ ఉపభోగం బుద్ధికార్యం ఎందుకంటే సాంఖ్య దర్శనానుసారం ఆత్మ అకర్త సాక్షి, ఆత్మ బుద్ధి ద్వారా విషయోపబోగ సుఖాన్ని పొందుతుంది ఈ సుఖమే ప్రధాన కామం విషయ ఉపభోగ మందలి కోరిక కూడ కామం అనబడుతుంది ఈ విధంగా హేతు, ఫల భేదాలచే కామం రెండు రకాలు అవిద్య శక్తి ద్వారా విషయ జ్ఞానంలో సమాహిత మౌతుంది ఇందువల్ల విషయోప బోగాలపై తీవ్రమైన కోరిక ఉత్పన్న మౌతుంది ఈ ఇచ్ఛ విషయ వాసనలచే కలుగుతుంది కాబట్టి సాధారణంగా ఈ విషయ వాసన కూడ 'కామం' అనబడుతుంది ఈ కామం ఆకర్షణకు మూలం సంయోగానికి హేతువు (ఇది సామాన్య కామం)

"స్పర్శ విశేష విషయే త్వ స్యాభిమానిక సుఖాను విద్ధా ఫల వత్యర్థ ప్రతీతిః ప్రాధాన్యాత్కామః"160

ఆలింగన చుంబనాది అభిమానిక సుఖంతో విశేష స్పర్శ విషయంతో ఫలవంతమయ్యే అర్థప్రతీతి 'ప్రధాన కామం' స్త్రీ పురుష జననేంద్రియాల స్పర్శే ఇచట విశేష స్పర్శగా చెప్పబడింది సావాసం కొరకు తీవ్రమైన ఇచ్ఛే దీనిక్కారణం పురుముని ఊరువు, కక్ష్యాదులు, స్త్రీ నితంబాదులు వీని స్పర్శ ప్రతీతి విశేషకామం కాదు అది సామాన్యకామం ఎపుడు ఈ అర్థ ప్రతీతి ఫలవంత మౌతుందో అపుడది ప్రధాన విశేష కామం అనబడుతుంది శుక్రక్షరణ జన్య సుఖమే ఫలవంతమైన అర్థప్రతీతి ఈ అర్థప్రతీతి ఆలింగన, చుంబనాది అభిమానిక సుఖంతో అనువిద్ధమైతే ప్రధాన కామం అవుతుంది వియోని, అయోనుల్లో ఈ అర్థప్రతీతి కామంలో సన్నివిష్టంకాదు ఎందు కంటే దానిలో అభిమానిక సుఖ భావముంటుంది కనుక.

"శరీర స్థితి హేతుత్వాదాహార సధర్మిణో హికామః"161

(శరీర స్థితి కోసం ఆహారాన్ని ఎలాసేవిస్తామో అలాగే కామాన్ని కూడ సేవించాలి )

ఈ ఫలవతియైన అర్థ ప్రతీతి లేకుండ స్త్రీ పురుష సంప్రయోగం జరగదు స్త్రీతో సంప్రయోగాన్ని ఆయతన సంప్రయోగం అంటారు దీంట్లో ఆభ్యంతర, బాహ్య భేదాలు కలవు రతిని ఆభ్యంతర సంప్రయోగం అనీ, దానికి ముందు బాహ్య కలయికను బాహ్య సంప్రయోగంఅని అంటారు పంచేంద్రియ సంయోగాన్ని అంగ సంప్రయోగం అంటారు

"రసోరతిః ప్రీతిర్భావో రాగో వేగః సమాప్తి రితిరతి పర్యాయాః
సంప్రయోగో రతం, రహఃశయనం, మోహనం, సురత - పర్యాయాః 162

సంప్రయోగానికి రహః, రతం, శయనం, మోహనాలు అనే అపరనామాలు కలవు వీటి ఫలావస్థను రతి, ప్రీతి, రాగం, వేగం మరియు సమాప్తి అంటారు

ఈ కామాన్ని గూర్చి పాశ్చాత్య విద్వాంసుడు 'Freud' చెప్పిన విషయాల్ని గ్రహిద్దాం

"Freud uses the word 'Sex' in a very general sense He includes in it not only specifically sexual interests and activities, but the whole love life- it might almost be said, the whole pleasure life- of human beings"163

ఫ్రాయిడ్ 'కామ' శబ్దాన్ని పారంపరికార్థంలో ప్రయోగించలేదు తరచుగా 'కామ' శబ్దాన్ని భిన్న లింగాల రతి వ్యాపారం, తజ్జన్య సుఖం లేదా ప్రజననాలకు వాడతారు పరంపరగా వస్తున్న ఈ సంకుచితార్థాన్ని వదలి ఫ్రాయిడ్ 'కామ' శబ్దానికి వ్యాపక - సందర్భ - అర్థాలనిచ్చాడు

"Such a conception of sex is same thing very much vaster than is usually understood by that term, actually it more nearly approximates to what we might very broadly call love" 164

ఫ్రాయిడ్ కాముకతను జననేంద్రియ వ్యాపారంగా కాక వ్యాపకమైన శరీర వ్యాపార రూపంలో చూసాడు దీని ప్రముఖ లక్ష్యం సుఖ ప్రాప్తి యోని వృత్తులలో వాత్సల్యం, సఖ్యం, సహానుభావం, కోమలత, ఆదరం, శ్రద్ధ మొదలగు భావాల సమాహారమే "ప్రేమ" అందువల్ల 'కామ' శబ్దం 'ప్రేమ' శబ్ద పర్యాయవాచి అయింది

"Anxiety states, he feel, were caused by coitus, interruptus, undischarged excitement and sexual abstinence " 165

వ్యాపక రూపంలో విశ్వ భావాత్మకం మరియు సర్జనాత్మక ప్రేరణకి కేంద్రం అయిన ఈ కామం మనుష్యుని భావజీవనాసార తత్వం అని ఫ్రాయిడ్ అంగీకరించాడు స్నాయు రోగులంతా కామ వ్యాపారపు గడబిడ కారణంగా ఉద్భవిస్తారు అతడు ఖండిత సంభోగం అనభి వ్యక్త ఉత్తేజన మరియు యోని వర్షనల్ని 'చింత' మూలంలో చూసాడు

ఇంద్రియాసక్తి, స్నేహం అనే రెండు తత్వాలు గల ఉభయాత్మక ప్రవృత్తి కామం కొందరిలో కేవల ఇంద్రియాసక్తి ప్రబలంగా ఉంటుంది ఇంద్రియాసక్తి శూన్యమైన విశుద్ధ స్నేహంలో విశ్వ బంధుత్వం, సామాజిక, దేశీయ ఐక్యత అనే ఆదర్శాలుంటాయి ఒకటి శుద్ధ భోగేచ్ఛ మరొకటి విశుద్ధ సౌహార్దం దంపతులలో ఈ రెండింటి మధుర సమన్వయం ఉంటుంది అందువల్లనే ఫ్రాయిడ్ వ్యక్తి వికాసం, సమాజ వికాసాలలో కామ వ్యాపారానికి అంతులేని మాహాత్మ్యం కలదన్నాడు విభిన్న మానసిక ప్రక్రియలలో విబిన్న రూపాలలో ఈ కామ ప్రవృత్తి అభివ్యక్తమౌతుంది ఒక్కొక్కప్పుడు అది విషయ విఖ్యాపితమౌతుంది ఒక్కొక్కసారి దాని లక్ష్యం నిరోధింప బడుతుంది లేదా ఇతర అకామ లక్ష్యాలలో రూపాంతరం పొందుతుంది సభ్యతా వికాసంలో కామాన్ని అకామీకరణం చేయడం వల్ల (ఒక విధ మైన) శక్తి లభిస్తుంది కామ ప్రవృత్తి నిరోధం, ఉన్నయనాల వల్ల సాంస్కృతిక వికాస మౌతుందని ఫ్రాయిడ్ చెప్పాడు

'రీక్' అనే ఆయన ఫ్రాయిడ్ యొక్క 'పరపీడన తోషం' మరియు 'ప్రేమ'ల విషయ విచారాల్ని పరిశీలించి కామం మరియు ప్రేమ మౌలికంగా ఒకటి కావు అని ప్రతిపాదించాడు

వాత్స్యాయనుడు, ఫ్రాయిడ్ - ఈ ఇద్దరు 'కామ' శబ్దాన్ని వ్యాపకార్థంలో ప్రయోగించారు వాత్స్యాయనుడు నిరూపించిన సామాన్య, విశేష కామాలలో 'విశేష కామమే' కామమనే బడుతుంది దాని ఉద్దేశ్యం రతి సుఖం, ప్రజననం వాత్సాయనుడు క్షేత్రాది విషయాలు వాని విషయంలో అనుకూల ప్రవృత్తి కలిగి ఉండడమే కామం అన్నాడు ఈ ప్రవృత్తి నుండి కలిగే సుఖానికిది అంగ సుఖమన బడుతుంది. ఫ్రాయిడ్ కూడ జననేంద్రియాల కలయికను మాత్రమే కామంగా భావించలేదు శైశవాన్ని మనో విశ్లేషణాత్మక అధ్యయనం, ప్రౌఢుల యౌవన విపరీత పరిజ్ఞానాల వల్ల, స్త్రీ పురుష సహవాసం వల్ల మాత్రమేకాక ఇతర రూపాలలో కూడ కామం అభివ్యక్తమౌతుందని ఫ్రాయిడ్ చెప్పాడు

"The psycho analytic study of early childhood and the knowledge of adult perversions compelled him to recognize that sexuality has many manifestations besides the simple genital union of coitus" 166

అతని మతానుసారం సమస్త శరీరాంగాలకు సుఖాన్నిచ్చే ఉత్తేజనాలు వాటి పరితుష్టులు అన్నీ కామాంతర్గతాలే. శరీరంలో ఏ అంగాలలో ఈ ఉత్తేజనాలు కలుగుతాయో

వాటిని ఫ్రాయిడ్ కామజనక క్షేత్రం అన్నాడు వాత్స్యాయనుడి లాగా ఫ్రాయిడ్ కూడ ప్రేక్షణ, స్పర్శనాలకు కామ క్రియలో మహత్త్వపూర్ణ స్థానం ఇచ్చాడు

సుఖవంతమైన శారీరిక సంవేదనలే కాక భక్తి, మిత్రత, వాత్సల్యం, సహానుభావం మొదలగు అన్ని ప్రేమ ప్రకారాల సమాహారమే ఫ్రాయిడ్ 'కామం'లో ఉంటుంది. ఇవన్నీ కామం యొక్క ఉదాత్తీకృత రూపాలు వీటి ద్వారా వ్యష్టి, సమష్టి వికాసం జరుగుతుంది విశుద్ధ, ఉదాత్త ప్రేమలో శారీరికతత్త్వం నిరస్తమౌతుంది. పండిత రాజవాడె అనే ఆయన వాత్స్యాయనుడి 'అయంత్రితరతి'ని ప్లేటోనిక్ లవ్ (Platonic love)ని ఒకటి గానే తలచాడు

'జిజీవిష' యే వ్యాపకరూపంలో ఉన్న కామం. దీనితో లోకేషణ తృప్తి నొందుతుంది దీనితో అర్థేషణ, ధర్మేషణల పరితుష్టికూడ అవుతుంది. అందువల్ల కామం ధర్మార్థాల ఫల భూతం. 'ఫలభూతశ్చ ధర్మార్థయోః' ఈ కామమే సాహిత్యానికి అంటే సాహిత్యోద్భవానికి మూల కారణం మోక్ష సాధనం, సంస్కృతికి మూలాధారం.

ఆలింగన, చుంబనాది రతి పూర్వ ప్రేమ క్రీడలు దంపతులలో పరస్పర ప్రేమ, విశ్వాసం, ఐక్యత, కామ వేగాల్ని వృద్ధి చేస్తాయి. "రసోరతిః ప్రీతిర్భావో రాగోవేగః సమాప్తిరితి రతి పర్యాయాః" 167

అనే దానిలో 'రసం' రతి శబ్ద పర్యాయంగ అంగీకరింప బడింది స్త్రీ పురుష హేతుక 'శృంగారాని'కి కామ శాస్త్రీయ వివేచనే వాత్స్యాయనుడు ఉద్దేశించిన ప్రయోజనం భరతుడు దీనికి నాట్య శాస్త్ర సంబంధమైన వ్యాఖ్య చేసాడు భరతుడి రస సంకల్పానికి మూలాధారం కామ సూత్రాలు కామసూత్ర అనుమోదితమైన రసం 'రతి'ని ఆధారంగా చేసికొని శృంగారానికి ప్రధాన రస ప్రతిష్ఠని కలుగ జేస్తుంది శృంగారాన్ని ప్రకృతి రసాన్ని చేసే లేదా రసరాజాన్ని చేసే ప్రవృత్తి కామ సూత్రీయ రసధారణ వ్యాఖ్య నుండి సిద్ధమౌతుంది

శృంగారానికి స్థాయి బావం రతి గదా' కామ సూత్రానుసారం రతం యొక్క ఫలావస్థేరతి దీంట్లో చిత్త పరిస్పందం సుఖంతోడి రమణ భావం ఉంటుంది అది రసనీయం, చిత్త ప్రణయోద్భవం అందు సుఖావేగం కలుగుతుంది తృప్తి పూర్ణత్వ మొందుతుంది అది కామ భావం యొక్క అంతిమ ఫలం భరతుడు కూడ 'రతి'ని ప్రమోదాత్మక ఇష్టార్థ విషయ ప్రాప్తి అని ఈ విషయాన్నే సూచించాడు అతడు శృంగారాన్ని స్త్రీ పురుష హేతుకం, ఉత్తమ యువ ప్రకృతికం అన్నాడు అందువల్ల రతి యొక్క వాస్తవ స్థితి, సంవేదన శీలం, యువక యువతి సంయోగంలో కలుగుతుంది.

సంభోగ శృంగారపు బహిరింద్రియ స్వరూపాని కాధారం కామ సూత్రాలలోని సంప్రయోగాధికరణంలో నిర్దిష్టమైన ఆలింగన, చుంబన, సంవేశనాదులలో స్పష్టంగా చూపబడింది

'రతి' కామం యొక్క సహధర్మిణి కామం సౌందర్య సారసమైతే రతి దాని శోభ కామం చంద్రుడయితే రతి దాని వెన్నెల శృంగార రసానికి ఈ రెండింటితో ఆధార ఆధేయ సంబంధం ఉంది శృంగార రస రూపమైన శిశువుకు ఒకటి జనకుడు, రెండవది జనని. భావ హృదయం కామ, రతి పరాయణమైనట్టిది. అందువల్ల దీని ప్రాంగణాన శృంగార రసమనే శిశువు ఆనందిస్తూ ఉంటుంది

పై కామ-రతి-శృంగార సంబంధాల వివేచనం వల్ల కామం శృంగారానికి జనక స్థానీయం అని తేలింది. కాబట్టి కామమే శృంగారం అని చెప్పవచ్చు రెండింటికి భేదం మాత్రం ఉంది ఇది లౌకికం అది అలౌకికం.

ఈ కామభావాన్ని అలౌకిక ధరాతలంపై ప్రతిష్ఠించడం వల్ల శృంగార రస సృష్టి జరుగుతుంది లోక సామాన్య కామ భావం యొక్క ఏకాంతికాభివ్యక్తి శృంగార రసంలో అంతర్భుక్తం కాదు

## 6. శృంగారం - అహంకార శృంగారం

ఇప్పటిదాకా పరిశీలించిన దాన్ని బట్టి శృంగారం యొక్క ఉత్పత్తి, స్వరూపాలు తెలిసాయి శృంగారానికి స్థాయి 'రతి' అనీ అది విభావానుభావ వ్యభిచారి భావాలచే పుష్టమై శృంగారావస్థను పొందుతుందనీ ఆలంకారికులంతా చెప్పారు ఆలంకారికులంతా రసపర్యాలోచనం చేస్తూ శృంగారం గురించే ఎక్కువ శ్రద్ధ చూపించారు దానికే లక్షణాల్ని, లక్ష్యాల్ని చూపి, దాని సమగ్ర స్వరూపాన్ని మన కళ్ళ ముందుంచారు

కాని సరస్వతీ కంఠాభరణం, శృంగార ప్రకాశాలకు కర్త అయిన భోజుడు 'శృంగారం ఒక్కటే రసం' అని అహంకార శృంగారాన్ని నిరూపించాడు దాని స్వరూపాన్ని తెలుసుకుంటే శృంగారానికి, అహంకార శృంగారానికి గల భేద సాదృశ్యాలు స్పష్టమౌతాయి బోజుడు తన సరస్వతీ కంఠాభరణం లో ఇలా చెప్పాడు.

"రసోzభిమానోzహంకారః శృంగార ఇతి గీయతె
యోzర్థస్తస్యాన్వయాత్ కావ్యం కమనీయత్వమశ్నుతే"
విశిష్టాదృష్ట జన్మాయం జన్మినామాంతరాత్మసు
ఆత్మసమ్యగ్గుణోద్భూతే రేకో హేతుః ప్రకాశతే
శృంగారీ చేత్కవిః కావ్యే జాతం రసమయం జగత్
సఏవ చే దశృంగారీ నీరసం సర్వమేవతత్ 168

రసవంతమైన కవిత్వం సుందరమైంది ఆరసం శృంగారం, అభిమానం, అహంకారం అనబడుతుంది బహుజన్మార్జిత పుణ్య విశేషాన మానవునిలో అహంకారం జనిస్తుంది అహంకారం అంటే గర్వంకాదు అది సాత్త్వి కాహంకారం ఆత్మ స్థిత మైన గుణ విశేషం దీని ఉనికి వల్లనే మానవుడు తన్ను దాను ప్రేమించు కొంటున్నాడు ఇతరులను ప్రేమిస్తున్నాడు తనకు కలిగిన బాధను కూడ ఆనందంగా స్వీకరిస్తున్నాడు

తను ప్రతిపాదింప దలచిన అహంకార రసాన్ని గూర్చి శృంగార ప్రకాశం లో భోజుడు ఇలా వివరించాడు

"ఆత్మ స్థితం గుణ విశేష మహంకృతస్య శృంగార మాహు రిహజీవిత మాత్మయోనేః

తస్యాత్మశక్తి రసనీయతయా సత్వం యుక్తస్య యేన రసికోzయమితి ప్రవాదః

సత్త్వాత్మనా మమల ధర్మ విశేష జన్మా జన్మాంతరాను బవ నిర్మిత వాసనోత్థః

సర్వాత్మ సంపదుదయాతి శయైకహేతుః జాగర్తికోzపి హృదిమానవతో (మయో)వికారః

తాత్పర్యమేవ వచసి ధ్వనిరేవ కావ్యేసౌభాగ్యమేవ గుణ సంపది వల్లభస్య

లావణ్యమేవ వపుషి స్వదతేంzగనాయాః శృంగార ఏవ హృది మానవతో జనస్య

శృంగార వీర కరుణాద్భుత రౌద్ర హాస్య బీభత్స వత్సల భయానక శాంతనామ్నః

ఆమ్నాసిమర్దశ రసాన్ సుధియో వయంతు శృంగారమేవ రసనాద్రసమామనామః

వీరాద్భుతాదిమ చయేహ రస ప్రసిద్ధిః సిద్ధా కుతోపి వటయక్ష వదావిభాతి

లోకే గతాను గతి కత్వ వశాదుపేతా మేతాం నివర్త యితుమేష పరిశ్రమోనః

అప్రాతికూలక తయా మనసో ముదాదేః యస్సంవిదోzను భవ హేతురిహాభిమానః

జ్ఞేయోరసః సరసనీయ తయాత్మరక్తేః రత్యాది భూమని పునర్వితథా రసోక్తిః

రత్యాదయోzర్ధ శతమేక వివర్జితాహి భావాః పృథగ్విధ విభావ భువో భవంతి

శృంగార తత్త్వమభితః పరివారయంతః సప్తార్చిషం ద్యుతిచయా ఇవ వర్ధయంతి."169

ఆత్మస్థితమైన గుణ విశేషం అహంకారం. దీనివల్లనే మానవుడు తన్ను తాను ప్రేమించుకొంటూ, ఇతరులను ప్రేమిస్తున్నాడు. సర్వ పదార్థాల్ని అభిమానిస్తుంటాడు ఈ అర్థంలో ఇది ఆత్మరతి అనబడుతుంది ఈ అహంకారాన్ని అభిమానం అనీ, శృంగారం అనీ అంటారు 'ఈఅహంకారం వల్లనే సర్వం రస్యమాన మౌతుంది ఇది కలవాడే రసికుడు లేనివాడు అరసికుడు అందరూ రసికులు కాజాలరు రసికత్వం బహుజన్మార్జిత తపః ఫలం సత్త్వాత్ములకు మాత్రమే లభ్యం పండితులు శృంగారాది శాంత పర్యంతం పది రసాల్ని పేర్కొన్నారు మేం (భోజుడు) ఒక్క శృంగారమే రసం అని సిద్ధాంతం చేస్తాం వట యక్షన్యాయాన లోకాన గతానుగతికంగా వీరాద్భుతాదు లందు రస ప్రసిద్ధి ఉంది దాన్ని వారించడానికే ఈ మా ప్రయత్నం అంటూ పైన చెప్పిన విధంగా అహంకార శృంగారాన్ని బోజుడు నిరూపించాడు అహంకార శృంగారాన్ని ఇలా సంక్షిప్తంగా చెప్పవచ్చు

ఇదిఒకటే పరమమైంది ఇదే రసం ఇది భావాతీతమైన అవస్థ దీన్ని బోజుడు పూర్వకోటి లేక పారమార్థి కావస్థ అని పేర్కొన్నాడు

రెండవది మధ్యమావస్థ, శృంగారం నుండే 'రతి' మొదలగు నలభై తొమ్మిది బావాలుద్భవిస్తాయి విభావానుభావ వ్యభిచారి సంయోగంలో ఏదేని ఒక బావం పరప్రకర్షను పొంది, రసవ్యపదేశ అర్హతను సంపాదించుకొంటుంది నిజానికవి రసాలుకావు భావాలే వీటిని రసాలనడం ఉపచార మాత్రమే

"మనోzను కూలేమ దుఃఖాదిమ ఆత్మనః సుఖాబి మానోరసః సతుపారంపర్యేణ సుఖ హేతుత్వాద్ రత్యాది భూమసు ఉపచారేణ వ్యవహ్రియతే అతోనరత్యాదీనాం రసత్వమ్, అపితుభావనా విషయత్వాద్ భావత్వమేవ" 170 అనే భోజుని అభిప్రాయం ప్రకారం నలభైతొమ్మిది భావాలూ ప్రకర్షావస్థను పొంది రసత్వాన్ని పొందవచ్చును నిజానికవి ప్రకర్షావస్థలోనూ భావాలే రసవ్యపదేశం ఔపచారికం

రతి ప్రబవం_శృంగారం అని కొందరంటారు రత్యాదులు శృంగారం నుండే జనిస్తున్నవని మా (బోజుని) అభిప్రాయం. శృంగారిలోనే రత్యాదులు జనిస్తాయి అశృంగారిలోకాదు శృంగారి రమిస్తాడు విస్మయ పడతాడు, ఉత్సాహం చూపుతాడు, స్నేహం చేస్తాడు ఇవన్నీ భావ్యమానం అవడంచే భావాలే కాని రసాలు కావు భావనాబావ్యమానం భావమే భావనాపథానికి అతీతం రసం రసం ఒక్కటే అది శృంగారం

మూడవది ఉత్తరకోటి లేదా పరాకోటి. ఈ అవస్థలో రత్యాది భావాలన్నీ ప్రేమలో అంతర్భవిస్తాయి రత్యాది ప్రకర్షలు అన్నింటికీ ప్రేమలోనే పర్యవసానం అందుకే రతి ప్రియుడు, రణ ప్రియుడు, పరిహాస ప్రియుడు, అమర్ష ప్రియుడు ఇలాంటివి లోక ప్రసిద్ధాలై ఉన్నాయి.

Bhoja analyses our experiences and arrives at this fact of Ahamkara which enables us to enjoy, and from this fact of its being the root cause of our enjoyment, he calls it Rasa. It is called Sringara not only as one that takes man to the acme of perfection but also because it is love, it is the very life of Atmayoni or Kama Kama is not meant here as sexual love, even as Sringara is not used by Bhoja here in the sense of love between man and woman and even as Bhoja's Ahamkara here is not egotism " 171

అని రామవన్ గారు బోజుని అభిప్రాయాన్ని విశదీకరించారు

ఆత్మస్థితమైన అహంకార గుణ విశేషాన్ని ఇక్కడ శృంగారం అని అంటారు ఇది ఆత్మయోనికి ప్రాణ భూతం ఇట ఆత్మయోని శబ్దానికి కేవలం స్త్రీపురుమలకు సంబంధించిన లైంగికేచ్ఛా రూపమైన కామమని అర్థం చెప్పరాదు "శృంగారోహినామ విశిష్టేష్ట దృష్ట చేష్టాభివ్యంజకానాం ఆత్మగుణ సంపదాం ఉత్కర్ష బీజం బుద్ధి సుఖ దుఃఖేచ్ఛా ద్వేషప్రయత్న సంస్కారాద్యతి శయహేతు రాత్మనోzహంకార విశేషః 172

తన ఇచ్ఛా విషయం అయిన విశేషంతో కూడిన చేష్టలచే అబివ్యక్తాలూ, చేష్టల్ని వ్యక్తీకరించేవి అయిన ఆత్మ గుణ సంపదల్ని (రత్యాదుల్ని) ఇతర వ్యక్తిలో గ్రహించిన స్వవిషయాలుగా భావించడం వల్ల తన రత్యాదులకు అతిశయం కలుగుతుంది ఇంకా బుద్ధి సుఖదుఃఖాదులకూ అతిశయం కలుగుతుంది ఈ అతిశయానికి హేతుభూతం అహంకార విశేషం ఆ అహంకారమే శృంగారం

బోజుడు తాను నిరూపించిన శృంగారానికి స్థాయిని ఎక్కడా తెలుపలేదు శృంగార ప్రకాశ వ్యాఖ్యాత అయిన శ్రీ Raghavan గారే ఇలా తెలిపారు

"We can take that the Ahamkara itself is the sthayin of the one basic Rasa of Bhoja It can be said that its name in the state of Rasa is Sringara and that the conditions which Bhoja says as for its nourish- namely, the forty nine Bhavas which arise out of it, surround it like flame and go to brighten more that central fire and are called Rati etc , are the sancarins of this one sthayin of Ahamkara, of this one Rasa of Sringara But this Bhoja does not say, we have said it taking some suggestions from Bhoja's text and developing his idea on his own lines" 173

ఈ శృంగారానికి స్థాయి అహంకారమే అనీ, రసావస్థలో ఇది శృంగారం అనబడుతుందని రాఘవన్ గారు నిర్ణయించారు భోజుడు ఈ అంశాన్ని ఎక్కడా స్పష్టంగా

చెప్పుక పోయినప్పటికీ, ఆతని గ్రంథంలోని కొన్ని సూచనల్ని బట్టి, ఆతని భావాల్ని తత్త్వాళి కానుసారంగా ప్రపంచించడాన్ని బట్టి స్థాయి రసాలనూహించ వచ్చునని రాఘవన్ గారి అభిప్రాయం

## 7. శృంగార బేదాలు:-

ఇంత వ్యాపకత్వం గల ఈ శృంగార రసంలో అధిక భేదాలు లెవు సాధారణంగా ఆలంకారికులంతా సంభోగం, విప్రలంభం అనే రెండు భేదాల్నే నిరూపించారు ఇవే ప్రధాన భేదాలు భరతుడు తన నాట్య శాస్త్రంలో, వాగాత్మకం, నైవథ్యాత్మకం, క్రియాత్మకం అనె భేదాలచే శృంగారాన్ని త్రివిధాలుగ విభజించాడు " 174 వీటిని మనసులో ఉంచుకొనె కాబోలు శారదా తనయుడు కూడ తన భావ ప్రకాశనంలో శృంగారాన్ని వాచిక, ఆంగిక, క్రియ అనే మూడు విధాలుగా విబజించాడు అతడు వాటికిచ్చిన లక్షణాలివి

"బావగర్భం రహః సంవిన్మధురం నర్మపేశలం సువృత్తం శ్రవణానంది శృంగారో వాచికోమతః

వాసోzగరాగ భూషాభిర్మాల్యైర్యుక్తం ప్రసాధితం ప్రాప్తయౌవన మంగం యచ్ఛృంగారః స్యాత్స ఆంగికః

దంతచ్ఛేద్యం నఖచ్ఛేద్యం మణితంచ ససీత్కృతం చుంబనం చూషణం భావేహేలాదిః కేలయోzపిచ

శయనా ద్యుపచారశ్చతథా సంగీతక క్రియా ఇత్యాది భావైః కధితః శృంగారః స్యాత్క్రియాత్మకః 175

ప్రేయసీ ప్రియులు రహస్యంగా హృదయంలో దాచి ఉంచిన భావ సంవేదనల్ని ఈ సమయంలో స్పష్టం చేస్తారు కావున అట్టి సంవేదనం ఇందు మధురంగా ఉంటుంది ఇది నర్మ పేశలం నర్మం శృంగారాత్మకమైన కర్మ దాంతో ఇది-మనోహరం మంచి వృత్తాలతో ఉంటుంది కావ్యంలోని శృంగార సూచకాలైన శ్లోకాలు - పద్యాలు శృంగారోచితాలైన వృత్తాలతో ఉంటుంది వినడానికి ఇంపుగా ఉంటుంది ఇలాంటిది వాచికశృంగారం.

మంచి వస్త్రం, అంగరాగం, ఆభరణాలు, పుష్పమాలలు మొ వాటితో అలంకృతమై యౌవన సంపదతో ఉండే దేహం ఆంగిక శృంగార యుతం అని భావించాలి

దంతచ్ఛేద్యాలు, నఖక్షతాలు, మణితధ్వనులు, సీత్కారాలు, చుంబనాలు, చూషణాలు =ఆస్వాదం- పీల్చుట, భావ హావహేలాదులు, కేళీ విలాసాలు, శయనాది ఉపచారాలు, సంగీత క్రియలు మొదలగు వాటితో ఉండడం క్రియా శృంగారం

భరతుడి వాగాత్మకం శారదా తనయుడి వాచికం, భరతుడి నైపథ్యాత్మకం శారదా తనయుడి ఆంగికం ఒకటే

వాగ్భటుడు తన వాగ్భటాలంకారంలో శృంగారంలో నాలుగు భేదాల్ని చెప్పాడు

"సంయోగో విప్రలాబశ్చేత్యేవతుద్వివిధోమతః
తౌతయోర్భవతో వాచ్యౌబుధైర్వ్యక్తవియుక్తయోః
ప్రచ్ఛన్నశ్చప్రకాశశ్చ పునరేవద్విధామతః

ఏవంచ ప్రచ్ఛన్న సంయోగః, ప్రకాశ సంయోగః, ప్రచ్ఛన్న విప్రలంభః, ప్రకాశ విప్రలంభః, ఇతి శృంగారః చతుర్విధః"176 ఇతడు ఆలంకారికులంతా చెప్పిన సంభోగ, విప్రలంభ భేదాల్నే ప్రకాశ, ప్రచ్ఛన్న భేదాలచే నాలుగు విధాలుగా చేసాడు ఇంతకు మించిన విశేషం దీంట్లో ఏమీ లేదు భోజుని అహంకార శృంగారాన్ని ఇతరాలంకారికులు నిరూపించిన 'రతి' స్థాయిక శృంగారాన్ని "Higher Sringara, Lower Sringara అని రెండు రకాలుగా రాఘవన్ గారు పేర్కొన్నారు

"To distinguish the two we can say that the Ahamkara Sringara the real Rasa, is the Paramartha Sringara or the **higher Sringara** and that called sex love and its climax, Rati prakarsa, is the **lower Sringara**" 177

బోజుడు చతుర్విధపురుషార్థాల ప్రాతిపదికపై తన అహంకార శృంగారాన్ని ధర్మశృంగారం, అర్థశృంగారం, కామ శృంగారం, మోక్ష శృంగారం అని నాలుగు విధాలుగా విభజించాడు

"In the Sringara Prakasa Bhoja classifies his one Rasa of Ahamkara into four main Ahamkaras or four main Sringaras corresponding to the four purusarthas He thus speaks of Dharma-Sringara, Artha Sringara, Kama Sringara and moksha sringara- These are purely activities as such towards the attainment of the four purusarthas But Bhoja examines them with reference to the life of a married individual, i e , activities in which a Nayika also is included He uses the word sringara in the higher as well as in the lower sense To these he devotes four chapters, where he describes how Dharma-Sringara is the Rasa of the character called Dhirodatta, Artha Sringara of Dhiroddhata, kama sringara of Dhiralalita and moksha sringara of Dhira santa" 178

దీంట్లో ధీరోదాత్తాది చతుర్విధనాయకుల్ని క్రమంగా ధర్మాది శృంగారాలకు నాయకులుగా నిలపడానికి భోజుడు ప్రయత్నించాడు.

ప్రధానంగా శృంగారాన్ని ఆలంకారికులంతా సంయోగం, విప్రయోగం అని రెండు రకాలుగా వింగడించారు వీటికి సంభోగం, విప్రలంభం అనే వివర్యాయాలు

a) సంబోగ శృంగారం:-

"వసంతాది ఋతువులు, పుష్పహారములు, కామోద్దీపకములైన గంధము మొదలగు వాని పూతలు, నగలు, విదూషకుడు మొదలగు ఇష్టజనుల సహవాసము, గీతాదులు, శ్రేష్ఠములైన భవనములు, వాని యందలి నివాసము, ఉద్యానవన విహారములు లేదా వానిని గూర్చిన ప్రశంసలు, కామోద్దీపకములైన చిత్రాదులు, ఉత్తమ జనుల అనుకరణము, జలక్రీడలు మున్నగు విభావముల వలన సంభోగ శృంగార ముత్పన్నమగును ఆలస్యము, ఉగ్రత, జాగుప్స అను మూడును తప్ప తక్కినవన్నియును ఇందు వ్యభిచారి భావములగును " 179అని నాట్య శాస్త్ర వ్యాఖ్యాత P S R అప్పారావు గారు

"తత్ర శృంగారస్య ద్వౌభేదౌ సంబోగో విప్రలంభశ్చ తత్రాద్యః పరస్పరావలోకన-ఆలింగన-అధరపాన-పరిచుంబనాద్యనంత భేదత్వాద పరిచ్ఛేద్య ఇత్యేక ఏవగణ్యతే" 180

సంబోగం పరస్పర అవలోకనం, ఆలింగనం, అధరపానం, పరిచుంబనాది అనేక బేదాలచే ఉండడం వల్ల ఒకటిగానే గణింప బడిందని మమ్మటుడి భావం

" దర్శన స్పర్శనాదీని నిషేవేతే విలాసినౌ యత్రానురక్తా వన్యోన్యం సంభోగోzయము దాహృతః

సంఖ్యామశక్యతయా చుంబన పరిరంభణాది బహుభేదాత్ అయమేక ఏవ ధీరైః కథితః సంబోగ శృంగారః 181

పరస్పర అనురక్తులైన నాయికానాయకుల దర్శన, స్పర్శనాదులే సంబోగ శృంగారం చుంబన, పరిరంభణాది అనేక బేదాలు దీంట్లో ఉంటాయి కాబట్టి దీన్ని ఒక బేధంగానే పరిగణించ వచ్చుని విశ్వనాథుడు వివరించాడు.

" _ రతేః సంయోగ కాలావచ్ఛిన్నత్వే ప్రథమః (సంబోగః) సంయోగశ్చ న దంపత్యోః సామానాధి కరణ్యమ్, ఏకతల్పశయనేz పీర్ష్యాది సద్భావ విప్రలంభస్యైవ వర్ణనాత్, తస్మాద్వావిమౌ సంయోగా వియోగాఖ్యావంతః కరణవృత్తి విశేషౌ, " 182 అనే జగన్నాధుని అభిప్రాయాన్ని,

"ప్రేమ అనబడే రతి స్త్రీపురుమల సంయోగ సమయములో కూడుకొనినది అయితే సంయోగశృంగారము అవుతుంది _ _ _ దంపతుల సంయోగము అంటే ఒక స్థానములో

ఉండడముకాదు నాయికా నాయకులు ఒక శయ్యపై శయనించిన వారైనా ఈర్ష్యాదులు ఉన్నట్లయితే విప్రలంభమే వర్ణింపబడుతున్నది - వారు విడివిడిగా ఉన్నా ఈర్ష్యాదులు లేక పోయినట్లయితే సంభోగమే వర్ణింపబడుతున్నది కాబట్టి సంయోగ వియోగములనే ఈ రెండూ అంతఃకరణవృత్తి విశేషాలు నేను ప్రియవ్యక్తితో కూడుకొని ఉన్నాను అనే అభిప్రాయము ఉంటే సంయోగము" 183 అని జమ్మలమడకవారు వాఖ్యానించారు

'సంయుక్త యోస్తు సంభోగో విప్రలంభో వియుక్త యోరి'తి శృంగార తిలకే, సంభోగస్య పరస్పరావలోకన సంభాషణాలింగన చుంబనాద్యనేక వ్యాపారమయ త్వేనానంత్యా దేకవిధత్వేన గణనాకృతా" 184 అని విద్యానాథుడు చెప్పాడు

పింగళి లక్ష్మీకాంతంగారు తమ సాహిత్య శిల్ప సమీక్షలో ఈ క్రింది విధంగా వివరించారు

"ఈ సంయోగ, సంభోగ, శబ్దములకు పామరవ్యవహారానుసారము 'మిథునక్రిడ' అని అర్థము చెప్పరాదు దీనికి శాస్త్రీయమును నాగరికమును అయిన అర్థము వేరు ఏక చిత్తులగు ఇరువురు ప్రాణులు జీవిత పరిపూర్తికై ఒండొరులు కలిసి ఉండగోరుట సంయోగము (A desire to live together in union) ఆ కలయికలో పరస్పర దర్శన స్పర్శనాదికమైన సుఖము కలదు ఆ సుఖము ఇరువుర చేతను అనుభవింపబడుటయే సంభోగము ఏ మానవుడును ఏకాకియై జీవితమున పరిపూర్ణ సుఖాను భూతిని పొందజాలడు పరిపూర్ణతకై ఒక ప్రాణి వేరొక ప్రాణి సహవాసమును అపేక్షించును ఈ అభిలాషలో పురుష ప్రకృతి స్త్రీ ప్రకృతిని, స్త్రీ ప్రకృతి పురుష ప్రకృతిని ఆకర్షించును - విజాతీయములైన స్త్రీ పుంతత్వ సంయోగము వలన కలిగినట్లు, సజాతీయ ప్రకృతి సంయోగమున కలుగదు కావుననే ఈ రసమునకు నాయికా నాయకాలంబనము ఆవశ్యకమైనది ఇది దీని పరమార్థము అయినను ఆ జంట మిథున క్రీడాపరమైన సుఖము ననుభవింపదని చెప్పరాదు అది ప్రధానము కాదు దానికే ప్రాధాన్యమిచ్చి, కావ్యములోను శాస్త్రములోను అతి మాత్రముగా వర్ణించుట మాత్రము తప్పు. ఈ శృంగారమునకు మూలమైన ప్రేమతత్త్వము ఉప్పొంగి, వెల్లివిరిసి, నిర్భరమైనప్పటి దశకే 'రతి' అనిపేరు మిథున క్రీడ వలన ఆ పొంగు చల్లారి, చిత్తములు ప్రకృతి గతములైనప్పుడు ఆ ప్రాణులు రెండును అంతటితో విముఖులే అగుచో వారి శృంగారము సంయోగమనెడి పేరునకే తగదు యథార్థమైన ఐక్యమును ఆ జంట యభిలషింప లేదనియు, కామోద్రేక ప్రేరణచే వారి కలయిక తటస్థించిన దనియు తలంపవలెను చిరకాలము అరణ్యవాసము చేసిన సీతారాములు వానప్రస్థులై, బ్రహ్మచర్య దీక్షా పరాయణులై కాలము గడపుట మిథున క్రీడా వాంఛలేని సంయోగముకాదా! కనుక పరమ పవిత్రమైన నాయికా నాయక ప్రేమకు మిథున క్రీడయే ఫలమని తలంపరాదు అట్టి తలంపు అనాగరికమే గాక అశాస్త్రీయము గూడ " 185

"అనుకూలౌ నిషేవేతే యత్రాన్యోన్యం విలాసినౌ
దర్శన స్పర్శనాదీని సంభోగో ముదాన్వితః." 186

అనుకూలురైన ఇద్దరు యువతీయువకులు పరస్పర దర్శన స్పర్శనాదికాన్ని అనుభవించేప్పుడు కలిగే సుఖాన్వితమైన వారి అనుభూతి సంయోగమౌతుంది అని ధనంజయుడు చెప్పాడు

" పతి జీవితయైన ప్రియురాలును, పత్ని జీవితుడైన ప్రియుడును ఒకరి మనస్సులో ఒకరు ఉనికి కలిగించుకొని ఎడబాటు లేక మధురమైన దాంపత్య సుఖమును అనుభవించుటయే ఈ సంయోగ శృంగారము" 187 అని పింగళివారు చెప్పారు

పింగళి లక్ష్మీకాంతంగారి వివేచన ప్రకారం శృంగారంలో దైహికమైన ఆకర్షణ తాత్కాలిక మైనదనీ, అది ఉత్తమమైనదీ, ప్రధానమైనదీ కాదనీ, మానసిక ప్రేమే ఉత్తమమైనదీ, ప్రధానమైనదనీ వ్యక్తమయింది ఇటువంటి మానసిక ప్రేమగల వాళ్ళు కూడ దైవికం, దైహికం అయిన ఎడబాటు లేకుండ ఉన్నప్పుడే అది సంయోగమౌతుంది మానసికమైన ఈర్ష్యాదులవల్ల 'ప్రేమ'కు అజ్ఞానం ఆవరించి వియోగం ప్రాప్తిస్తుంది అలాగే దైవికాదులచే మనుమలు దూరమై, సంయోగ తపన వారిలో ఉన్నప్పటికీ, దర్శన స్పర్శనాది సంయోగం లేకుండడంచే అది వియోగమే అవుతుంది కాబట్టి దేహం, మనస్సు రెండూ (దాంపత్య) జీవితంలో ముఖ్యమైనట్టివే మానసిక ప్రేమ ఉన్నంత మాత్రాన దైహికంగా ఇద్దరూ వేర్వేరు ప్రదేశాలలో ఉంటే అది సంయోగం అనిపించుకోదు. కాబట్టి దైహిక సంబంధం ప్రధానంగా ఉండకూడదనడం కూడా యుక్తం కాదు 'మిథున క్రీడ' ను ప్రత్యక్షంగా వర్ణించడం భావ్యంకాదు దర్శన స్పర్శనాదికాలే దాన్ని వ్యంజింప జేస్తాయి కాబట్టి దర్శన స్పర్శనాది కాలలోనే దైహిక సంబం ధం ఉన్నప్పుడు దానికి అప్రాధాన్యత కల్పించడం న్యాయం కాదనిపిస్తుంది

దేహికి మనస్సు ఉంటుంది మనస్సులేని దేహం, దేహంలేని మనస్సు ఉండడం అసంభవం కాబట్టి సంయోగంలో కూడ శరీర, మనస్సులకు సమాన స్థానం , ప్రాధాన్యం ఉంటుంది మానసికంగా ఐక్యత కోరుకొన్నప్పుడే శారీరిక ఐక్యత లభిస్తుంది మానసిక ఐక్యత ఉన్నా శారీరిక ఐక్యత లేకుంటే అది సంయోగం కాజాలదు వియోగమే అవుతుంది కాబట్టి నాయికా నాయకుల పరస్పర అనుకూల దర్శన స్పర్శనాది వ్యాపారాల ద్వారా అనుభూతమయ్యే సుఖం లేదా బహిరింద్రియ సంబంధ జన్య ఆనందాన్ని సంభోగ శృంగారం అనవచ్చును

"కామః సవిష సంభోగస్స చతుర్ధా విభజ్యతే యూనోః పరస్పర స్పర్శ విశేష విషయీకృతః

సౌఖ్యాభిమాన సంకల్ప ఫలవాన్కామ ఇష్యతే సమితః సంకరశ్చేతి సంపన్నశ్చ సమృద్ధి మాన్.

పరస్పర స్యోపచారైః యూనోర్యత్సాధ్వసాదిభిః మితం ప్రయుజ్యతే భోగే ప్రథమే సమితో భవేత్

ప్రసాదేzపి వ్యలీకాది స్మృతేః కోపానువర్తనాత్ సంకీర్యతే యస్సంబోగ స్తస్మాత్సంకర ఈరితః

సంపన్న కామై రాయాతైః ప్రోషితై రుపభుజ్యతే సంపన్న మేవ యత్తస్మాత్సంపన్న ఇతి కథ్యతే

ప్రత్యుజ్జీవన హర్షాదేః ప్రవృద్ధో మృతజీవతో దీపనాతిశయైర్దీప్తః సంబోగః స్యాత్సమృద్ధిమాన్ " 188

అని శారదా తనయుడు చెప్పాడు దీని భావం ఇది-సంబోగమే కామం సంబోగం నాలుగు విధాల విభక్తమయింది ప్రేయసీ ప్రియుల పరస్పర స్పర్శ విశేషాన విషయంగా ఉన్న సంభోగం సౌఖ్యం కలుగును అనే అభిమానాత్మకమైన సంకల్పం యొక్క ఫలం కలదై కామం అనే వ్యవహారమున కూడి ఉంది ఈ సంబోగం మితం, సంకరం, సంపన్నం, సమృద్ధి అని నాలుగు విధాలు

ప్రథమ సమాగమంలో ప్రేయసీ ప్రియుల పరస్పర ఉపచార విశేషాలు సాధ్వసాదులతో కూడి ఉంటాయి కాబట్టి సంభోగ ప్రక్రియా విశేషాలన్నీ మితంగానే ప్రయుక్తాలౌతాయి ప్రథమ బోగంలో మితప్రయోగం ఉండడంచే ఇది మితం అనే పేరుగల సంబోగం

ప్రియుడు చేసిన ప్రసాదన విధానంతో ప్రసాదం కలిగినా పూర్వాపరాధ స్మరణం వల్ల కోపం అనువర్తిస్తుంది కాబట్టి అప్పటి సంభోగం కోప సంకీర్ణమై ఉంటుంది కాబట్టి ఇది సంకీర్ణ సంబోగం

కామ సంపన్నులు ప్రోషితులై వచ్చి ఉపబోగరతులై నప్పుడు వారి సమ్యక్సంభోగం సంపన్నంగానే ఉంటుంది కాబట్టి ఇట్టిది సంపన్న సంబోగం

మృతులై జీవించిన వాళ్ళ సంభోగం సమృద్ధం ప్రత్యుజ్జీవనం వలని హర్షాదుల వల్ల వృద్ధి నొంది దీపన అతిశయ విశేషాలచే దీప్తమై ఉంటుంది కాబట్టి అప్పటి సంభోగం సమృద్ధిమాన్ అనబడుతుంది

"చేష్టా విశేషాః సంభోగే చుంబనాలింగ నాదయః

వికారాః స్తంభరోమాంచ స్వేదాః స్యుః సాధ్వసాదయః" 189

సంబోగంలో చుంబన, ఆలింగనాదులు చేష్టా విశేషాలు స్తంభ, రోమాంచ, స్వేదాలు, సాధ్వ సాదులును సంభోగ సమయంలో కలిగే వికారాలని శారదా తనయుడు వివరించాడు

ఈ శారదా తనయుడు చెప్పిన భేదాలే గాక విప్రలంభం తర్వాత కలిగే సంయోగాల్ని కొందరు చెప్పారు

అవి:- 1. పూర్వరాగ విప్రలంభానంతర సంభోగం

2. మాన విప్రలంభానంతర సంభోగం

3 విరహ విప్రలంభానంతర సంభోగం

4 ప్రవాస విప్రలంభానంతర సంభోగం

అసలు సంభోగ శృంగారంలో రెండు భేదాలు మాత్రమే చెబితే యుక్తయుక్తంగా ఉంటుంది అంతఃకరణ తత్త్వాన్ని బట్టి శృంగారాన్ని రెండు విధాలుగా విభజించారు గదా ఆ అంతఃకరణ తత్త్వం ఆధారంగానే సంభోగాన్ని కూడ 1. విప్రలంభ పూర్వ సంబోగం 2 విప్రలంభానంతర సంభోగం అనే రెండు విధాలుగా విభజించవచ్చును

విప్రలంభ పూర్వ సంభోగంలో రామణీయకత అంత ఉండక పోవచ్చు గాని, కోపాది సంకీర్ణ భావాలు ఏవీలేక ప్రశాంత సంయోగం ఏర్పడుతుంది. విప్రలంభానంతర (విరహానంతర) సంబోగం రమణీయం (Thrilling) గా కష్టం తర్వాతి సుఖం లాగా మిక్కలి సుఖాన్ని ఆహ్లాదాన్ని కలిగిస్తుంది

b) విప్రలంభ శృంగారం:-

"వియోగ కాలావచ్ఛిన్న త్వేద్వితీయః (విప్రలంభః) .. వియోగేzపి నవైయధికరణ్యా తస్మాద్వావిమౌ, సంయోగ వియోగాఖ్యా వంతః కరణ వృత్తి విశేషా యుత్సం యుక్తో వియుక్త శ్చాస్మీ తిధీః" 190

రతి వియోగ కాలావచ్ఛిన్నమైతే అది విప్రలంభం వియోగం అంటే వైయధికరణ్యం కాదు పృథక్ స్థానస్థితులై ఉన్నప్పటికీ మనసులో రతి ఉండి ఈర్ష్యాదులు లేకుండ ఉన్నపుడు వియోగం చెప్పరాదు సంభోగమే చెప్పాలి కాబట్టి వైయధికరణ్యం విప్రయోగం అనడం దోషం అన్నాడు జగన్నాథుడు.

విప్రలంభం పూర్వరాగ, మాన, ప్రవాస, కరుణ- అనే భేదాలచే నాలుగు విధాలు అని విభజించాడు విశ్వనాథుడు 191

1. పూర్వరాగం:-

శ్రవణం వల్లగాని, దర్శనం వల్లగాని రాగం ఏర్పడితే అది పూర్వరాగం ఇందు దశవిధ మన్మథావస్థలు ఉంటాయి

శ్రవణం అంటే దూత, వందీ, సఖీముఖంగా వినడం దర్శనం అంటే ఇంద్రజాలంలో, చిత్రంలో, సాక్షాత్తుగ, స్వప్నంలో చూడడం అభిలాష, చింత, స్మృతి, గుణకథనం, ఉద్వేగం, సంప్రలాపం, ఉన్మాదం, వ్యాధి, జడత, మృతి అనే కామావస్థలు పది వీటిని వివరించి, మరణం వర్ణిస్తే రసవిచ్ఛేదం అవుతుంది కావున దాన్ని వర్ణించరాదని విశ్వనాథుడు నియమం చేసాడు సమీపంలో ప్రత్యుజ్జీవన ఆశ ఉంటే దాన్ని వర్ణించ వచ్చును అన్నాడు

స్త్రీముందు అనురక్త కావాలి తర్వాత ఆమె ఇంగితాల్ని బట్టి పురుషుడు అనురక్తుడు కావాలి పూర్వరాగం నీలీ, కుసుంబ, మంజిష్ఠా అని మూడు రకాలు 1 మిక్కిలిగా వ్యక్తం గాకున్నా మనోగతమై ఎన్నటికీ చెదరని ప్రేమే నీలీరాగం ఉదా - సీతారాముల ప్రేమ

2. మిక్కిలిగా శోభించినా కాలాంతరాన పోయేది కుసుంభరాగం ఉదా - దేవహూతీ కర్దముల ప్రేమ

3. అత్యంతం శోభిస్తూ ఎన్నటికీ మాసిపోని ప్రేమ మంజిష్ఠా రాగం-ఉదా - నలదమయంతుల ప్రేమ

2. మానం:- మానం అంటే కోపం అది ప్రణయ, ఈర్ష్యలచే పుడుతుంది అది రెండు రకాలు ప్రణయ మానం నాయికా నాయకులు ఇద్దరికీ కలుగవచ్చు ప్రేమ కుటిల స్వభావం కలది కాబట్టి కారణం లేకుండానె ప్రేమాతిశయంచే కోపం కలుగుతుంది భర్త అన్య స్త్రీ సంగమాన్ని పొంది ఉండడం చూసిగాని, ఊహించిగాని, విని గాని నాయికకు ఈర్ష్యామానరా కలుగుతుంది వీటిలో అనుమితి (ఊహించడం) మూడు విధాలు

1 ఉత్స్వప్నాయితం -- కలలో కలవరించడం
2. భోగాంకం -- అన్యస్త్రీ సంగమపు చిన్నెలు
3 గోత్ర స్ఖలనం -- అన్యస్త్రీ పేరును స్మరించడం

నాయికకు కలిగిన మానాన్ని నాయకుడు సామ, బేధ, దాన, నతి, ఉపేక్ష, రసాంతరాలు అనే ఆరు ఉపాయాలచే క్రమంగా ఉపశమింప చేయాలి సామం అంటే ప్రియవచనం ఆమె సఖుల్ని తనవైపు తిప్పుకోవటం భేదం ఏదో మిషచే ఆభరణాల్ని, వస్త్రాల్ని ఇవ్వడం

దానం పాదాలపై బడడంనతి సామాదులచే నాయిక మానం ఉపశమించనపుడు ఉపేక్షించడం (మిన్నకుండడం) ఉపేక్ష, రభస, త్రాస, హర్షాదులచే కోపాన్ని పోగొట్టడం రసాంతరం

3. ప్రవాసం:- కార్యం వల్లగాని, శాపంవల్లగాని, సంభ్రమంవల్లగాని భిన్నదేశంలో ఉండడం ప్రవాసం దీంట్లో అంగ వస్త్రాలు మలిన మవడం, ఏకవేణి అవడం, నిట్టూర్పులు, ఏడ్పు, భూమిపై పడడం మున్నగునవి నాయికకు కలుగుతాయి ఇంకా అంగాల అసౌష్ఠవం, తాపం, పాండుత్వం, కృశత్వం, అరుచి, అధృతి, అనాలంబం, ఉన్మాదం, మూర్ఛ, మృతి అనె మన్మథావస్థలు కలుగుతాయి

4. కరుణవిప్రలంభం:- నాయికానాయకులు ఇద్దరిలో ఒకళ్ళు లోకాంతరగతులై పునరుజ్జీవితులౌతారు అనే ఆశ ఉంటే అది కరుణ విప్రలంభం

విద్యానాథుడు విప్రలంభ భేదాల్ని ఇలా చెప్పాడు "విప్రలంభః పునరభిలాషేర్ష్యా విరహ ప్రవాస హేతుకత్వేన చతుర్విధః

అభిలాషో నామ సంభోగాత్ప్రాగనురాగః
ఈర్ష్యానామ నాయకస్యా అన్యాసక్త భావాచ్చిత్త విక్రియా

విరహోనామలబ్ధ సంయోగయోః (నాయిక) నాయకయోః కేన చిత్కారణేన పునః సమాగమ కాలాతిక్షేపః

యూనోర్దేశాంతర వృత్తిత్వం ప్రవాసః" 192
రసార్ణవ సుధాకర కారుడు విప్రలంభాన్ని ఇలానిర్వచించాడు

"అభీష్టా లింగనాదీనామన వాప్తౌ ప్రకృష్యతే
సవిప్రలంభోవిజ్ఞేయః సచతుర్ధానిగద్యతే

నాయికా నాయకయోః ప్రాగసంగతయోః సంగతవియుక్తయోర్వా (పరస్పర మనురక్తయోః) స్వోచిత విభావైరనుభావైశ్చోపజాయమానః పరస్పరాను రాగోzన్యతరానురాగోవా స్వాభిలషితాలింగ నాదీనా౼ మనవాప్తౌ సత్యా ముత్పాద్య మానైర్వ్యభిచారి భిరను భావైశ్చ ప్రకృష్య మాణో విప్రలంభ శృంగార ఇత్యాఖ్యాయతే" 193

అని సాహిత్య దర్పణ కారుని లాగే వీటిని నిరూపించాడు

అలంకారికులంతా సంభోగ, విప్రలంభ భేదాలనే శృంగారానికి చెప్పగా ధనంజయుడు మాత్రం అయోగ, వియోగ, సంయోగం అనే మూడు భేదాలు చెప్పాడు

"అయోగో విప్రయోగశ్చ సంభోగశ్చేతి సత్రిధా,
తత్రాయోగోzను రాగేzపి నవయోరేక చిత్తయోః
పారతంత్ర్యేణ దైవాద్వా విప్రకర్షాద సంగమః" 194

అయోగం అంటే పరస్పర అనురక్తులు యువకులు అయిన నాయికా నాయకులకు పారతంత్ర్యం వల్లగాని, దైవికంగాగాని, సంగమం ఏర్పడకుండడం. దీన్ని కొందరు పూర్వరాగం లోనే కలిపారు విప్రలంభ, సంభోగాలను ఇతరుల వలెనే ఇతడూ నిరూపించాడు

మమ్మటాదులు విప్రలంభం ఐదువిధాలు అన్నారు.

1. అభిలాష విప్రలంభం 2. విరహ విప్రలంభం 3 ఈర్ష్యా విప్రలంభం 4 ప్రవాస విప్రలంభం 5 శాప విప్రలంభం

ప్రియులకు తటస్థించే విప్రయోగమే విప్రలంభ శృంగారం వాళ్ళ సంయోగం ఎంత సుఖకరమో, వాళ్ళ విప్రయోగం అంత విషాదకరం

కరుణ విప్రలంభం అనే భేదాన్ని యుక్తియుక్తంగా పింగళి లక్ష్మీకాంతం గారు తోసిపుచ్చారు అది యుక్తమే కొందరు విప్రలంభ భేదాలను చెబుతూ 'విరహ విప్రలంభం'ను చెప్పారు విరహం అన్నా, విప్రలంభం అన్నా ఒకటేకదా రెండూ పర్యాయ పదాలే అలాంటప్పుడు ఇలా చెప్పడం యుక్తంగాదు విరహోత్కంఠిత నాయికను ఆధారంగా చేసికొని అయినా దీన్ని చెబితే విరహోత్కంఠిత విరహంలో 'ఎదురుచూపు' (ప్రతీక్ష) ఉంటుంది కాబట్టి ఆ బేదాన్ని 'ప్రతీక్షా విప్రలంభం' అనడం మేలు

అలాగే మమ్మటుడు చెప్పిన 'ఈర్ష్యా విప్రలంభం' కంటే సాహిత్య దర్పణ కారుని 'మాన విప్రలంభం' అనే భేదమే యుక్తంగా ఉంది ఈర్ష్య అనేది ప్రణయకలహంలో ఒక విశిష్టత కలిగినట్టిది దాన్ని చెబితే ఇతర ప్రణయ కలహాలకు దాంట్లో చోటుండదు 'మానం'ను గ్రహిస్తే అన్ని విధాలైన ప్రణయమానాలకు (ఈర్ష్యతో కూడ) అందు స్థానం ఉంటుంది

ఇక 'శాప విప్రలంభం' ప్రవాస విప్రలంభంలోనే అంతర్భవిస్తుంది కాని శాకుంతలం లాంటి రచనలలో 'శాపం' యొక్క ప్రభావం, దాని వల్ల కలిగే విరహం ఎంతో రమణీయంగా చిత్రింపబడ్డాయి కాబట్టి దీనిని విప్రలంభ భేదాల్లో ఐదవ దానినిగా గ్రహించినా గ్రహించవచ్చు కాని దీన్ని ప్రత్యేక భేదంగా పరిగణించాల్సిన ఆవశ్యకత అంతగా కనబడడంలేదు

ధనంజయ, విశ్వనాథులు పది మన్మథావస్థలు పూర్వరాగంలో మాత్రమే కలుగునని చెప్పారు కాని మాన, ప్రవాసాది ఇతర విప్రలంభ భేదాల్లో కూడ ఇవన్నీ కాకున్నా కొన్నైనా

ఉండవచ్చు కాబట్టి వాటిని కేవల పూర్వరాగానికే పరిమితం చేయక విప్రలంభ భేదాలన్నింటిలో ఇవి ఉండడాన్ని గ్రహించాలి.

విప్రలంభం సంభోగం కంటే అధిక శక్తి గలది

"నవినా విప్రలంభేణ శృంగారః పుష్టిమశ్నుతే" 195

అంతటి సత్తా దానికి ఉంది విరహావస్థలో పూర్తిమానసిక సంయోగం ఉంటుంది సంయోగేచ్ఛ తీవ్రమైన కొద్దీ ప్రేమ యొక్క ఆధిక్యం, లోతు పెరుగుతుంది ప్రేమ యొక్క ఈ తీవ్రత వల్లనే ప్రేమికుల్ని ఎవరూ వేరుచేయలేరు విరహాగ్ని తప్తులైన ప్రేమికుల స్వరూపం స్వచ్ఛమౌతుంది విరహంలో మానసిక పక్షం ప్రబలంగా ఉంటుంది ఇంద్రియ సంబంధం న్యూనాతిన్యూనంగా ఉంటుంది సత్యమైన విరహంలో ఇంద్రియ సుఖప్రాప్తి కోరిక ఉండనే ఉండదు ఇందులో ప్రియదర్శనేచ్ఛ మాత్రమే మిగిలి ఉంటుంది ఇంక కొంత ముందుకు పోతే అదికూడా పోయి ప్రేమ పాత్రుల కుశల సమాచారం లభిస్తే చాలు ననిపిస్తుంది తర్వాత ప్రియుడు ఎక్కడ ఉన్నా సుఖంగా ఉండాలని కోరడం ఉంటుంది ఈ విధంగా 'ప్రేమ' చాపల్యాన్ని వదలి శాంతమైన ఆరాధనగా పరిణత మౌతుంది

విరహంలోనే వాళ్ళ ప్రేమయొక్క వాస్తవ స్వరూపం వ్యక్తమౌతుంది ప్రథమ దర్శనంలో కలిగే ప్రేమ (love at first sight) పూర్వరాగం ప్రేమ అంకురించిన తర్వాత సంయోగేచ్ఛ స్వాభావికం ఇపుడు సంయోగం కలిగితే అభిలాష పూర్తి అయి సంబోగ శృంగారం ఆరంభమౌతుంది సంయోగానంతరం కూడా ఏదేని కారణం వల్ల వియోగం ఏర్పడితే ఆబాధ భరింపరానిదిగా ఉంటుంది మానసిక తపన ఇందు అధికంగా ఉంటుంది

విరహం వల్ల ప్రేమ పరిపుష్టం, పరిష్కృతం ఔతుంది మానసిక యోగం పరిపుష్ట మవడంచే విరహావస్థలో ప్రేమికుల చిత్త వృత్తులు ఒక్కొక్కటే జాగృతం అవుతాయి ఇది ప్రేమకు పరీక్ష, సంబోగంలో కూడ ప్రేమ పరిపుష్ట మవడానికి విప్రలంబం అత్యావశ్యక మైందికదా! సంభోగంలో కూడ 'మానం' వల్ల వియోగం ఏర్పడుతుంది మానోపశమనం తర్వాత ప్రేమ ప్రవాహానికి ఒక నూత్నగతి వస్తుంది వియోగి ప్రేమ పాశాన్ని తెంచి పారిపోవడానికి యత్నించడు ఆ విరహంలోనే ఒక విశేషమైన సుఖాన్ని అనుభవిస్తాడు ఈ విరహం అతని మనస్సులోని వాసనాత్మకమైన మలినాన్ని దహించి (అతన్ని) నిర్మలంచేస్తుంది

ప్రేమ యొక్క ఉన్నత అవస్థ అత్యంత విరహాసక్తియే ప్రేమ లేక విరహానికి స్వతంత్ర సత్తా లేదు ఇలాగే విరహం లేక ప్రేమకు కూడ అస్తిత్వం లేదు ఎక్కడ ప్రేమ ఉందో అక్కడ విరహం ఉంది ప్రేమాగ్నిని విరహపవనం ప్రజ్వలిత మొనరిస్తుంది ప్రేమాంకురాన్ని విరహజలం పల్లవిత మొనరిస్తుంది ప్రేమ దీపించడానికి విరహమే మూలం

ఈ సంయోగ వియోగ పదాలు జీవితంలోని సుఖదుఃఖాల్ని, వెలుగు చీకట్లని, కలిమిలేముల్ని వ్యంజింప చేస్తున్నవి ఇవి జీవిత సత్యాన్ని తెలపడమే గాక జీవిత సారమే తామన్నట్లు మానవ జీవితంలో చోటు చేసుకొన్నాయి (Life is meetings and Partings) కలయిక, విడిపోవడాలే జీవితంకదా!

## 8. శృంగారం - మనోవైజ్ఞానిక విశ్లేషణ:-

(ఈవిషయం 'శృంగార్ రస్‌కా శాస్త్రీయ్ వివేచన్' అనే గ్రంధంలోని 'శృంగార్ రస్‌కా మనో వైజ్ఞానిక్ వివేచన్' అనే దాన్ని ఆధారంగా చేసుకొని వ్రాసాను )

సుఖదుఃఖాత్మక అనుభూతి బావం భావ ప్రదానమైంది మనోవేగం మనో వేగం (emotion) లో వేగ తీవ్రత అధికం ప్రాణి శరీరాన్ని ఉత్తేజ పరచి మథించు దశ బావదశ మరియు మనోవేగదశ డా భగవాన్ దాసు అనే అతడు జీవితాన్ని జ్ఞాన, ఇచ్ఛ క్రియ (లేదా ఆత్మప్రతిష్ఠ) లచే మూడుగా విబజించాడు 'ఒక జీవిని గూర్చి మరొక జీవియొక్క జ్ఞాన, ఇచ్ఛల సంయోగమే మనో వేగం అనబడుతుంది '

భావం మస్తిష్కం యొక్క సునిశ్చిత జాగ్రదవస్థ దీన్ని విబావాలు జాగృతం చేయగా అనుభావాలు దాన్ని బావ్యరూపంలో ప్రకాశింప జేస్తాయి మనోవేగం యొక్క ప్రధాన తత్త్వాలు మూడు అవి,

1 ఉత్తేజ పరచు వాని కారణం

2 మానసిక ప్రబావం

3 శారీరక ప్రభావం, శారీరక చేష్టల్లో పరివర్తన

విభావాల తత్త్వం ఉత్తేజకత్త్వం (1)లో, అనుబావాల తత్త్వం శారీరక ప్రబావం (3)లో, స్థాయి, సంచారుల తత్త్వం మానసిక్ ప్రభావం (2)లో సమానంగా అంగీకరించబడ్డాయి ఇది రాకేశ్ గారి సిద్ధాంతం

కాని మనో వేగానికి, రసానికి మౌలికమైన భేదం ఉంది మనోవేగం కేవలం చిత్త వేగం, మస్తిష్కం యొక్క ఉత్తేజకత్వ దశ, ఒక జాగ్రదవస్థ మాత్రమే ఇక రసం అంటే ఆనంద మయమైన మనస్సు యొక్క ఏకాగ్రావస్థ మనో వేగం ఉద్బుద్ధం అయినపుడు మనస్సు తన్మయత్వంచే ఆనంద అవస్థను పొందవచ్చు కాబట్టి రసంసాధ్యం (సిద్ధి) మనో వేగం సాధన. రసం మనోవేగం కాదు మనో వేగం యొక్క ఆస్వాదనం

స్థాయి భావం ఒక స్థిరమైన మనోదశ సంచారిభావం సంచరించు ఒక మనోవేగం రత్యాది స్థాయి భావాలు కూడ అప్పుడప్పుడు సంచారిత్వాన్ని పొందుతాయి అలంకార శాస్త్ర ప్రకారం స్థాయి భావానికి అపేక్షాకృత స్థిరత్వం, అపేక్షాకృతపుష్టి, స్థాయి భావమే ఉపచితమై రసం అవడం అనుమూడు విశిష్టతలు కలవు

a) జీవులందలి మౌలిక ప్రవృత్తులు (Instincts)

1 అపత్యస్నేహవృత్తి లేదా సంరక్షణ వృత్తి - ఈ వృత్తితో సంబంధం కలిగిన మనోవేగం వాత్సల్యం

2 సంఘర్షవృత్తి - ఆహార సంపాదన, మైథున క్రియలలో ఆటంకం కలిగినవుడు ఈ వృత్తి పనిచేస్తుంది దీంట్లో 'క్రోధం" అనే మనో వేగం ఉంటుంది

3 జిజ్ఞాస లేదా ఉత్సుకతావృత్తి - నూతన విషయాన్వేషణ దీంట్లో ఉంటుంది దీని వల్ల 'ఉత్సుకత' అనే మనో వేగం కలుగుతుంది

4 భోజనో పార్జన వృత్తి

5 నిషేధ వృత్తి - అయిష్టాలైన వాటిని దూరం చేయడం దీని మనో వెగం ఘృణ జుగుప్స నిషేధం నుండి ఆరంభమై అపకర్షణ రూపం పొందుతు ఇది ఘృణావస్థని పొందుతుంది

6 పలాయన వృత్తి - భయాదుల వల్ల పారిపోవడం దీని మనో వేగం 'భయం'

7 సామాజిక వృత్తి - ఒక వర్గం తనను రక్షించుకొంటూ శత్రు వర్గంపై ఆక్రమణ జరపడం దీని మనోవేగం 'సహానుభూతి'

8 ఆత్మప్రతిష్ఠావృత్తి:- దీని మనోవేగాలు అహంకారం, గర్వం, ఉల్లాసాలు

9 సమర్పణ వృత్తి - దీని మనో వేగాలు స్నేహం, ఉత్సర్గం అధీనత, దైన్యాలు

10 ప్రజనన వృత్తి - విషయ సుఖాలలో కోరిక, మైథునం లో అభిలాష ఉంటుంది దీని మనో వేగం 'కామం'

11. పరిగ్రహవృత్తి - దీని మనోవేగం 'అధికార భావన'

12. నిర్మాణ వృత్తి - దీని మనో వేగం 'సృజనోత్సాహం'

13 చిత్తాకర్షణ వృత్తి.- దీని మనోవేగాలు 'దైన్య, కార్పణ్యాలు'

ఈ పదమూడే గాక క్రీడా వృత్తి, అనుకరణ వృత్తి, హాస్యవృత్తి - అనే మూడు వృత్తులు కూడా ఉన్నాయి

ఈ పదహారు వృత్తులలో అనుకరణ, క్రీడా, భోజనోపార్జన వృత్తులకు సాహిత్యంలో విశేష స్థానం లేదు ఆత్మ ప్రతిష్ఠా వృత్తిలోని అహంకారంలో నిర్మాణ వృత్తి, సృజనోత్సాహం, పరిగ్రహవృత్తులు, అధికార భావనలు అంతర్గతా లౌతాయి కార్పణ్య, కాతరతలు రెండూ ఒకటే ఇలా మనస్తత్వ శాస్త్రాన్ననుసరించి సహజ వృత్తి మూలకమైన మనో వేగాల సంఖ్య పదిమాత్రమే ఉంటుంది కామ, హాస్య, క్రోధ, భయ, ఘృణ, ఔత్సుక్య, వాత్సల్య, అహంకార, కార్పణ్య సహానుభూతులలో మొదటి ఏడూ స్థాయి భావాలే కార్పణ్య సానుభూతులు రెంటినీ శోక తత్వాలుగా గ్రహిస్తే ఎనిమిదవ స్థాయి 'శోకం' అవుతుంది అహంకార, కార్పణ్య, సహానుభూతులనేవి స్థాయి భావాలలో లేవు కాని బోజుడు 'అహంకారమే' శృంగారంగా భావించి, అదొక్కటే (ప్రధాన) రసం అని నిరూపించాడు కాని ఆ అహంకారం వేరు ఈ అహంకారం వేరు 'వాత్సల్యా'న్ని పదవస్థాయిగా కొందరంగీకరించారు కాని కొందరు దాన్ని 'రతి' యొక్క ఉపభేదంగా మాత్రమే గ్రహించారు

'రతి' స్థాయి భావంలో రెండు మనోవేగాలున్నాయి అవి 1 కామం 2. వాత్సల్యం

ఇంకా తరచి చూస్తే 'రతి'లో ఈ రెండు మాత్రమేగాక ఆత్మ సమర్పణ, సామాజికత, ఆత్మరక్షా సంఘర్షం మొ అనేక ఇతర వృత్తులు ఉంటాయి

మనస్తత్వ శాస్త్రంలో మనోవేగానికి మూడు భేదాలు చెప్పబడ్డాయి

1. మౌలిక మనోవేగం (primaryemotion) ·- మన అనుభవాల యొక్క స్వరూపమే ఇది ఇది మూల ప్రవృత్తులతో నేరుగా సంబంధం కలిగి ఉంటుంది భయం, కామం మొదలగునవి మౌలిక మనో వేగాలు

2. మిశ్రిత లేదా గౌణ మనో వేగం:- (Blended or Secondary emotion) - అనేక మూల ప్రవృత్తులు ఒకే మారు కలిసి ప్రవర్తిస్తాయి అపుడు కొన్ని వృత్తులు కలిసి మిశ్రిత మనోవేగం ఏర్పడుతుంది 'దయ' అనే దాంట్లో అపత్య స్నేహ, సంరక్షణ సహానుభూతి అనే వృత్తులు కలిసి ఉంటాయి అలాగే 'అవమాన' మనోవేగంలో క్రోధం, ఘృణలతో అహంకారం కలసి ఉంటుంది 'ప్రశంస'లో ఆశ్చర్యం, ఆత్మ సమర్పణ అనే మనో వేగాల మిశ్రణం ఉంటుంది

3. వ్యుత్పన్న మనోవేగం:- అస్వతంత్రమైన మనో వేగం ఇంకొక దాన్ని ఆశ్రయించి ఉంటే దాన్ని వ్యుత్పన్న మనో వేగం అంటారు అనేక మనో వేగాలకు నేరుగా మూల ప్రవృత్తులతో సంబంధం ఉండదు ప్రత్యేక పరిస్థితులలో ప్రత్యేక కారణాలతో వృత్తిజన్య

కార్య మధ్యమున ఉత్పన్న మైనదాన్ని 'వ్యుత్పన్న మనో వేగం' అంటారు హర్షం, సుఖం, దుఃఖం, నైరాశ్యం, ఆశ, ఆశంక, విశ్వాసం మొ: వాటికి మూలంలో ఇచ్చ ఉంటుంది.

పై విషయాలాధారంగా ఇలా నిర్ణయించ వచ్చును.

మౌలిక, మిశ్రిత మనోవేగాలతో వ్యుత్పన్న మనో వేగం యొక్క సమ్మిశ్రణం ద్వారా ప్రేమ యొక్క మనో దశా నిర్మాణం జరుగుతుంది దేని పైపైన ఆకర్షింపబడ్డప్పుడు ఆత్మ ప్రతిష్ఠ, సమర్పణ, సామాజికత మొ: భావాలు సృష్టింపబడి వాటి వెంట ఆశంక, చింత, స్మృతి, హర్షాది విభిన్న వ్యుత్పన్న మనోవేగాల సంయోగం జరగడం వల్ల మన హృదయంలో ఒక విచిత్రమైన ఆనందాన్ని కలిగించే మనోదశ ఏర్పడుతుంది. దీనినే ప్రేమ అంటారు.

స్వవిస్తారమైన ఇచ్చ మరియు సంయోగేచ్ఛయే మానవ జీవిత మూలంలో ఉంటుంది కొందరు మనో వైజ్ఞానికులు ఈ సంయోగేచ్ఛనే పూర్ణత్వ ప్రాప్తి యొక్క ఇచ్చ మరియు తన నుండి విడివడిన అర్ధ భాగం యొక్క అన్వేషణ అని వివరించారు

ఈ విషయంలో మనస్తత్వ శాస్త్ర వేత్తలలో మూడు రకాలైన మతభేదాలు గలవు 1 ఫ్రాయిడ్ మతంలో 'కామం' జీవితపు మూల వృత్తి 2 ఆడ్లర్ మతంలో హీనభావం (inferiority Complex) మరియు క్షతిపూర్తులు. 3 యూంగ్ మతంలో పై భావాలతో కూడ 'జీవనేచ్ఛ' మూలంగా అంగీకరించబడింది పై మూడింటిలో అధికభేదం లేదు ఈ మూడూ రాగం, ఆకర్షణ, సంయోగేచ్ఛ మరియు స్వత్వరక్ష అనేవి

డా భగవాన్ దాస్ స్థాయి భావాలను ఇలా విభజించారు 'సంస్కృత సాహిత్యంలోని స్థాయి భావాలన్నీ రాగద్వేషాల సమాహారమే రతి, హాస, ఉత్సాహ, విస్మయాలు - రాగం యొక్క అంతర్గతాలు శోక, క్రోధ, భయ, జుగుప్స అనేవి ద్వేషాంతర్గతాలు నిర్వేదంలో రాగద్వేషాల సమరసత ఉంటుంది మొదటి నాలుగు భావాలు మధురమైనట్టివి సుఖాన్ని అభివ్యక్తం చేస్తాయి మిగిలినవి దుఃఖాన్ని అభివ్యక్తం చేస్తాయి కఠినమైనవి సుఖదుఃఖ సమన్విత మైంది నిర్వేదం'.

ఈ విభజన సర్వథా అంగీకార్యం కాదు ఏ ప్రవృత్తి కూడ శుద్ధ రాగం కాని ద్వేషం కాని కాకపోవచ్చును వాస్తవంగా ఈ రాగ ద్వేషాల సంమర్షణ, సమ్మిశ్రణాలే మానసిక జీవనాన్ని నడిపిస్తాయి 'శోకం'లో రాగం, ఉత్సాహంలో ద్వేషం కూడ కలిసి ఉంటాయి

ఈ ప్రపంచం ప్రకృతి పురుషుల రంగస్థలం స్త్రీ పురుషుల యొక్క ప్రీతి, ప్రకృతి పురుషుల ప్రీతికి ప్రతిబింబం కామం, ప్రేమ - లౌకిక, అలౌకిక విషయకాలైనవి

ఈ ప్రపంచంలో స్త్రీ పురుష సంయోగానికి గొప్పస్థానం ఉంది సృష్టినిర్మాణానికి ఈ ఇద్దరి ఆవశ్యకత ఉంది. కామంగురించి వాత్సాయన, ఫ్రాయిడ్‌ల భావాల్ని ఇంతకు ముందే గ్రహించాం కామం వైజ్ఞానికం అవడమే గాక వ్యవహార జీవితాన్ని ఉదాత్తం చేయడంలో కూడ తోడ్పడుతుంది ప్రేమ ఒక మనో వేగంకాదు ఒక మనో వృత్తి మరియు వ్యవస్థిత మైన మనోదశ ప్రేమ నిర్మాణం మౌలిక, మిశ్రిత మనో వేగాలతో వ్యుత్పన్న మనో వేగాల యొక్క సమ్మిశ్రణం ద్వారా జరుగుతుంది

ప్రేమలో సమస్త మూల ప్రవృత్తులు, అపత్యస్నేహం, సంఘర్షణ, భోజనోపార్జన, నిషేధ, పలాయన, సామాజికత, ఆత్మప్రతిష్ఠ, కామ, నిర్మాణ, ఆర్తప్రార్థనా, క్రీడా, అనుకరణ మరియు హాస్యం మొ: వాటితో కూడ సమస్త మనోవేగాలు, వాత్సల్య, క్రోధ, ఉత్సుకత, క్షుధ, ఘృణ, భయ, సహానుభూతి, గర్వ, ఉత్సర్గకామ, పరిగ్రహ, సృజనోత్సాహ, కార్పణ్య, క్రీడ, అనుకరణ, హాస్యాలు అంతర్భూతమై ఉంటాయి శృంగారాన్ని ఆదిరసం, రసరాజం అనడానికి ఇది కూడ ఒక కారణం

పాత్ర భేదాల కారణాన రతి మూడు విధాలు 1. చిన్న వాళ్ళలోనిది 2 యుక్త వయస్కులలోనిది 3 పెద్దలలోనిది 1,3 లలో క్రమంగా వాత్సల్యం, దైన్యం, ఆత్మ సమర్పణ అనే బావాలు నిక్షిప్తమై ఉంటాయి అవి కోమలాలు, ఉజ్జ్వలాలు, పవిత్రాలు రెండవ దానిలో దాంపత్య భావం, నాయికా నాయకుల పరస్పరాకర్షణ ముఖ్యమైనవి

అపత్య స్నేహవృత్తి జ్ఞాన, సదాచారాలకు తల్లి వంటిదని డా మెకడూగల్ చెప్పాడు ఈ 'అపత్యస్నేహం'లో గల ప్రేమే శృంగార రసానికి మూలబూతమైన కారణంగా గ్రహింపబడింది

దాంపత్య ప్రేమ శారీరక సుఖోపభోగానికి మాత్రమే పరిమిత మైందికాదు ఈ దాంపత్య ప్రేమ గృహస్థ జీవితానికి మూలమై సమస్త కోమల భావాలకు జనక మౌతుంది జీవితంలో పవిత్రత, ఉత్సర్గం, సమర్పణ, స్వార్థత్యాగం మొ వానికి సఫలమైన ఉదాహరణం గృహస్థ జీవితంలోనే లభిస్తుంది గృహస్థులైన స్త్రీ పురుషులలో శారీరక ఆకర్షణ స్థానంలో మానసిక ఆకర్షణ నిలుస్తుంది దాంపత్య ప్రేమలో కామం నామ మాత్రంగా ఉంటుంది దీనిలో ప్రేమ యొక్క శుద్ధ స్వరూపం ప్రధానంగా ఉంటుంది గృహస్థ జీవనం దాంపత్య భావాన్ని ఆశ్రయించి ఉంటుంది

"గృహస్థాశ్రమమే జ్యేష్ఠాశ్రమమని మనువు ప్రశంసించెను" 196

ఈ ప్రపంచంలో ఏది పవిత్రం, ఉత్తమం, దర్శనీయం అయినదో అదే శృంగారం శృంగార రసంలో ప్రేమ యొక్క పూర్ణ పరి పక్వత ఉంటుంది

"Bhoja s Ahamkara - Sringara Can be called the Ego . The libido is the general Ahamkara comprehending all forms of love By the term libido Freud disignates a quantitative and changeable energy of the sexual instinct which is directed to an object It comprises not only sexual love (our Rati) but self-love (our Ahamkara - Sringara) love for parents and children, friendship and devotion to concrete and abstract ideas " 197

ఈ విధంగా రాఘవన్‌గారు శృంగారవు మనో వైజ్ఞానికతను వెల్లడించారు

## 9. శృంగారం - పారలౌకికతత్వం:-

రసమే పరమాత్మ స్వరూపం రసాత్మక కావ్యానందం లౌకిక విషయాశ్రయం అయినప్పటికీ బ్రహ్మానంద సబ్రహ్మచారి అనే ఆలంకారికులంతా అంగీకరించారు ప్రవృత్తి, నివృత్తికాలైన చతుర్విధ పురుషార్థాలే వివిధ రసాలుగా వింగడించారు కొందరు ఇది సమంజసమే భౌతిక విషయాలంబనమైన కామం పరమాత్మగతమవడమే శృంగారం భక్తిగా మారడం అనిచెప్ప వచ్చును కామం అన్ని పురుషార్థాలకు మూలం అయినట్లే శృంగారమే అన్ని రసాలకు మూలం

"సంసారెzస్మిన్ సుఖం గ్రాహ్యం దుఃఖహేయ మితిస్థితిః అతస్తు సుఖ మూలంహి దుఃఖ మిచ్ఛంతి నేతరత్

సుఖం ద్విధేవ కథితం నిత్యానిత్య విబేదతః నిత్యం తద్బ్రహ్మ రూపంహి అనిత్యం విషయోద్భవం

కేవలం యోగిభిర్గమ్యం బ్రహ్మానంద మయం విదుః ప్రచారో విరలస్తస్య లోకేస్మిన్ విషయోన్ముఖే

యత్సుఖం విషయోత్తంహి నానారుచి సమాశ్రయిం అదేవ బహుదాభిన్నం ప్రాంతేనైవాతి సుందరం

రసరూపం సుఖంయత్తు తద్వయోరపి మధ్యమం అనిర్వాచ్యతయాయత్తు పూర్వాచార్యై ర్నిరూపితం

తస్మాదసారే సంసారే సారరూపో రసోమతః యత్రప్రీతిః సువిపులావర్ధతేహి దినేదినే

ఇత్థం విచిత్రాభావాస్తు హర్షోత్కర్ష ప్రదాయినః నిమజ్జయంతి మనుజాన్ నిస్సీమ సుఖసాగరే " 198

అని రసరత్న ప్రదీపికాకారుడు వివరించాడు

ఈ సంసారంలో సుఖం ఉపాదేయం. దుఃఖం హేయమైంది ఇది వస్తుస్థితి అందువల్ల జగత్తు సుఖమూలం. దుఃఖాన్ని ఎవ్వరూ కోరరు కదా! ఆ సుఖం నిత్యం, అనిత్యం అని రెండు రకాలు. నిత్యం బ్రహ్మరూపం. అనిత్యం విషయోద్భవం యోగులకు మాత్రమే గమ్యమైంది బ్రహ్మానందం. విషయోన్ముఖమైన ఈ లోకంలో దాని ప్రచారం తక్కువ. నానారుచుల్ని ఆశ్రయించేది విషయోద్భవమైన సుఖం అది బహువిధం పర్యవసానంలో అది మిక్కిలి అసుందరం. ఇక రసరూపం ఈ రెంటి మధ్యన ఉండేది అది అనిర్వాచ్య మైందని పూర్వాచార్యులు నిరూపించారు

అందువల్ల అసారమైన సంసారంలో సారరూపమైంది రసం దాని మీది ప్రీతి నానాటికీ సువిపులంగా వర్ధిల్లుతుంది ఇలా నానాభావాలు చిత్ర విచిత్రాలుగా హర్షోత్కర్ష ప్రదాలై మానవులందరినీ నిస్సీమమైన సుఖసాగరంలో ఓలలాడిస్తాయి

ఇలాంటి సకలానంద విలక్షణమైన ఈ రసం పరమ ఆహ్లాదకరం, లోకోత్తరం అయినప్పటికీ విషయవాసన కలదవడంచే కావ్యాను శీలన పర్యంతం మాత్రమే ఉంటుంది అందువల్ల ఇది నిర్విషయం, నిత్యమూ అయిన బ్రహ్మానందానికి సబ్రహ్మచారిగా చెప్పబడింది రసచర్వణలో ఆనందాంశ కలదనడానికి "రసోవైసః, రసగ్గ్ హ్యేవాయం లబ్ధ్వానందీ భవతి" 199 అనే శ్రుతి ప్రమాణాలు కలవు ఆసచ్చిదానంద స్వరూపుడు ఆత్మరసం ఆఆత్మరసం అనుభవించేవాడు సచ్చిదానంద స్వరూపుడే అవుతాడు కాబట్టి రసం బ్రహ్మానందం లాంటి ఆనందాన్నిచ్చి తాత్కాలికంగా (ఆచర్వణ ఉన్నంత వరకు) అయినా మానవుడిని ప్రవృత్తి మార్గంనుండి నివృత్తి మార్గాన విహరింపజేస్తుంది ఇక్కడ ఈ ఆనందం అనుభవించేవాడు సహృదయుడు సహృదయునికీ, యోగికీ విషయ, నిర్విషయాలే భేదకాలు

రసమే పరమాత్మ స్వరూపం అని అంగీకరించేటప్పుడు రసాధిరాజైన శృంగారంలో పారలౌకిక తత్వం ఉందని వేరే చెప్పాల్సిన అవసరం లేదు ఈ శృంగారానికి అధిదైవతం శ్రీ మహా విష్ణువే దీన్ని బట్టి కూడ శృంగారం మోక్ష కారకమైందని మనం గ్రహించవచ్చు

పురుషుడు విశ్వశక్తి అతడు తనకుతానే జీవం అనీ, ప్రకృతి అనీ విభజించుకొంటాడు దీన్నే ఆత్మ, అనాత్మ అంటారు తనను విస్తరింపచేయడం ఆత్మస్వభావం ఆత్మ అనాత్మను అధికరించడానికి చేసే ప్రయత్నమే జీవనం ఆత్మ సక్రియ అనాత్మ నిష్క్రియ ఈ కారణం వల్లనే పురుషుడు ఆత్మ, స్త్రీ అనాత్మ అని చెప్పబడింది పురుష రూపాత్మ తనను విస్తరింప చేసుకొనే క్రియలలో 'ప్రజననం' ప్రముఖమైంది కాబట్టి ప్రజననం కొరకు అతడు అనాత్మ రూపమైన స్త్రీ సాహచర్యం కోరుతాడు దాంపత్య భావం ఈ ఆధ్యాత్మిక క్రియ యొక్క ప్రతిబింబం

రసానందం అనుభవించేప్పుడు శృంగారంలో లౌకికమైన కామోపసర్జనం ఉండదు ఆ ఆనందం శాంతి మయమైనట్టిది. జీవుడికి తాత్వికాలయిన పురుష స్త్రీత్వాలు లేక పోయినా పురుష శరీరధారి అయిన ఆత్మ, స్త్రీ శరీరధారి అయిన ఆత్మతోడి సంయోగాన్ని అభిలషించడం, స్త్రీ శరీరి పురుషశరీరిని వాంఛించడం, జీవుడికి పాంచభౌతికమైన ప్రకృతితోడి సంసర్గం వల్ల కలిగిన లక్షణం అలాంటి ఆత్మలు రెండూ కలిసి ఏకంగా భాసించడం పేరే అర్ధ నారీశ్వరత్వం. ఇదంతాసంభోగ శృంగారానికి సంబంధించిన వివేచనం

ఇక విప్రలంభంలో కూడ ఇంతకు మించిన పారలౌకిక తత్వాన్ని మనం దర్శించవచ్చు విరహాగ్నిలో ప్రేమికుల అహంకారం దగ్ధమై జీవేన్ముఖులైనవారు ఈశ్వరోన్ముఖులౌతారు స్థూల, సూక్ష్మ శరీరాలు రెండూ విరహాగ్నిచే దగ్ధం కావింపబడి, భస్మీభూతం చేయబడి ఈ ప్రేమజీవి ఆ పరమతత్వంతో తాదాత్మ్యం పొందుతాడు

వియోగావస్థలో ప్రేమప్రకర్ష అధికమౌతుంది ప్రేమమయులైన ప్రేమికులకు ప్రపంచంలోని ప్రతి అణువు ప్రేమమయంగా కనిపిస్తుంది.

"యస్తు సర్వాణి భూతాని ఆత్మన్యే వానుపశ్యతి
సర్వ భూతేషు చాత్మానం తతో న విజుగుప్సతే" 200
అని ఈశోపనిషత్

ప్రేమికుల సాధారణ ప్రేమే 'ఇంతింతై వటుడింతై' అనేరీతిని విశ్వంలో వ్యాపించి అసాధారణ ప్రేమ అవుతుంది. ఆధ్యాత్మిక పరిభాషలో దీన్నే లౌకిక ప్రేమ పారలౌకిక ప్రేమ రూపంగా పరిణతి నొందడం అనీ, జీవేన్ముఖి ప్రేమ ఈశ్వరోన్ముఖి అయిన ప్రేమ అవడం అనీ అంటారు ఏకత్వస్థాపనాభావం వల్ల ఆత్మ వికలమౌతుంది అపుడు పరమాత్మ నుండి వేరవడం సహింపలేదు ఈ వేరవడమే విరహం

స్త్రీ పురుషుల లౌకిక ప్రేమలో అనేక బాధలు, కష్టాలు ఉంటాయి. మొదట సంయోగం కలగడమే కష్టం అయినా, అది స్వల్పకాలం మాత్రమే ఉంటుంది. ఏదో కారణం వల్ల వియోగం ఏర్పడుతుంది ప్రియుడు మరణిస్తే విషాదాంత మౌతుంది ఈ విధంగా లౌకిక ప్రేమ అస్థాయి, చివరలో దుఃఖదాయి అవుతుంది. లోకంలోని అస్థిరమైన ప్రాణి హృదయంలో అప్పుడప్పుడు నిర్వేదం, విరక్తిభావం కలిగి ఏది స్థిరం(స్థాయి) అయిందో, ఎప్పుడూ తగ్గదో, ఎల్లప్పుడూ సుఖంగానే ఉంటుందో, సంయోగానంతరం వియోగం ఉండదో అలాంటి (శాశ్వత) ప్రేమ వైపు మనసు పయనిస్తుంది ఈ భావనే మానవుని ఈశ్వరుని వైపు మొగ్గునట్లు చేస్తుంది

ఈశ్వరోన్ముఖమైన ప్రేమ మూలంలో ఈ కారణాలుంటాయి.

1. దానితో పూర్ణమూ, స్థిరమూ అయిన ఆనందం లభిస్తుంది

2. దానిలో అనంతం, అక్షయం అయిన సౌందర్యం సాక్షాత్కరిస్తుంది.

3 సమస్త సుందరమైన కోరికలు పూర్తి అవుతాయనే ఆశ ఉంటుంది.

భక్తజనులు తమ ఇష్టదైవంలో అనంతశక్తితో పాటు అనంత సౌందర్యాన్ని కూడ ప్రతిష్ఠించడం ఈ కారణం వల్లనే కాబోలు! అక్షయసౌందర్యమే సుఖప్రాప్తికి ప్రబలమైన హేతువు

ఈశ్వర దర్శనం, ఆత్మసాక్షాత్కారం, ప్రియాసంగమం అనే ప్రబలమైన క్షుధ సాధకుని బాధిస్తుంది. ఈ కలయిక గురించి వారు మధురమైన కల్పనలు చేస్తారు. ఈ కలయిక మిక్కిలిసుఖవంతమైంది. ఇలాంటి ప్రేమికునికి సంగమం ప్రాప్తిస్తే కోరికలన్నీ పరిపూర్ణమౌతాయి అలాగే భక్తులుకూడ సాక్షాత్కారాన్ని కోరుతారు భక్తి సాధన, భగవంతుడు సాధ్యం, భక్తునికి అన్నిటికంటే గొప్పది భక్తి

మానవునిలఘుత్వ అనుభవం, ఆదాన ప్రదానం అనే రెండు ప్రధాన తత్వాలు ప్రేమలో ఉంటాయి ప్రేమికుడు తన ప్రేమకు పాత్రమైన వారిని అత్యంతం గొప్పవాళ్ళుగా భావిస్తాడు తను యోగ్యుణ్ణి కాననీ, తన్ను స్వీకరిస్తుందో లేదో అని ఆలోచిస్తాడు జీవాత్మ, పరమాత్మల సందర్భంలో ఇది ప్రత్యక్షమే లోక వ్యవహారంలో కూడ ప్రేమికులు తమ ప్రేమ పాత్రుల్ని భగవంతుడితో సమానంగా భావిస్తారు

భార్యా భర్తలు ఒకర్ని ఒకరు పరమాత్మ స్వరూపంగా భావిస్తున్నంత వరకు వారి ప్రేమ ప్రవాహం నిండుగా ప్రవహిస్తుంటుంది ఒకరిలో ఒకరు అవగుణాల్ని వెదకడం ఆరంభింపగానే వారి ప్రేమ ప్రవాహగతి కుంటుపడుతుంది పూజ్య బుద్ధి సమన్వితం అయిన ప్రేమే భక్తి లఘుత్వంచే పోషింపబడే మహత్వాన్ని చేరడానికి ప్రేరణ ఎప్పటి వరకు కలుగదో అప్పటి వరకు భక్తి ఆవిర్భవింపదు లఘుత్వం మహత్వంలో లీనమవడం లేదా భక్తుడు భగవంతుడిలో లీనమవడమే భక్తికి చరమఫలం దైన్య, కార్పణ్యాలు భక్తికి బలమైన సాధనాలు ప్రేమ పాత్రునిలో లీనమవడమే అన్నిటికంటే ఉన్నతమైన ఆనందం విశ్వవ్యాపి పరమాత్మునిలో తాదాత్మ్యం చెందడమే మోక్షం

ఆధునిక మనో వైజ్ఞానికులు 'అభుక్తకామ'మే సమస్త కార్యకలాపాలకు మూలమని భావిస్తారు ఈ మత ప్రవక్త సిగ్మండ్ ఫ్రాయిడ్ డా హైవలోక్ ఎలీస్ మతానుసారం భక్తి భావనకు మూలం కూడ ఈ అభుక్త కామవాసన లేదా దాంపత్య జీవన అసాఫల్యం

జన్మజాతమైన కామభావం సమయోచితంగా ధర్మ భావనలోకి పరిణత మవడం స్వాభావికం మనుష్య ప్రేమ దైవ రూపంలోకి మారడానికి ఇదే రహస్యం. భగవత్ప్రేమ దాంపత్య ప్రేమ రెండు మనోదశలూ సమాన రూపంతో వేగవంతమౌతాయి సాంసారిక సుఖాలు క్షణ భంగురమైన వని తెలుసుకొని వాస్తవికానందం కొరకు ఎవుడు ప్రయత్నిస్తామో అవుడే పార లౌకిక ప్రేమ ఉదయ మైనట్లు, అలాంటి వాస్తవిక పదార్థం యొక్క వియోగాన్ని జీవుడు సహింపలేడు. కామం వల్ల ఉత్పన్నమైన కోమల భావాల చివరి పరిణామమే భక్తి ఉపాసనలో మోక్షేచ్ఛ అనే స్వార్థం ఉంది కాని విశుద్ధ భక్తి సర్వథా నిష్కామమై ఉంటుంది

దాంపత్య ప్రేమ మూలంలో ప్రియుడిలో ఏకత్వ స్థాపన భావన ఉంటుంది. ద్వైతంలో అద్వైత స్థాపన కూడ ఈ భావన ఆధారంగానే చేయబడింది ప్రియురాలి కౌగిట్లో ప్రియుడు కొంత సేపు సమస్త ప్రపంచాన్ని ఎలా మరుస్తాడో అలాగే పరమాత్మ సాయుజ్యం ద్వార జీవుడు ఎల్లప్పుడూ ఈ ప్రపంచాన్ని విస్మరిస్తాడు ఆకర్షణను చిరస్థాయిగా చేసే ఈ కామమే చివరలో మోక్ష కారణమౌతుంది

పరమాత్మ పురుషరూపమవడంచే అతన్ని ప్రియుడి రూపంలో భావించడం భారతీయుల తాత్వికాలోచనకు అనుకూల సిద్ధమైంది భగవంతుని బాలకుడి రూపంలో భావించడం కూడ శృంగార భావ కారణంతోడనే లౌకికం అయిన గోపికా కృష్ణుల ప్రేమను పారలౌకిక క్షేత్రంలో ఆత్మ పరమాత్మల బింబ, ప్రతిబింబ భావాల చిత్రణం అన వచ్చు దీన్ని అద్వైతి. 'ఏకోzహం', 'ద్వితీయోనాస్తి' అని నిరూపిస్తాడు

వియోగ, సంయోగాలనేవి కేవలం మానవునికి మాత్రమే సంబంధించినవి కావు ఈ విశ్వంలోని ప్రతి కణం పరమతత్వం యొక్క విరహంలో తిరుగుతూ ఉంటుంది సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు మొదలగునవి ఎల్లప్పుడు తిరగడం ఆవిరహఫలమే ప్రాణుల లౌకిక వియోగం ఈ పరమ వియోగానికి ఆభాసమాత్రం

ప్రేమ సాగరం అగాధమైంది విరహాగ్నితప్తమైన ప్రేమ ద్వారా పొందిన దృష్టి సర్వథా ఆనందమయం, నిర్మలం అయినది శుభ్రత ప్రభావంచే విరహిజనుడు 'జీవ సంజ్ఞ' ను వదలి శుద్ధమైన ఆత్మ స్వరూపం అవుతాడు అత్యధిక విరహంలో పుట్టిన ప్రేమలో ప్రియదర్శనేచ్ఛ తక్క ఇతర ఏ కోరికలూ మిగిలి ఉండవు నిష్కామం అనే ఈ దశను వియోగి చరమావస్థలో పొందుతాడు పరమాత్మ తత్వ దర్శనం ముందు మూడు లోకాల సుఖం, రాజ్యం , పదవి, మోక్షం అన్నీ అగ్రాహ్యాలౌతాయి

పారలౌకిక ప్రేమకు మార్గం ఈ లోకంలోనే ఏర్పడుతుంది ప్రియుడి పరమాత్మ రూపాన్ని ఊహించి పరమాత్మ యొక్క వాస్తవ రూపాన్ని దర్శించ వచ్చు ప్రపంచంలో సుఖ శాంతులతో జీవించడానికి ప్రేమ ఒక ఆధారం ప్రకృతి పురుషుల యొక్క చిర వియోగ అనుభవమే మానవజీవనం

## 10. శృంగారమే రసరాజం:-

కొందరు పండితులు కరుణయే రసమనీ, మరికొందరు వీరమే ప్రధాన రసమనీ, ఇంకొందరు అద్భుతమే అసలు రసమనీ, శాంతం ఒక్కటే రసం అనీ కొందరు ప్రతిపాదించారు వీరు చేసిన వాదాలకు సాహిత్య శాస్త్రంలో కొంత ప్రాధాన్యం ఉన్నప్పటికీ ఇవేవీ సార్వజనీనతను, సార్వకాలీనతను పొందలేదు. 'శృంగారమే రసరాజం' అనే సిద్ధాంతాన్ని అత్యధికులైన ఆలంకారికులు, పండితులు, లోకులు అంతా అంగీకరించారు అందుకే దీనికి సార్వజనీనత, సార్వకాలీనత లభించింది.

శృంగారానికి రసరాజత్వాన్ని స్థాపించిన వాళ్ళలో భోజుడు, అగ్ని పురాణకారుడు, కేశవుడు, చింతామణి మొదలగు వాళ్ళు కలరు. వీళ్ళే గాక భరతుడు, ఆనంద వర్ధనాది ఆలంకారికులూ ప్రత్యక్షంగానో పరోక్షంగానో శృంగారానికి రసరాజత్వాన్ని అంగీకరించారు

'శృంగారమే రసరాజం' అనడానికి పండితులు (పింగళి లక్ష్మీకాంతం, తిప్పాభట్ల రామకృష్ణమూర్తి, రాజేశ్వర్ ప్రసాద్ చతుర్వేది మొదలగు వారు) అనేక కారణాలను చూపారు శృంగారం దాని తత్వాన్ని బట్టి అది రసరాజమౌతుంది దాని సాధన సామగ్రి దాని రసరాజత్వానికి మిక్కిలి ఉపయుక్తంగా ఉంది భరతుడు శృంగారాన్ని ఉజ్జ్వలం, పవిత్రం, ఉత్తమం అని అత్యున్నత స్థానానికి తీసి కెళ్ళాడు దీని యొక్క మహత్వం, ప్రభావం, వ్యాపకత్వాల వల్ల ఆచార్యులంతా దీన్ని రసరాజమన్నారు. రసాల యొక్క మహత్వం వాటి యొక్క స్థాయి విభావాను భావసంచారి భావాలపై ఆధారపడి ఉంటుంది

శృంగారం యొక్క స్థాయి భావం జననాది మృత్యు పర్యంతం వాసనా రూపంలో మనలో ఉండే 'రతి' (ప్రేమ) అనేది జీవి యొక్క ముఖ్య భావం ప్రేమ అది సత్యం, శాశ్వతం ఇది సర్వవ్యాపి, సర్వోపయోగి దీనిలో తన్మయత్వపుచరమ సీమ, ఆత్మ త్యాగపు పూర్ణ ప్రతిష్ఠ ఉంటుంది కాబట్టి శృంగారమే రసరాజం

ఈ 'ప్రేమ' భావం యొక్క వ్యాపకత్వం పరలోకంలో కూడ మనోకామనను పూర్తి చేయడానికి అన్నిటి కంటే ప్రబలమైన సాధనం విభావాల దృష్టితో చూసినా శృంగార రసం సర్వ శ్రేష్ఠమైంది శృంగార రసానికి ఆలంబనం నాయికా నాయకులు వీరి అనురాగం పరస్పరమైనది అంటే ఆశ్రయ ఆలంబనాలు అన్యోన్య ఆశ్రితంగా ఉంటాయి

వీళ్ళలో ద్వైతభావన లుప్తమవుతుంది. రెండు వైపుల సమాన ఆకర్షణతో పాటు వాళ్ళ అనురాగం తన్మయతలో పరాకాష్ఠ పొందుతుంది అంతే కాక ఒకరి కొరకు ఒకరు ప్రాణత్యాగం చేయడానికి సిద్ధమౌతారు సత్యమైన ప్రేమగల వాళ్ళే ఈ రసాన్ని అనుభవించ గలరు

శృంగారేతర రసాలకు ఉద్దీపన విభావం కేవలం మనుష్య సంబంధి అయిఉంటుంది కాని శృంగారానికి దైవ, మానుష, ప్రాకృతిక, అప్రాకృతిక, జడ జంగమాలన్నీ ఉద్దీపన విభావాలౌతాయి ఈ విశ్వంలోని ప్రతి కణం దీనికి పోషకం, సహాయకం అయిఉంటుంది ఈ రసానికి ఉద్దీపనం ప్రతిచోట, ప్రతి సమయాన ప్రతి ఋతువులో లభిస్తుంది ఈ ఉద్దీపనాల ప్రచురత్వం వల్ల కూడ శృంగారానికి రసరాజకత్వం స్వయం సిద్ధంగా లభిస్తుంది

అనుభావాలూ దీన్ని రసరాజును చేస్తున్నాయి శృంగారంలో ఉన్నన్ని అనుభావాలు ఏ ఇతర రసంలోనూ ఉండవు 'హావా'ది భావాలు శృంగారంలో మాత్రమే ఉంటాయి సాత్త్విక భావాల పూర్ణ పరిష్కారం గూడ ఈ రసంలోనే ఉంటుంది.

సంచారి భావాల ప్రచురత్వంలో ఇది అనుపమేయమైంది సంఖ్యాదృష్టితో చూస్తే రసాలలో వ్యభిచారుల క్రమం ఇలా ఉంటుంది.

హాస్య రసంలోని వ్యభిచారుల సంఖ్య -2, అద్భుతంలో -4, బీభత్సంలో -5, వీరంలో -6, రౌద్రంలో -8, భయానకంలో -10, కరుణంలో - 11, శృంగారంలో - 29 ఉంటాయి

శృంగారంలో ప్రయోగింపబడే వ్యభిచారులలో అధిక శాతం మృదుల స్వభావం కలిగినవై ఉంటాయి దీని వల్లకూడ శృంగారం స్వతస్సిద్ధంగానే రసరాజ పదవిని అలంకరించింది శృంగారేతర రసాల్ని శృంగారానికి అంగరసాలుగా చేయవచ్చును దీనికి అధి దైవతం శ్రీ మహావిష్ణువు కావడం కూడ ఇది రసరాజ పదవిని పొందడానికి ఆస్కార మేర్పరచింది భోజుడు,

"శృంగార వీర కరుణాద్భుత రౌద్రహాస్య
బీభత్స వత్సల భయానక శాంతనామ్నః
ఆమ్నాసిషుర్దశ రసాన్ సుధియో వయంతు
శృంగారమేవ రసనాద్రస మామ నామః" 201

పండితులు శృంగారాది శాంతాంతాలగు పదిరసాల్ని పేర్కొన్నారు మేము ఒక్క శృంగారమే రసమని సిద్ధాంతం ఒనర్తుము - అని పేర్కొన్నాడు. శృంగారం సమస్త సుఖాలకు మూలం రసరాజం ప్రేమ ప్రమోదాలకు అధిష్ఠాత ప్రీతికి ప్రాణం ఈ రసం యొక్క తీవ్రత, విస్తారం, శక్తి, ప్రభావశీలత - అన్నీ ఇతర రసాలన్నిటి కంటే అత్యధికంగా ఉంటాయి

శృంగార రసరాజత్వాన్ని గూర్చి రాఘవన్ గారు ఇలా చెప్పారు

. . . Bhoja glorifies both. His Aham kara is glorified by the one Rasa and at the same time minor Sringara born of Rati also is glorified by Bhoja This

glorification of Rati Sringara is however nothing new Writers have always held love as the greatest of sentiments and it is called Adima Rasa Literature is eloquent on its Supremacy and dramaturgy and poetics deal only with it. It is the monarch of all Rasas as Kumara Swamin puts it - "రససార్వభౌమః శృంగారః - P.44 P R. Vya. Bala manorama Edn Says Rudrata-" అనుసరతి రసానాం రస్యతా, మస్యనాన్యః సకలమిద మనేన వ్యాప్త మాబాల వృద్ధమ్" - K. A. XIV 38 - " 202.

శృంగారం రసరాజ పదవిని అధిష్ఠించడానికి తగిన అర్హతను కలిగించిన హేతువులు కొన్ని ఉన్నాయి అవి ఇవి -

మానవసృష్టికి ఆది కారణం అయిన కామవాసన సర్వమానవ సామాన్యం ఇది మానవ సాధారణమేగాక సర్వప్రాణి సాధారణం గూడ స్థావర ప్రకృతిలోనూ ఈ వాంఛ కలదని కొన్ని శాస్త్రాలు చెబుతున్నాయి కాబట్టి మానవేతర స్థావర జంగమాత్మక మైన ప్రపంచమంతా ఈ కామ వాసనా పూర్వకంగానే ప్రవర్తిస్తుంది అందుచే శృంగారానికి కారణం అయిన కామవాసనకు ఉన్న విశ్వవ్యాప్తి తక్కిన వాటికి లేదు

2. శృంగార రసం ఆదినుండీ చిత్తసుఖాన్ని ఇచ్చే మాధుర్యం కలది కావ్యంలో వలె లోకంలోనూ ఆద్యంత సుఖదాయకమైంది తక్కిన రసాలు పరిపోషణలోను, చరమదశలోను మాత్రమే ఆనందాన్నిస్తాయి లోకంలో వానికలాంటి ఆనందస్థితి అసలే లేదు దుఃఖం లోకాన దుఃఖమే అది కరుణమైనప్పుడు గానీ ఆనందదాయకం కాదు అలాగే క్రోధం అన్ని చోట్ల సుఖావహంకాదు కాబట్టి లోకంలోను, కావ్యంలోను మొదటి నుండీ మనోహరమైన శృంగారం నవరసాలలో అగ్రస్థానానికి అర్హమౌతుంది

3 సర్వప్రాణి సమైక్యానికి పూలబాటలనదగ్గ అనురాగ, భక్తి, ప్రేమ, ప్రణయ, వాత్సల్యాది హృదయ భావాలన్నీ శృంగార గర్భితాలై జీవుడికి స్వర్గసుఖాన్ని ఇస్తున్నవి ఆ దివ్య సుఖమే జీవేశ్వర ఐక్యభావనకూ, సర్వప్రాణి సమానత్వభావనకూ, అనుభవానికీ సాధన మౌతుంది

4 మానవుని జీవిత పరమావధి జీవేశ్వరైక్యం శృంగార రసం ఆ ఆధ్యాత్మిక సిద్ధికి ఛాయ అవడమే గాక, దాన్ని ప్రతిఫలింపచేసే ముకురం కూడా అవుతుంది శృంగార రసానుభవశాలి తన ఆత్మను పరమాత్మలో సుకరంగా లీనం చేయగలడు హృదయం ప్రేమ పూరితమైనప్పుడు ఆత్మ భగవంతుని పదములపై వ్రాలి ఉంటుంది

5 ఇతర రసాలలోలాగ గాక శృంగారంలో క్షాళితం కాదగిన మాలిన్యం చాలా తక్కువ కావడం వల్ల అది కెథార్సిస్ ప్రక్రియను ప్రతి ఘటిస్తుందని అరిస్టాటిల్ అభిప్రాయం అయినట్లు అతని వ్యాఖ్యాత బుచర్ చెప్పాడు ఎక్కువ క్షాళనాన్ని అపేక్షించే భావాలు

అనారోగ్య ప్రదాలు అవి ఆత్మకు తేజోహానిని కలిగిస్తాయి క్షాళన అపెక్ష లేనివి ఆరోగ్య ప్రదాలు అవి ఆత్మకు దీప్తినిస్తాయి అలాంటి శక్తిగలవాటిలో 'రతి' బావం ప్రథమ గణ్యం ఈ జాతికి చెందిందే శమం అది రెండవ స్థానాన్ని ఆక్రమిస్తుంది ఈ కారణాలనే మనసులో బెట్టుకొని కాబోలు శృంగారం ఒక్కటే రసం అని భోజుడు సిద్ధాంతం చేసాడు కాబట్టి శృంగారం ఒకటే రసరాజం అనే వరమ సిద్ధాంతం

6 సకల జనానుభవ గోచరత దీన్ని రసరాజాన్ని చేసిన హేతువులలో ఒకటి అధిక సంఖ్యాకులచే ఈరసం ఆస్వాదింప బడుతుంది ఈ విషయాన్ని అబినవగుప్తుడు కూడా (చూ ధ్వన్యాలోకం తృ పేజి 433) ప్రకటించాడు సర్వరసాలూ, సర్వజనులకూ జీవితంలో అనుబవానికి రావడం కష్టం శృంగారానుభవం లేనివాళ్ళు ఒకరిద్దరు కనిపించవచ్చు కాని ఆ సంఖ్య చాల తక్కువ అందుకే పురాణాలలో వరమ మహర్షులు కూడా చలితమనస్కులై శృంగార వాగురలో పడ్డట్లు వర్ణించడం కనబడుతుంది

7 స్వభావసిద్ధత దీనికి ఉంది కాని వాసనాత్మకం అనడాన్ని బట్టి సర్వస్థాయులు హృదయంలో ఉండక తప్పవు అయినా శృంగార రస స్వరూపమైన వాసన అతి త్వరితంగా ఉద్బుద్ధమవడానికి అవకాశం ఉంది ఆలంబన ప్రతిపత్తి దీనికధికంగా ఉండడమే దానికి కారణం

8 ధనేషణ, దారేషణ, పుత్రేషణ - అనే ఈషణ త్రయాలలో కూడా రెండూ శృంగార ప్రతిబింబాలే అవి దారేషణ, పుత్రేషణలు తత్సాధనకు లౌకికంగా ఉపకరించేది ధనేషణ

9 అరిషడ్వర్గాలలో కామం మొదట పేర్కొన బడింది కామాతి క్రమణం చాలాకష్టం తక్కిన వాటిని జయించిన వారున్నారు కనుక తొలిమెట్టు ఎక్కిన వారికి తక్కినవన్నీ సుసాధ్యాలని తెల్పడానికే కామానికి పూర్వనిపాతిత్వం

10. అరిషడ్వర్గాలలో గల ఈకామం ధర్మార్థ కామమోక్ష రూపాలైన పురుషార్థాలలో కూడా కనబడుతుంది మానవ శత్రువుగా అరిషడ్వర్గాలలో పరిగణించి మళ్ళీపురుషార్థాల్లో పరిగణించడానికి బహుశః అది అనతిక్రమణీయం అవడమే కారణం కావచ్చును అంటే శత్రువుతో సంధి చేసుకోవడం లాంటిది ఆశ్రమాలలో గృహస్థాశ్రమానికి ప్రాధాన్యాన్ని కలిపించడం కూడ కామపురుషార్థ ప్రాధాన్యాన్నే సూచిస్తుంది ఈ విధంగా పురుషార్థాలలో కామానికి ప్రాధాన్యం స్పష్టమౌతుంది సృష్టి స్థితికి మూలభూతం శృంగారమే ప్రకృతి పురుషుల కలయికే సృష్టికారణ మనడం నిర్వివాదం అది ఆధ్యాత్మిక తత్వ చింతనాత్మకం లౌకికంగా కూడ ప్రకృతి పురుష ప్రతిరూపాలైన స్త్రీ పురుషుల కలయికే సృష్టికి మూలం అదిసంపూర్ణంగా కామ(శృంగార) ప్రధానం సృష్టి స్థితి క్రమం విచ్ఛిన్నం కారాదని ఉపనిషత్తులు ఘోషిస్తున్నాయి

"ఆచార్యాయ ప్రియం ధన మాహృత్యప్రజాతంతుం మావ్యవచ్ఛేత్సీః" 203

కాబట్టి కామం అనిరోధనీయం తదతిక్రమణ యత్నం కూడ విఫలమే అవుతుంది

11. శరీరతత్వం సర్వాత్మనా శృంగారానుకూలం అందు ప్రధానమైంది అధోరేతస్కృత మహర్షులకు ఊర్ధ్వరేతస్కులని వ్యవహారం అధోరేతస్కృత అత్యంతం అపరిహార్యం హాస్యాది రసాలకు ప్రత్యేకించి శరీర నిర్మాణంలేదు మానవునిలో కామానుకూలత దైవ సృష్టం అయిన విషయం లౌకిక, అలౌకిక భేదంగల కామ, శృంగారాలు సమాన కక్షాంతర్గతాలు

12. కామ పురుషార్థం మోక్షసాధకమైనట్టిది ధర్మార్థ కామత్రయ సాధ్యం మోక్షం సాధన త్రయంలో కామం ప్రధానమైంది.

13. కామి గాని వాడు మోక్ష కామి గాడని లోకోక్తి, పర్యంత కామానుభూతి వైరాగ్యానికే దారి చూపుతుందని ఆధ్యాత్మిక, సాహిత్య తత్వాలు రెండూ ప్రకటిస్తాయి భక్తి ప్రతిపాదకాలైన అనేక గ్రంధాలలో మొదట కామిత్వం, అనంతరం మోక్షగామిత్వం ప్రతిపాదితం (వైజయంతీవిలాసం, శివరాత్రి మాహాత్మ్యం మొ ) సర్వ ప్రవృత్తి నివృత్తి లయం అవుతుందనే ఆధ్యాత్మిక తత్వంకూడ దీన్ని బలపరుస్తుంది కాబట్టి కామప్రాధాన్యం అప్రతిహతమైనట్టిది

14 దీనికి శాశ్వత విభావస్థితిగలదు దాంపత్య జీవనం గృహస్థాశ్రమంలో ప్రధానమైంది స్త్రీ పురుమలలో, అన్యోన్య ఆలంబన ద్వారా ఏర్పడేది (కామం) శృంగారం అలాంటి ఆలంబనం స్త్రీ పురుమలకు దాంపత్యం ద్వారా శాశ్వతంగా లభిస్తుంది తదితర రసాలకట్టి శాశ్వతాలంబనం లభించదు అవి తత్కాల జాతాలు వెనువెంటనే అంతరిస్తాయి కామం(శృంగారం) అంటే శాశ్వత విభావస్థితి ఉండడంచే అవిచ్ఛిన్నంగా సమకూరుతుంది

15 శృంగారం ఆద్యంతం హృద్యమైంది విబావస్థితి నుండి రసీభావ స్థితి దాకా చర్వ్యమాణత శృంగారంలో కనబడుతుంది శృంగారం సంయోగం, వియోగం అనే రెండు అవస్థలలో ఆస్వాద్యమౌన మౌతుంది ఇతర రసాలు అనుభవ వేళలో మాత్రమే రసనీయాలు అభావవేళలో వాటికి ఆస్వాద్యమానతలేదు ఇది శృంగారానికి ఇతర రసాలకంటే గలవిశిష్టత కావ్యం పరమప్రయోజనం ఆనందం అది శృంగారం వల్ల సులభ సాధ్యం

శృంగారానికి సామగ్రి ప్రకృతి సిద్ధమైనట్టిది ఈ విషయాన్ని ఇదివరకే చర్చించాం ఒడుదొడుకులు లేని జీవితం సామాన్యంగా శృంగారాన్ని అతిక్రమించదు లౌకికాలు,

బౌతికాలు, శాస్త్రీయాలు అయిన ఈ కారణాలచే శృంగారాన్ని రసరాజంగా అంగీకరించడం సహృదయ హృద్య మౌతుంది. రస వివేచన ఆరంభమైన నాటి నుండి నేటి వరకూ శృంగారం రసరాజ పదవిలో నిలచి ఉంది ఇక ముందు కూడా అదే రసరాజుగా ఉంటుందనడంలో విప్రతిపత్తి ఉండబోదు

"శృంగార ఏవమధురః పరప్రహ్లాదనో రసః" 204

11. శృంగార రసాబాసం:-

ఆభాసం అంటే ప్రకాశం, ప్రతిఫలనం అనీ రసాభాసం అంటే చెడిపోయింది అనీ శబ్దరత్నాకరంలో అర్థాలీయబడ్డాయి ఆభాసం అంటే కొంచెం కనబడడం, లేదా కొంచెం ప్రకాశించడం అని అర్థం చెప్పుకొంటే బావుంటుంది రసాభాస ఘట్టాలలో రసం పుష్టి నొందదు రసం ఉన్నట్లు స్ఫూర్తి మాత్రం కలుగుతుంది ఈ రసాభాసానికి ఆలంకారికులు రసానికి లాగే సముచిత స్థానం ఇచ్చారు

"ఆభాసమనగా లేనిది యున్నట్లుగా భాసించుట (అసత్ సదివ)" 205 అని పింగళి వారి నిర్వచనం

"అనౌచిత్య ప్రవృత్తత్వే ఆభాసో రస భావయోః" 206 - అని విశ్వనాథుడు

అనౌచిత్య ప్రవృత్తత్వం వల్ల రస, భావాలకు ఆభాసం కలుగుతుంది రసం అనౌచిత్యంలో ప్రవర్తిల్లితే రసాభాసం. భావం అనౌచిత్యంలో ప్రవర్తిల్లితే భావాభాసం

"తదాభాసా అనౌచిత్య ప్రవర్తితాః" 207

"అనుచిత విభావాలంబనత్వం రసాభాసత్వమ్" 208

రసబావాల్ని అనుచితంగా ప్రవర్తింపచేయడమే రసాభాస, భావాబాసాలకు కారణం - అని పై మమ్మట, జగన్నాదుల వాక్యాలు తెలుపుతున్నాయి

ఈ రసాబాసం మూడు విధాలుగా ఉంటుందని ప్రతాప రుద్రీయకర్త చెప్పాడు

"ఏకత్రైవాను రాగశ్చేత్తి ర్యఙ్మ్లేచ్ఛ గతోzపివా

యోషితోబహుసక్తశ్చేద్రసాభాసస్త్రిధామతః" 209

అన్యోన్య అనురాగం లేని స్త్రీ పురుషుల్ని ఆలంబనంగా గ్రహించి వ్రాసిన కావ్యంవల్ల మనకు కలిగే ఆనందం శృంగారం యొక్క ఆభాసం వల్లనే రసంవల్ల కాదు ఇదే

ఏకత్రైవానురాగం రెండవ విదమైన ఆభాసం మ్లేచ్ఛాలంబనం (మ్లేచ్ఛులంటేనీచప్రకృతులు అని గ్రహించాలి) పశువక్ష్యాదుల్ని ఆలంబనంగా చేసి శృంగార కావ్యాలు వ్రాయడం. దీనికి మ్లేచ్ఛ తిర్యగ్గతం అనిపేరు మొదటి దాంట్లోలాగే దీంట్లోకావ్య వరన వేళ మనకు ఆనందాన్ని ఇచ్చేది శృంగార రసంకాదనీ, దాని ఆభాసం మాత్రమే అనీ పైశ్లోకంలో సిద్ధాంతం చేయబడింది.

"ఏకత్రైవాను రాగమున స్త్రీ పురుషులనెడి ఉభయాలంబనములో ఒక ఆలంబనము నందే ప్రీతియు, రెండవ ఆలంబనము నందు దానియెడ వైముఖ్యముగల వేరొక విరోధ భావమును ఉండును సాధారణముగా ఉభయనిష్ఠమైన ప్రీతిగాని సామాజికునకు 'రతి' అనెడి స్థాయిని కలిగించి చరమదశలో శృంగారముగా ఆనందమునీయజాలదు మరి ఏకనిష్ఠమైన ప్రీతి శృంగార రసముగా పర్యవసించి ఆనందము నీయలేక పోయినను స్థాయిని అంకురింప జేయుటకు సమర్థమే అగును కవి యిట్టి అసంపూర్ణా లంబనమును చేపట్టి దానివలన కలుగు స్థాయికి సహజముగా ఉన్న శక్తికంటె అధికశక్తిని ఆపాదించి ప్రదీప్తము చేయుట వలన సామాజికుడు ఇది యాభాసమా? యథార్థమా? అనెడి పరీక్షకు పూనుకొనకయే ఆనందమును అనుభవించును ఈ యాభాసమును రసముగానే ప్రకాశింప జేయుటకు కవి అసాధారణ ప్రజ్ఞాశాలియై ఉండవలెను" 210 అని పింగళి వారు విశదపరిచారు

మ్లేచ్ఛగతరాగం 'నీచ ప్రకృతి' ప్రయుక్తం అవడంచే ఆభాస మౌతుంది తిర్యక్కులకు భాష లేక పోవడంచే వాటి వాక్యాలచే మనలో వ్యక్తం కాదగిన రసభావస్ఫురణకు, తత్పరిపోషణకు అవకాశం లేక పోతుంది కాబట్టి తిర్యగ్గతమైన శృంగారం కూడ రసాభాసమే

మూడవ ఆబాసం స్త్రీలకు బహుపురుషులపై రాగముండడం కూడ రసాభాసం అనేది ఒక స్త్రీకి చాలా మంది పురుషులపై అనురాగం ఉండడం అంటే బహునాయక విషయకమగు రతి కూడ దీనివల్ల ఆభాసత్వం పొందుతుంది ఈ రసాభాసాన్ని గూర్చి సాహిత్య దర్పణకారుడు ఇలా వివరించాడు.

"ఉపనాయక సంస్థాయాం ముని గురు పత్నీ గతా
యాంచ బహునాయక విషయాయాం రతౌ తథాను
భయనిష్ఠాయామ్ ప్రతి నాయక నిష్ఠత్వే తద్వద
ధమపాత్ర తిర్యగాది గతేశృంగారేz నౌచిత్యమ్" 211

ఉపనాయకుడిపై నిలచినరతి, ముని గురు పత్నీ గతమగురతి, బహునాయక విషయక మగురతి, అనుభయ నిష్ఠమగురతి, ప్రతినాయక నిష్ఠమగురతి, అధమ పాత్రగతమగు రతి, తిర్యగాది గతమగు రతి అనుచితము లౌతున్నాయి కాబట్టి వాటిల్లో కూడా రసాభాసమే

వీటిలో ఉపనాయకరతి, ముని గురు పత్నీ గతమగు రతి, ప్రతినాయక నిష్ఠమగు రతి - అనే మూడు తక్క తక్కిన నాలుగింటిని ప్రతాపరుద్రీయకర్త గ్రహించాడు ఇక్కడ ఒక సందేహం కలగడానికి అవకాశం ఉంది. బహునాయక గతమగు రతి అనౌచిత్య దోషదూషితమై ఆభాసమైతే బహునాయికా గతమగు రతి ఏల ఆభాసంకాదు? ఈ ప్రశ్నకు ప్రతాపరుద్రీయ వ్యాఖ్యాత ఇలా సమాధానం ఇచ్చాడు -

"పుంసోఽప్యనేక నాయికానురాగే రసాభాసత్వమితి కేచిత్ తర్హితన్మతే దక్షిణ నాయకాను రాగస్య సర్వ సంప్రతిపన్న రసభావస్య ఆభాసత్వ ప్రసంగ ఇతి చేన్నైవమ్ తస్యాప్యేకస్యామేవ గాఢానురాగత్వాత్ అన్యత్రతు క్వచిన్మధ్యత్వం క్వచిన్మంద మనిశ్చితమ్ 'తుల్యోఽ నేకత్రదక్షిణ' ఇతి లక్షణం పునరనే కాసు నాయికా స్వనువృత్తిమాత్ర పరత్వేన తుల్యత్వ పరమితి ద్రష్టవ్యమ్" 212

బహునాయికా గతమైన పురుషరతి ఆబాసమే అని కొందరు అంటారు. అలాంటప్పుడు సర్వాలంకారిక సమ్మతమైన దక్షిణ నాయక గతమగు రతి కూడ ఆభాసమే అవుతుంది కాని అలాకాదు కారణం ఇది- దక్షిణ నాయకుడికి కూడా ఒక్కతె పైనే గాఢమైన అనురాగం ఉంటుంది మరొకతెపై మధ్యమ అనురాగం, వేరొకతె పై మందానురాగం ఉంటుంది అలాగయితే 'అనేక నాయిక లందు తుల్యుడు దక్షిణుడు' అనే లక్షణం ఎలా పొసగుతుంది? అంటే అనేక నాయికలందు వృత్తి తుల్యమే కాని అనురాగం తుల్యం కాదని సమాధానం

ఈ ఆభాసానికి శాస్త్రకారులు రసంతో సమానమైన స్థానాన్ని ఇచ్చారు ప్రవృత్తమైన రసానికి అనౌచిత్యం వల్ల కలుగు భంగంకంటె, అప్రవృత్తమయ్యు ప్రవర్తమానంవలె ఆనందప్రదమైన ఆభాసం మేల్తరం కాబట్టి దీనిని రసభంగం వలె తోసివుచ్చడం తగదు

ఈ రసాలలో కొన్నిటికి పరస్పర విరోధం ఉంది. శృంగార వీరాలకు, శృంగార హాస్యాలకు, వీరాద్భుతాలకు, వీరరౌద్రాలకు, శృంగారాద్భుతాలకు విరోధం లేదు అంటే అవి మిత్రరసాలని భావం శృంగారానికి వీరం, హాస్యం, అద్భుతాలతో మైత్రి ఉంది.

శృంగార బీభత్సాలకు, శృంగార కరుణాలకు, వీర భయానకాలకు, శాంతరౌద్రాలకు, శాంత శృంగారాలకు పరస్పరం విరోధం కలుగుతుంది అంటే అవి పరస్పరం శత్రు రసాలని భావం శృంగారానికి బీభత్స కరుణ, శాంతరసాలు విరోధి రసాలు

ఈ విరోధం రెండు విధాలు. 1. స్థితివిరోధం 2 జ్ఞాన విరోధం

దాని ఆధారమందు ఉండకపోవడం స్థితి విరోధం. దాని జ్ఞానానికి ప్రతిబం ధకమైన జ్ఞానం కలది జ్ఞాన విరోధం. ఇతరమైన ఆధారంలో విరోధిరసాన్ని స్థాపించగా మొదటి రసం

విస్తరిస్తుంది. ఎలాగంటే నాయకునిలో వీరరసం వర్ణింపదగి ఉండగా ప్రతినాయకునిలో భయానకాన్ని వర్ణించడం

రసం సామాజికుని లోనేగాని నాయకాదులలో ఉండదు. కాబట్టి రసపదంచే దానికి ఉపాధి అయిన స్థాయిభావం గ్రహింపబడుతుంది రసం అద్వితీ యానంద కరమవడంచే విరోధం సంభవింపదు అంటే మొదట ప్రధాన రస స్థాయి భావానికి విరోధం కలిగితే ప్రధాన రసం పుట్టనే పుట్టదని భావం.

"అనౌచిత్యాదృతే నాన్య ద్రస భంగస్యకారణమ్

ప్రసిద్ధౌచిత్య బంధస్తు రసస్యోపనిషత్పురా" 213

అని ఆనందవర్ధనుడు

ఈ విధంగా 'రతి' బీజమూలకమై అంకురించి, వృద్ధినొంది, శాఖోపశాఖలుగా విస్తరిల్లి రసానంద ఫలాన్నిచ్చే ఈ శృంగార రసం రసరాజం కావటంలో వింత ఏమి?

ఇలా రసరాజమై నిలిచిన శృంగారాన్ని ప్రబంధ నిర్మాతలు ఎలా పోషించారో, దాని ప్రయోగంలో ఏయే విధాలైన పోకడలు పోయారో ఇక ముందు పరిశీలిస్తాను

'శృంగార రస సర్వస్వమ్‌శిఖి పింఛ విభూషణమ్

అంగీకృత నరాకారమ్, ఆశ్రయే భువనాశ్రయమ్

- లీలాశుకుడు

# అధోజ్ఞాపికలు

1 రఘువంశం-కాళిదాసు, సర్గ-1 శ్లో - 1 పుట-1
2&3 నాట్యశాస్త్రం-భరతుడు,అభినవ భారతి (వ్యాఖ్య)-
4 రసార్ణవ సుధాకరః - సింహభూపాలః; పుట -253
5 భావప్రకాశనం - శారదాతనయుడు, పుట-89
6 సాహిత్య శిల్పసమీక్ష - లక్ష్మీకాంతం, పింగళి, పుట- 146,
7 యాజ్ఞవస్మార్త మన్త్రపారం- లక్ష్మీనృసింహ శాస్త్రి, చల్లా, పుట-286
8 రఘువంశం- కాళిదాసు - సర్గ -1 శ్లో. - 69
9 భగవద్గీత - అధ్యాయం - 7 - శ్లో - 11
10 కావ్యాలంకార సంగ్రహం - సూర్యనారాయణ శాస్త్రి, సన్నిదానం, పుట - 316 & 317
11. ధ్వన్యాలోకం - ఆనందవర్ధనః, 2-7,10,2-1,2
12 రససిద్ధాంతము - ఆంధ్రుల వరివస్య - రామకృష్ణమూర్తి, తిప్పాబట్ల-పుట -198
13 శబ్దకల్పద్రుమః - స్యార-రాజా-రాధాకాంతదేవ బహదుర్. బాగం-5 - పుట - 133
14 रस प्रक्रिया- डा शकर देव अवतरे పుట - 224, 225
15. श्रगार रस का शास्त्रीय विवेचन- डा राजेश्वर प्रसाद चतुर्वेदि, పుట - 11
16 శబ్దకల్పద్రుమః - స్యార- రాజా - రాధాకాంతదేవ బహదుర్, పుట - 133
17 నాట్యవేదము - మాధవరామశర్మ, జమ్మలమడక, పుట - 203
18 వాగ్భటాలంకారః - వాగ్భటః; పుట -114
19 సాహిత్య దర్పణమ్ - విశ్వనాధః, పుట -46
20 రసమంజరీ - భానుసూరి , పుట - 130
21. రసార్ణవ సుధాకరః - సింహభూపాలః; పుట - 253
22. దశరూపకమ్ - ధనంజయః , పుట - 262
23 సరస్వతీ కంఠాభరణమ్ - భోజః , పుట - 238
24 శృంగారప్రకాశః - భోజః (వ్యాఖ్యానం - రాఘవన్), పుట - 434
25. అలంకార మహోదధి - నరేంద్ర ప్రభవసూరి , పుట - 59
26&27 భావప్రకాశనము -శారదా తనయుడు; పుట - 108 & 167
28 కావ్యాలంకారచూడామణి పెద్దన , విన్నకోట, , పుట - 23

29 శృంగారం- పోతన - చంద్రమౌళి, బి; (ప్రవేశిక), పుట- 9

30. నాట్యశాస్త్రము - శ్రీరామ అప్పారావు, పోణంగి, పుట - 200 & 201

31 నాట్యవేదము - మాధవరామశర్మ, జమ్మలమడక, పుట - 204

32. अग्नि पुराण का काव्य शास्त्रीय भाग- रामलाल वर्मा शास्त्री - अध्याय - 3 పుట - 37

33 అలంకారమహోదధి - నరేంద్ర ప్రభవసూరి, పుట - 59

34 अग्नि पुराण का काव्य शास्त्रीय भाग- गमलाल वर्मा शास्त्री - अध्याय - 3, పుట - 37

35 రసరత్న ప్రదీపికా - పుట - 24

36 to 38 భావప్రకాశనము - శారదా తనయుడు , పుట - 109, 110 & 125,126 & 130

39 Sringara Prakasa - Raghavan, vol -II పుట - 353

40 నాట్యశాస్త్రము - శ్రీరామ అప్పారావు, పోణంగి, పుట- -196

41. దశరూపకమ్ - ధనంజయః పుట- 182

42. ప్రతాపరుద్రీయమ్ - విద్యానాథః - , పుట 184,185

43 సాహిత్య దర్పణమ్ - విశ్వనాథః - , పుట - 145

44 నవరస గంగాధరము - మాధవరామశర్మ, జమ్మలమడక, పుట - 97

45 రసమంజరీ - భానుసూరి, టీకాకర్త - వేంకటరాయ శాస్త్రి వేదం, పుట - 130

46. రసార్ణవ సుధాకరః - సింహభూపాలః , పుట - 111

47. నాట్యశాస్త్రము - శ్రీరామ అప్పారావు, పోణంగి,

48 కావ్యప్రకాశః- మమ్మటః పుట - 140

49 రసార్ణవ సుధాకరః - సింహభుపాలః; పుట - 112

50to56. భావప్రకాశనము - శారదాతనయుడు , పుట - 169 to 178

57 సాహిత్య దర్పణమ్ - విశ్వ నాథః;

58 ప్రతాపరుద్రీయమ్ విద్యానాథః , పుట - 184

59 భావప్రకాశః - మమ్మటః; పుట - 10

60 వాగ్భటాలంకారః - వాగ్భటః , పుట - 116

61 సాహిత్య దర్పణమ్ - విశ్వనాథః; పుట - 68

62 ప్రతాపరుద్రీయమ్ - విద్యానాథః

63&64. సాహిత్య దర్పణమ్ - విశ్వనాథః

65 భావప్రకాశనము - శారదా తనయుడు , పుట - 198

66 కావ్యానుశాసనమ్ - హేమచంద్రః

67 భావప్రకాశనము - శారదాతనయుడు ; పుట - 200

68to71.రసమంజరీ - భానుసూరి; పుటలు - 108 నుండి 111

72. సాహిత్య దర్పణమ్ - విశ్వనాథః

73 భావప్రకాశనము - శారదాతనయుడు; పుట - 207

74to77 కావ్యాలంకార సంగ్రహము - సూర్యనారాయణ శాస్త్రి, సన్నిధానం పుట - 77 & 78

78 సాహిత్య దర్పణమ్ - విశ్వనాథః; పుట - 146

79 ప్రతాప రుద్రీయమ్ - విద్యానాథః , పుట - 86

80 సాహిత్య దర్పణమ్ - విశ్వనాథః

81to157 కావ్యాలంకార సంగ్రహము - సూర్యనారాయణశాస్త్రి, సన్నిధానం. పుటలు మొ -373

158 నాట్యశాస్త్రము - శ్రీరామ అప్పారావు, పోణంగి, పుట - 666

159to 162 - కామసూత్రం - వాత్స్యాయనః, పుట - 13 & 23 & 76 శ్లో- 111 & 112 & 46

163. Seven Psychologies - Edna Heid Breder. Page - 389

164 Normal And Abnormal Psychology - Nicole; Page - 51

165 Freud, His life and His mind - Puner ; Page - 94

166. Sigmund Freud life and work - Jones; Vol-III; Page - 316

167. కామసూత్రం - వాత్స్యాయనః; పుట - 76

168. సరస్వతీ కంఠాభరణం - భోజః ; Vol - V, పుట - 238

169to173 శృంగారప్రకాశః - భోజః, - (Raghavan), Vol -I Pages -354 & 452 & 461.

174. నాట్యశాస్త్రము - శ్రీరామ అప్పారావు, పోణంగి, పుట - 221

175 భావప్రకాశనము - శారదాతనయుడు, పుట - 143,144

176. వాగ్భటాలంకారః - వాగ్భటః-

177 & 178 శృంగార ప్రకాశః - భోజః (Raghavan) ; పుట - 470 & 444

179 నాట్యశాస్త్రము - శ్రీరామ అప్పారావు, పోణంగి; పుట - 203

180. కావ్యప్రకాశమ్ - మమ్మటః, పుట - 121

181 సాహిత్యదర్పణమ్ - విశ్వనాథః; పుట - 157

182. రసగంగాధరః - జగన్నాథః, పుట - 34

183. నవరసగంగాధరము - మాధవరామశర్మ, జమ్మలమడక, పుట - 102

184 ప్రతాప రుద్రీయమ్ - విద్యానాథః, పుట - 233
185 సాహిత్యశిల్పసమీక్ష - లక్ష్మీకాంతం, పింగళి, పుట - 155 నుండి 159
186 దశరూపకమ్ - ధనంజయః , పుట -282
187 సాహిత్యశిల్పసమీక్ష- లక్ష్మీకాంతం, పింగళి, పుట - 155 నుండి 159
188&189 భావప్రకాశనము - శారదాతనయుడు, పుట - 88,89 & 189
190 రసగంగాధరః - జగన్నాథః, పుట - 34
191. సాహిత్య దర్పణమ్ - విశ్వనాథః (చూ పుట -146 నుండి 156 వరకు)
192 ప్రతాపరుద్రీయమ్ - విద్యానాథః,
193 రసార్ణవ సుధాకరః - సింహ భూపాలః ; పుట - 253, 254
194 దశరూపకమ్ - ధనంజయః , పుట - 267,268
195 సాహిత్య దర్పణమ్ - విశ్వనాథః - పుట - 205
196 మనుస్మృతి - మనువు, అధ్యాయం - 3 , శ్లో - 77,78
197 శృంగారప్రకాశః - భోజః, (Raghavan) , పుట - 490
198 రసరత్నప్రదీపికా --
199 యాజ్ఞవ స్మార్త మన్త్రపాఠః - లక్ష్మీనృసింహశాస్త్రి, చల్లా , పుట - 290
200. ఈశోపనిషత్-
201. సరస్వతీ కంఠా భరణమ్ - భోజః
202. శృంగార ప్రకాశః - భోజః (Raghavan), పుట - 470 నుండి 477
203 యాజ్ఞవస్మార్తమంత్రపాఠః - లక్ష్మీనృసింహ శాస్త్రి, చల్లా, పుట - 286
204 ధ్వన్యాలోకనమ్ - ఆనందవర్ధనః-
205 సాహిత్యశిల్పసమీక్ష - లక్ష్మీకాంతం, పింగళి ; పుట - 167.
206 సాహిత్య దర్పణమ్ - విశ్వనాథః
207 కావ్యప్రకాశః - మమ్మటః , పుట - 141
208. రసగంగాధరః - జగన్నాథః , పుట - 99
209 ప్రతాపరుద్రీయమ్ - విద్యానాథః , పుట - 190
210. సాహిత్య శిల్ప సమీక్ష - లక్ష్మీకాంతం, పింగళి , పుట - 168,169
211 సాహిత్యదర్పణః - విశ్వనాథః
212. ప్రతాపరుద్రీయమ్ - విద్యానాథః
213 ధ్వన్యాలోకమ్ - ఆనందవర్ధనః -

# ఆంధ్ర ప్రబంధాలు
# అంగిరస నిర్ణయం - శృంగార పోషణం

'ప్రబంధం' అనే పేరు వినడంతోనే మనకు 16వ శతాబ్దం స్మరణకు వస్తుంది. ఆపదహారవ శతాబ్ది ఆంధ్ర సాహిత్యంలో స్వర్ణయుగం ఈ స్వర్ణయుగపు అధినేత సాహితీ సమరాంగణ సార్వభౌముడైన శ్రీకృష్ణదేవరాయలు ఈ రాజు స్వయంగా కవి కావడం, కవితా లోలుడవడం వల్ల సాహిత్యానికి ఆనాడు అత్యున్నత స్థానం లభించింది రాయలు కావ్యాలు స్వయంగా వ్రాశాడు అనేక కావ్యాల్ని అంకితంగా గ్రహించాడు ఆకాలంలో సర్వ సుభిక్షంగా ఉండి, రాజు విజేత అయి, ఎలాంటి ఒడి దొడుకులు లేని విజయనగర సామ్రాజ్యంలో కవితా లత రాయల ఆలంబనంచే చిగురించి, మొగ్గ దొడిగి, పుష్పించి ఫలవంతమైంది

ఈ కాలంనాటి కావ్యాలకు (ప్రబంధాలకు) మూలాధారాలు కొన్నిటికి ఈషణ్మాత్రంగా ఉన్నా, అసలు లేనివి, అధికంగా ఉన్నవి కూడా వెలిశాయి ఈ కాలంలో వచ్చిన గ్రందాలను ప్రబంధాలనీ, ఈ కాలాన్ని ప్రబంధయుగం అనీ సాహిత్య చరిత్రకారులు పిలుస్తున్నారు

ఈ కాలంలో వెలసిన ప్రబంధాలలో ప్రధాన రసమేదో నిర్ణయించి, శృంగారం పోషింపబడ్డ రీతిని విమర్శిస్తాను

ఆలంకారికులు కావ్యాలలో శృంగార, వీరాలనే ప్రధానంగా గ్రహించాలని చెప్పి ఉండడం వాటి ప్రాధాన్యాన్నిబట్టే గాక కవుల, సాహితీ ప్రియుల మనోభీష్టాన్ని కూడ వ్యంజింప చేస్తుంది ఇలా శృంగార వీరాలకు ప్రాధాన్యం ఇచ్చినా వీరంకన్నా శృంగారాన్నే కవులంతా తమ ప్రబంధాలలో ప్రధాన రసంగా స్వీకరించారు. ప్రబంధాలకు చెప్పబడ్డ లక్షణాలలో ముఖ్యమైంది కూడ అవి శృంగార రస ప్రధానాలై ఉండడం కాబట్టి ఈ శతాబ్దిలోని ప్రబంధాలందలి ప్రధాన రసం శృంగారం అని చెప్పకుండానే తెలుస్తుంది

ప్రబంధ కవులలో పెద్దన కవే అన్నింటా పెద్ద అయినా ఆ యుగంలో కవి పోషకుడు, రాజ్యాధినేత అయిన శ్రీకృష్ణదేవరాయల్ని మొదట గ్రహించడం న్యాయంగా ఉంటుంది ఆయన వ్రాసిన కావ్యాలలో మనకు లభించేది ఆముక్త మాల్యద ఒక్కటే.

. ఆముక్తమాల్యద:-

ఈ ప్రబంధంలో గోదా శ్రీరంగేశుల ప్రణయ వృత్తాంతం చివరి అయిదారు ఆశ్వాసాల్లోనే ఉంది. మిగిలిన మొదటి నాలుగాశ్వాసాలలో విష్ణుచిత్తుని కథ, ఖాండిక్యకేశి ధ్వజోపాఖ్యానం, యామునాచార్య చరిత్రాలు కలవు ఆరవ ఆశ్వాసారంభంలో మాలదాసరి కథ, గోదాదేవి కథలో ఆమె పూర్వ జన్మ గురించి చెప్పడానికి చేర్చబడింది ఇది కూడ విష్ణు పారమ్యాన్ని బోధించునట్టిదే స్థూలంగా చూస్తే ఈ ప్రబంధంలో వైష్ణవమత స్థాపనం, విష్ణుపారమ్యాన్ని బోధించే విషయాలే ఉన్నాయి ఒక విధంగా చూస్తే గోదాదేవి కథ కూడా విష్ణుపారమ్యాన్ని బోధించు నట్టిదే కదా! కాని అలాకాదు

ఈ కథలన్నీ విష్ణుపారమ్య బోధ ప్రధానంగా కలవే అయినా, విష్ణు చిత్తుని వృత్తాంతంచే ప్రారంభింపబడి, అతడు పరమ భాగవతోత్తముడుగా నిరూపింపబడి, భగవద్దత్త అయిన గోదాదేవిని ఆ భగవంతుడికే అర్పించడానికి విష్ణుచిత్తుడు తటస్థుడుగా ఈ గ్రంథంలో నిలిచాడు ఈ నియామకం కూడ బగవదిచ్ఛే ఆ భగవంతుడు తన ప్రణయ కార్యాన్ని లీలగా నెరవేర్చు కోవడానికి, అతని నాయకత్వ నిరూఢికై ఈ ప్రబంధంలోని మత, భక్తి సంబంధాలైన కథలన్నీ పరంపరగా కూర్చబడ్డాయి ఈ కథా పరంపర అంతా గోదా శ్రీరంగేశుల ప్రణయ, పరిణయాలకే దారి తీసింది భగవత్సంకల్పమూ అదే దాని వల్ల లోక కళ్యాణం జరుగుతుంది అందుకే కథాంతంలో, "

సహ్యకన్యాతటోద్యాన చందనద్రు
కుంజముల నీలకుంతల గుస్తరించి
కంతు సామ్రాజ్య మేలించి కరుణ జిత్త
మొలయ జగముల బాలించు చున్నవాడు"1

అని గోదా, శ్రీరంగేశుల ప్రణయ, పరిణయాలు లోకపాలనకే అని కవి వాచ్యం గానూ, ధ్వని పూర్వకంగానూ చెప్పాడు కాబట్టి ఇందలి ప్రధాన కథ గోదా శ్రీరంగేశుల ప్రణయమే అని మనం నిస్సంకోచంగా భావింపవచ్చు విష్ణు చిత్తుని వృత్తాంతం కూడా గోదాదేవి కథకు సంబంధించిందే కదా! తక్కిన కథలన్నీ ప్రాసంగికాలని చెప్పకుండానే తెలుస్తుంది

. అంగిరస నిర్ణయం:-

ఈ ప్రధాన ప్రాసంగిక ఇతివృత్తాల్ని ఆధారంగా చేసి కొని ఆముక్త మందలి ప్రధాన రసం ఏదో మనం నిరూపించ వలసి ఉంది ఈ ప్రధాన, ప్రాసంగిక ఇతి వృత్తాలలో రెండు భిన్న భావాలు, రసాలు మనకు గోచరిస్తాయి. బాగుగా తరచి చూస్తే ఆ భిన్నత్వంలోనే ఏకత్వం

మనకు గోచరిస్తుంది. ఈ పరిశీలనకు ముందు ఇతర పండితులు చెప్పిన విషయాల్ని పరామర్శిద్దాం.

ఆముక్త మాల్యదలో ప్రధానరసం ఏది? అనే ప్రశ్నకు శ్రీ వెల్దండ ప్రభాకరరావు గారి సమాధానం ఈ క్రింది విధంగా ఉంది

" ... ప్రధాన రసము భక్తి అంగి శృంగారము. విష్ణుచిత్తుని కథ ప్రధాన కథ. అతడు సంపూర్ణ భక్తి స్వరూపుడు ఆతని భక్తికే మెచ్చి శ్రీమన్నారాయణుడు కూతు నొసంగినాడు ఆమెను మరల శ్రీహరికే యర్పించి యల్లునిగా జేసుకొనియె ఆముక్తమాల్యద చరిత్రయే శృంగారరస పూరితమయినది. ప్రధాన రసము భక్తి అంగిరసము శృంగారము"2

దీంట్లో ప్రభాకరరావు గారు రెండు రసాల్ని ప్రతిపాదించారు ఆ రెండింటికీ ప్రాధాన్యం ఇవ్వగోరి 'ప్రధానరసం' అని ఒక దానికి 'అంగిరసం' అని మరొక దానికి పేరు పెట్టారు వారు శృంగార, భక్తులకు సమప్రాధాన్యం ఇవ్వడం తప్పు ఆముక్త మందలి ప్రధాన రసాన్ని నిరూపించినట్లు దీని వల్ల స్పష్టం కావడం లేదు ప్రధానం, అంగి అనే రెండు పదాల్ని వేరు వేరు అర్థాలలో వాడి ఉన్నారా? అలాగైతే ఆయా అర్థాలలో ఆయా రసాల్ని వివరించి స్థాయి భావాలతో సహా నిరూపించాల్సి ఉండెను కాని అలాకాక కావ్యమందు అంతటా కనిపించే భక్తి భావం వారికి ప్రధాన రసంగా తోచింది అలాగైతే భక్తే అంగిరసం అంటే సరిపోయేది శృంగారం అంగి అనడంలోని అంతరార్థం ఏమి? అంగిరసం అన్నా, ప్రధాన రసం అన్నా ఒకటే గదా! అట్లే భావించిన భక్తి, శృంగారాలు ఒకటేనా? ఒకటి ప్రధాన రసం, ఇంకొకటి అంగిరసం అనడంలో తికమక ఉంది.

ప్రధానంగా కనిపించే భక్తి భావాన్ని శృంగారాంతర్యామిగానే మనం భావించ వలసి ఉంది శృంగారం మధురమైన రసం ఆమధురత్వం కలిగిన భావాలలో భక్తి ఒకటి కాబట్టి భక్తికి కూడా ఇందు శృంగారమే గమ్యస్థానమైంది ఆలంకారికులంతా తొమ్మిది (నవ) రసాల్నే అంగీకరించారు కదా! ఈ భక్తి భావం, విష్ణు పారమ్యాన్ని బోధించడానికే, భాగవతోత్తములలో నిరూపింపబడి నాయక ఉత్కర్షకు దోహద పడుతుంది అంతే దాని పని గాని అదే ప్రధాన రసం కాదు శృంగారమే ప్రధాన రసమూ అంగిరసమూ శ్రీ ప్రభాకరరావు గారే" . ఇదియే గ్రంథములోని కెల్లను శృంగార రస ప్రధాన ఘట్టము కాని ఈ శృంగార మనురాగ పూరితమైన భక్తి ఇదియే పరమ పవిత్రము "3 అని చెప్పారు దీన్ని బట్టి 'అనురాగ పూరితమైన భక్తే శృంగారం' అని తేలింది కదా! దీని వల్ల కూడ భక్తి ఇందలి ప్రధాన రసంకాదనీ, అంగిరసమైన శృంగారానికి అంగ భూతమైన భావమనీ అభివ్యక్తమౌతుంది

ఇలా ఉండగా శ్రీ మేదేపల్లి వేంకట రమణాచార్యుల వారు వావిళ్ళ వారు ప్రచురించిన 'ఆముక్త మాల్యద' ఉపోద్ఘాతంలో అందలి అంగిరసాన్ని గూర్చి ఇలా వక్కాణించారు "

. . అంగముగా నాయాయి ప్రకరణముల యందు శృంగారాది రసములను ప్రవిష్టములయి యున్నను దీనిలో బ్రధాన రసము భక్తిరూపాపన్నమైన శాంత రసము"4 అని సిద్ధాంతీకరించారు

వీరి ప్రకారం భక్తితో కూడిన శాంతం అంగిరసం శృంగారాదులు అంగరసాలు శాంతం అంగి అయితే దానికి స్థాయిశమం విష్ణు చిత్తుడూ శమ ప్రధానుడే. శమ ప్రధానుడైన విష్ణుచిత్తునకు వాదంలో గెలిచిన తర్వాత ధనం అంతా భక్తులకు ధారవోసి అతడు దరిద్రుడౌతాడని విశ్వకర్మతో అతని భవనాన్ని మణిమయంగా, సకల సామగ్రీ సంపూర్ణంగా చేయుమని ఆజ్ఞ ఇవ్వడంలో గల ప్రయోజనం ఏంటి? శమ ప్రధానుడైన విష్ణుచిత్తుని జీవితానికి ఆసంపద అవసరమా? ఒకవేళ విష్ణుచిత్తుని చరిత్రాన్నే ప్రధానంగా గ్రహిస్తే 5,6 ఆశ్వాసాలలో గల గోదా శ్రీరంగేశ్వరుల ప్రణయ వృత్తాంతాన్ని కవి చిత్రించాల్సిన పనేమి? అంతేకాదు శ్రీ ఆచార్యుల వారు 'భక్తి రూపాపన్నమైన శాంత రసము' అని చెప్పారు కదా? భక్తి రూపాపన్నంగాని శాంతరసం కూడ మరొకటి ఉండాలి లేకుంటే అలా చెప్పి ప్రయోజనం ఏమి? ఇట'భక్తి రూపాపన్నమైన శాంతరసము' ప్రధాన రసం అని చెప్పినా, ఆచార్యుల వారే స్థలాంతరంలో " . . . ఈ ప్రబంధములో బ్రధాన ప్రతిపాద్యము గోదా విష్ణు చిత్తులకథ" అని చెబుతూనే " . దీనిలో నంగముగా శృంగారాది రసములను ప్రవిష్టములయియున్నను ప్రధాన రసము శాంత రసాంతర్భూత భక్తిరసము"5 అని చెప్పారు

దీన్ని బట్టి శృంగారాన్ని అంగస్థాయికి నెట్టి ప్రధాన రస నిరూపణంలో వీరూ తికమక బడ్డట్టు స్పష్టమౌతుంది ఇంతకు ముందు ప్రధాన రసం 'భక్తి రూపాపన్న మైన శాంతరసము' అని ఇపుడు 'శాంత రసాంతర్భూత భక్తి రసము' అంటున్నారు శాంతం, భక్తి రెండూ భిన్న రసాలుగా భావిస్తే ఒకదానిలో మరొకటి అంతర్భూత మవడం అసంభవం ఒకసారి శాంతం ప్రధాన రసమనీ, ఇంకొక మారు భక్తి ప్రధాన రసమనీ వారి సిద్ధాంతాన్ని వారే ఖండించుకొని బంగ్యంతరంగా ' .. ఈ ప్రబంధంలో ప్రధాన ప్రతి పాద్యం గోదా విష్ణుచిత్తుల కథ' అని చెప్పి ఆముక్త మాల్యదలోని ప్రధాన రసం శృంగారమే అని వారు పరోక్షంగా చెప్పినట్లు మనం నిర్ధారించుకోవచ్చు

ఈ విషయాలు ఇలా ఉండగా, శ్రీ శిష్టాలక్ష్మీకాంతశాస్త్రిగారు మరొక నూత్న సిద్ధాంతాన్ని ప్రతి పాదించి ఉన్నారు అదేమన "చివరి రెండా శ్వాసములందు భక్తి సంయుతంబగు శృంగారము వర్ణింపబడినది కావున అందలి రసము మధుర భక్తి "6

వీరు ఆముక్తమాల్యద గ్రంథం మొత్తాన్ని గ్రహించక చివరి రెండా శ్వాసాలలో గల రసాన్ని గూర్చి మాత్రమే వివరించారు అదీ భక్తి సంయుతం అయిన శృంగారం కాబట్టి మధుర భక్తి అట భక్తి సంయుతం అయిన శృంగారమైతే భక్తి శృంగారం అనో, శృంగారభక్తి అనో చెబితే బాగుండేది. మధుర భక్తి అనే దాంట్లో 'మధురం' అనే పదం విశేషణం, గుణ

వాచకం కదా! మధురమైన భక్తి అని విగ్రహం. భక్తి రసమే కాదని పెక్కురు ఆలంకారికులు భావిస్తుండగా 'మధురభక్తి' అని భక్తికి ఒక విశేషణాన్ని చేర్చి నూత్నరసంగా ప్రతిపాదించడంలో ప్రయోజనం ఏమిటి? దానికి స్థాయి మొదలైన బావాల్ని నిరూపించాల్సి ఉంది అలాగాక వారు 'మధుర' అనే పదాన్ని శృంగారానికి పర్యాయంగా వాడి ఉన్నారా? శృంగారం మధురమైన రసం కదా మరి! అప్పుడు అది 'శృంగార భక్తి' అని తేలుతుంది కాని ఎంత విచారించినా ఇందు భక్తికి ప్రాధాన్యం ఇవ్వడం తక్క వేరే ఏమీకనిపించదు భక్తికే ప్రాధాన్యం ఇవ్వదలచి నపుడు 'చివరి రెండా శ్వాసాలందు' అని ప్రత్యేకంగా చెప్పాల్సిన అవసరం ఏముంది? 'ఆముక్తములోని రసం భక్తి' అంటే సరిపోయేది ఈ రెండా శ్వాసాలలో అయినా భక్తితో కూడిన శృంగారమే కలదు శృంగారంతో కూడిన భక్తిలేదు ఇక్కడ భక్తి అంగం శృంగారం అంగి అంగ భూతమైన భక్తి శృంగారానికి మరింత వన్నె తెస్తుంది మధురత్వాన్ని కలిగిస్తుంది కాబట్టి ఇందలి రసం శృంగారం అనడమే యుక్తం 'మధురం' అనే విశేషణాన్ని చేర్చదలిస్తే 'మధుర శృంగారం' అనడం యుక్తి యుక్తంగా ఉంటుంది కాబట్టి ఇందలి ప్రధాన రసం 'మధురభక్తి' కాదనీ, రసరాజమైన శృంగారమే అనీ నిశ్శంకంగా చెప్పవచ్చును అంతేగాక శ్రీ తుమ్మపూడి కోటేశ్వరరావు గారు తమ 'ఆముక్తమాల్యదా సౌందర్యము'లో ఆముక్తంలోని అంగిరసం శృంగారం అని నిర్ణయించి, 'మధురభక్తి' అనే వాదాన్ని ఖండించారు వారి అభిప్రాయం ఇలా ఉంది

కావ్యమునకు ఫలముగా కవి శృంగారమును నిరూపించెను నాయకుడు సంస్కృత నాటకాదులందు కొన్నిటివలె దానికోసమై యత్నించినట్లు వాచ్యముగా లేదు కాని విష్ణు చిత్తునకు మణిమయ గృహాదుల ననుగ్రహించుటలో స్వామికి గోదయందున్న రతి భావము వ్యంగ్యమగుచున్నది ఈతని యందు నాయికకు రతి కల్గుటకు కవి ముందటి కథలు వ్రాసెను ఆతని నిత్య వ్యవసాయము లోకపాలన యందలి ఉత్సాహము నిత్యోద్యోగితను వ్యక్తీ కరించు కథలవి ఆలంబన విభావమైన భగవంతుని యొక్క జ్ఞాన శక్తి బలాదులు దయా స్వభావము, దీన జనసముద్ధరణము కవి వర్ణించెను ఈ కథా వర్ణన మంతయు గోదాదేవికి స్వామియందు రతి భావము కల్గించుటలో పర్యవసించుచున్నది[7]

శ్రీ కోటేశ్వరరావు గారు ఆముక్త మాల్యదలో అంగిరసం శృంగారం, అంగరసం వీరం అని నిర్ణయించారు విష్ణుచిత్తుని కథలో దయావీరం, యామునా చార్యుని కథలో ధర్మవీరం, మాలదాసరి కథలో దానవీరం కలదని సోపపత్తికంగా నిరూపించి, ఈ వీరం శృంగారంలో పర్యవసించిందని శ్రీరావు గారు చెప్పి వున్నారు ఇది యదార్థం

ఇందు 'మధురభక్తి' కలదనే వారికి శ్రీరావు గారు సమాధానమిస్తూ, అబినవ భారతి (6వ అధ్యా)ని, పండితరాయల (ర గం 1ఆ) ను ఉటంకిస్తూ, " .... ఇట్టు రసాలంకారులు భక్తిని రసముగా పరిగణింపలేదు రాయలు వీరినే యనుసరించెను ఒక వేళ రూప గోస్వామి,

మధుసూదన సరస్వతులు రాయలకు పూర్వులై రాయల నాటికా సిద్ధాంతము బాగుగా వ్రేళ్ళూదన్ని బలుపొంది యున్నచో కొంత విచారణీయాంశమై యుండెడిదేమో! . "8

".... మధుర భక్తి పరకీయలగు వారికి నున్నది గోదాదేవి స్వకీయ మధురభక్తి యందు వైవాహిక మంగళము లుండవు. ఇందున్నవి కదా! ఇందుచే నిందలి రసము భరతముని నిరూపించిన శృంగారమే" 9

ఈ చర్చవల్ల ఆముక్తమాల్యదలోని అంగిరసం శాంతం, భక్తి, మధురభక్తి అని చెప్పే పండితుల వాదాన్ని పూర్వపక్షం చేసి, ఇందలి ప్రధాన రసం లేదా అంగి రసం శృంగారం అని నిర్ణయించాను శృంగారమే ఇందలి ప్రధాన రసమని నిర్ణయించడానికి శ్రీ కోటేశ్వరరావు గారి అభిప్రాయం ప్రధానాధారంగా ఉన్నా మరి కొన్ని ఆధారాలను ఇక్కడ పొందు పరచడం నా వాదానికి బలకరంగా ఉంటుంది

ఆముక్తమాల్యద పీఠికలో
" ఎన్నిను గూర్తునన్న విను మేమును దాల్చిన మాల్యమిచ్చున
ప్పున్నది రంగ మందయిన పెండిలి సెప్పుము - "10

అని భగవంతుడు రాయలకు స్వప్నంలో చెప్పిన మాటల వల్ల 'గోదా శ్రీరంగేశుల ప్రణయ కథను చెప్పుము' అని స్వామి అడిగాడు రాయలు కూడ ప్రధాన ఇతివృత్తంగా దాన్నే గ్రహించాడు తక్కిన కథలు (యామునాదులవి) ప్రసంగ వశాన చెప్పబడ్డవి కాబట్టి అవి ప్రాసంగికాలు ఆనుషంగికాలు ఇందలి ప్రధాన కథ 'గోదా శ్రీరంగేశుల వివాహం' కాబట్టి ప్రధానేతివృత్తాన్ని బట్టి ఇందలి ప్రధానరసం శృంగారమే

కావ్యారంభ పద్యం కూడా ఇందలి ప్రధాన వస్తువును ధ్వనిస్తుంది

"శ్రీ కమనీయ హారమణి జెన్నుగ దానును గౌస్తుభంబునం
దాకమలా వధూటియునుదారతదోప బరస్పరాత్మలం
దాకలితంబులైన తమ యాకృతులచ్చుత బైకి దోపన
స్తోకతనందు దోచెనన శోభిలు వేంకట భర్త గొల్చెదన్"11

ఈ పద్యంలో శ్రీమహావిష్ణువు, లక్ష్మి ఒకరిని ఒకరు వక్షస్థలంలోని నాయక రత్నాలందు ప్రతిఫలించినట్లు వర్ణించడంచే వక్ష్యమాణమైన గోదా శ్రీరంగేశుల పరిణయ సముచిత పరస్పర అభిముఖావస్థితి వ్యంగ్యంగా తోస్తుంది దీన్ని బట్టి కూడా ఆముక్త మందలి ప్రధాన ఇతి వృత్తం, ప్రధాన రసం వ్యంజిత మౌతున్నాయి

ఈ గ్రంథనామం గూర్చి ఇంచుక విచారిద్దాం -- దీనిని 'విష్ణుచిత్తీయం' అనే నామాంతరం గల 'ఆముక్తమాల్యద' అని వ్యవహరిస్తారు అంటే దీనికి విష్ణుచిత్తీయం,

ఆముక్తమాల్యద అనె రెండు పేర్లు వ్యవహారంలో ఉన్నాయి ఆముక్తమాల్యద అంటే ఏమిటి? ఆముక్త = ధరించి (తీసిన) విడిచిన, మాల్య = దండను, ద = ఇచ్చేది తాను ధరించిన దండను తీసి ఇచ్చేది అని భావం ఈ ఆముక్త మాల్యద ఎవరు? గోదాదేవి ఈ గోదాదేవి తాను ధరించి విడిచిన దండను ఎవరికి ఇచ్చింది? శ్రీ రంగేశునకు ఇలా ఇవ్వడంలో భక్తి ప్రణయం రెండూ ఉన్నాయి దీంట్లో ప్రణయమే ప్రధానమైంది ఆముక్తమాల్యద అనే పేరు నాయిక ప్రాధాన్యాన్ని తెలుపుతుంది. నాయికా ప్రాధాన్యాన్ని తెలిపే ఈ పేరు ప్రబంధంలోని శృంగార ప్రాధాన్యాన్ని కూడ వ్యంజింపజేస్తుంది

విష్ణు చిత్తీయం అంటే విష్ణువు చిత్తానికి సంబంధించింది (అనగా గోదాదేవి వరమైంది అతని చిత్తం) అనే అర్థం చెప్పుకొన్నా ఇందలి శృంగార ప్రాధాన్యం వ్యక్తమౌతుంది ఈ అర్థమే అన్వర్థమైతే 'ఆముక్తమాల్యద' అనేది నాయికా ప్రాధాన్యాన్ని, 'విష్ణుచిత్తీయం' అనేది నాయక ప్రాధాన్యాన్ని తెలుపుతూ ఇందలి ప్రధాన రసం శృంగారం అనే ఆ రెండు పేర్లూ చాటి చెబుతున్నాయి అలాగాక, 'విష్ణుచిత్తీయం' అనే గ్రంథ నామానికి విష్ణుచిత్తునకు సంబంధించిన కథ అనే సాధారణార్థం చెప్పుకొన్నా పరంపరగా విష్ణుచిత్తుని కూతురు భగవద్దత్తయైన గోదాదేవి ప్రణయ కథలో విష్ణుచిత్తుని వృత్తాంతం పర్యవసిస్తుంది విష్ణుచిత్తుడు లేనిదే గోదాదేవి లేదు ఆమె లేనిదే 'ఆముక్తమాల్యద' లేదు భగవంతుడు తన ప్రణయ లీల కొరకే విష్ణుచిత్తునకు తనపై భక్తి కలిగించి, అతనికి అయోనిజ అయిన కూతుర్ని ప్రసాదించి, ఆమెపై ప్రేమచే విష్ణువు నాటకం ఆడి చివరకు ఆమెను పరిణయమాడాడు కాబట్టి ఇందలి ఏపేరైనా గోదా శ్రీరంగేశుల ప్రణయ వృత్తాంతాన్ని తెలుపుతూ శృంగార రస ప్రధానతను వ్యంజింపజేస్తుంది

గోదా శ్రీరంగేశుల ప్రణయ కథకు పూర్వం గల మత, దైవభక్తి సంబంధాలైన కథలన్నీ వారి ప్రణయానికి పోషకాలుగా ఉండడమే గాక, ఇందలి విశిష్టాద్వైత స్థాపన --భగవంతునకు (శ్రీరంగేశునకు), భక్తురాలు (గోదాదేవి) తనను సమర్పించు కోవడం అనే విషయాన్ని తెలుపుతూ దివ్యాదివ్య (దేవమనుష్య) శృంగారాన్ని వ్యక్తం చేస్తుంది. 'ఎన్నిను- ', అనే పద్యంలో కవే స్వయంగా అంగి రసాన్ని గూర్చి సూచించాడు

పైన చర్చించిన విషయాలు ఆధారంగా 'ఆముక్తమాల్యద' లోని ప్రధాన లేదా అంగిరసం శృంగారం అని తేలింది వస్తు దృష్టితో చూస్తే ఇందు వస్త్వైక్యం లెదనె చెప్పాల్సి ఉంటుంది కాని పరంపరగా నాయకుడి మహత్వాన్ని అధికం చేసే లేదా వ్యక్తపరచే విష్ణుచిత్తుని చరిత్రం, స్వామి గొప్పతనాన్ని నిరూపించే యామునాది భక్తుల చరిత్రలు నాయకుని గుణోత్కర్షకు దోహదపడ్డవని చెప్పుకొంటే వస్త్వైక్యం కలదని చెప్పుకోవచ్చును రస దృష్టితో చూస్తే దీంట్లో శృంగార పోషకాలుగానే ప్రాసంగిక వృత్తాలన్నీ, ప్రధాన ఇతివృత్తం అయిన గోదా శ్రీరంగేశుల ప్రణయ కథకు తోడ్పడ్డాయని చెప్పుకోవచ్చు

## 2. శృంగార రస పోషణ:-

ఇక ఈ ప్రబంధంలో శృంగార రసం ఎలా పోషింపబడిందో పరిశీలిద్దాం

రసోత్పత్తిని గూర్చి ప్రామాణికమైన సూత్రాన్ని భరతాచార్యులు చెప్పారు శృంగార రస ఉత్పత్తికి కూడ ఆ సూత్రాన్నే అన్వయించుకోవాలి

"విభావానుబావ వ్యభిచారి సంయోగాద్రస నిష్పత్తిః"12 విబావం, అనుభావం , వ్యభిచారి భావం అనే వాటి సంయోగం వల్ల రస నిష్పత్తి జరుగుతుంది అంటే విభావాది భావాలు ఏ గ్రందంలో చక్కగా, పోషింపబడతాయో ఆ గ్రంధంలో రసం చక్కగా పోషింప బడ్డట్టు ఆముక్తమాల్యదలో ఈ విభావాదులు ఎలా పోషింప బడ్డాయో వాని మేళనం వల్ల శృంగారం ఎలా పోషింపబడి రసస్థితి పొందిందో చూద్దాం

### a) విభావానుశీలనం:-

**1.** ఆలంబన విభావాలు:- ఆముక్తమాల్యద లోని నాయకుడు శ్రీ మహావిష్ణువు ఆయన్ని అనుసరించే ప్రధాన, ప్రాసంగిక వృత్తాలన్నీ ఉన్నాయి ఆలంకారికులు గుణస్వభావాల్ని బట్టి (కావ్య) నాయకులను నాలుగు విధాలుగా విభజించారు వారు ధీరోదాత్తుడు, ధీరోద్ధతుడు, ధీరలలితుడు, ధీరశాంతుడు అనేవారు ఈ చతుర్విధ నాయకులలో శ్రీమహావిష్ణువు ఏనాయకుడు? ఉద్ధతుడు అసలేకాడు ఆస్వభావం అతనిలో లేదు లలితత్వం అతనిలో ఉంది కాని లోకపాలనాదక్షుడుగ, కరుణోద్వేలుడుగ, భక్తవత్సలుడుగ చిత్రింపబడ్డ శ్రీమహావిష్ణువు కేవల ధీరలలితుడనడం సమంజసం గాదు ఇక శాంతత్వం అతనిలో ఉంది నివృత్తి మార్గాన భక్తులతన్ని పొందుతారు కావున అతడు ధీరశాంతుడు అనవచ్చు కాని ఈ కావ్యంలో స్వామి నివృత్తి ముఖుడుగ చిత్రింప బడలేదు అంతే గాక భగవంతుని నివృత్తి ముఖాన్ని శ్రీవైష్ణవం అంగీకరించదు జగద్రక్షకుడైన శ్రీమహావిష్ణువు ప్రవృత్తి మార్గాన్నే ఈ కావ్యంలో చిత్రింప బడ్డాడు కావున అతడు ధీరశాంతుడు అనే నాయకుడు అనడానికి వీల్లేదు ఇక అతడు ధీరోదాత్తుడు అని అంగీకరించడమే ఉత్తమం ధీరోదాత్తునిలో ఉండాల్సిన లక్షణాలన్నీ మన నాయకునిలో ఉన్నాయి సాధారణంగా ధీరోదాత్తుడు వీరరసంలో నాయకుడుగా ఉంటాడు వీర రసానికి స్థాయి ఉత్సాహం స్వామిలో ఆ ఉత్సాహం అమితంగా ఉంది భక్తవాత్సల్యం, కరుణోద్వేలత, ఆర్తరక్షణ మొదలగు లక్షణాలన్నీ అతనిలో 'దయావీరం'లో ఉన్నాయి ధర్మసంస్థాపకుడగు శ్రీమహావిష్ణువు (ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే) ధర్మ వీరుడని వేరుగా చెప్పాల్సిన పని లేదు విష్ణుచిత్తుడికి అమిత సంపదల్ని ఇచ్చిన దాన వీరుడు శ్రీమహావిష్ణువు ధీరోదాత్తుడైన శ్రీమహా విష్ణువు నాయకత్వాన్ని బట్టి ఇందలి అంగిరసం వీరం కావలె కదా! కాని అలాకాదు వీరుడంటే

లోకోత్తర క్రియాచణుడు లోకంలో ఏ స్త్రీ అయినా వీరున్నే ప్రేమిస్తుంది కామిస్తుంది. అందువల్ల వీరం శృంగార పార్యంతికం ఆముక్తంలో స్వామి ఉత్సాహం అంతా గోదాదేవిని తన దానినిగా చేసు కోవడంలోనె సార్ధకత పొందింది అతని వీరత్వం ధీరోదాత్తత శృంగార పోషకమే గాని భంజకంకాదు అందువల్ల పూర్వోత్తర విరోధం లేకుండ అంగి శృంగారం అనీ, అంగం వీరం అనీ సమన్వయించుకోవచ్చును

ఇందు నాయకుని వీరత్వం వల్ల ధర్మబద్ధంగా శృంగారం నిర్వహింపబడింది అభినవ భారతి కూడా, "తత్ర కామస్య సకల జాతి సులభతయాzత్యంత పరిచితత్వేన సర్వాన్ ప్రతిహత్యేతి (హృద్యతేతి) పూర్వం శృంగారః - తతః కామార్ధయోః ధర్మమూలత్వాద్వీరః సహిధర్మ ప్రధానః'13 అని చెప్పాడు వీరం వల్ల ధర్మబద్ధంగా కామార్ధ సాధన జరుగుతుంది కాబట్టి వీరం ధర్మబద్ధమైన శృంగారంలో పర్యవసిస్తుందనడంలో విప్రతిపత్తి ఉండబోదు

ఇందలి నాయిక గోదాదేవి లక్ష్మీవతి అయిన వారికి ఉజ్జ్వల వేషాదులన్నీ సహజంగానే ఉన్నాయి శృంగారానికి అవి అవసరం నాయిక ఉజ్జ్వల వేష కావడానికి విష్ణుచిత్తునికి స్వామి సకల వైభవాల్ని ప్రసాదించాడు " - ఏతదీయ నిలయమప్పురిన్ మణిమయంబు సార్ధము జేయు - "14 ఇత్యాది పద్యంలో విరక్తచిత్తుడైన విష్ణుచిత్తునకు సంపద నివ్వడం నాయిక అయిన గోదాదేవికి భోగ వస్తువులుగా పర్యవసించడానికె పంచమాశ్వాసంలో మళ్ళీ ఈ విషయాన్నె కవి "తమ తండ్రి శ్రీశదత్తశ్రీలు గృహమున త్రవ్వి తండములయ్యె - "15 అనె పద్యంలో ధృవపరిచాడు శృంగారం ఉత్తమ యువ ప్రకృతికం గదా! నిత్య యౌవనుడైన స్వామి యువకత్వం గూర్చి చెప్పాల్సిన అవసరంలేదు నాయికకు యౌవనం ఆవిర్భవించి దానితో గూడ భక్తి భావ పురస్సర శృంగారం ఆవిర్భవించింది నాయికా నాయకులైన ఈ యువతీ యువకులు ఇద్దరూ ఉత్తములే అనగా దివ్య రక్త స్పందనం కలవారే నాయికకు ఉండవలసిన సామగ్రి అంతా గోదాదేవికి భగవద్దత్తంగా లభించింది చక్కని ఇల్లు అలంకరణాదులకు కావలసిన ధనం విష్ణుచిత్తుని నుండి ఆమెకు సంక్రమించాయి చెలికత్తెలు ఆమెకు జన్మతో వచ్చిన వారె వున్నారు ఇలా అన్ని హంగులూ కలిగిన గోదాదేవి శృంగారరస సర్వస్వంగా భాసిస్తుంది అందువల్ల పరస్పర ఆలంబనాలైన నాయికా నాయకులు ఆముక్తమాల్యదలో చక్కగా దిద్దితీర్చబడ్డారు శృంగారోత్పత్తికి ఆలంబనంగా గోదా శ్రీరంగేశులు నాయికా నాయకులుగా తగి ఉన్నారు విభావాలలో ఆలంబన విభావాలే 'రతి' ఉద్భవానికి మొదటి కారణం కదా!

**2. ఉద్దీపన విభావాలు:-**

ఆముక్తం లో ఉద్దీపన విభావాలు చక్కగా సమకూర్చబడ్డాయి ఆలంబన గుణాలలో నాయికా నాయకుల రూప యౌవనాదుల వర్ణన ఉంటుంది నాయకుడైన శ్రీ మహావిష్ణువు

యొక్క రూప యౌవనాది గుణాలను ప్రత్యేకంగా వివరించాల్సిన పనిలేదు. విష్ణుచిత్తుడు దశావతార ప్రశంస చేసిన పద్యాలలోను, తదితర చోట్ల లోని ప్రశంసలలోను నాయకుని గుణాలు వ్యక్తపరచ బడ్డాయి పంచమాశ్వాసంలో నాయిక యొక్క రూప యౌవన వర్ణనలు కలవు.

" హేమాబ్జాంగ విభాధరారుణిమ వక్త్రేందు ప్రభాశ్రీలద
ద్వామారత్నము వొందదయ్యె మును దత్త ద్వర్ణయుక్తాఖ్యలన్
శ్యామాత్వంబళి గర్వధూర్వహకచచ్ఛాయాచ్చటంగాంచెనో
గామున్నుర్వి 'శిరఃప్రధాన' మనువాక్యం బెమ్మెయిందప్పునే"16.

ఆకన్యక (గోదాదేవి) శరీరం బంగారు వన్నె కలిగి ఉన్న దానివల్లగాని, అధరోష్ఠం ఎఱ్ఱగా ఉన్న దానివల్ల గాని, నెమ్మోము చందురుని వన్నె కలిగి ఉన్న దానివల్ల గాని, తత్తద్వర్ణాను సరణంగా హేమాంగి, బింబోష్ఠి, చంద్రముఖి అనే నామాలు వహింపక తేటులతో దీటగు నల్లని తలవెంట్రుకల కాంతికి అనుగుణంగా 'శ్యామ' అనే నామం వహించింది శ్యామ అనగా యౌవన మధ్యస్థురాలనీ, సర్వ శరీర మందు శిరమే ప్రధాన మవడం చేత నాశిరః కాంతే ప్రదానంగా ఆపేరు వచ్చిందని బావం

దీంట్లో నాయిక యొక్క రూప యౌవనాదులు చక్కగా వర్ణించబడ్డాయి దీని తర్వాత అనేక పద్యాలలో నాయిక యొక్క రూపయౌవనాలు వర్ణించబడ్డాయి ఈ ఆలంబన గుణాలు నాయికా నాయకులిద్దరకూ పరస్పర ఉద్దీపనాలుగా ఉన్నాయి గోదాదేవి రూపం శ్రీమహావిష్ణువునకు ప్రబలమైన ఉద్దీపనం కలిగించింది వసంత ఋతు వర్ణనం తటస్థమైన ఉద్దీపనంగా ఈ కావ్యంలో అతి రమ్యంగా తీర్చి దిద్దబడింది స్వామి అలంకారాలు, గోదాదేవి అలంకారాలూ పరస్పర ఉద్దీపనాలె గోదాదెవి రూపం స్వామికి ప్రబలమైన ఉద్దీపనం అనడానికి ఈ క్రింది పద్యమె ప్రత్యక్ష తార్కాణం

"దీని చూపెదురెక్కగానె కాసి రిపట్టికనిబోర బిరుదు టెక్కెంబు గలిగె
దీనికౌ నల్లాడ గానెకా గర్వించియుర్వి జైత్రునకు గాలాద గలిగె
దీని పాలిండ్లుబ్బుగానెకా రతి చెతికన్నెర మ్రోతకు వన్నె గలిగె
దీని మోమొప్పారగానె కావాణిరాయంచలేమకు గులాయంబు గలిగె
దీని పెన్నెఱులే పారగానెకాప్రపోషితమయూరికి విరాళి పొందు గలిగె
దీని యడుగులు రంజిల్లగానె కా పిపాస బదుతెటులకు మెట్ట పంటగలిగె "17

సకల సీమంతినీ సీమంత ముక్తామణి అయిన ఆముకమాల్యద రూపు. లేత

ఒక్క వసంత ఋతువే దేవికి ఉద్దీపనం అనడం కాదు. సకల కాలాలు ప్రాతర్మధ్యాహ్న సాయంనిశలన్నీ ఆమెకు ఉద్దీపన సామగ్రే నాయికకు గాని, నాయకునికి గాని వలపు తలకెక్కితే వారిదృష్టి పథంలో పడ్డ వస్తువులు, భావాలు, ఆలోచనలు అన్నీ వారికి ఉద్దీపనాలు గానే ఉంటాయి వారి ప్రియుని, లేదా ప్రియురాలి నామం ఇతరులు ఉచ్చరించినా, వారి గురించి ఏ విషయమైనా మాట్లాడినా, వారి వస్తువేది కనిపించినా, వారి రూప సామ్యం కలవి కన్పించినా వారి మనస్సులకు ఉత్తేజాన్ని, ఉద్దీపనాన్ని కలిగిస్తాయి వాళ్ళు ఉన్నస్థలం, ఆడిన మాట, చూసిన చూపు, చేసిన చేష్ట ఒక్కటేమిటి? ప్రతి ఒక్కటీ నాయికా నాయకులకు పరస్పర ఉద్దీపనాలు గానే ఉంటాయి

**b) అనుభావాలోకనం:-**

"అయ్యెందు వదన ధరాంగన కావున బ్రాహ్మెత్రి బొరుగుల భాగవతుల
గృహము లందు మరాళికైకావళీహరిణీ మనోజ్ఞాస్రగ్విణీ సమాఖ్య
లమర జనించి వయస్యలై నాగకన్యలు పుత్రికా వివాహముల యందు
బాడు పద్మాలయా పరిణయామేయగేయముల ననంత కళ్యాణ గుణము
లద్భుతంబొప్ప వినివిని యతని గవయుబుద్ధి ప్రాగ్జన్మ సంస్కారమున జనింప
దదవతారానుమేయ కథాసుధానుకలిత లీలానుకృతుల వర్తిలుచునుండి"18

ఈ పద్యంలో వయస్యలైన 'నాగకన్యలు పుత్రికా వివాహాలలో పాడే పద్మాలయా పరిణయామేయ గేయాల్ని అనంత కళ్యాణ గుణాలు అద్భుతం బొప్ప వినివిని అతని కవయు బుద్ధి కలిగిందట దీంట్లో 'భావం' అనే అంగజమైన అనుభావం ఉంది "బావయతిరిరంసామితి భావః"19 (రమించు కోర్కెను తెలిపేది భావం) దీన్నే సాహిత్య దర్పణకారుడు 'నిర్వికారాత్మకే చిత్తే భావః ప్రథమ విక్రియా20" (నిర్వికారాత్మ అయిన చిత్తంలో మొట్టమొదట కలిగిన వికారమే భావం) అన్నాడు ప్రాగ్జన్మ సంస్కారం వల్ల కలిగిన ఈ బావం తోడనే ఆమెకు అతని కవయుబుద్ధి వ్యక్తమై ఉండడంచే ఈ పద్యంలోనే హావం, హేల అనే అనుభావాలు కలవని చెప్పవచ్చును ఈ పద్యంలోని చివరి రెండు పాదాలలో

"తదవతారాను మేయ కథాసుధాను
కలిత లీలానుకృతులు వర్తిలుచునుండి' అనే దాంట్లో
'లీల' యే స్వబావజం అయిన 'లీల' అనే అనుభావం

గోదాదేవి సౌందర్యం, యౌవనాన్ని వర్ణించిన పద్యాలలో శోభ, కాంతి - అనే అనుబావాలున్నాయి

'పద్మాస్య ప్రతి దిన ప్రత్యూషమును ..' అనే పద్యంలోని గీత పద్యంలో

"వర్షసీలేశ పూర్ణ సౌభాగ్యదాంగ
'ధూతి చక చక లీరెండ తోడ మాఱు
మలయనిదు వెంద్రుకల గుంపు మలచివైచి
వేగ వెడవెడ దడియొత్తి విధి యుత ముగ "21

'విచ్ఛిత్తి' అనే అనుభావం వ్యక్తీకరింప బడిందని శ్రీ టి కోటేశ్వరరావు గారు తెలిపారు

ఈ క్రింది పద్యంలో కొన్ని సాత్త్వికి భావాలు, ఇతర అనుభావాలు చోటు చేసుకొన్నాయి

"నఖ ముఖోజ్జ్వత వరాబ్జముఖ ముక్త బాష్పాంబుపటిమ దీపపు జిటచిటలు తెలువ
పొరిను పాంశూత్సృష్ట పూత్కృతుల్కృశమధ్యపార్శ్వముమః ప్రకంపములు తెలువ
నొదవెడు గాద్గద్య మదరి పాటున బల్కరింప బుట్టెడు కేకరింత తెలువ
వలవంత విసువు కాంతల పుట్టు దూషించు కారణంబుల తొంటి కదలు తెలువ
నలత బానువుపై బొరలాట తెలువదెగువ లోలోననే నవ్వు నగవు తెలువ
గలక మామిడి పనిలేని కసరు తెలువబొలతి రేలు నీయున్కియే వులుగుగాదె"22

దీనిలో అశ్రువు, వైస్వర్యం, హసితం అనే భావాలు చక్కగా కూర్చ బడ్డాయి "శ్రీపతి మీది గీతముల .. మ్రొన్నుడున్ "23 ఇందు వైస్వర్యం, స్వేదాలు ఉన్నాయి "వాలిక కన్నులం.. .. .. "24 అనే దానిలో రోమాంచం, 5-71 వచనంలో చెలికత్తెల మాటలకు గోదాదేవి "కించి దవనతాననయై నెమ్మొగంబు వెలవెలపాటు లేనగవున నడంచి"25 అనే వాక్యంలో వైవర్ణ్యం కలవు

"తనకు నందఱు గూర్చు బృందావనమున
నొకతె రతి దేల్చి కాక నొండొకతె బ్రేల్చి
యంత రాధకు మేలు వాడై మురారి
యెల్ల సతులకు నెదనుదు కేయిడండె"26

అని 'త్రపా' భరంతో నర్మగర్భంగా హరిని దెప్పి పొడిచింది ఇందు 'బిబ్బోకం' అనే భావం ఉంది

"కుముద సరస్తటస్ఫటిక .. "27లో 'అశ్రువు' అనే సాత్త్విక భావం ఉంది

ఈ విధంగా అనేక అనుభావాలు అక్కడక్కడ పొందు పరచ బడ్డాయి స్థాలీ పులాక న్యాయంగా కొన్ని భావాలు మాత్రమే ఉదాహరణార్థం విశ్లేషించి చూపబడ్డాయి ఇవి రసపోషణలో మిక్కిలి ఉపయుక్తాలౌతాయి

ఒ. సంచారీ సమాలోచనం :-

విభావాను భావాల తర్వాత రసోత్పత్తికి మిక్కిలి ఉపకరించే భావాలు సంచారి భావాలు వీటినే వ్యభిచారి భావాలని వ్యవహరిస్తారు

పూర్వోక్త " నఖముఖోజ్ఝిత ___" అనే పద్యంలో నిర్వేదం, విషాదం, చపలత, ఆలస్యం మొదలగు సంచారులున్నాయి.

"ఎఱుగరుగా యొకద్భుతము - - "28 ఇత్యాది పద్యంలో నాయిక యొక్క తీవ్రమైన తాపం వ్యక్తపరచ బడింది ఇది 'ఆర్తి' అనే సంచారీ భావం

5వ ఆశ్వాసంలో 40వ పద్యం మొదల్కొని 50వ పద్యం వరకు చెప్పి తర్వాత వచనంలో " అని యిట్లు త్రపాభరంబున నుపాలంభ దంభంబుగా జేయు పునః పునస్స్మరణంబున "29 అనే దాంట్లో చెప్పిన దాన్ని బట్టి ఇందు త్రప, స్మృతి, శ్రమం - అనే సంచారులున్నాయి

"వాలిక కన్నులంబొడము వారి సకజ్జల మాశ్రిత శ్రవో
గోళకమై తదింతకవు గుంతల వల్లికి దల్లి దోడుగా
మైల వలిన్న నల్నిగుడుమై బులకల్పొడమన్ శ్లథాంగియై
సోలిన జూచి దెందములు సుఱ్ఱన పోయని బోటులర్మిలిన్"30

ఈ పద్యంలో ముదం (హర్షం), మోహాలు చక్కగా వ్యంజితాలైనవి చెలుల ఉపచారాలచే గోదాదేవి,

"తెలిసి కనుదెఱచి వెండియు
జలజేక్షణ తన్ముకుంద చరణస్మృతి ని
శ్చలతగను మొగిచి. - - "31 ఈ పద్యంలో బోధం, స్మృతి - అనే వ్యభిచారులు,

"అట్టి మురారి కప్పుడనుగ్రె మఱి యీ కలి వేళ గ్రమ్మఱం
బుట్టి వియోగ వేదనల బొక్కెడు నీతను వేల తండ్రితా
నిట్టగు నన్ను నింకొకని కియ్యక తొల్తన యోగ శక్తిబో
బొట్టెద - - - - - "32

"అదియొండె భక్తి యెవ్వతె - - "33 అనే రెండు పద్యాలలో అంతం (మరణం) అనే సంచారి,

"ప్రతి దివము నిట్టు చని య
చ్యుతపూజ యొనర్చి వచ్చు సుదతి వియోగ
చ్యుత ధైర్య యగుచు నయ్యదు
వతి గుణములు ద్రవిడ భాష బాడుచు నుండున్"34ఈ పద్యంలో ధృతి అనే సంచారి,

"కామిని మేఘరంజి మధుగర్వ _ "35 ఇత్యాది పద్యంలో 'మోహం' అనే సంచారి భావమూ ఉన్నాయి.

"పూజా దంభమున న్పురాకు . "36 అనే పద్యంలో త్రప (లజ్జ), అసహత (అసూయ) అనే సంచారు లున్నాయి "భ్రమర గీతిక మాయ వివంచి ..."37 అనే దానిలో ఉన్మాదం, "వెలదికతి తావదంబయ్యె విరులపాన్పు..."38 అనే దానిలో వ్యాధి అనే సంచారీ భావమూ ఉన్నాయి

ఈ విధంగా సంచారీ భావాలనేకం ఆముక్తమాల్యద లో చోటు చేసుకొన్నాయి

పైన చెప్పిన క్రమంలో ఆముక్తమాల్యద యందు విభావాను భావ వ్యభిచారుల సంయోగం చక్కగా విర్పడి శృంగార రసాన్ని చక్కగా ఉత్పత్తి చేసాయి ఈ భావాలన్నీ పాఠకుని హృదయంలో వాసనా రూపంలో ఉన్న 'రతి'ని భోధ మొనర్చి శృంగార రసాన్ని అనుభవింప జేస్తున్నాయి ఈ బావాలన్నీ ఇందు చక్కగా పోషింప బడడం చే రాయలు శృంగార రసాన్ని చక్కగా పోషించారని చెప్పవచ్చు

### 3. విప్రలంబ వివేచన:-

ఆముక్తమాల్యద లో శృంగారం పుష్టిమంతమై ఉంది ఈ పుష్టి ఎలా సంభవించింది? "నవినా విప్రలంభేన శృంగారః పుష్టిమశ్నుతే"39 అనే ఆలంకారిక వాక్యానుసారం గోదాదేవి విరహమే ఇక్కడ శృంగారానికి పుష్టిని ఇచ్చింది ఇక్కడ విరహం నాయికా నాయకు లిద్దరకు వర్ణించకపోవడానికి కారణం ప్రకృతి భేదమే ఆయన దివ్య ప్రకృతి ఈమెమానవ ప్రకృతి

మానవునికి విరహాదులు దానిలో కలిగే చిత్త వికారాలు, భావాలు సహజం మానవ కన్యగా అవతరించిన గోదాదేవిని పరిగ్రహించడానికి ఉత్సుకుడైన జగద్రక్షకునికి విరహాన్ని అంట గట్టితే కట్టవచ్చుగాని అది ఆయన మహాసత్త్వానికి భంజకం సర్వ ప్రకృతీ అతనిలోనే ఇమిడి ఉంది. సర్వాత్మకుడు, సర్వవ్యాపకుడైన లోకేశ్వరుని యందు విరహాన్ని వాచ్యంగా వర్ణించాల్సిన పని లేదు అతని కామె ప్రియమైనదనే విషయాన్ని స్వామే విష్ణుచిత్తునికి చెప్పాడు స్వామి విరహం ఆయన గోదాదేవిని పరిణయమాడడానికి పడే ఆత్రంలోనే ధ్వనితమౌతుంది కాబట్టి గోదాదేవికి విరహం కలిగితే స్వామికీ కలిగినట్లే అని మనం భావించ వచ్చు ఇది వ్యక్తం అది అవ్యక్తం అంతే

అసలు గోదాదేవికి వలపు, విరహాలు ఎలా కలిగాయో అవి ఎలా ఫలవంతాలై నాయికా నాయకుల కలయికకు దోహద పడ్డాయో ఆలోచించాల్సి ఉంది.

గోదాదేవికి స్వామి యొక్క అనంత కళ్యాణ గుణాలను వినడం (వినుకలి) వల్లనే వలపు కలిగిందని, 'అయ్యేందు వదన ధరాంగన కావున ... " అనే పద్యంలో . . . . . . పుత్రికా వివాహముల యందు

బాడు పద్మాలయా పరిణయామేయ గే
యముల ననంత కళ్యాణ గుణము
లద్భుతం బొప్ప విని విని యతని గవయు

బుద్ధి ప్రాగ్జన్మ సంస్కారమున జనింప. . ."40 అని చెప్పబడి ఉంది. ఇందు వినుకలి ప్రథమ కారణంగా పూర్వజన్మ వాసనాబలం ద్వితీయ కారణంగా చెప్పబడింది ఈ రెండింటిలో ప్రాగ్జన్మ సంస్కారమే గొప్పది. దాని వల్లనే గోదాదేవికి వలపు తనతో బాటే పుట్టింది లేకుంటే ఆమె 'ఆముక్త మాల్యద' అవడం ఎలా! వలపు కలగడానికి 'వినుకలి' బాహ్య కారణం అయింది అంతః కారణం పూర్వజన్మ వాసనా బలమే 'వినుకలి' ప్రాగ్జన్మ సంస్కారాన్ని ప్రేరేపించి, ఆమెలో వలపు రేపింది. ఆమె యౌవనం ముదురుతున్న కొద్దీ వలపు ముదిరి స్వామి సంయోగం కలగక పోవడంచే విరహం ఆరంభమైంది.విష్ణుచిత్తుడు శృంగార భావ మర్మజ్ఞులైతే ఆమె భావం తెలుతనే పసిగట్టి వారిని కూర్చినచో విరహానికి ఆస్కారం లేక పోయేది ఆమె విరహాన్ని అతడు తపస్సుగా భావించాడు భక్తిభావ శబలితమైన అతని హృదయంలో ఈ భావం కలగడం యుక్తియుక్తం గానే ఉంది అదితపస్సు అనుకోవడం ఉచితంగానే ఉంది ఆమె విరహంచే తపిస్తుంది. అతడు ఆమె భక్తితో తపిస్తుందనుకొన్నాడు అందుకే స్వామికి తెలిపాడు

సర్వం స్వామికే సమర్పణం చేసుకొన్న విష్ణుచిత్తుడికి తన కూతురు, అది కూడా భగవద్దత్తమైన దాని తపం గురించి స్వయంగా ఆలోచించాల్సిన పని ఏముంది? అదీ స్వామికే నివేదించాడు గోదాదేవి చెలికత్తెలు చేసిన పని మాత్రం ఏమి? వారికి ఆమె విరహబాధ పొందుతుందని తెలుసు ఆమెతో మేలములాడారు ఆమె దేహత్యాగ పర్యంతమైన విరహతాపాన్ని పరిమార్చ లేక స్వామినే సేవించమని ప్రోత్సహించారు చెలికత్తెలు చేసిందీ, విష్ణుచిత్తుడు చేసిందీ ఒకటి కాదా! విష్ణుచిత్తుడు ఛాందసుడనీ, అతని *ఛాందసమే గోదాదేవి విరహానికి కారణం అనీ కొందరు పండితులు భావించారు కాని నాకు అలా తోచ లేదు అతడు ఛాందసుడైతే గోదాదేవి చెలికత్తెలు మరి? వారికి విషయం తెలుసు కదా! వారు కూడా ఆమెను స్వామిని ఆశ్రయించమని చెప్పడం ఎందుకు? విష్ణుచిత్తుడు గాని, ఆమె చెలికత్తెలు గాని మానవ మాత్రులు,గోదాదేవి భూదేవి అవతారమైనా ప్రస్తుతం మానవ మాత్రయే ఆమెకు చెప్పిన పాటి స్వామికి చెప్పడం సాధ్యం కాదు ఆ స్వామికి తెలీదని పేరు

చెప్పడమా? అన్నీ ఆయనకు తెలుసు మానవ చాపలత్వంచే మాత్రమే ఆపని చేయవలసి ఉంటుంది. అందుకే విష్ణుచిత్తుడు తన తండ్రి కావున, తన బాధ్యత నెరవేర్చుకొనడానికై అమాయక ధోరణిలో స్వామికి విన్నవించాడు అతని మనోవ్యాకులత, ఆర్తి తీర్చవలసిన ఆవశ్యకత స్వామికి ఉంది అందుకే ఉన్న విషయాన్ని స్వామికి నివేదించాడు చెలికత్తెలు స్వామిని ఆశ్రయించుమని గోదాదేవికి చెప్పారు వీరి పని ఏతన్మాత్రమే

గోదాదేవికి స్వామిని చేపట్టాలి అనే బుద్ధి ప్రాగ్జన్మ సంస్కారం వల్ల కలిగింది కాబట్టి ఆమె ప్రణయం బలవత్తరమైంది ఆమె వయస్సు, భావాలతో విరహవేదన అధికమైంది దానికి కాలం కూడా తోడైంది ఆమె విరహాగ్నికి వసంతాజ్యం పోయబడింది ఈ విరహాన్నే విప్రలంభం అంటారు అది నాలుగు రకాలు కదా! ఈ నాలుగింటిలో అభిలాష (పూర్వరాగ) విప్రలంభం తక్క తక్కిన మూడూ సంయోగానంతర విప్రలంభాలే అభిలాష విప్రలంభంలో బాహ తీవ్రత ఉండగా, తక్కిన వాటిలో ఆలోచనా తీవ్రత ఉంటుంది అభిలాష విప్రలంభంలో చిత్ర విచిత్రాలైన ఊహలకు స్థానం ఉంటుంది శారీరక కలయిక కంటే ఆత్మల కలయికకు ఇందు ప్రాధాన్యం అధికంగా ఉంటుంది

గోదాదేవి విప్రలంభం అభిలాష విప్రలంభం అని నిష్కర్షగా, నిశ్శంకంగా చెప్పవచ్చు ఈ అభిలాష విప్రలంభం దశ విధ మన్మథావస్థలతో గూడి అతి రమ్యంగా ఉంటుంది ఈ విరహాన్ని ఎంత చక్కగా పోషిస్తే శృంగారం అంత పుష్టిమంతం అవుతుంది ఈ అభిలాష విప్రలంభం అంకుర, పల్లవ, కోరక, పుష్ప, ఫలాత్మకం అయిన అయిదు అవస్థల్ని పొందుతుంది ఈ పంచావస్థాత్మకమైన విప్రలంభమే దశావస్థల్ని పొందుతుంది ఈ దశావస్థల పోషణని బట్టి అభిలాష విప్రలంభం పోషింపబడ్డ తీరు సువ్యక్తమౌతుంది

**a) దశవిధ మన్మథావస్థలు:-**

నాయికా నాయకులు ఒకర్ని ఒకరు చూడగానే 'చక్షుః ప్రీతి' అనే మొదటి అవస్థ కలుగుతుంది ఇలా ప్రత్యక్షంగా దర్శించడమే కాక ఒకర్ని గూర్చి ఒకరు వినడం వల్ల (వినుకలి) చిత్రంలో చూడడం (కనుకలి) వల్ల కూడా రతి కలుగుతుంది 'శ్రవణాద్దర్శనాద్వాzపి' అనే దాన్ని అనుసరించి 'వినుకలి' గూడ చక్షుః ప్రీతే (దీన్ని 'చక్షుఃప్రీతి' అనడం కంటే 'శ్రవణ ప్రీతి' అనవచ్చు) ఏవిధంగా అయినా అంటే చూడడంవల్ల గానీ, వినడంవల్ల గానీ మనస్సులో (అతని లేదా ఆమె) రూపం బడదాన్ని 'చక్షుః ప్రీతి' అనే మొదటి అవస్థ అని చెప్పవచ్చు

ఆముక్తమాల్యద లో గోదాదేవికి స్వామి యొక్క 'అనంత కళ్యాణ గుణములద్భుతం బొప్ప వినివిని యతని గవయు బుద్ధి' జనించింది ఇక్కడ 'వినుకలి' వల్ల మొదటి అవస్థ కలిగి, వెంటనే మనస్సు అతనిపైబడి కవయు బుద్ధి కలిగింది కాబట్టి ఇది 'మనస్సంగం' అనే రెండవ అవస్థ

"మోపాడిన హరిచందము
లేపాడిగ దలవవచ్చు...."41 అనే పద్యం మొదల్కొని అతని సంగమ చింత ఆమెలో వ్యక్తమౌతుంది. కాబట్టి ఇది 'సంకల్పం' అనే మూడవ అవస్థ ఇది ముదిరిన తర్వాత,

"ఎలసి యేప్రొద్దు గనువొందనీక మరుదు
కలహమున 'కంకకాడయి కాలుద్రవ్వ
బాందు బహుళక్షపా పరంపరలు వెడల
కింటిలో నేదుముల్లయ్యో నిందు ముఖికి"42.

గోదాదేవి సంగమ చింత అధికం అయి మన్మధుడు నిద్ర పట్టనీయక పోవడం వల్ల ఆమెకు 'జాగరం' అనే చతుర్థ అవస్థ ప్రాప్తించింది

నిద్ర లేమి, మనస్తాపం మున్నగు కారణాల వల్ల ఆమె కృశించ సాగింది ఈ 'కృశత' అనే పంచమావస్థను రాయలు ఈ క్రింది పద్యంలో హృద్యంగా చిత్రించాడు

" అనినస్రుగ్వీణి వల్కొదన్ను జెలులారా నే లతాడోలజి
క్కన నూపందెగి వ్రాలదీని చనువ్రేకంబేక్రియందాల్తునో
యని పట్టం దిన మధ్య మార్కురుచి ఖిద్యన్మంజరుల్వోనివా
దిన పాలిండ్లను బెండు బొమ్మగతి నుండెన్సందిటంజాల్కనై"43

ఆముక్తమాల్యద ". . . సకల కాలంబుల నారటంబునకు నూఱట గానకుండియు నప్పుండరీకాక్షి యందుండు నప్పుండరీకాక్షు నారాధనంబున నారాధారమణుం గ్రమ్మఱ బెంద డెందంబునం దలంచి"44

"పద్మాస్య ప్రతిదిన ప్రత్యూషమును .. విధియుతముగా "45 శ్రీహరిని పూజించి పొందడానికి హ్రీత్యాగం చేసి సిద్ధమైంది కాబట్టి ఇది హ్రీత్యాగం అనే సప్తమావస్థ

అలా లజ్జత్యాగం చేసి స్వామిని పూజించి,
"భ్రమర గీతిక మాయ విపంచి మీట
దాన శ్రుతి గూడి మిగుల దద్రక్తి హెచ్చ
వేనివారించి లేచి దైవికము నెదుట
యుక్తులు ఫలింప వనుచుబిట్టార్చి నవ్వు"46
గోదాదేవి తాపాన్ని తట్టుకోలేక ఉన్మాదినివలె నవ్వినట్లు కవి చిత్రించాడు ఇదే 'ఉన్మాదం' అనే అష్టమావస్థ

"వాలిక కన్నులం బోడము -- "47

"కామిని మేఘరంజి -- " 48 అనే రెండు పద్యాలలో రెండు మార్లు 'మూర్ఛ' అనే నవమావస్థ వర్ణించ బడింది.

"అట్టి మురారి కప్పుడనుగ్రైమఱి --- " 49
"అదియొండె భక్తి యెవ్వతె ---- "50

అనే రెండు పద్యాలలో మరణ యత్నం చిత్రించ బడింది కాబట్టి ఇది 'అంతం' అనే పదవ మన్మథావస్థ ఈ విధంగా దశవిధమన్మథావస్థలతో అభిలాష విప్రలంభం అతి మనోహరంగా పోషింపబడింది.

గోదాదేవికి పూర్వజన్మ వాసనా బలం వల్ల పుట్టుక తోడనే స్వామి యందు భక్తి పూర్వకమైన ప్రేమ కలదు ఆమె ప్రేమ ఆమె యౌవనంతో విజృంభించి విరహంతో ఆమెను తల్లడిల్ల జేసింది ఆ విరహంతో ఆమె స్వామి యొక్క వ్యాజనింద మొదలుపెట్టి అనుక్షణం అతన్ని స్మరించ దొడగింది ఆమె చెలికత్తెలు దాన్ని గ్రహించి, ఆమెకు పూర్వజన్మ జ్ఞానాన్ని కలిగించారు ఆమెకు విరహం అగ్గలమైంది తనువు త్యజించి అయినా స్వామిని చేరుతానని నిశ్చయ మతికాగా ఆమె చెలికత్తెలు వారించి 'హరిని భజింపుము' అని చెప్పారు హరిని భజించిన కొద్దీ విరహం అధికం కాజొచ్చింది ఆమె ఉన్మాదావస్థకు చేరుకొంది ఆస్థితి విష్ణుచిత్తునికి అవగతం కాలేదు స్వామికి ఆ విషయాన్ని నివేదించి పరిహారం కోరగా ఆయన, "వరాహావతారమున భూదేవి మదీయ పూజోచితో పచారంబుల విశేష ఫలంబుగా నంబయని వైష్ణవియుందానె గాన తదాకలన కుతూహలంబునం గూతురై నీకొదవి విప్రలంబ దంబే రితాగాద గాథార్థ సమేత గీత రసంబునం బ్రొద్దు వుచ్చుట గాని వేరొండు గాదని "51 చెప్పి, శ్రీరంగానికి శ్రీరంగని సేవించడానికి తోడుకొని పొమ్మని చెప్పాడు

ఇలా శ్రీవిష్ణువే ఆమెను స్వయంగా పిలిపించు కోవడంవల్ల ఆమె విరహంతో అతడూ వేగుతున్నాడని మనం ఊహించవచ్చు అంతేకాదు. తనవద్దకి తీసికొని వచ్చిన గోదాదేవి యొక్క రూపం, లేత వయస్సులను సాభిప్రాయంగా చూసి ఉవ్విళ్ళూరాడట దీన్ని బట్టి అయినా ఆయనకు ఆమెపై గల ప్రేమను మనం తెలుసుకోవచ్చు అంత మాత్రంతో ఆగక తమకాన్ని ఆపలేని స్వామి ఆమెను తన అంతః పురానికి తిరస్కరణీ విద్యచే ఇతరులకు తెలియకుండా చేర్చుకొని మాయా కన్యను అక్కడ ఉంచాడట. స్వామికి తమకం ఏమిటి? ఆమెను మాయచే అంతః పురమున చేర్చడం ఏమిటి? ఇది స్వామి యొక్క మహాసత్త్వానికి భంజకం కాదా? కాదు స్వామి భూదేవి యందు మాత్రమే తమకం కలిగి ఉన్నాడు మర్త్యాకృతిలో ఉన్న నాయికపై ప్రేమ, తమకాలచే మళ్ళీ మళ్ళీ చూడడం, స్మరించడంతో 'భ్రమరకీట న్యాయము'న స్వామికీ మానవత్వం ఏర్పడింది అప్పుడు ఆయనకు వలపు

పెరిగి, విరహం అధికమై, తట్టుకో లేని తమకంలో ఆమెను తన అంతఃపురానికి చేర్చాడు నాయికా నాయకు లిద్దరూ పరస్పరం అనురక్తులవడంచే అందునూ వాళ్ళు పరస్పర సంగమాన్ని కోరుచుండడంచే నాయకుడు అలా చేయడం దోషం కాదు. అందునా శ్రీ విష్ణువు శృంగార అధిదైవతం గదా! విష్ణుచిత్తుడు తాత్కాలికంగా బాధపడకుండే విధంగా మాయాకన్యను అచట ఉంచడం భక్త వాత్సల్యానికి తార్కాణ అంతే కాదు ఒక విధంగా ఈ పథకం అంతా తన వివాహానికి ఒక పెద్ద ప్రణాళిక తమ ప్రణయ భావాన్ని లోక కళ్యాణానికై స్థిరం చేసి, వివాహం అనే వ్యవస్థలో విలీనం చేయడానికి ఇది ఉపకరించింది

స్వామిపై భక్తి విశ్వాసాలు గల విష్ణు చిత్తుడు తీర్థ ప్రసాదాల్ని స్వీకరించి, నిజకన్య అని భావించి, మాయాకన్యను వల్లకిలో ఎక్కించుకొని ఇంటికేగాడు ఈ విష్ణుచిత్తుని భ్రమ, 'మానవుడు ఈ మాయా సంసారాన్ని నిత్యమైందని భ్రమించి అందు తలమున్కలౌతున్నాడు' అనే విషయాన్ని ధ్వనింప జేస్తుంది ఆ వల్లకీ తెరతీసి చూడగా కూతురు కనిపించక పోవడం వల్ల దుఃఖితుడై 'బ్రాహ్మణుడైన తనను రంగ భర్త మోసం చేసాడ'ని స్నేహితులతో చెప్పుకొన్నాడు సాంసారిక బాధల్ని అనుభవించే సామాన్యుడు పొందే దుఃఖాన్నే ఇక్కడ విష్ణుచిత్తుడు పొందాడు

విష్ణుచిత్తుడు భక్తుడు కాబట్టి అతనిపై వాత్సల్యం కలిగిన శ్రీహరి అతని మనఃక్షోబాన్ని సహింప జాలడు ఏ భక్తునికి సంక్షోభం కలిగినా భక్తపరాధీనుడైన ఆహరి సహించలేడు గదా! ఒక్కోసారి భక్తులకు భగవంతుడు భయపడాల్సి వస్తుంది కూడా అపుడు స్వామి అతడి వద్దకు రాక తప్పదు క్షుభితుడైన విష్ణుచిత్తుని మాటలు విని స్వామి అతిలౌక్యంగా 'ముదిమదితప్పి మాట లాడెదవేల? మీపిల్ల మీ ఇంట్లోనే ఉంది సరిగ్గా చూసి లెనప్పుడు అనుము మేము ఒప్పుకొంటాం వృధాగామమ్ము దూరెదవు ఏల? అని సమాధానం ఇచ్చాడు పరమేశ్వరునకు అసాధ్యం ఏముంది? ఇలా చెప్పడంలో తాను నిర్దోషిని అని నిరూపించు కొన్నాడు అంతేగాక తన మహాసత్త్వాన్ని గూడ నిలబెట్టు కొన్నట్లు మరోసారి వ్యక్తం చేసి తర్వాత గంభీరంగా ప్రవర్తించాడు

"ఎంతే వేడుక యైన పెండ్లగుటకీనే - " అని విష్ణుచిత్తునిచే స్వయంగా అనిపించడానికే స్వామి ఈ ఎత్తు ఎత్తినట్లు కనిపిస్తుంది ఇది ఆయన 'ధీరోదాత్తత'ను కూడా చాటుతుంది

ఆతర్వాత స్వామే స్వయంగా 'బ్రహ్మరుద్రులను, బ్రాహ్మిని గౌరిని దనకునక్కన్య నడిగింప' పంపాడు వాళ్ళా విషయాన్ని తెలుపగానే విష్ణుచిత్తుడు మహాలౌక్యంగా ఇలా అన్నాడు

"వినుడీదగు సంబంధపు
టెనయికగని యెంచి తెచ్చి యిచ్చెనసరెచు

ల్కా నినరులు గాన మావుర
మునకు న్విజయంబు సేయ బుత్రిక నిత్తున్"52

ఆ తర్వాత బ్రహ్మాదులు ఈ విషయాన్ని ఆయనకు తెలుపగా ఆయన ఒక రాకుమారుడు పెండ్లికి తరలి వచ్చి, ఒక రాకుమార్తెను పెండ్లాడిన విధంగా గోదాదేవిని పెండ్లాడాడు దీంతో వారి వియోగానికి వియోగం ఏర్పడి, సంభోగానికి సంయోగం (సమ్యక్‌యోగం) ఏర్పడింది

గోదా శ్రీరంగేశుల ప్రణయం సువ్యక్తమైందే కాని వారి విరహంలో మాత్రం ఒక రామణీయకత ఉంది గోదాదేవి విరహం వాచ్యంగా వర్ణించబడగా, స్వామి విరహం వ్యంగ్యంగా నిర్వహింప బడింది గోదాదేవి తన సన్నిధానానికి రాగానే స్వామి కూడా బయట పడ్డాడు అంతదాకా భక్తియుతంగా ఉన్న ప్రణయం నూటికి నూరు పాళ్ళు శృంగారంగా వికసించింది దివ్య మానవ శృంగారంలో విరహాన్ని ఔచిత్య వంతంగా నిర్వహించి రాయలు శృంగారానికి పుష్టి చేకూర్చాడు ప్రణయ భావం భావం గానే మిగిలిపోక వివాహం అనే వ్యవస్థలోకి పరిణమించి, అది చిర, స్థిర, స్థానాన్ని సంపాదించుకొంది గోదాదేవి స్వామికై ఏర్పరచిన మాలను తాను ధరించి, తన సౌందర్యాన్ని చూసుకొని మురిసి, మళ్ళీ స్వామికై తీసి ఉంచడంలోనూ, విష్ణుచిత్తుడు భయపడి స్వామికి నివేదించగా ఆయనకు అదే మిక్కిలి ఇష్టం అని చెప్పడంలోనూ గోదా శ్రీరంగేశుల ప్రణయం పరాకాష్ఠకు చేరుకొంది

## 4. సంభోగ సమ్యక్పోషణ:-

ఈ కావ్యంలో శృంగార పోషణలో విరహాన్ని అధికంగా నూత్న రీతిలో చిత్రించి, కావ్యాంత పద్యం ఒక్క దానిలో వారి సంభోగాన్ని సూచించి, అదిలోక కళ్యాణ హేతువని సూచించడంలో ఎంతో ఔచిత్యం ఉంది సంభోగాన్ని అతివేలంగా వర్ణిస్తే రసపుష్టి ఉండదు శృంగారాన్ని, అందులో సంభోగ శృంగారాన్ని ధ్వనింప చేయడంలోనే మధురత్వం ఉంది ఒకే ఒక్క పద్యంలో దానిని ధ్వనింపజేసి రాయలు సంభోగ శృంగారాన్ని కూడా చక్కగా పోషించాడు.

"సహ్యకన్యా తటోద్యాన చందనద్రు
కుంజముల నీలకుంతల గుస్తరించి
కంతు సామ్రాజ్యమేలించి కరుణ చిత్త
మెలయ జగముల బాలించు చున్నవాడు"53

## 5. రస నిర్వహణలో రమ్యమైన పోకడలు:-

శ్రీకృష్ణదేవరాయలు తన ఆముక్తమాల్యద లో శృంగార రసాన్ని నిర్వహించడంలో అనేకమైన నూత్న పోకడలు పోయారు వాన్ని సంక్షిప్తంగా ఇలా వివరింపవచ్చు

1. శృంగార నిర్వహణలో మానవ, దివ్యుల్ని నాయికా నాయకులుగా స్వీకరించడం, వారి ప్రణయానికి కారణం 'ప్రాగ్జన్మ సంస్కారం' అని చెప్పడం

2. గోదాదేవి విరహాన్ని వినూత్న రీతిలో తీర్చిదిద్దడం, ఆమెకు ఉద్దీపనంగా కాలాన్ని, సర్వ ప్రకృతిని స్వీకరించడం.

3. విరహంలో గతానుగతికంగా చేయబడుతున్న చంద్రాది ఉపాలంభనాలను పరిత్యజించి, నాయకుని వ్యాజనింద చేయడం

4. నాయకుని విరహాన్ని వాచ్యంగా వర్ణింపక ధ్వనింప జేయడం, రానురాను దివ్యత్వం నుండి మర్త్యకన్యాకర్షణచే నాయకుడు మర్త్యత్వాన్ని బొందడం

5. నాయకుడే స్వయంగా తన కళ్యాణానికి ప్రణాళిక వేయడం

6. వీరాన్ని ప్రధానాంగంగా గ్రహించి, భక్తిని మేళవించి, శృంగారానికి లౌకిక దోషం అంటకుండే విధంగా నిర్వహించడం.

7. మధురమైన శృంగారం ద్వారా తాత్త్వికోపదేశం (విశిష్టాద్వైతం) చేయడం.

8 సంభోగ శృంగారాన్ని వాచ్యంగా వర్ణించక ధ్వనింప చేయడం

ఇత్యాది నూత్న అంశాలతో రాయలు తన ప్రబంధంలో శృంగార రసాన్ని చక్కగా నిర్వహించాడు

2. మనుచరిత్ర:-

"పెద్దన వలె గృతి సెప్పిన
బెద్దన వలె నల్పకవిని బెద్దన వలెనా!
యెద్దన వలె మొద్దన వలె
గ్రద్దన వలె గుందవరపు గవి చౌడప్పా!"54.

అన్నింటిలో అగ్రతాంబూలం అందిన పెద్దనను మించిన పెద్దకవి ప్రబంధ యుగం లోనే లేడంటే అతిశయోక్తి కాదు! ప్రబంధ రచన, అందులోనూ స్వతంత్ర కావ్యరచన ఆంధ్రకవితా పితామహ అల్లసాని వారి చేతనే ప్రారంభమైంది చతుర వచోనిధి అయిన పెద్దన విచిత్రమైన ఘట్టాల్ని తన కవితా రచనకు స్వీకరించి శృంగారంలో వింతైన ప్రయోగాలు చేసి సాహిత్య ప్రియులచే 'సెబాస్' అనిపించు కొన్నాడు. సాహితీ సమరాంగణ సార్వభౌముడైన కృష్ణదేవరాయలచే గండపెండేరాది అనేక ఘన సన్మానాలను పొందిన పెద్దన కవివర్యుడు శిరీషపేశల సుధామయోక్తులతోకైశికీ వృత్తిలో సుకుమార సుందర మధుర

రసాన్ని చిప్పిలజేసి మను చరిత్ర మహాప్రబంధాన్ని ఏనిర్మించి తర్వాత ప్రబంధ కవులకు మార్గదర్శకుడయ్యాడు తన 'స్వారోచిషమను సంభవ' ప్రబంధ నిర్మాణంచే నాటినుండి నేటిదాకా పండిత ప్రకాండుల హృదయాలకు మేధస్సులకు చక్కని పని కల్పించాడు

ఈ ప్రబంధంలో వరూధినీ ప్రవరుల ఘట్టం, మాయా ప్రవర వరూధినీ ఘట్టం, స్వరోచి - మనోరమను, విభావసి, కళావతుల్ని పెండ్లాడి సుఖించే ఘట్టం పార్వతి పుంజిక స్థలల ఘట్టం, లేడి స్వరోచి సంగమం కోరి అతని కౌగిట్లో వనదేవత అయి, అతనితో భోగించి, స్వారోచిమని కన్న ఘట్టం, అనేవి శృంగార ప్రధానాలైనట్టివి

ప్రవరుని ధార్మికత, స్వారోచిమని తపస్సు - ఈ రెండూ వ్యక్తిగత సన్నివేశాలు శృంగారేతరంగా అంటే ఒకసారి శృంగారానికి ప్రతిస్పర్ధిగా, ఇంకోసారి శృంగార స్పర్శ లేనిదిగా వర్ణించ బడ్డాయి.

ఈ ప్రబంధంలోని ఇతివృత్తాన్ని పరిశీలిస్తే శృంగార ప్రధానం అయిన కథాంశమే దీంట్లో అధికంగా కలదు స్వరోచి రాక్షసుల యుద్ధం, మనోరమాదులకు మునిశాపాలు మొదలగు సన్నివేశాలు శృంగారానికి అంగంగా ఉండి దాని పోషణకు తోడ్పడ్డాయి ప్రవరుని ధార్మికత్వం ఏకపత్నీవ్రతత్వం, నిత్యకర్మానుష్ఠానాసక్తి మొదలైనవన్నీ శృంగారాన్ని భంజించినట్లు కన్పిస్తున్నా, ధార్మికత్వం ముందు శృంగారం తలవంచి తరువాత తానే విజయాన్ని పొందింది వరూధినీ ప్రవర ఘట్టంలో శృంగారం ఆభాస రూపం దాల్చినామాయా ప్రవరుని ప్రవేశపెట్టి శృంగారానికిచ్యుతి లేకుండా చేసాడు కవి 'పవిత్రత కొంత కొరవడినా మాయా ప్రవర వరూధినుల సన్నివేశం 'ఔపచారికంగా' అయినా శృంగారం అయిందని పండితులే అంగీకరించారు. దాన్ని ధర్మ శృంగారంగా మనం భావించక పోయినా శృంగారం అని మాత్రం అంగీకరించక తప్పదు

ప్రవర వరూధినీ ఘట్టంలో ప్రవరునికి విజయం కలిగినట్లు చిత్రించినా పారుడు మాత్రం పుంజిక స్థల అనే అప్సరస చేతిలో శృంగారానికి వీగిపోయినట్లు చిత్రించి ఈ రెండు ఘట్టాలకు బింబ ప్రతిబింబత్వం కల్పించినట్లు కనబడుతున్నా వరూధినీ ప్రవర ఘట్టం ముందు పారర్షి పుంజికస్థలల ఘట్టం నిర్వహణంలో వెలవెల పోతుంది స్వరోచి శృంగారంలో బహునాయికాత్వం ఉన్నా సంభోగం చక్కగానే నిర్వహించ బడింది వనదేవత మొదట జంతువుగా కనిపించినా, తర్వాత స్త్రీ రూపంతో స్వరోచి వల్ల భోగాలు అనుభవించి మనువును ప్రసవించింది

ఈ శృంగార సన్నివేశాలలో ముఖ్యమైనవి మూడు మొదటిది - వరూధినీ - ప్రవర - మాయా ప్రవరుల సన్నివేశం రెండవది - స్వరోచి - మనోరమ, విభావసి, కళావతుల భోగ సన్నివేశం.

మూడవది - వన దేవతా - స్వరోచుల భోగ సన్నివేశం

పై ఇతివృత్త సన్నివేశ పరామర్శం వల్లనే ఇందలి అంగిరసం శృంగారం అని తెలుస్తుంది కాని ఇందలి ప్రధాన రసంలేదా అంగిరసం ఏది? అనే విషయంలో పండితులలో అభిప్రాయ భేదాలు ఉన్నాయి ఆ అభిప్రాయాల్ని సమీక్షించి, ఇందలి ప్రధాన రసం ఏదో పరిశీలిస్తాను

1. అంగిరస నిర్ణయం:-

ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు మను చరిత్రలోని అంగి రసాన్ని గూర్చి ఇలా వ్రాసారు.

"ఈ వరూథినీ ప్రవరుల కథలో అంగిరసము శాంతము అంగరసము శృంగారము శమ ప్రధానుడైన ప్రవరుడు ఆలంబనముగా శాంతమునకును, ప్రణయ ప్రధానయైన వరూథిని ఆలంబనముగా శృంగారమునకును ఇచ్చట సమ్మేళనము జరిగెను . . . కథను ప్రవరుని చరిత్రతోనే ఉపక్రమించుటయు, ఆతని సచ్ఛీలమునే మొదట వర్ణించుటయు, ఎట్టి ప్రత్యవాయవములు కల్గినను, ఆ శీలమును అకుంఠితముగా ప్రదర్శించుటయు గమనించితి మేని గ్రంధకర్త ఈ ఘట్టమును ప్రవరుని చరిత్రాంశము గానే సంకల్పించెననియు, శాంతమునే అంగిరసముగా ప్రతిపాదించెననియు గోచరింపక మానదు"55.

వీరు కేవలం వరూథినీ ప్రవరుల ఘట్టాన్ని, అందునా ఒక్క ప్రవరుని పాత్రనే దృష్టిలో ఉంచుకొని అంగిరస నిర్ణయం చేసినట్లు కనిపిస్తుంది.

మనుచరిత్ర పీఠికలో శ్రీ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారు అందలి అంగిరసాన్ని గూర్చి ఇలా వివరించారు

"........ ఇట్లన్ని రసములతో సంకీర్ణమగు వస్తువు ప్రబంధమున నుపాదేయమగునా యనినచో నట్లుండుటయే తటస్థించుచో నందొక రసము నంగిగాను, తక్కిన రసములు దాని కంగములు గాను నుండ దగునని ధ్వన్యాలోకమున నిట్లు కలదు.

"ప్రసిద్దేऽపి ప్రబంధానాం నానారస నిబంధనే
ఏకో రసోऽంగీ కర్తవ్యస్తేషా ముత్కర్షమిచ్ఛతా"
ప్రబంధేమ మహాకావ్యాదిమ నాటకాదిమవావిప్రకీర్ణ తయా అంగాంగి భావేన వాబహవో రసా ఉపనిబధ్యంతే, ఇత్యత్ర ప్రసిద్ధౌ సత్యామపి యః (కవిః) ప్రబంధానాం ఛాయాతిశయ

మిచ్ఛతి తేన (కవినా) తేషాం రసానాం అన్యతమః కశ్చిద్వివక్షితో రసో అంగిత్వేన వినివేశయితవ్య ఇత్యయం యుక్త తరో మార్గః" ప్రబంధము లందు అనగా మహాకావ్యము లందును నాటకము లందును సంకీర్ణములై కాని అంగాంగి భావమున గాని పెక్కు రసములు గూర్చ బడునని ప్రసిద్ధి యున్నను కావ్యమునకు శోభను గూర్చగోరు కవి యారసములలో దాను జెప్పదలచిన యొక రసమును అంగిగా (ప్రధాన రసముగా) నెలకొల్ప వలెనను నీమార్గము యుక్తతరము" అని.

దీని ననుసరించి ధర్మవీర రసాశ్రయమగు బ్రవరుని వృత్తముతో నారంభమై శాంత రసాశ్రయమగు స్వారోచిమని తపశ్చర్యతో బూర్తి యగుచున్నది. కాన మనుచరిత్ర శాంత రస ప్రధాన మనిపించును కాని పరిశీలింప స్వరోచి కథకుపోద్ఘాత ప్రాయమగు వరూధినీ వృత్తాంతమున ఆభాస రూపమున భాసించినను శృంగారము రసత్వము నొంది యంగిరసమగు చున్నది ఈ విషయమున రసాభాసము రసమగునా కాదాయని చర్చించి సాహిత్య దర్పణమున,

"రసభావౌ రసాభాసౌ భావస్య ప్రశమోదయౌ
సంధి శ్శబలతా చేతి సర్వేపి రసనాద్రసాః,

రసన యోగిత్వాద్భావాదిష్వపి రసత్వముపచారా దిత్యభిప్రాయః - "అనగా రసభావములు, రసాభాస, భావాభాసములు, భావశాంతి, భావోదయ, భావసంధి, భావశబలతలు - అనెడి సర్వమును రసనము (ఆస్వాదనము) వలన రసములగు చున్నవి రస ధర్మములతో యోగము గలవగుటచే నీభావాదులందు సైత మౌపచారికముగా రసత్వము కలుగును" అని

ఇట్లనుటచే వరూధినీ ప్రవరుల నడుమను, వరూధినీ గంధర్వుల యెడను బ్రవర్తిల్లినది ముఖ్యముగా గాకున్నను నౌపచారికముగా నైనను (గౌణముగా నైనను) శృంగార రసమే కావున సహృదయాస్వాద మగుచున్నది ప్రబంధమునకు బ్రధాన నాయకుడగు స్వరోచికిని, మనో రమాదులకును నడుమ శృంగారమే నిండుగా బ్రవర్తిల్లుటచే నాద్యంతము శృంగార మంగిరసముగాను తదితరము లంగరసములుగాను గోచరించుచున్నవి "56

విన్నకోట మాధవరావు గారు అంగిరసాన్ని గూర్చి ఈ విధంగా సెలవిచ్చారు

" ... పెద్దనగారు కథా ప్రారంభముననే ప్రవరుని ప్రవేశ పెట్టుటయు, అతని శీలము శాంతి దాంతి శౌచాదుల విపులముగ వర్ణించుటయు తన కావ్యమునకు ప్రధాన రసము శాంతమనియే యాయన భావించి యుండెనని తలంచ వలయును శాంత రసమునకు ఆలంబనము ప్రవరుడు శృంగార రసమునకు వరూధిని రెండును విరుద్ధ రసములు

శృంగార రసము వీగి పోయినది శాంత రసము విజయము గాంచినది. ప్రవరాఖ్యుడు వరూధినిని ద్రోసివేయుట శాంత రసము శృంగార రసమునకు శృంగ భంగము జేయుటయే ... శాంత రస మూర్తి యగు ప్రవరునితో ప్రారంభమయిన గాధ శమదమాది గుణములు మూర్తీభవించిన స్వారోచిషమనువుతో సమాప్తమైనది అందుచే స్వారోచిషమను సంభవ కావ్యము శాంత రసప్రధానమని విమర్శకుల మతము .. ప్రవరునిచే తిరస్కృతయై విరహోత్కంఠత విలపించు వరూధిని యప్పటి స్థితి కరుణ రసోద్దీపకము. గంధర్వుని దుశ్చేష్ట వరూధిని యెడ జాలి గలిగించుటచే కరుణ రసమినుమడించును. అందుచే (మాయా ప్రవర వరూధినీ సంగమమున) శృంగార రససిద్ధి గలిగిన దనుట పొసగదు ఈ ఘట్టము కరుణ రస ప్రధానము "57

వై రాధాకృష్ణారావు గారు తమ 'త్రివేణి' లో మనుచరిత్రలోని అంగి రసాన్ని గూర్చి ఇలా చర్చించారు

"ఆది మధ్యాంతము లందు ధర్మమే సుప్రతిష్ఠితమై సువ్యక్తమై యుండుట చేతను ముఖ్య కథా పురుషులందరును ధర్మ నిర్వహణ దీక్ష యందే సమధికోత్సాహమును ప్రదర్శించుట చేతను మనుచరిత్ర మందలి అంగి రసము ధర్మవీర మనుటయే యుక్తము ప్రవర వరూధినీ ఘట్టము మాటేమి? అని కొందరడుగ వచ్చును అందు శృంగారా భాసమున్న మాట నిజమే కాని అది ఆధికారికేతి వృత్తము కాదు. ప్రాసంగిక మగు నా ఘట్టమున రసాభాస మున్నందు వలన వచ్చు లోవమేమియును లేదు. ఇందు శృంగార మంగి రసము కాదు (వరూధినీ మాయా ప్రవర ఘట్టమున గలది శృంగారమే కాని ఆభాసము కాదు) ఇంతకును మను చరిత్రమున శృంగార మంగ రసమే కాని యంగి రసము కాదు అంగరసము తప్పక సమ్యక్పరిపుష్టము కావలెనను నాలంకారిక నియమము లేదు

మనుచరిత్ర యందలి రసము శాంతమని కొందరి యభిప్రాయము కాని శాస్త్రీయముగ పర్యాలోచన చేసినచో నీయభిప్రాయము నిలువదు శాంతమునకు స్థాయి భావము శమము శమము సర్వరాగ ప్రశమైక రూపము రాగద్వేషములకందు తావులేదు ప్రవరుడు స్వధర్మపరుడే కాని రాగ విరహితుడు కాదు. ఎచ్చట సుఖ దుఃఖములుగాని, చింతాద్వేష రాగేచ్ఛలు గాని యుండవో అచట శాంతము రసమగును. ఇల్లుసేరునుపాయము తెలియనందులకు ప్రవరుడు దుఃఖించినాడు. 'అనుకూలవతి నాదు మనసులో వర్తించు కులకాంత మదినెంత కుందు నొక్కొ' అని వాపోయినాడు ప్రవరుని యందు ధర్మ కార్య నిర్వహణమునెడ నుత్సాహమే కన్పట్టును స్వరోచి యందు శమము లేశ మాత్రమును లేదు. ఆతని యందును ధర్మాచరణోత్సాహము మాత్రమే కలదు కావున మను చరిత్రమున అంగిరసము ధర్మవీరమే కాని శాంతము కాదు "58

ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారు మనుచరిత్రలోని ప్రధాన రసాన్ని గూర్చి ఇలా అభిప్రాయ పడ్డారు.

"పెద్దనయు మను చరిత్రమున శృంగార రసమునే ప్రధానముగా పోషించెను. అది యందొకచో నాభాస రూపమునను, ఒకచో వియోగరూపమునను, ఒకచో సంభోగ రూపమునను వైవిధ్యము దాల్చి రెండు చోట్ల శాంతముతో సంఘర్షము కూడ పొందినది. . . . . పెద్దనయా కాలము ప్రభావమును బట్టి మను చరిత్రమున ప్రధానముగా శృంగారమునే వర్ణించినను ఆరంభావసానము లందు శాంతమునకఖండ విజయము గ్రహించి తన కాల మర్యాద నతిక్రమింపజాపలెను."59

ఆచార్య జి.వి సుబ్రహ్మణ్యం గారు మనుచరిత్ర లోని అంగిరసాన్ని గూర్చి ఇలా నిష్కర్ష చేసారు.

"పురాణ కథా రసతత్త్వము ననుసరించి యాప్రబంధము నందలి యంగిరసము· శాంతము కావలెను ఈ కథ యేక నాయక వృత్తము కాక పోవుట వలనను స్వయం సమగ్రములైన రెండు కథల సంపుటీకరణ మగుట చేతను, శమ దమాన్వితుడైన మనువు జన్మించుటే కథా ఫలమగుట చేతను, ఇందలి రెండు కథల రస తాత్పర్యము కథా ఫలమును వ్యంజింప జేయవలసి యున్నది. కావున ప్రవరుని కథలో మృగరాజ హంస బోధామృతము వలన గలిగిన జ్ఞాన దీప్తి శృంగారమును మందీకృత మొనర్చుటయును, కుమారోదయ ఫలమైన కథా వస్తువునందు సర్వ సహజమైన శృంగారమును బరితవివేకించి వీనిని మను జీవ లక్షణమైన శమమున కువష్టంభకముగా నిల్పికొని శాంత రసోన్ముఖుడగును కావున మార్కండేయ పురాణోక్త ప్రకారమున బ్రబంధ రచన మొనర్చిన అల్లసాని పెద్దన మను చరిత్రమునకును ఆరంభ నిర్వహణ సమన్వయ వివేకముతో బరిశీలించినచో శాంతమే యంగి రసము కాగలదు."60

డా. ముదిగంటి సుజాతారెడ్డి గారు కూడా ఆంధ్ర ధ్వన్యాలోక కారుని మాటలను ఉటంకించి మనుచరిత్ర లోని అంగిరసం శాంతమే అంటున్నారు

". .. .. ప్రవర వరూధినీ సంవాద ఘట్టమున శాంత శృంగారములకు ఘర్షణ ఏర్పడినప్పుడు కవి మోక్ష కాంక్ష స్థాయిగా గల శాంతము నుద్దీపింప జేసినాడు కాని ప్రవరుని నిష్క్రమణతో మరియు వరూధిని విప్రయోగ, సంభోగ శృంగారముల వర్ణనలతో శాంత రస ప్రశమనము జరిగినది కాని మరల ప్రబంధాంతమున స్వారోచిమని జననము తపస్సులలో మోక్ష కాంక్ష స్థాయిగాగల శాంతము వ్యక్తమై కావ్య పఠనానంతరము పాఠకుల హృదయములందు నిండి నిలచి పోవుచున్నది. కావున మనుచరిత్రలో శాంత రసమే యంగి రసమనుట సమంజసము"61

ఆమె ఉటంకించిన ఆంధ్రధ్వన్యా లోకకారుని వాక్యాలు ఇవి 'ప్రబంధముల యందు మొట్టమొదట ప్రస్తావింపబడి మాటిమాటికి ననుసంధేయ మానమగు రసము స్థాయిరస మనబడును. ఏమన అది ఇతి వృత్తము నందంతటను చక్కగా వ్యాపించి చివరి వరకు నవిచ్ఛిన్నముగ స్మృతికి కొనిరాబడు చున్నది ఇట్టధిక వ్యాప్తి కలది కావుననే ఇది అంగియగుటకు దగి యుండును. అట్టి అస్థాయి రసమునకు నితర రసముల తోడనెంతగ సమావేశ మేర్పడినను దీని యంగిత్వము తొలగి పోవదు' అని.

మను చరిత్ర ప్రబంధంలోని అంగిరస విషయంలో మూడు ముఖ్యమైన వాదాలు కనిపిస్తున్నాయి. దానిలో మొదటిది శాంతరసం అంగిరసం అనేవాదం. దీన్ని స్థాపించిన వారు శ్రీ పింగళి లక్ష్మీకాంతం గారు, శ్రీ జి. వి. సుబ్రహ్మణ్యం గారు, శ్రీ విన్నకోట మాధవరావు గారు, శ్రీమతి ముదిగంటి సుజాతారెడ్డి గారలు. వీరందరూ ఆద్యంత కథల్ని అంటే ప్రవరస్వారోచిమల గుణ ప్రవర్తనల్ని బట్టి ఇందలి అంగిరసం శాంతం అని ప్రధానంగా నిర్ణయించారు. పింగళి వారు ఒక్క ప్రవరుని ఆధారంగా చేసుకొనే అంగిరస నిర్ణయం చేసారు. విన్నకోట వారు ఆద్యంత కథల్నిబట్టి శాంతమే అంగి అని చెబుతూ 'ప్రవరునిచే తిరస్కరింప బడిన వరూధిని స్థితి కరుణ రసోద్దీపకము గంధర్వుని దుశ్చేష్ట వరూధిని యెడ జాలి కలిగించుటచే కరుణ రసమినుమడించును. ఈ ఘట్టము కరుణ రస ప్రధానము'. అని నిర్ధారించారు కాని కరుణం ఉన్నదనడం విచార్యం. ప్రవరునిచే తిరస్కరింప బడ్డ వరూధిని ఎడ సామాజికునికి సానుభూతి కలగడం సమంజసమే. వరూధినికి ప్రవరుడు మళ్ళీ వస్తాడనే ప్రత్యాశ ఉంది. ఆమె విరహంలో మునిగింది ఆ విప్రలంభాన్ని పెద్దనగారు చక్కగా నిర్వహించారు ఈ అభిలాష విప్రలంభంలో కరుణ భావానికైనా ఆస్కారంలేదు 'గంధర్వుని దుశ్చేష్ట' కరుణ రసోద్దీపకం అన్నారు. కాని అతని కూటమికి వరూధిని బాధ పడకపోగా మిగుల ఆనందించింది అతడు అసలు గంధర్వుడు అని ఆమెకు తెలియదు కదా! ప్రవరుడు అనే భావించింది. ఆమె సామాన్య (దేవవేశ్య) నాయిక కావున ఇందు లోపం ఉన్నట్లు కనిపించదు ఆ ఘట్టంలో అంటే మాయా ప్రవర వరూధినీ సన్నివేశంలో శృంగారమే ఉంది కాని కరుణానికి ఆవంతైనా చోటులేదు. ప్రవర తిరస్కార సన్దర్భంలో పాఠకునికి వరూధిని ఎడ తాత్కాలికంగా కలిగిన సానుభూతిని ఆధారంగా చేసుకొని ఈ ఘట్టంలోని ప్రధాన రసం కరుణం అనడం అవిచార మూలకం అసలు కరుణానికి 'శోకం' స్థాయి. ఇక్కడ శోకానికి స్థాయిత్వం కలగడానికి అవకాశమే లేదు. ఇట 'విషాదం' అనే వ్యభిచారి భావమే ఉంది విరహ తీవ్రత వల్ల బాధపడే వరూధినిని చూసి పాఠకుడు ఆర్ద్రీభూత హృదయుడు అవుతాడు. వరూధినిపై సానుభూతి కలిగిన పాఠకునికి మాయా ప్రవర సంభోగంలో ఎలాంటి జుగుప్సా కలుగదు 'ఆనందో బ్రహ్మ' అనే ప్రాబలుకును కాముకార్థంతో వ్యాఖ్యానించిన వరూధిని కోరిక తీర్చిన గంధర్వునిది దుశ్చేష్ట ఎలా అవుతుంది? కాబట్టి ఈ ఘట్టంలోని ప్రధాన రసం శృంగారమే అని మనం భావించాల్సి ఉంది.

శ్రీ సుబ్రహ్మణ్యం గారు 'పురాణ కథా రసతత్త్వము ననుసరించి యా ప్రబంధము నందలి యంగిరసము శాంతము ' అని నిర్ణయించారు.

అయినా పెద్దన గారు చెప్పదలచింది పురాణం కాదు. 'రససమంచిత కథ' ల్ని చెప్పబూనాడు ఆకథలలో అనేక రసాలు ఉండవచ్చు కాని పూసలలో దారం వలె అంగిరసం ఒకటి ఉండి తీరుతుంది అట్టి తరి రెండు రసాలుగాని, అంతకంటే ఎక్కువ రసాలు గాని సమ ప్రాధాన్యం కలిగి ఉండేట్లు కవి రచన చేస్తే విమర్శకులకు ప్రధాన రస నిర్ణయంలో అభిప్రాయ భేదాలు ఏర్పడడం కద్దు అలాంటి చోట్లలో వాళ్ళ బుద్ధి నైశిత్యాన్ని బట్టి ఆధారాలను వెదకి 'ఇందలి 'అంగిరసం' ఇది' అని నిర్ణయిస్తారు మనుచరిత్రలో 'అంగిరస' నిర్ణయంలో ఇలాంటి విధానాన్నే విమర్శకులు అవలంబించారు ప్రథమాంధ్ర పురాణాన్ని (మార్కండేయ పురాణం) గూర్చి విమర్శించే వీరు పురాణ రసతత్త్వాన్ననుసరించి 'శాంతం' అంగి రసం అని నిర్ణయించారు దానికి ఉపబలకంగా 'ఆరంభ నిర్వహణ' కథల్ని ఆధారంగా స్వీకరించారు కాని పూర్తి ప్రబంధాన్ని దృష్టిలో ఉంచుకొని, స్వారోచిమ జననానికి మూలమైన కారణాలను విచారించి విమర్శించి ఉంటే వీరు 'శాంతం' అంగి అని చెప్పి ఉండక పోయేవారు పౌరాణిక దృష్టితో వారు అలా నిర్ణయించడం సమంజసం అయినా మనుచరిత్ర ప్రబంధంలో మాత్రం ప్రాబంధిక దృష్టితో చూస్తే అంగిరసం శాంతం కాదు

ఇక 'శాంతం అంగిరసం' అని చెప్పడానికి ప్రధాన మైన కారణం ప్రవర, స్వారోచిమల చరిత్రలు ఆది, అంతా లందున్న వీరిద్దరి చరిత్రల్ని మాత్రమే గ్రహించి తక్కిన వారిని అందర్నీ, ప్రధానమైన స్వరోచి కథను వదలి అంగి రస నిర్ణయం చేయ బూనడం సాహసమే అవుతుంది కాని ఇలా చేయడానికి వీలుండడం చేతనే అలా చేసారు. అసలు మనుచరిత్రలో ప్రవర, స్వారోచిమల కథలు ఒక ఎత్తు తక్కిన కథ అంతా ఒక ఎత్తు ఈ రెండింటిని ఒక ప్రామాణిక త్రాసులో తూచితే రెండూ సమాన ప్రాధాన్యం గలవిగానే తోస్తాయి కాని ప్రవర, స్వారోచిమల మానసిక తత్త్వాల్లో గల భేదాన్ని గమనిస్తే వాళ్ళ గుణ స్వభావాలు వేరని తెలుతుంది అప్పుడు రెండవ భాగం బలం పెరుగుతుంది ప్రవరుని, స్వారోచిమని తత్త్వాలందు గల ప్రధాన భేదం ఏమిటి? ప్రవరుడు కేవలం ధార్మికుడు ధర్మబద్ధమైన భోగాల్ని అనుభవిస్తూ సుఖజీవనం గడుపుతూ, నిష్ఠగా జీవించేవాడు శమ దమాది గుణాలు ఈతనిలో ఉన్నా అవి గౌణంగా వున్నాయి స్వారోచిమడంటే శమదమాది గుణాలే ప్రధానంగా కలిగి తపస్సుచే పరబ్రహ్మాన్ని ప్రత్యక్షం చేసుకున్న వాడు కేవలం భగవంతుని ఆదేశం పైననే రాజ్యపాలన చేసాడు నిస్సంగుడు. ధార్మిక లక్షణాలున్నా, అవి ఇతనిలో గౌణాలు కాబట్టి ప్రవరుడు ధార్మికుడు అంటే ధర్మ (వీర) స్వభావం కలవాడు. స్వారోచిమడు శాంతమూర్తి శాంత స్వభావం కలవాడు ఈ ఇద్దరు వ్యక్తుల్ని ఆధారంగా చేసుకొని రస నిర్ణయం చేయబూనితే ప్రవరుని చరిత్ర ధర్మోత్సాహం కలది కావున అచటి రసం ధర్మవీరం అనీ, స్వారోచిమని చరిత్ర శమదమాది గుణ ప్రాధాన్యం కలిగిన శాంత ప్రధానమైంది కాబట్టి

అచటి రసం శాంతం అనీ నిర్ణయించాల్సి ఉంటుంది. అవుడు మనుచరిత్రలోని అంగి రస నిర్ణయంలో ఈ ఇద్దరి చరిత్రలు ఆధారంగా ధర్మవీర, శాంతాలు అంగ రసాలౌతాయి అంతే కాక శాంతానికి స్థాయి భావం శమం శమం సర్వరాగ ప్రశమైక రూపంగదా! రాగ ద్వేషాలకు దాంట్లో చోటులేదు. ఈ శమం స్థాయిగా స్వారోచిమనిలో కలదని చెప్పవచ్చు. ప్రవరుడు స్వధర్మ నిర్వహణ పరుడేగాని రాగ విరహితుడు కాడు. ఎచట సుఖం, దుఃఖం, రాగం, ద్వేషం, చింతాదులు ఉండవో అచట శాంతం రసమౌతుంది ఇల్లు చేరేవిధం ఉపాయం తెలీ నప్పుడు ప్రవరుడు 'అనుకూలవతి నాదు మనసులో వర్తించు కులకాంత మదినెంత కుందు నొక్కొ' అని దుఃఖిత మతి అయ్యాడు కాబట్టి ప్రవరుని చరిత్రం ఆధారంగా మనుచరిత్ర లో 'శాంతం' అంగిరసం అని నిర్ణయించడం అనుచితం ప్రబంధాంతంలో ఉన్న కేవల స్వారో చిమని చరిత్రాన్ని ఒక్క దాన్ని ఆధారంగా గ్రహించి, ప్రబంధంలో అంతటా వ్యాపించి ఉన్న అంగిరసం శాంతం అనడం కూడా అనుచితమే

ఇక రెండవ వాదం మనుచరిత్రలో అంగిరసం ధర్మ వీరం అనడం ఈ ధర్మవీరాన్ని ప్రతిపాదించిన వారిలో పై రాధాకృష్ణారావు ప్రభృతులు కలరు "ముఖ్య కథా పురుషులందరును ధర్మ నిర్వహణ దీక్షయందే సమధికోత్సాహమును ప్రదర్శించుట" అనేది వీరి అంగిరస ప్రతిపాదనకు ప్రధానమైన ఆధారం 'ప్రవర, స్వరోచులందు ధర్మాచరణోత్సాహమే యుండుట' వల్ల ఇందలి అంగిరసం ధర్మవీరమని వివరించారు వీరి ప్రతిపాదనలో పురుష పాత్రలు మాత్రమే స్థానం సంపాదించుకో గలిగినవి. స్త్రీ పాత్రల ప్రసక్తి లేదు. ముఖ్య కథా పురుష లంటే ప్రవరుడు, స్వరోచి, స్వారోచిషుడు అనే ముగ్గురే కథా పాత్రలైన స్త్రీ పురుష చరిత్రల సమన్వయం లేకుండా అంగిరస నిర్ణయం చేయడం దుర్ఘటం. స్త్రీ(పాత్ర)లు లేకుంటే అది వేరు ఆ పాత్రలు వాటి చరిత్రలు, ఆ నాయికలకు నాయకులతో గల సంబంధం రస నిర్వహణలో వారి పాత్ర మున్నగు అంశాలెన్నింటినో త్రోసిరాజని ఏ ఒక్కపాత్ర చరిత్రాన్నో ఆధారంగా జేసికొని ఇందలి అంగి రసాన్ని నిర్ణయించడం అతి సాహసం ' ముఖ్య కథా పురుషులు అందరూ' అని చెప్పి తర్వాత స్వారోచిమని రాధాకృష్ణమూర్తి గారు తామే స్వయంగా జారవిడిచారు. స్వారోచిమనిలో 'ధర్మవీరం' ఔపచారికంగా కూడా లేదని ముందే నిర్ణయించాను కదా! ఇక వీరికి ఆధారం అయింది ప్రవర, స్వరోచులలోని ధర్మ వీరం. స్వరోచిలో ఉత్సాహం కలదు అతడు వీరుడే అనుమానం లేదు కాని అతనిలో ధర్మవీరం ఉందనడం విచార్యం మనోరమను వెంటాడిన రాక్షసుణ్ణి సంహరించడంలో యుద్ధోత్సాహం, కళావతి, విభావసులను రోగ విముక్తుల్ని చేయడంలో దయోత్సాహాలు స్వారోచిలో స్పష్టంగా కనిపిస్తున్నవి. అతని ధర్మోత్సాహం కనిపించే కథాంశం స్పష్టంగా కనబడడం లేదు. రాజ్యపాలనలో ఆ ధర్మోత్సాహం కలదని చెప్పుకొన్నా, అతనిలో కేవలం ధర్మోత్సాహమే కలదని చెప్పడం ఉచితంగా లేదు. అతడు ఉత్సాహవంతుడు. ఆయా సందర్భాల్ని బట్టి అది వ్యక్తమౌతుంటుంది. అసలు ప్రతి నాయకుడు గూడా వీరుడు, ధీరుడు అయ్యే ఉండాలి కదా! స్వరోచి ధీరోదాత్త నాయకుడు.

అతడు నలుగురు (మనోరమ, విభావసి, కళావతి, వనదేవతలనే) భార్యలపై ప్రేమకలిగి భోగించిన దక్షిణ నాయకుడు కాబట్టి స్వరోచి చరిత్రాన్ని ఆధారంగా చేసికొని మనుచరిత్ర లో ధర్మవీరం అంగిరసమని నిర్ణయించడం ఎంత మాత్రమూ కుదిరేది కాదు. స్వరోచి చరిత్రకు ధర్మ వీరానికి సంబంధాన్ని సృష్టించడం మోకాలికి • బోడి తలను కలిపి ముడివేయడం లాంటిది ఇక మిగిలిన ముఖ్య కథాపురుషుడు ప్రవరుడు ఒక్కడు మాత్రమే ఇతని చరిత్రాన్ని మాత్రమే ఆధారంగా చేసికొని ప్రబంధం అంతటా వ్యాపించి ఉండాల్సిన అంగిరసం 'ధర్మవీరం' అని చెప్పడం స్వారోచిషమని ఆధారంగా గొని శాంతం అంగి అని చెప్పడం లాంటిదే. అంతే గాక ప్రవరుని ధర్మవీర స్వభావం అంతర్నిహితంగా ఉండి, అతని భౌతిక స్వరూపం ఆధారంగానే తర్వాతి కథ నడిచింది ఈ ఒక్క కారణం చేతనే మనుచరిత్రలోని అంగిరసం 'ధర్మవీరం' అనడం ఉచితంగా లేదు

ఇక మూడవ వాదం 'ఈ ప్రబంధ మందలి అంగిరసము శృంగారము' అనడం ఈ సిద్ధాంతాన్ని స్థాపించిన వారు శ్రీ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రి గారు, శ్రీ దివాకర్ల వేంకటావధాని గారు, శ్రీ వల్లా దుర్గయ్య గారు మొదలగు వారలు శ్రీ అవధాని గారు 'మనుచరిత్రమున శృంగార రసమే ప్రధాన రసము' అని చెప్పి కూడా 'ఆరంభావసానము లందు శాంతమున కఖండ విజయము గ్రహించి తన కాల మర్యాద నతిక్రమింప జాలెను అని చెప్పారు. ఈ చివరి ముక్తాయింపు మాటను డా॥ సుజాతారెడ్డి గారు తమ 'శాంత రస వాదానికి ఉపబలకం గా స్వీకరించారు కాని ఇది సమంజసమైన పద్ధతి కాదు అవధాని గారు కూడా ప్రవరుడిలోనిది శాంతం అని భ్రమపడి ప్రవర స్వారోచిషుల లోనిది శాంతం అని చెప్పారు ఒక వేళ వారిద్దరి లోనిది కూడా శాంతమే-అని గ్రహించినా వారిద్దరికీ విజయం కలిగినట్లు వర్ణించినంత మాత్రాన ప్రబంధంలోని ప్రధాన రసం శాంతమని చెప్పడం ఎలా? వారి దృష్టిలో శృంగారానికి ప్రతిస్పర్ధిగా శాంతాన్ని చిత్రించడం, రెండిటినీ ఒకటి రెండు తావులలో సమాన స్థాయిలో పోషించడం ఎవ్వరూ ఆ కాలంలో చేసిన వాళ్ళు లేరు. ప్రవర వరూధినుల చరిత్రలో శృంగారం తాత్కాలికంగా శమించినట్లు పెద్దన గారు చిత్రించినా 'పారర్షి పుంజికస్థల'ల చరిత్రలో శాంతం వీగి పోయి శృంగారం జయాన్ని గ్రహించినట్లు వర్ణించారు గదా! దీనికే మంటారు? కాబట్టి అవధాని గారి మాటల్ని మనం ఈ విధంగా వ్యాఖ్యానించు కోవచ్చు 'మనుచరిత్ర లోని అంగిరసం శృంగారమే కాని ప్రవర చరిత్రలో ధర్మ వీరాన్ని (వారి మాటలలో శాంతం) స్వారోచిషమని చరిత్రలో శాంతాన్ని చక్కగా అంగిరసానికి సమాన స్థాయిలో పోషించి ఒక వినూత్న ప్రయోగాన్ని పెద్దన గారు చేసారు. ఇదే వారు పెద్దన 'తన కాల మర్యాద నతిక్రమింపజాలెను అని చెప్పడంలో గల భావం'

శ్రీ వల్లా దుర్గయ్యగారు " పెద్దనామాత్యుడు మనుచరిత్రము నందు నవ రసములను సందర్భానుసారముగ హృదయంగమముగ బోషించెను. శృంగార రసము నంగిరసము గావించి, తక్కిన రసములను నంగ రసములుగా బెద్దన పోషించెను"62 అని చెప్పారు

వై రాధాకృష్ణారావు-గారి లాగానే శ్రీ సముద్రాల నాగయ్య గారు కూడా మనుచరిత్ర లోని అంగిరసాన్ని గూర్చి ఇలా చెప్పారు.

"ఈ ప్రబంధములో శృంగార, వీర, భయానక, బీభత్స అద్భుత, శాంత రసములు సంకీర్ణములుగా ప్రతీయ మానము లగుచున్నను, ప్రధాన నాయకుడగు స్వరోచిలో మొదట యుద్ధ వీరమును, ఆపిదప శృంగారమును భాసించినను, చివరకు ధర్మ వీరమే ప్రధానముగా నిలుచును. కాన నీ కావ్యమున ధర్మవీరము ప్రధానరసము. తక్కిన రసములు తత్పరి పోషకములగు అంగ రసములు"63.

ఈ వాదం ఇదివరకే పూర్వపక్షం చేయబడింది శ్రీ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రి గారు తమ మనుచరిత్ర పీఠికలో వరూధినీ ప్రవర, మాయాప్రవరవరూధినీ ఘట్టాలలోని రసం ఔపచారిక శృంగారం అని గ్రహించి, స్వరోచి వృత్తాంతం కూడా శృంగార రస ప్రధానం అయిందే కాబట్టి మనుచరిత్రలోని 'అంగిరసం శృంగారం' అని సిద్ధాంతీకరించారు. వల్లావారి మాటలు కూడా ఈ వాదాన్నే బలపరుస్తున్నాయి ప్రబంధాన్ని ఆద్యంతం పరిశీలిస్తే గాని ప్రధాన రసం ఏదో తెలియదు ఒకటి రెండు ఘట్టాలాధారంగా గ్రహించి అంగిరస నిర్ణయం చేయబూనడం తొందరపాటు చర్య అవుతుంది కాబట్టి మనుచరిత్ర లోని అంగిరసం శృంగారమే!

మనుచరిత్ర లో అంగిరసం శృంగారమని సిద్ధాంతీకరించడానికి నా బుద్ధికి తోచిన కొన్ని కారణాల్ని ఈ కింద పొందు పరుస్తున్నాను

1. వరూధినీప్రవరుల వాగ్వివాదం, ప్రవర తిరస్కారం, తిరోధానం తర్వాత వరూధినీ జీవితంలో ప్రవర రూపంలో గంధర్వుడు ప్రవేశించడం వల్ల వరూధినిలో అంకురితమైన రతిభావన కథా నిర్వహణంలో అవిచ్ఛిన్నంగా సాగి కథాగతి కుంటుపడలేదు కేవలం ప్రవరుని దృష్టిలో పెట్టుకొంటే శాంతమో, ధర్మవీరమో కనిపిస్తుంది కాని కథాగతిలో ప్రవరుడు మరుగు పడి పోయినా అతని ఆత్మసౌందర్యాన్ని గాక భౌతిక రూప సౌందర్యాన్ని మోహించి ఉండడంచే వరూధిని అరూపంలో ఉన్న మాయాప్రవరునితో (గంధర్వునితో) భౌతిక సుఖాన్ని అనుభవించి స్వరోచిని కని తృతీయ పురుషార్థాన్ని సార్థకం చేసుకుంది. ఇక్కడ సాధించబడ్డ కామం స్వారోచిమని జన్మకు కూడా హేతువుగా నిలచింది కాబట్టి మనుచరిత్ర లోని అంగిరసం శృంగారమే!

2. స్వరోచి కూడా రాజ్యపాలకుడైన తర్వాత వేటలో మనోరమను, ఆమెవల్ల ఆమె చెలికత్తెలైన విభావసి, కళావతుల్ని స్వీకరించి తృతీయ పురుషార్థమైన కామాన్ని సేవించాడు. ఆ తర్వాత వేటలోనే లేడి రూపంలో ఉన్న వన దేవతను చేపట్టి, భోగించి, ఆమెవల్ల మనువును (స్వారోచిమని) కన్నాడు ఈ వృత్తాంతం అంతా అతని దక్షిణ నాయకత్వాన్ని బలపరుస్తూ ఈ ప్రబంధం లోని శృంగార రస ప్రాధాన్యతను వేనోళ్ళ చాటుతూ వుంది.

3. ప్రబంధం అంతంలో స్వారోచిమదు తపస్సు చేసి శ్రీ హరిని ప్రసన్నుని చేసుకొని మోక్షాన్ని కోరాదు. ఆ స్వామి ఆదేశంచే ధర్మ రక్షణకై రాజ్యపాలన చేసి మోక్షాన్ని పొందాదు ఈ స్వారోచిమని వృత్తాంతాన్ని బట్టి మనుచరిత్ర అంతటా వ్యాపించి ఉన్న ప్రధాన రసం శాంతం అని చెప్పదం సబబుగా ఉండదు. మనుచరిత్రలోని కథ ఏక నాయకాశ్రయం కాదు స్వారోచిమదు జన్మించడానికి పరంపరగా సాగిన శృంగార ఘట్టాలు దీంట్లో ఉన్నాయి ఈ శృంగారం అనేక చోట్ల అనేక విధాలైన వ్యతిరేకతల్ని ఎదుర్కొని ఫలవంతమైంది. నిర్వహణ అంతంలో శాంతం ఉంది. శృంగార ఫలమే శాంతం 'కామిగాని వాదు మోక్షగామి కాదు' అనేమాట లోకంలో ఉన్నదే కదా! రక్తి నుండి విరక్తి పుట్టింది వరూథినీ స్వరోచులలోని రక్తి పరంపరగా సాగి స్వారోచిమనిలోని విరక్తికి హేతువైంది ప్రవర ధార్మికత ధర్మపాలనలో స్వారోచిమనికి తోడ్పడింది శాంత రసానికి ఆలంబనమైన స్వారోచిష ఫలాన్ని ప్రసాదించింది శృంగారమే కాబట్టి మనుచరిత్ర లోని అంగిరసం శృంగారమే అని నిశ్శంకంగా చెప్పవచ్చు

4 పాత్రల్ని ఆధారంగా చేసుకొని, అందునా ప్రవర వరూథినులను ఆధారంగా చేసుకొని ప్రధానరసం నిర్ణయం చేయబూనితే కూడా ఈ విధంగా చేయవచ్చు ప్రవరుడు తాత్కాలికంగా జయించినా తదుపరి కథలో అతని చరిత్ర కొనసాగలేదు వరూథిని చరిత్ర మాత్రమే కొనసాగింది ప్రవర రూప సౌందర్యాన్ని మాత్రమే తన హృదయంలో నిలుపుకొని, మాయాప్రవరునిచే శృంగారపు పంట పండించుకొని, వీరుడైన స్వరోచిని గని, అతనివల్ల మనువు జన్మించడానికి ప్రధాన కారకురాలై నిలిచింది ఈ విధంగా ప్రవరుడు మొదలుకొని స్వారోచిమని వరకు గల చరిత్రలలో పూసలలో దారంలాగా వ్యాపించి ఉన్న శృంగారమే ఇందలి ప్రధాన రసం 'స్వారోచిష మనుసంభవం' అనే గ్రంథనామం కూడా శృంగార ప్రాధాన్యతను వ్యంజింప చేస్తూ ఈ విషయాన్ని బలపరుస్తుంది

5. అసలు శాంతాన్ని భరతుడు తన అష్టరసాలలో చెప్పలేదు అంత మాత్రమే గాక శాంతానికి స్థాయి శమం కదా! 'శమం' సర్వభావ ప్రశమైకరూపం అనేక రసాలతో చిత్ర విచిత్ర సమ్మేళనాలతో శృంగారాన్ని వివిధ వన్నెలతో తీర్చిదిద్దిన పెద్దన మనుచరిత్రలో శాంతం ప్రధాన రసం అనదం ఏ విధంగానూ పొసగదు ధర్మవీర స్వభావం ప్రవరునిలో తక్క మరి ఎచ్చటనూ మచ్చుకైనా కనిపించదు కాబట్టి ధర్మవీరం ప్రధాన మనదం అసలే కుదరదు ఇక దీంట్లోని ప్రధాన రసం శృంగారం అని అంగీకరించక ఏవిధంగానూ తప్పదు

పై కారణాల వల్లా, అంతకు ముందు పండితాభిప్రాయాల గూర్చిన చర్చలోనూ గల అంశాల్ని బట్టి ఆంధ్ర కవితా పితామహ అల్లసాని పెద్దన గారి మనుచరిత్ర లో అంగిరసం శృంగారం అనే నేను సిద్ధాంతీకరిస్తున్నాను.

## 2. శృంగార రస పోషణ:-

మనుచరిత్రలో శృంగారమే ప్రధాన రసం అని తేలింది కదా! ఇక ఈ శృంగారాన్ని విభావాది సాధన సామగ్రిచే పెద్దనగారు ఎలా పోషించారో పరిశీలిస్తాను

### a) విభావ అనుశీలనం:-

1. **ఆలంబన విభావాలు:-** శృంగారంలో ఆలంబన విభావాలు నాయికా నాయకులు. సామాన్యంగా ఒక కావ్యంలో శృంగారాన్ని పోషింప వలసి వస్తే ఒక నాయికను, ఒక నాయకుని ఆలంబనంగా గ్రహించి కవి కథ నడిపిస్తాడు కాని అనేక నాయికలు, అనేక నాయకులు ఉన్న కావ్యంలో ఏక రసాన్ని పోషించడం అతి కష్టమైన విషయం. మనుచరిత్ర బహు నాయకాశ్రయం నాయకులే గాక నాయికలూ అధికంగానే ఉన్నారు. ఇందలి రసపోషణ విధానం కత్తి మీది సాము లాంటిది అలాంటి సామునే పెద్దన గారు చేసారు. ఈ ప్రబంధంలో నాయకులు నలుగురు ఉన్నారు మాయా ప్రవరుని నాయకునిగా గాక ప్రవర ప్రతిబింబంగా గ్రహిస్తే ముగ్గురే నాయకులౌతారు నాయికలు మాత్రం అయిదుగురు, నలుగురు నాయకుల్ని బట్టి నాలుగు ఘట్టాలు ఇందున్నాయి ప్రవర వరూధినుల సన్నివేశం, వరూధినీ (గంధర్వుల) మాయా ప్రవరుల సమాగమం, స్వరోచి జీవిత చరిత్ర, స్వారోచిమని జీవితం ఈ నాలిగింటిలో మొదటి రెండు సన్నివేశాల్లో నాయిక ఒక్కతే నాయకుడు కూడా ఒక్కడే అని చెప్పవచ్చు ప్రవరుడు వరూధినిని తిరస్కరించి వెళ్ళిపోగా, ఆమెచే తిరస్కరింపబడ్డ గంధర్వుడు ప్రవర రూపంతోనే రంగ ప్రవేశం చేసాడు కాబట్టి ఈ రెండింటిలో ప్రవర మాయా ప్రవర రూపంలో ఒకే నాయక రూపం భాసిస్తుంది నాయిక దృష్టిలో మాయా ప్రవరుడు కూడా ప్రవరుడే సామాజికుడు కూడా నాయకునిలో (సన్నివేశ గతంగా) లీనమైనప్పుడు అలాగే భావిస్తాడు

స్వరోచి చరిత్రలో స్వరోచి ఒక్కడు నాయకుడు కాగా మనోరమ, విభావసి, కళావతి, వనదేవత - అనే నలుగురు నాయికలున్నారు స్వారోచిమని వృత్తాంతంలో అసలు నాయికే లేదు చివరి ఘట్టంలో శృంగారం లేదని విశదమౌతుంది. ఇక మిగిలినవి రెండుఘట్టాలు. వరూధినీ ప్రవర (మాయాప్రవర) వత్తాంతం, స్వరోచి వృత్తాంతం.

వరూధిని ప్రౌఢ అయిన సామాన్య నాయిక. వరూధిని లోని శృంగార రసోదయానికి ప్రవరుడు ఆలంబన విభావం. వరూధినికి ప్రవరుడు ఆలంబనం అయినట్లే, ప్రవరునికి కూడా వరూధిని ఆలంబన విభావం కావలసి ఉండెను. ఇలా పరస్పర ఆలంబనత్వం వల్ల మాత్రమే రసపోషణ జరుగుతుంది. కాని వరూధిని లాంటి భావం ప్రవరునికి లేదు ప్రవరుని రూపాదుల్ని చూసి అతనిలో కూడా రతి ఉన్నట్టు భావించి ఎంత కష్టమైనా అతన్ని తన వంకకు తిప్పుకోవడానికి వరూధిని సకల యత్నాలూ చేసింది.

"ప్రకృతమున బ్రవరుని చూడగనే కలిగిన వరూధినీ మనో వికార రూప 'రతి' యనెడి భావము తనకు విజాతీయమును, ప్రవరగతమునునైన ధర్మవీరముచే తిరస్కృతమయ్యును నశింపక వియోగమున దృఢమై మాయా ప్రవర సంయోగ పర్యంతము నిలిచి యుండుటచే స్థాయిత్వము నొంది, యేక తరావలంబన విభావమగు (ఒక్క) వరూధిని వలననే సామాజికుల యందు నౌపచారికముగా రస రూప మొందు చున్నది. మొదట వరూధిని నాలంబన విభావముగా గ్రహింత మనిన శృంగారమున నాయికా నాయకులుభయులును ఆలంబన విభావములు కాని యొక్కొక్కరు కారు గదా! ఇట బ్రవరుని యందు పరస్త్రీ రతికి విరోధియగు వైదిక కర్మోత్సాహము స్థాయి యగుచుండ రతియుభయ నిష్ఠము కాక యాలంబన విభావమే లేదనిపించును. కాని గృహస్థ వేషముతో రూప లావణ్యా సౌందర్యములతో గోచరించుచున్న ప్రవరుని యందు రతి యుండుననియే భావించి తదుద్బోధనముగా వరూధిని యత్నించుటచే నామె దృష్టిలో మాత్రమే నాతడాలంబన విభావమయ్యెను గావుననే (పరమార్థమున గాకున్నను) యాతనిని తనవంక కావర్జించుకొన యత్నించెను" 64 అని వెంపరాల వారి అభిప్రాయం.

అసలు భావాలనేవి ఆ యా పరిస్థితులు ఉద్దీపనల్ని బట్టి తాత్కాలికంగా ఉద్బుద్ధమై అప్పటికి అనుకూలంగా వర్తిస్తాయి. రత్యాది స్థాయి భావాలన్నీ ప్రతి మానసంలో వాసనా రూపంలో ఉండే ఉంటాయి ఆయా సన్నివేశాల బలం వల్ల ఆ స్థాయి భావం ఉద్బుద్ధమై, అచటి వాతావరణం దాని వృద్ధికి దోహద పడితే అది రసరూపాన్ని పొందుతుంది ఆ తర్వాత మరొక సన్నివేశంలో మరొక స్థాయి బావం ఉద్బుద్ధం కావచ్చు అచటి ఉద్దీపన, వ్యభిచారి మొ పోషక సామగ్రి ప్రకృష్టంగా ఉంటే ఆ స్థాయి చక్కగా పోషింపబడి రసరూపంగా పర్యవసిస్తుంది అంతేకాని మొదటే ఇతనిలో ఈ భావం కలదు ఈమెలో ఈ భావం ఉంది అని నిర్ణయించడం కష్టతరం వాటికి కలిగే ప్రేరణలు మొదలగు వాటివల్ల అతనిలో ప్రస్తుతంలో ఉన్న భావం తాత్కాలికంగా శమించి, మరొక భావం ఉద్బుద్ధం కావచ్చును వివిధాలైన మాటలచే మనసులు వివిధాలుగా మారుతున్నట్టే భావాలు మారడానికి అవకాశం లేకపోలేదు కాని కావ్య నాటకాలలో ఏదేని ఒక రస పోషణకై రచయిత తత్సంబంధమైన స్థాయిని ఉద్బుద్ధం చేసి, దానిని ఉద్దీపంప చేసి, పోషిస్తూ రసపర్యంతం దానికి అనేక పోషకాల్ని అందిస్తూ ఉంటాడు.

ప్రవరునిలో వైదిక కర్మోత్సాహం కలదని అతని నిత్య జీవితం వల్ల, వరూధినితో అతడు మాట్లాడిన తీరును బట్టి నిర్ణయించవచ్చు కాని అతనిలో 'రతి' అనేభావం అసలే లేదని చెప్పగలమా? ఆ భావం అతనిలో లేకుంటే అతడు గృహస్థు అయి ఉండడమే తటస్థించేది కాదు అతనిలో తక్కిన భావాల వలెనే 'రతి' కూడా వాసనా రూపంలో ఉండే ఉంది. వరూధిని అతని రూప లావణ్యాదులను చూడగానే అతన్ని'రతి' మంతుడని భావించడం యుక్తతరమే! మనం కూడా వరూధినీ ప్రవర సన్నివేశంలో అంతకు పూర్వపు ప్రవరుని

జీవితాన్ని మరచి, వారి వాదనకు మూలమైన రతి భావనతో ఉంటాం. వారి యుక్తి ప్రయుక్తి సంయుతం అయిన వాదోప వాదాలు సామాజికునిలో 'రతి'ని ఉద్బుద్ధం చేస్తూ, శమింపజేస్తూ సాగుతుంటాయి ఏ నిముషంలో అయినా ప్రవరుడు తన పట్టును విడువ గలడు అనే భావంచే వరూధిని లాగానే సామాజికుడు కూడా ఆశిస్తూ ఉంటాడు. 'భీతహరిణేక్షణ', 'అండజయాన' లాంటి ప్రవర సంబోధనలు వరూధినిని లాగానే సామాజికున్ని కూడా ప్రోత్సహిస్తున్నాయి. చివరిదాకా ప్రవరుడు ఏదో విధంగా లొంగుతాడేమో అనే భావంతో సామాజికుడు ఉంటాడు. అనుకూల వ్యతిరేక భావాలచే 'రతి'ని అత్యుత్కటంగా పోషిస్తూ శమింపజేస్తూ, అగ్నిలో మరగడం వల్ల బంగారం వన్నె దేరే లాగున 'రతి' ఉజ్జ్వలం కావడానికి ప్రవర వరూధినుల వాదోపవాదాలు ఎంతో తోడ్పడ్డాయి తనపై బడి అధరం ఆసించిన వరూధినిని ప్రవరుడు తోసి వేయడంతో సామాజికునిలో ఆటుపోట్లకు గురౌతున్న 'రతి' తాత్కాలికంగా శమిస్తుంది అది సామాజికునకు విశ్రాంతి సమయం. కాని వరూధినిలో మాత్రం ఆశ చావలేదు ఏవిధంగానైనా అతడు తనని అంగీకరిస్తాడనే భావిస్తుంది హవ్య వాహనుని కృపచే అతడు ఇల్లు చేరిన సంగతిని ఆమె ఎఱుగదు అచటి నికుంజాలలో అతడు సంచరిస్తుంటాడని, అంత నిర్దయతో తనని తోసి వేసినా, అతడు ఏదో ఒక సమయంలో తనను పరిగ్రహిస్తాడనే ప్రత్యాశతో ఉంది సామాజికునిలో వలె వరూధినిలో 'రతి' తాత్కాలికంగానైనా ఉపశమింపలేదు సరికదా! అత్యుత్కటం అయి ఆమెను విరహవేదన పాలు చేసింది.

విశ్రాంతి గైకొంటున్న సామాజికుడు వరూధిని భవిష్యత్తు గురించి అనేక ఊహలతో అటూ ఇటూ ఊగిసలాడుతుంటాడు ప్రవరుడు ఇంక రాడనే నిశ్చయం సామాజికునకు ఉంది కాబట్టి ప్రవర సమాగమం ఎలాగూ జరుగదు. కావున ఆమె తన భావాన్ని మార్చుకొంటుందా; లేక మిక్కిలి వ్యతిరేక భావంతో పురుష ద్వేషిణి ఔతుందా? అని తర్కించు కొంటూ ఉంటాడు తర్వాతి ఆమె విరహ వర్ణన సామాజికునిలో సానుభూతిని వృద్ధి చేసి తదనంతర ఫలితానికై ఉత్సుకుని చేస్తుంటుంది ఆ తర్వాత అతి మెలకువతో పెద్దన గారు మాయా ప్రవరుని ప్రవేశ పెట్టడంతో వరూధిని పై సానుభూతి కలిగిన సామాజికుడు ఆనందిస్తాడే కాని అసహ్యించు కోడు. వరూధిని తను కోరిన పురుషున్నే భావిస్తూ ఉండింది. కాని మనసును మార్చుకొని అన్యునిపై మరలించలేదు. అలాచేస్తే సామాజికుని సానుభూతిని కోల్పోయి అసహ్యాన్నే కలిగించేది. 'అనన్యకాంత' అయిన వరూధినీ మాయాప్రవర సమాగమంలో తత్పూర్వం 'రతి' శమించిన కాలంలో సామాజికునిలో కలిగిన తర్కం నశించి మళ్ళీ నెమ్మదిగా 'రతి' భావం ఉద్బుద్ధమౌతుంది వరూధినీ మాయా ప్రవరులు ఒకరికి ఒకరు ఆలంబనంగా నిలిచి 'రతి' అనే భావాన్ని చక్కగా పోషించారు వరూధినీ 'రతి'ప్రవర వ్యతిరేకతను కలిగిన దైనప్పటికీ 'ఉద్దీప్తి'తో మాయా ప్రవర సమాగమంతో ఫలవంతమైంది సామాజికుడు మాయా ప్రవరుని గూర్చి

ఆలోచించడం మొదలు పెడితే ఆ ఘట్టం అతనికి రసాభాసంగా కనిపిస్తుంది కాని ఆ సమయంలో సహృదయుడైన వాడెవ్వడూ తర్కానికి దిగడు కథలో లీనమై మాయాప్రవర ప్రవేశంతో ఆనందాశ్చర్యాలను పొంది రసాన్ని చర్వణ చేస్తుంటాడు. వారి సంభోగానంతరం శృంగారం ఫలవంతమైందని తృప్తి నొందుతాడు ఇక్కడ వరూధినీ మాయా ప్రవరులు పరస్పర ఆస్థ కలవారే. వారిద్దరిలో రతి భావం పోషంప బడింది. ఇవుడు వరూధిని ప్రవరునితో, తిరస్కరింప బడ్డట్లే అంతకు పూర్వం గంధర్వుడు కూడా వరూధినిచే తిరస్కరింప బడ్డాడు గంధర్వునిపై వరూధినికి, వరూధినిపై ప్రవరునకు పరస్పరాస్థ లేదు కర్మిష్ఠి అయిన ప్రవరుని వదలి ఆతని రూపాన్ని మాయాప్రవరునకు కల్పించి, తిరస్కృతులిద్దరకూ సమాగమం కల్పించి, వారి కోర్కెలను తీర్చి ఒక విచిత్రమైన రీతిలో శృంగారాన్ని పెద్దన గారు పోషించారు బ్రాహ్మణుడూ, మర్త్యుడూ అయిన ప్రవరుని వదలి గంధర్వ, అప్సరసలకు పొందు గూర్చడంలో పెద్దన గారు ఒక విధమైన ఔచిత్యాన్ని పాటించారు.

ఒక వ్యాజంచే తిరస్కృత పునస్సమాగమం కల్పించి ఇక్కడ శృంగారం భాసమా? ఆభాసమా? అనే భ్రాంతికి విమర్శకులను లోను చేసారు అల్లసానివారు ఇట ఆలంబన విభావాలలో గల పరస్పర వ్యతిరేకతను పరిహరించి పరస్పర ఆస్థ గల రెండు విభావాలను తీర్చిదిద్దడం జరిగింది ఇక్కడ పాత్రలు మూడు కనబడుతున్నా ఆలంబన విభావాలు మాత్రం రెండే వారు వరూధినీ ప్రవరులే వ్యతిరేక పరిహారానికి కవి గారికి ఒక మాయచేయక తప్పులేదు ఈ మాయ మూలంలో ఉన్నదే (ఇది మూలాన్ని అనుసరించిందే అయినా గొప్ప విషయమే) ఆ మాయా ఫలితమే పూర్వార్ధంలో ఆలంబన విభావంగా ఉన్న ప్రవరుడు ఉత్తరార్ధంలో మాయాప్రవరుడుగా తీర్చిదిద్దబడడం ఈ మాయాకల్పనలు, భ్రాంతులు కల్పించడంలో పెద్దనగారు సిద్ధహస్తులు తన చతుర రచనకు అనుకూలంగా ఎన్ని పోకడలనైనా పోగలరు

ఇక రెండవ ఘట్టమైన స్వరోచి చరిత్రంలో స్వరోచి ధీరోదాత్తుడయిన నాయకుడు. నాయికను చెప్పవలసి వస్తే నలుగురినీ చెప్పాల్సి ఉంటుంది ఇక్కడ రసాన్ని గూర్చి చెప్పవలసి వస్తే ఆలంకారికంగా సమర్థించడానికి వీలుంది కాని సాధారణ దృష్టితో ఆలోచిస్తే ఇదొక విచిత్ర సమస్యే,పరస్పర ఆస్థ నాయికా నాయకులకు ఉండాలి కదా! నాయకుడు నలుగురి ఎడ ఆస్థ కలిగి ఉన్నాడని చెప్పడం ఒక విధంగా అసంబద్ధంగానే కనిపిస్తోంది పరస్పరాలంబనంగా ఉండే 'రతి' ఇచట అవిచ్ఛిన్నంగా సాగిందనడం సంశయాత్మకమే స్వరోచి దక్షిణ నాయకత్వంతో నాయికలలోని రతిని సమర్థించడానికి వీలుంది దక్షిణ నాయకుడు అంటే ఏమిటి? పెక్కండ్రు నాయికలపై సమాన ప్రీతి గలవాడు దక్షిణుడు కదా! 'సమాన ప్రీతి' ఉండడం సాధ్యమా? హెచ్చు తగ్గులు ఉండవా? శ్రీకృష్ణుడూ దక్షిణుడే కదా! అష్ట భార్యలకు సమాన ప్రతిపత్తిని ఇచ్చాడా? అలా సమాన ప్రీతి కలిగి ఉంటే సత్యా రుక్మిణుల ఎడ అధిక ప్రత్యయాన్ని కలిగి ఉన్నాడనడంలో గల భావమేమిటి? రుక్మిణి

సత్యలపై ఆతడు చూపించిన 'ప్రీతి' లోనూ వ్యత్యాసం గలదు అట్టి యెడ సమాన ప్రీతికి అవకాశం ఎక్కడ ఉంది? అలాగని దక్షిణ నాయకత్వం దోషం అని కాదు. అది ఆలంకారిక సమ్మతం కూడా సాంఘిక పరిస్థితుల్ని బట్టే లక్షణాలూ ఏర్పడు తుంటాయి కృష్ణుడు దక్షిణ నాయకుడు కాగా రాముడు అనుకూలుడుగా ఉండేవాడు ఒక కాలంలో బహుభార్యాత్వం సంఘ సమ్మతం మరొక కాలంలో కాక పోవచ్చు ఒక కాలంలో ఏకపత్నీవ్రతం ఉత్తమ లక్షణం కాగా మరొక కాలంలో దానికి విప్రతి పత్తి కలుగవచ్చు కాలానుగుణం గానూ, కాలాతీతం గానూ వచ్చిన కావ్య నాటకాలాధారంగా చేసుకొనే ఆలంకారికులు లక్షణాల్ని నిర్ణయించి ఉన్నారు కాని విమర్శకుడు తాను ఉన్న సామాజిక, కాలావధులకు లోబడి ఆలోచిస్తాడు ఆనాటి నీతి నియమాలను, కట్టుబాట్లను, మంచి చెడు లను దృష్టిలో ఉంచుకొని ఆలోచిస్తాడు కాబట్టి ఒక లక్షణాన్ని సమంజసమైందా? కాదా! అనితర్కించడం తప్పుకాదు

స్వరోచికి నలుగురి యందూ ప్రీతి ఉండవచ్చును కాని 'సమాన ప్రీతి' కలదనడం నిర్వివాదాంశం కాదు వెంపరాల వారి భావలో చెప్పాలంటే ఒకరిపై ప్రధాన ప్రీతి, తదితరులపై ఔపచారిక ప్రీతి కలదని చెప్పవలసి ఉంటుంది కాని ఇక్కడ కేవల సన్నివేశం మాత్రమే చిత్రింపబడి ఉండలేదు స్వరోచి జీవిత గమనం చిత్రీకరింపబడి ఉంది తన సాంసారిక జీవితంలో ఎలాంటి ఒడుదొడుకులు లేక నలుగురు భార్యలూ తనకు విముఖులు కాకుండేట్లుగా చూసుకొని, తన సుఖానికి కొఱత రాకుండేట్లు చూసుకొన్నాడు అందుకే అతడు దక్షిణ నాయకుడు అందుకే ఇట శృంగారం ఫలావస్థను పొందిందని చెప్పవచ్చు తన వీరత్వాన్ని ప్రదర్శించి మనోరమ మనశ్శరీరాల్ని తండ్రి దత్తతచే పరిగ్రహించాడు మనోరమ మానసిక ఖేదాన్ని పోగొట్టి, ఆమెకు ప్రీతి కలిగించడానికై విభావసి, కళావతుల రోగాన్ని దూరం చేసి, ఆమె అనుమతితో వారి కోరికపై వారిని చేపట్టాడు వారిని చెపట్టడంతో మనోరమా స్వరోచుల భోగానికి కలిగిన ఆటంకం పరిహారమైంది తర్వాత వాళ్ళతో అనేక సంవత్సరాలు ప్రీతితో అనుభవించాడు మధ్యలో విజాతీయ భావాలు తనపై ప్రబావాన్ని చూవ యత్నించినా స్వరోచిలోని 'రతి' తల ఒగ్గలేదు. మీదు మిక్కిలి అతి మిక్కుటమై భోగావస్థ నొందింది ఆ తర్వాత ఆడు జింక స్వరోచి వేటకు రాగా వరాహం బదులు తనను చంపుమని కోరింది. నీకు ఈ దేహంపై రోత ఏల జనించిందని ప్రశ్నించగా అన్యకాంతాసక్తుని కలయిక కోరడం కంటే మరణమే మేలంది నీ మనసులో ఎవరిని కోరావు అంటే తన మనో రథాన్ని వ్యక్త పరచింది అది తిర్యక్కని స్వరోచికి తెలుసు మానవునకు తిర్యక్కులతో సంభోగం ఎలా? ఇట జాతి భేదం సంయోగానికి ఆటంకం కలిగిస్తుంది ఆజాతి బేదాన్ని పరిహరించి ఏక జాతిగ చేసినగాని సంయోగానికి అవకాశంలేదు కాబట్టి ఆ మృగం తనను కౌగిలించుకుంటే చాలన్నది అతని కౌగిలితో తన రూపం తనకు వచ్చి, ఆటంకం పరిహార మౌతుందని ఆ లేడికి తెలుసు అందుకే అది అలా కోరింది మానవత్వంతో స్వరోచి దాని

కోరికను అంగీకరించాడు. అది వనదేవతా రూపాన్ని పొందింది దాన్ని స్వరోచి పరిగ్రహించాడు. ఆవిధంగా తన జీవిత గమనంలో ఆయా సంఘటనల ద్వారా తటస్థించిన కన్నెలను (నాయికలను) పరిగ్రహించి 'ప్రీతి'తో వారిని చూసుకోవడంతో శృంగారం ఫలవంతమైంది అలాగైతే 'రతి' ఏ నాయికలో ఉన్నట్లు? నలుగురిలోనూ కలదు అది ఎలాసాధ్యం? సమాన ప్రీతి కలిగి ఉన్న స్వరోచికి అందరి నాయికలందూ సమానమైన రతే ప్రతిఫలించింది స్వరోచికి నలుగురిలో కనిపించిన సమాన రతే సామాజికులకు గూడా కనిపించి శృంగారం అవిచ్ఛిన్నంగా సాగడానికి హేతువైంది ఇచటి నలుగురు నాయికల్ని కూడా సామూహికంగా ఒకే ఆలంబనంగా పరిగ్రహించవచ్చు ప్రవర వరూథినీ మట్టంలో పాత్రలు ఇద్దరైనా ఒకే ఆలంబన విభావంగా భాసించిన విధంగా ఇక్కడకూడా నాయికలు మనోరమాది పాత్రలు నాలుగు పాత్రలుగా కనిపిస్తున్నా, నలుగురిని కలిపి ఒకే సామూహిక ఆలంబనంగా మనం పరిగ్రహించవచ్చు ఇందు అసంబద్ధం ఏదీలేదు ప్రవర వరూథినీ మట్టంలో అనేక పాత్రల మూలాన ఏకాలంబనం కల్పించినట్లే ఇచట కూడా అనేక పాత్రల మూలాన ఏకాలంబనాన్ని కవిగారు కల్పించారు రెండు చోట్లా మూలసూత్రం ఒకటే కాని ఒక భేదం ఉంది అదేమన, అక్కడ ప్రవర, మాయా ప్రవర రూపంలో ఉన్న రెండు పురుష పాత్రలను ఒక పురుషాలంబన విభావంగా తీర్చిదిద్దగా ఇక్కడ అనేక నాయికలు అంటే మనోరమ, విభావసి, కళావతి, వనదేవతలు అనే అనెక స్త్రీపాత్రల్ని ఒక స్త్రీ ఆలంబన విభావంగా తీర్చిదిద్దారు ప్రవర, మాయాప్రవర సమ్మేళనంలో భౌతిక రూప భేదం లేదు ఇక్కడ ఉంది ఈ స్త్రీ ఆలంబన రూప కల్పనలో ఒక విశేషం ఉంది నలుగురిలో ఒక నాయిక అదివ్య తక్కిన వారు దివ్యులు ఈ దివ్యమానవ సంయోగాన్ని ఇచట కల్పించడంలో సార్థకత ఉంది స్వరోచి కూడా దివ్యమానవ సంయోగ ఫలితమే కదా! వరూథిని అప్సర స్త్రీ ప్రవరుడు మానవుడు ఆలంబనంలో సమతూకానికై దివ్య మానవత్వ సమ్మేళనం చేసిన పెద్దనగారి ఉపజ్ఞ ఎలాంటిదో మనం ఊహించవచ్చు ఇక్కడ ఆలంబన విభావాలలో దివ్య మాన వాంశ ఉంది

కళావతి జన్మ వృత్తాంతం చెప్పేటప్పుడు ఆమె తండ్రి పారుదనే ఋషి, పుంజికస్థల అనే అప్సరసతో సంయోగం పొందిన ఘట్టం వర్ణించబడింది ఇది కూడా శృంగార ప్రధానమైన సన్నివేశమే ఇట తపస్సులో లీనమై శమ ప్రధానుడైన పారర్షిలో సుప్తమై ఉన్న 'రతి'ని పుంజికస్థల కావాలని బలవంతంగా ప్రబుద్ధం చేసింది ఆమె రూపం సౌందర్యాది ఉద్దీపనల ముందు, ఒంపు సొంపుల ముందు శమం శమించి, 'రతి' దీప్తమైంది ఇక్కడ కూడా పుంజికస్థల అప్సరస దివ్యవనిత దేవవేశ్య పారుదు మానవుడు వృత్తిచే ఋషి ఇచట పారర్షి పుంజిక స్థలల పరస్పర ఆలంబనంతో 'రతి' ఉద్బుద్ధమైంది. ఇట కూడా దివ్యమానవ సంయోగమే చిత్రించ బడింది ఇది కవిగారి ప్రణాళికకు అనుకూల మైంది.

ఈ విధంగా ప్రతి సన్నివేశంలోనూ కవి గారు మిక్కిలి ఉపజ్ఞతో దివ్యమానవ ఆలంబన విభావాలు, దివ్యమాన వాంశగం ఆలంబన విభావాలను సృష్టించి రత్యంకురం గావించి రసపోషణకు మిక్కిలి అనుకూలంగా ప్రణాళికను ఏర్పరచుకొన్నారు

2. ఉద్దీపన విభావాలు.-

ఆలంబన గుణాలనీ, వారి చేష్టలనీ, వారి అలంకరణాలనీ, తటస్థాలనీ ఉద్దీపన విభావాలు నాలుగు విధాలుగా ఉంటాయి రూపయౌవనాది నాయికా నాయకుల గుణాలే ఆలంబన గుణాలు, హావభావాదికాలైన వారి చేష్టలే చేష్టలనే ఉద్దీపనాలు నూపురాంగహారాదులైన ఆభరణాల వర్ణన తదలంకరణాలు చంద్రికా మలయానిలాదులు తటస్థాలైన ఉద్దీపన విభావాలు శృంగార రసం ఉత్పత్తి కావడానికి ఈ సామగ్రి మిక్కిలి ఉపయోగ పడుతుంది ఈ సామగ్రిని పెద్దనగారు మనోహరంగా సమకూర్చారు

నాయకుడైన ప్రవరుడు 'తురుణాగ్ని హోత్రి' అంటే లేబ్రాయపుయజ్వ అనీ "తీర్థ సంవాసులేతెంచినారని .. "65 అనే పద్యంలో చెప్పబడి ఉంది ప్రవరుడు యువకుడని చెప్పబడడంచే 'ప్రాయం' అనే ఆలంబన గుణం ఇచట పొందు పరచబడింది. అలాగే నాయిక అయిన వరూధిని కూడా యౌవనవతి అని ఈ కింది పద్యంలో కవి ఆమెకు వాడిన విశేషణాల వల్ల తెలుస్తుంది

. కనియెన్ విద్యుల్లతా విగ్రహన్
శత పత్రేక్షణ జంచరీక చికురన్ జంద్రాస్య జక్రస్తనిన్
నతనాభిన్ నవలా నొకానొక మరున్నారీ శిరోరత్నమున్ "66

దీంట్లో వరూధిని 'నవలా' అనీ, 'మరున్నారీ శిరోరత్నం' అనీ వర్ణించ బడింది నవలా అనగా నవ లావణ్యవతి అనీ, జవరాలని అర్థం మరున్నారీ శిరోరత్నం అంటే దేవతా స్త్రీలలో మిన్న అయిందని అర్థం వరూధిని దేవతా స్త్రీ కాబట్టి దేవతలు నిర్జరులు అంటే ముసలితనం లేనివారు కాబట్టి ఆమె నిత్య యౌవనవతి అని తెలుస్తుంది

ఇక రూపంలో ఒకరిని మించిన వారు ఒకరు దేవతా స్త్రీ అయిన వరూధినికే అబ్బురం కలిగించిన సౌందర్యం ప్రవరునిది అతడు మకరాంక, శశాంక మనోజ్ఞమూర్తి యక్ష తనయేందు జయంత వసంత కంతులను చక్కదనంలో గెలువ జాలేవాడు అతని సౌందర్యం ఇంకా "వదన ప్రమాత లావణ్యాంబు సంభూత కమలంబులన వీని కన్నులమరు "67 అనే పద్యంలో వర్ణించ బడింది. ప్రవరుని ఈ సౌందర్యమే వరూధినికి ఉద్దీపనం కలిగించింది వరూధిని కూడా మిక్కిలి రూపవతి ఆమె విద్యుల్లతా విగ్రహ, శత

పత్రేక్షణ, చంచరీక చికుర, చంద్రాస్య కాబట్టి (గంధర్వునికి ఉద్దీపనం కలిగించింది ) ఆమె సౌందర్యాన్ని గూర్చి ప్రత్యేకంగా చెప్పవలసిన పనిలేదు ఈ విధంగా నాయికా నాయకులైన ప్రవర వరూధినులలో రూప యౌవనాది గుణాలు ఉద్దీపన విభావాలుగా ఉన్నాయి.

వరూధిని శృంగార చేష్టలు మనుచరిత్రలో మనోహరంగా వర్ణింపబడి ఉన్నాయి మొట్టమొదట వరూధిని ప్రవరుని చూడగానే " . . లేచికుచంబులున్ దుఱుము లేనడుమల్లలనాడ . . ఒక్క పోక నును బోదియ చేరడం, "68ఆలాపగతి జొక్కి యరమోడ్పుగనుదోయి, రతి పారవశ్య విభ్రమము దెలుప"69 అనే దానిలో వీణ వాయించేపుడు రతి పారవశ్య విభ్రమం తెలుపునట్టి 'అరమోడ్పు గనుదోయి' అనేవి శృంగార చేష్టలు ఈ వరూధినీ చేష్టల వల్ల ఉద్దీపనం కలిగించ బడుతుంది ఈ శృంగార చేష్టలలో భావ, హావ, హేల, విలాస, మాధుర్యాది పద్దెనిమిది చేష్టలు చెప్పబడ్డాయి వీటిలో కొన్నిటిని మనుచరిత్రలో మనం దర్శిద్దాం.

"చూచి ఝళంఝుళత్కటక . ."70 ఇత్యాది పద్యంలో వరూధిని పోక చెట్టును సుకుమారంగా చేరడాన్ని వర్ణించాడు కాబట్టి ఇది 'లలితం' అనే శృంగార చేష్ట ఈ పద్యాంతంలో 'విలోకన ప్రభావీచికలన్ దదీయ పదవీ కలశాంబుధి వెల్లి గొల్పుచున్ ' అనే దాంట్లో 'విలాసం' అనే శృంగార చేష్ట కలదు తనకు ఇష్టమైన రూపం కనిపించింది కాబట్టి ఒయ్యారంగా చూస్తున్నది కాబట్టి విలాసం " ఇంతలు కన్నులుండ"71 అనే పద్యంలో భావం' అనే శృంగార చేష్ట ఉంది ఇలాగే తక్కిన చేష్టలు కూడా అచ్చటచ్చట ఉన్నాయి

నూపురాంగ హారాదులు కూడా అచ్చటచ్చట చక్కగా వర్ణింప బడ్డాయి ఝళం ఝళత్కటకాలు, ప్రాంచద్భూషణాలు, కలక్వణత్కనక కాంచిక మొదలగునవి వరూధినికి గల ఆభరణాలు ప్రవరునికి రమణీయ మణికుండలాలు, కాశికాముద్ర ఇడిన ఉంగరము, పసిడి తోరణం, మొదలగు ఆభరణాలు కలవు ఇవి కూడా ఉద్దీపన విభావాలే

ఇక తటస్థాలైన ఉద్దీపన విభావాలు ప్రవర వరూధినులకు లభించిన ఏకాంతం, ఆమె గారుడోత్కీర్ణ భవనం, తత్పరిసర ప్రాంతాలు తటస్థ ఉద్దీపనాలు.

"తావుల్ క్రేవల జల్లు చెంగలువ కేదారంబు తీరంబునన్
మావుల్ క్రోవులు నల్లిబిల్లి గొను కాంతారంబు నందైందవ
గ్రావాకల్పిత కాయమాన జటిల ద్రాక్షా గుళుచ్ఛంబులన్
బూవుందీ వెల నొప్పు నొక్క భవనంబున్ గారుడోత్కీర్ణమున్"72

ఈ పద్యంలో గారుడోత్కీర్ణ భవన ప్రాంతపు వాతావరణం, అచటి పరిసరాలు వర్ణించ బడ్డాయి

"అమల మణిమయ నిజ మందిరాంగణస్థ
తరుణ సహకార మూల వితర్ది మీద
శీతలానిల మొలయ నాసీనయైన. . . 73

సహకార మూలంలోని తిన్నె, శీతలానిలం అనేవి తటస్థ ఉద్దీపనాలు.

" బహురత్నద్యుతి మేదురోదర దరీభాగంబులన్ బొల్చుని
మ్మహికాహార్యమునన్ జరింతు మెపుడుం బ్రేమన్నభోవాహినీ
లహరీ శీతల గంధవాహ పరిఖేలన్మంజరీ సౌరభ
గ్రహణేందిందిర తుందిలంబులివి మత్కాంతార సంతానముల్"74

రత్నాలతో కూడిన గుహలుగల హిమవత్పర్వతం, ఆకాశ గంగానది నుండి వచ్చు చల్లని గాలి, పూవుల పరిమళం, ఆ పరిమళానికి మూగిన తుమ్మెదలు గల ఉద్యాన వనాలు ఇందు వర్ణింప బడ్డ తటస్థ ఉద్దీపన విభావాలు ఇవేగాక "సద్యో వినిర్భిన్న సారంగ నాభికా . . "75 అనే పద్యంలో భోగ వస్తువులయిన కస్తూరి, జవ్వాజి, పచ్చ కర్పూరం, పన్నీరు, పువ్వులు, వండ్లు, మృదువైన వలువలు, సొమ్ములు, మద్యాలు వర్ణింపబడ్డాయి ఇవి కూడా శృంగారంలో తటస్థ ఉద్దీపనాలే వారి మాటలు, చేష్టలు, వాతావరణం, కాలం, పరిసరాలు తదితర భావాలన్నీ అంటే ఆలంబన సాత్త్వికాది భావాలన్నీ ఉద్దీపనాలుగానే ఉంటాయి ప్రవరుని సంబోధనలు, వరూధినిలో కలిగిన వికారాలు, భావాలు, చేష్టలు అన్నీ ఉద్దీపన విభావాలే.

వరూధినీ విరహంలో చంద్ర, మలయానిల, వసంత, మన్మథ దూషణంలు వర్ణించబడ్డాయి ఇవీ తటస్థ ఉద్దీపనాలే వాటి ఉద్దీపన ధాటికి తాళలేకనే వరూధిని వాటిని నిందించింది ఈ విధంగా వరూధినీ ప్రవరుల ఘట్టంలో ఉద్దీపన విభావాలు సమకూర్చబడ్డాయి.

స్వరోచి వృత్తాంతంలో కూడా ఇవి ఉన్నాయి.

స్వరోచి, మనోరమలకు రూపం, యౌవనం, రెండూ ఉన్నాయి స్వరోచికి మామ అయిన ఇందీవరాక్షుని వల్ల గజాంత ఐశ్వర్యం లభించింది. అనేక బంగారు ఆభరణాలు కానుకలుగా లభించాయి స్వరోచి మామవల్ల రత్నఖచితమైన విమానాన్ని కూడా కానుకగా పొందాడు. మనోరమకు తండ్రి వెండి, బంగారు వస్తువులు, పలువిధాలైన గృహ ఉపకరణాలు, రత్న విభూషలు, చిత్రవిచిత్ర వసనాలు, అమూల్యాగరు, మృగమద సంకుమద కుంకుమ పటీర కర్పూర హిమాంబు పూరంబులు దట్టు పునుంగు నగరుసత్తును, మంచి గందవొడి, చాదుదయ భాస్కరంబు లోనుగా గల పరిమళ ద్రవ్య సంభార

పరంపరలు, తరుణ దాసీ జనాన్ని ఇచ్చారు ఇంతేగాక రతనపు గనులు కలవీ, పూదేనెల తోడా, కల్పవృక్షాల తోడా, కస్తూరీ మృగాలతోడా, సరస్సుల తోడా, లోకోత్తర సౌభాగ్యంచే అలరారే కొన్ని గ్రామాల్ని కూడా అరణంగా ఇచ్చారు. పెండ్లి సమయంలో లభించిన అలంకరణ సామగ్రి, పరిమళ ద్రవ్య సంభారం ఇవన్నీ వారి భావి భోగంలో ఉద్దీపనాలుగా ఉంటాయి.

"పాండుర ప్రభగ్రిందు వడిన ... నొవ్వు మేడమీద"76

అనే పద్యంలో నీలమణుల తిన్నెలు, అగరు ధూమాలు, చిత్రాలు, కీచు బిళ్ళల పట్టె మంచం, ఇవన్నీ కలిగిన మేడ - వారి సంభోగ శృంగారానికి ఉద్దీపనంగా ఉన్నాయి సంభోగ సమయంలో మనోరమకు చేసిన అలంకరణాలు "చెంగల్వ పూదండ సేర్చి - - "77 అనే పద్యంలో చక్కగా వివరింప బడ్డాయి

ఆమె నడుముకు గట్టిన ముత్యాల మొలనూలు, మెడలో వేసిన ఒంటి పేట ముత్యాలహారం, ఆమెకు తొడిగిన ఇతర రత్నాలంకారాలు, కాళ్ళకు ఘల్లుఘల్లు మని మోగే అందెలు ఇవన్నీ స్వరోచిలోని 'రతి' ని ఉద్దీపింప చేస్తాయి ఇట ఇవి అలంకరణ ఉద్దీపన విభావాలు ఈ విధంగా మనోరమ, స్వరోచులకు తగిన ఉద్దీపన సామగ్రి సమకూర్చబడి వారిలోని 'రతి'ని ఉద్దీపింప చేయడానికి తోడ్పడింది.

ఈ స్వరోచి వృత్తాంతంలోనే మరో నాయిక అయిన కళావతి గూడా యౌవన వతే "ఎవ్వరు చూచిన ... "78 అనే పద్యంలో 'పావపు జవ్వన మెదిరించె జిగియెసగ నామేనన్' అని ఆమె యౌవనం తెలుపబడింది. "అతి సౌందర్య నిశాంతమీ తనువు "79 అనే పద్యంలో ఆమె రూపం వర్ణించ బడింది ఇవి ఆలంబన గుణాలు విభావసి కూడా రూప యౌవనాలు కలిగిన నాయికే

విభావసి, కళావతులను కూడా పెండ్లి అయిన తర్వాత మనోరమాది ముగ్గురు నాయికలతో స్వరోచి సల్పిన వివిధ విహారాలలో తటస్థ ఉద్దీపన విభావాలనేకం చిత్రించ బడ్డాయి "గంగా తరంగిణీ రంగత్తరంగ .. "80 అనే పద్యంలో నదీ సైకత ప్రదేశాలు, విహారవనాలు, చంద్రకాంత శిలావేదికలు గల పర్వత గహ్వరాలు, సరస్తీరాలు మున్నగు తటస్థ ఉద్దీపన విభావాలు కలవు 6. ఆశ్వా లోని 64వ పద్యంలో మలయానిలం కలదు

ఈ విధంగా ప్రవర వరూధినుల ఘట్టంలో లాగానే స్వరోచి వృత్తాంతంలోనూ చక్కని ఉద్దీపన విభావాల్ని సమకూర్చి రస పోషణ కావించ బడింది పుంజికస్థల పారద్వుల సన్నివేశంలో కూడా నాయిక అలంకరణం, వసంత ఋతువు మొదలగునవి ఉద్దీపన విభావాలుగా ఉన్నాయి

b) అనుభావాలోకనం:-

ప్రవర వరూధినీ ఘట్టంలో వీణ వాయిస్తున్న వరూధినికి ప్రవరుడు కనిపించి నప్పటి నుండి మనస్సులో అనేక భావాలు ఉత్పన్నమై వివిధ రీతుల వెలువడ్డాయి ఇవే అనుభావాలు. ప్రవరుని చూడగనే వరూధినిలో కలిగిన మార్పులు ఇలా వర్ణింప బడ్డాయి.

" అబ్బురపాటు తోడ నయనాంబుజముల్ వికసింపగాంతిపె
ల్లుబ్బి కనీనికల్ వికసితోత్పల వంక్తుల గ్రుమ్మరింపగా
గుబ్బ మెఱుంగు జన్గవ గగుర్పొడవన్ మదిలోన గోరికల్
గుబ్బ తిలంగ జూచె నలకూబర సన్నిభు నద్ధరా మరున్"81

వరూధినికి ప్రవరుని చూడగానే ఆశ్చర్యం కలిగి కనులు వికసించాయి. అంతవరకు నిర్వికారంగా ఉన్న వరూధిని చిత్తంలో ప్రవరుని చూడడంతోనే ఆ సౌందర్యానికి ఆశ్చర్యం కలిగింది ఇది భావం ఆమె కనులు వికసించడంలో 'హావం' కలదు చనుగవ గగుర్పొడవడంలో ఆమెలో కలిగిన వికారం సువ్యక్తమౌతుంది. కాబట్టి అది 'హేల' వరూధిని ప్రౌఢ కావున ఒకటి వెంట ఒకటి భావాలన్నీ వ్యక్తమైనాయి

"చూచి ఝళంఝళత్కటక సూచిత వేగ పదారవిందయై
లేచి కుచంబులున్ దుఱములేనడుమల్లలనాడ నయ్యెడన్
బూచిన యొక్క పోకనును బోదియ జేరి విలోకన ప్రభా
వీచికలన్ దదీయ పదవీ కలశాంబుధి వెల్లి గొల్పుచున్"82

లేనడుము అల్లల్లాడే విధంగా పోకనునుబోదియ చేరడంలో ఆమె పద విన్యాసం, ఒయ్యారం అతి రమణీయంగా చిత్రించ బడ్డాయి ఇట ఆమె నడకలో విశేషం కనబడుతుంది. కాబట్టి ఇది 'విలాసం'

"మునుమున్ పుట్టెడు కొంకు .. "83 అనే పద్యంలో 'విలాసం'తో పాటు 'మాధుర్యం' కూడా కలదు కొంకు, లౌల్యం, మున్నగు లక్షణాలు కలిగిన వరూధిని రమణీయంగా కనిపిస్తుంది కావున ఇది మాధుర్యం. ద్వితీయాశ్వాసంలోని 28,29,30 సంఖ్య గల పద్యాలలో వరూధిని ప్రవరుని చూడడం వర్ణించారు ఈ మూడింటిలో 'కటాక్షం' అనే అనుభావం ఉంది. చూచి ఝళంఝళత్కటక - లో లలితం అనే భావం కూడా కలదు. 'అబ్బుర పాటుతోడ' అనే పూర్వోక్త పద్యంలో హర్షాతిశయంచే కలిగిన 'రోమాంచం' అనే సాత్త్విక భావం ఉంది. 'మునుమున్ పుట్టెడు కొంకు' అనే పద్యంలో స్తంభం, "వంకజముఖి కప్పుడు. .. "84 అనే పద్యంలో రోమాంచం అనే భావం వర్ణించబడ్డాయి. "తొంగలి ఱెప్పలం .. లేజెమట గ్రమ్మెలలాటము డిగ్గి చెక్కులన్"85 అనే దాంట్లోను, "అనిమేష స్థితి మాన్పె .. "86 అనే దాంట్లోను 'స్వేదం' అనే సాత్త్విక భావం వర్ణించ బడింది.

"పాటన సేయమిన్ గురులు పైబడి శీర్ణ పటీర పంకలా
లాటికమై దరస్మిత విలాసపు జంద్రిక దొంకి వాడుటన్
దేట దొఱంగి విన్ననగు నీ మొగమోయన మాసి చంద్రుడో
పాటల గంధి వ్రాలెనదె భాను రుచిన్ దనకందు మీఱగన్"87అనే పద్యంలోనూ,
"వాడిన మోము దమ్మి తెలి వాలుకన్నులు విన్నబోవ"88 అనే పద్యంలోనూ 'వైవర్ణ్యం'
-అనే సాత్త్విక భావం ఉంది

ఈ కింది పద్యంలో అనేక సాత్త్విక భావాలు చిత్రించ బడ్డాయి
"తొలుదొల్త వాని గన్నుల గాంచినప్పుడవల్లవాధర గుండె జల్లుమనియె
నట రెండు మూదంజ లరుగునప్పుడ కాళ్ళబంకజాక్షికి దొట్రుపాటు కదిరె
డాయంగ జనునప్పుడ ముఖాంబుజంబునగంబు కంధరకు దైన్యంబు దోచె
గదిసి నిల్చిన యప్డ కనుదోయి ఱెప్పలలలనకు మిగుల జంచలత బెరసె
గటకటా యనునపుడ గద్గదిక వొదమెజెఱగు పట్టిన యవుడ లేజెమట గ్రమ్మె
నొలసి మాటాడ నుంకింప దలచి మోముదేరకొని చూచునపుడ కన్నీరు వొడమె"89

ఇందు మొదటి పాదంలో రాగంచే కలిగిన గాత్రవేపథువు వర్ణించడం వల్ల 'కంపం, ' రెండవ పాదంలోనూ 'కంపం' గీతి మొదటి పాదంలో వైస్వర్యం, రెండవ పాదంలో 'స్వేదం', చివరి పాదంలో 'అశ్రువు' అనే సాత్త్విక భావాలు ఉన్నాయి

"అనినన్ జిత్రము జల్లనన్ . . ."90 అనే పద్యంలోనూ "అత్తటి గంధర్వ . . . "91 అనే పద్యంలోనూ కూడా 'అశ్రువు' అనే సాత్త్విక భావం చిత్రించ బడింది

ద్వితీయాశ్వాసంలోని 66వ పద్యంలోనూ, తృతీయాశ్వాసంలోని 91వ పద్యంలోనూ 'వైస్వర్యం' కలదు

ఇక స్వరోచి వృత్తాంతంలో,
"చిలుకలకొల్కి కల్కి యొక చేడియ నాటకసాల మేడపై
నిలువున నాడుచుండి ధరణీపతి జూడ దలంచి యంచునన్
నిలిచిరహిన్ గనుంగొనుచు నెయ్యమునన్ దనువల్లియుబ్బికం
చెలతెగిపడ్డగేతనము చీర చెఱంగును మూసె జన్నులన్"92
ఈ పద్యంలో భావం, హావం, హేల-అనే అనుభావాలు చిత్రించబడ్డాయి

"పరవశ దైన్యమాడుకొను . "93లో 'స్తంభం', 'స్వేదం'లూ, 'అలికులవేణియొక్కతె " 94లో స్తంభం, రోమాంచం, స్వేదాలూ, "అలరులబంతి జృంభికకు. . . ." 95

అనేదానిలో 'అశ్రువు', అనే సాత్త్విక భావాలు చిత్రీకరింప బడ్డాయి. ఈ పై భావాలన్నీ పెండ్లికోసం వచ్చే స్వరోచిని చూస్తున్న స్త్రీలలో వ్యక్తమైనవి. ఇక స్వరోచి, మనోరమల వివాహ ఘట్టంలో

"అవనీశత్రిదశేంద్రు చూపు బరి .. .."96 అనే పద్యంలో 'స్వేదం',

"సకల క్ష్మాపతి. . .. "97 అనే దాంట్లోనూ స్వేదం అనే సాత్త్విక భావం స్వరోచి, మనోరమలకు కలిగినట్లు చిత్రించ బడ్డాయి

"మేనుగరుపాఱ దమిన
మ్మౌని జపము తపము దన్నుమఱచి యనంగ
గ్లాని బడి కదిసి వడకుచు
హీనస్వర మెసగ బ్రోవవే నన్నుచున్" 98

అనే పద్యంలో రోమాంచం, ప్రళయం, కంపం, వైస్వర్యం అనే సాత్త్విక భావాలు పారర్షిక చెప్పబడ్డాయి.

ఈ విధంగా ప్రవర వరూధినీ ఘట్టంలో లాగానే స్వరోచి వృత్తాంతంలోనూ అనుభావాలు చక్కగా పొందుపరచబడి, శృంగార రస పోషణకు మిక్కిలి ఉపయుక్తాలైనాయి ప్రధాన ఘట్టాలందే గాక తదితర స్థలాల్లోనూ ఈ భావాలు చిత్రించబడి శృంగార రసాభివ్యక్తికి తోడ్పడ్డాయి

C. సంచారీ సమాలోచనం -

మనుచరిత్రలో సంచారీ భావాలు చక్కగా పోషించ బడ్డాయి ప్రవర తిరస్కృత అయిన వరూధిని లోని 'రతి' అడుగంటలేదు ప్రవరుడు వెళ్ళిపోయిన తర్వాత కూడా అతడు ఎక్కడైనా ఉండవచ్చు అనే ఆశతో అన్వేషణ ప్రారంభించింది. కాని అతనిని కానక దుఃఖ సముద్రంలో మునిగి నిస్పృహచెంది, ప్రవరుని రూపాద్దుల్ని పొగడి అట్టివాడిని చేపట్టకుంటే చక్కదనం, యౌవనాలే కాదు ప్రాణాలు కూడా వ్యర్థమే అని భావించింది.

"చొక్కపు బ్రాయమున్ మిగుల సోయగమున్ గల ప్రాణ నాయకుం
డెక్కడు వశ్యతన్ రతులనేకట దీర్చి సమేళ మొప్పగా
నక్కున గారవించి ప్రియమందగ నోచని యింతిదైనయా
చక్కదనం బదేమిటికి జవ్వన మేటికి బ్రాణమేటికిన్"99

ఈ పద్యంలో సౌందర్య, యౌవన, ప్రాణాలపై 'అరతి' అనే సంచారీభావం, 'దైన్యం' అనే సంచారి వ్యక్తమవడమే గాక 'నిర్వేదం' అనే సంచారీ భావం మిక్కిలి ప్రస్ఫుట మౌతుంది

"ఎంత తపంబు చేసి జనియించిన వారొకొ మర్త్యభామినులో"100

ఇత్యాది పద్యంలోని వరూధిని విలాపోక్తులలో చింత, నిర్వేదం, దైన్యం, అంతం మున్నగు అనేక సంచారులు స్ఫురిస్తున్నాయి.

"వ. అని వితర్కించు చుంగ్రించు దనంబునన్ ............ వేగు చుండెనంత "101 ఈ వచనంలో మనోరుజచే వరూధినికి వైవర్ణ్య, శిథిలాంగత్వాదులు కలిగినట్లు చిత్రించ బడింది కాబట్టి ఇది 'గ్లాని'.

"ఏలర యీ చలంబుడిగి యేలర - "102 అనే పద్యంలో 'ఆర్తి', "ఎక్కడియూరు - ."103, "అంధునకు గొఱయె - . "104, "ఎన్ని భవంబులన్ గలుగు"105 అనే పద్యాలలో వరూధిని యొక్క 'గర్వం' అనే సంచారి చిత్రించ బడింది.

'చూచి ఝుళంఝుళత్కటకొ అనే పూర్వోక్త పద్యంలో 'ఆవేగం' అనే సంచారీ భావం ఉంది.

తృతీయాశ్వాసంలో వరూధిని చంద్ర, మన్మథ, మలయానిలుల్ని ఉపాలంభించిన పట్టున 'ఔగ్ర్యం' లేదా 'ఉగ్రత' అనే సంచారి ఉంది

తృతీయాశ్వాసంలోని 3,4,5 పద్యాలలో విషాదం, 52వ సంఖ్య గల వచనంలో 'మోహం', ద్వితీయాశ్వాసంలోని 61వ సంఖ్య గల వచనంలో 'మదం' అనే సంచారీ భావం చిత్రించబడ్డాయి

"చనుగవ్వ దొలగ వాసన గాలి కెదురేగు

బరువెవ్వ నలుగుల జారు కరణి - "106

ఇత్యాది పద్యంలో వరూధిని మరణ యత్నం వర్ణించబడింది కాబట్టి దీనిలో 'మరణం' అనే సంచారీ భావం ఉంది.

'అబ్బుర పాటు తోడ -.', 'మునుమును పుట్టెడు కొంకు' ఇత్యాది పూర్వోక్త పద్యాలలో ప్రవరుని చూడడం వల్ల వరూధినిలో కలిగిన 'ముదం' అనే సంచారీ భావం ఉంది "నడ జడను వడియె - "107 అనే పద్యం లోనూ, "పాటల సుగంధి పాటలు నాటలు లేకవ్వుడొప్పె నలసత -. "108 లోనూ వరూధిని అలసత్వం వర్ణించ బడింది. కాబట్టి వీటిలో 'ఆలస్యం' అనే సంచారి కలదు 'ఎంత తపంబుజేసి - ' అనే పూర్వోక్త పద్యంలో 'వితర్కం', ప్రవరుని జితేంద్రియత్వాన్ని నిందించిన వరూధిని మాటలలో 'అసూయ' అనే సంచారీ భావం కలదు.

"కొనసాగి కామినీ గోష "109, "తల్లిందండ్రియు . - "110, "ఓ సరసీరుహాక్షి వినవో"111 ఇత్యాది పద్యాల్లో 'చింత' తో బాటు 'ఆర్తి' అనే సంచారి కూడా కలదు

"ఘనసార వంక మొక్క లతాంగి తెచ్చిన
ముట్టివ్రేలనె చుక్క బొట్టు పెట్టి . . "112

ఇత్యాది పద్యంలో గంధం, పువ్వులు మొదలగు వాటిపై వరూధినికి విరహం వల్ల అనిష్టం ఏర్పడ్డట్టు వర్ణించడంలో 'అరతి' వ్యక్తమౌతుంది.

'తొలుదొల్త వాని గన్నుల గాంచినప్పుడు' అనే పూర్వోక్త పద్యంలోని 3,4 పాదాలలో దైన్యం, చాంచల్యం అనే సంచారులు ఉన్నాయి.

"సహసానఖంవచస్తన దత్త పరిరంభ . "113 అనే దానిలో 'శ్రమం'
"జిలుగుల బెట్టుచున్ దొడల జెంద్రిక పావడ . ."114 లో
"కలయన్ గూర్మి . . 115 లోనూ 'ఔత్సుక్యం',
"ముడివడు కంకణ ప్రభల ముత్తెపు సేసలు . . 116 లో 'అవహిత్థ',
"కటక రవంబు బోరు కలగన్ రమణుల్ . . "117 అనే దానిలోనూ,
"రాజు చూడ్కి కవుదు రాజీవ ముఖి చూడ్కి "118 అనే దానిలోనూ 'వ్రీడ' అనే సంచారీ భావమున్నూ కలవు

ఈ పై చెప్పబడ్డ సంచారీ భావాలే గాక మాయా ప్రవరుని చూచి నప్పుడు వరూధినిలో దైన్యం, జాడ్యం, త్రాసం, ఆర్తి ఆవేగం, త్రప మొదలగు అనేక సంచారులు వర్ణించ బడ్డాయి. ఇంకా అక్కడక్కడ అనేక సంచారీ భావాలున్నాయి ఇవన్నీ రస పోషణలో ఎంతగానో సహకరించాయి ఈ విధంగా విభావానుభావ వ్యభిచారీ భావాల్ని చక్కగా సంయోగ పరచి శృంగార రసాన్ని చక్కగా పోషించారు పెద్దన గారు.

### 3. విప్రలంభ వివేచన:-

కేవలం సంభోగ శృంగారాన్ని చిత్రించడం కంటె దానిలో విరహాన్ని కల్పించి తర్వాత సంభోగం చిత్రిస్తే ఆ శృంగారం పుష్టిమంతమై సహృదయ హృద్యంగా ఉంటుంది ప్రవర వరూధినీ ఘట్టంలో ఇలాంటి విప్రలంభాన్ని సృష్టించి పెద్దనగారు శృంగారానికి పుష్టిని. రమ్యతను సాధించారు ఈ ఘట్టంలో విప్రలంభం సక్రమంగా నిర్వహించడానికి దశవిధ మన్మధావస్థల్ని కవి చక్కగా సమకూర్చారు. ఇది సమాగమానికి పూర్వం కలిగిన విప్రలంభం. దీన్ని పూర్వరాగం అనీ, అభిలాష విప్రలంభం అనీ అంటారు ఈ పూర్వరాగం లోనే రతి వల్ల దశవిధ మన్మధావస్థలు కలుగుతాయి ఈ దశ విధ మన్మధావస్థలు శృంగారపు అంకురితాది అవస్థల్ని తెలుపుతాయి చక్షుఃప్రీతి, మనస్సంగమం, సంకల్పం, జాగరం, కృశత, అరతి, హ్రీత్యాగం, ఉన్మాదం, మూర్ఛ, అంతం - అనే ఈ పది అవస్థలు వరూధినిలో కలిగినట్లు చిత్రించ బడ్డాయి.

ప్రవరుని చూచింది మొదలు మళ్ళీ మాయా ప్రవరుని కలిసే వరకు ఆమెలో ఈ మన్మథావస్థలు కనబడుతున్నాయి ప్రవరుని చూడడంతోనే వరూధినిలో 'రతి' అంకురించింది. ఇదే 'చక్షుఃప్రీతి' అనే అవస్థ. ఈ కింది పద్యాల్లో అది వర్ణించ బడింది.

"నయనాంబుజముల్ వికసింప .."119

"చూచి ఝళంఝళత్కటక ..."120

"మునుమున్ పుట్టెడు గొంకు .. ."121

చక్షుః ప్రీతి తర్వాత వరూధినికి 'మనస్సంగమం' ఏర్పడి, పులకలు, స్వేదం మున్నగు భావాలు ఏర్పడ్డాయి. ఈ 'మనస్సంగమం' అనే అవస్థ ఈ కింది పద్యాలలో గమ్యమాన మౌతుంది.

"పంకజ ముఖి కప్పురు _ "122

"తొంగలి తెప్పలం _ _ "123

"అనిమేష స్థితి మాని _ _ "124

ఆ తర్వాత వరూధినిలో ప్రవర సంగమ చింత ప్రారంభమైంది ఇదే 'సంకల్పం' అనే అవస్థ.

"ఎక్కడి వాడొ యక్షతనయేందు _ _ "125 ఇత్యాది పద్యంలో 'సంకల్పం' చిత్రించబడింది

ఆ తర్వాత వరూధిని సంకల్పానికి అనూకూల ప్రయత్నం చేసి ప్రవర నిరాకృతయై, అతని సంగమం లభించనిదై విరహ వేదనా దోదూయ మాన మానస అయింది అతనిని ఒడంబరచే సందర్భంలో 'హ్రీత్యాగం' చేసి మాట్లాడింది. అతని పై బడింది "నిక్కము దాపనేల _ _ "126 ఇత్యాది పద్యంలో 'హ్రీత్యాగం' అనే అవస్థ చక్కగా చిత్రించ బడింది

"ఆ భూదేవ కుమారుడేగిన _ "127 ఇత్యాది పద్యం మొదలుకొని 5,6 పద్యాలలో సంకల్పావస్థ మళ్ళీ (విరహంలో) చిత్రించ బడింది

3వ ఆశ్వాసంలోని 9వ వచనంలో వరూధిని మన్మథావస్థలు పొందడం సూచింప బడింది " _ _ _ గుసుమిత లతాంత నిశాంత శశికాంత వేదికాంతరంబున మేనుసేర్చి వివిధ దశాంతరంబుల వేగు చుండెనంత"128 అనే దానిలో ఈ సూచన ఉంది

"ఘన సార పంక మొక్క లతాంగి తెచ్చిన

ముట్ట వ్రేలనె చుక్క బొట్టు పెట్టె'

- - - - - - - - - - - -. .

సగమునయి చింతచే సగమగుచునరిగె
నవ్వరూధిని యంతికోద్యానమునకు"129

ఈ పద్యంలో 'కృశత', 'అరతి' అనే అవస్థలు కలవు. ఈ 'అరతి' అనే అవస్థ "పాటన సేయమిన్ . . "130 అనే పద్యం మొదల్కొని అనేక పద్యాలలో వర్ణించబడింది 3వ ఆ శ్వాసంలోని 52వ వచనంలో 'మూర్ఛ' అనే అవస్థ వర్ణించబడింది

"అని పలికి యక్కల కంఠ కంఠి దీపించు తాపంబు పెల్లున
మూర్ఛిల్లినం . . "131 అనే దాంట్లో 'మూర్ఛ' కలదు
"చనుగవ్పదొలగ వాసన గాలి కెదురేగు
బరువెవ్వ నలుగుల బాఱు కరణి . . "132

ఇత్యాది పద్యంలో వరూధిని మరణయత్నం వర్ణించబడడం వల్ల ఇక్కడ 'అంతం' అనే చివరి మన్మధావస్థ కలదు

ఈ దశవిధ మన్మధావస్థలు కూర్చబడడం వల్ల విప్రలంభం చక్కగా చిక్కగా పోషించబడి శృంగారానికి పుష్టి కలిగింది.చతుర్విధ విప్రలంభాలలో వరూధినికి కలిగింది అభిలాష విప్రలంభం. విప్రలంభాన్ని వర్ణించిన ఘట్టం మనుచరిత్రలో ఇదొక్కటే కలదని చెప్పవచ్చు

స్వరోచి వృత్తాంతం అంతటా సంభోగ శృంగారమే కాని విరహం వర్ణించబడి ఉండలేదు మనోరమ పునస్సంధాన కాలంనాటి రాత్రి మాత్రం స్వరోచి,

"దట్టంబు నీ కట్టినట్టి చెంగావికి బాగుగాదని కేల బయట నిమిరె . . 133
ఇలా ప్రవర్తించి మనోరమను కౌగిలించాడు

"వ అట్లు కవయందమకించి త్రస్తరుల గుస్తరింప నింపు గలిగియు మును మున్న మనంబునం బొడమి యుండు నడలప్పుడు తలంపునంబాఱిన సమర్థుండగు నతని చేనది తీర్చించుకొనంగలదియై నవోఢ గావున మాటలందేటపడం జెప్ప శంకించి స్త్రీ స్వభావంబునం దొరగు కన్నీరు కంకణ క్రేంకృతులు మీఱ గోరబాఱ మీటుచు నూరక యున్నంగనుంగొని యవని పతి వుంగవుండంత రంగంబునం జెంగలించు కౌతుకాం కురంబు కరగుపడ వెఱగుపడి యుద్వేగ సమన్వితుండై సంభ్రమించుచు జెక్కుటద్దంబులు నొక్కి కురులు చక్కం ద్రోయుచుం దోయ జాక్షీ యక్షయానంద సంధాయకంబగు నిట్టి క్రీడా సమయంబున వగవునకుం గారణంబేమి నా యెడం గల్ల యేమేనియుం బాటిల్లదు గదా

యెవ్వరేమప్రి యంబు గావించి రెఱింగింపు వారిం దండించెద నేమి సాధింప వలయు జెప్పుమది వేధచే నున్న సాధించెద మదీయంబు లగు నర్ధ జీవితంబులు భవదధీనంబులు మ్మలిక యింత యేటి కనుటయు "134

ఈ వచనంలో సంయోగ కాలంలో మనోరమ కన్నీరు పెట్టడం, స్వరోచి ఆమెను అనునయించి ఆమె కోర్కెను తీర్చుననడం, తర్వాత వారేగడం - అనే వాటిలో విరహం స్ఫురిస్తుంది ఆ సమయంలో మనోరమ అలా ప్రవర్తించడం అనౌచిత్యం అని కొందరు విజ్ఞులు భావిస్తున్నారు సంగమ కౌతుక అయికూడా మనోరమ కంటనీరు పెట్టడం వింత విషయం. పునస్సంధాన కాలానికి ముందుగాని తర్వాత గాని తన కార్యం స్వరోచికి తెలుప వచ్చుగదా! మనోరమ ఇలా ప్రవర్తించిందేమిటి? ఇతర సమయాల్లోనైతే స్వరోచి ఏమరుననో, పట్టించుకోడనో మనోరమ భావించి, ఆ సమయంలో కాంతలు ఏ కోరిక కోరినా కాంతులు తీర్తురనే భావంతో ఆమె అలా ప్రవర్తించింది ఆలంకారికమైన విప్రలంభం ఇట లేదు కాని సంయోగానికి ఆటంకం కలిగించి, ప్రియుని అనునయాన్ని పొందడంచే ఇది కూడా విరహం లాగానే భాసిస్తుంది ప్రణయం, ఈర్ష్యలతో కూడిన మానం ఇక్కడ లేదు మానవి ప్రలంభం లోనే అనునయానికి అవకాశం ఉంటుంది. అనునయానికి అవకాశం ఉండడంచే ఇది మాన విప్రలంభం లాగా కనబడుతుంది ఈమెకు చెలులపై ఈర్ష్యలేదు ప్రేమ కలదు కాబట్టి ప్రణయ మానంలో దీన్ని చేర్చవచ్చును. ఇది లౌకికంగా కనబడుతుంది ప్రణయమానం లాగా కనబడుతున్నా ఇది ప్రణయమానం కూడాకాదు ఇది కేవలం విప్రలంభ ఆభాసమే దీని వల్ల కూడా వారి కలయికకు ఎడం కలిగి కౌతుకం అధికమై పునస్సంగమంలో వారు సంభోగాన్ని అధికంగా అనుభవించగలరు కాబట్టి ఈ సన్నివేశం అంత ఉచితంగా కనబడకున్నా శృంగారానికి మాత్రం దోహదకారిగా ఉండి, రసపోషణకు ఉపయోగ పడుతుంది

4. సంభోగ సమ్యక్పోషణ:-

రెండు ప్రధాన రసాలకు సంఘర్షణ కలిగించడంలో విజయం పొంది, ఆ ఘట్టమే తలమానికంగా ప్రబంధంలో కనిపించేట్టు చేసి ఒక రమణీయ శిల్పచాతురిని ప్రదర్శించారు ఆంధ్ర కవితా పితామహులు గంభీర ధర్మనిష్ఠాపరత్వం, చతురత్వం అనే (తన) గుణాలను రెండు పాత్రలలో ప్రవర వరూధినులలో పొందుపరచి, ఆ రెండిటికి అనుకూలమైన వీర, శృంగారాలను అత్యున్నత స్థాయిలో పోషించి, సహృదయుని హృదయంలో ఉత్సుకతను ప్రేరేపిస్తూ కథను నడిపిన పెద్దన గారు ధన్యులు

ప్రవరుని చూడగానే తను కోరుకున్న వస్తువు లభించినట్టు వరూధిని నయనాంబుజాలు వికసించి ఆమెలో 'రతి'ని అంకురింప చేసాయి. అలా అంకురితం

అయిన 'రతి', ప్రౌఢ, దేవవేశ్య అయిన వరూధినిని పలుపోకడలు పోవునట్లు ప్రేరేపించింది అతని దారికి అడ్డుగా నిలిచింది. ఆతడు ఊరికి పోయే మార్గం తెలుపుమనగా 'వచ్చిన మార్గం నీకు తెలియదా? ఒంటరిగా ఉన్న జవరాంద్రను పల్కరించుటకు ఎత్తిన ఎత్తుగాని' అని నర్మగర్భంగా పలికి ఎక్కడి ఊరు? కాల్నిలువక ఇంటికి వెళ్ళుతానంటావు ఇచటి రమణీయ మనోహర ప్రకృతి కంటే అధికమైందా నీ ఊరు? అని అతనిలో 'రతి'ని ఉద్దీపింపజేస్తూ అతన్ని తన వంకకు తిప్పుకోవడానికి అనేక యత్నాలు ఆరంభించింది 'నిక్కము దాపనేల? ధరణీసుర నందన! ఇంక నీవయింజొక్కా మనంబు' అని తన మనస్సులోని మాటను అతనికి తెలిపింది. కాని ప్రవరుడు తన ధర్మ మార్గాన్ని వివరించి, ఆమె కోర్కెను సవినయంగా తిరస్కరించాడు 'ఆనందోబ్రహ్మ' అనే ఉపనిషద్వాక్యాన్ని తన భావానికి అనుకూలమైన అర్థంతో అతనికి తెలిపింది మీయజ్ఞ ఫలం మా కౌగిళ్ళలో సుఖించడమే కదా! అని అతని ధర్మ ప్రవృత్తిని తనవృత్తికి అనుకూల పరచుకొన ప్రయత్నించింది చివరకు తమకాన్ని ఆపలేక అతనిపై బడింది ఇప్పటిదాకా ఆమె వాదానికి ప్రతివాదం చేస్తూండిన ప్రవరుడు ఆమె తనపై బడగానే 'తదీయాంసద్వయంబంటి' తోసి వేసాడు ఆమె అతని నిర్దయతను నిందించింది పరాశరుపట్టి, ఇంద్రుడు, మాందకర్ణి మొ పౌరాణిక పురుషుల చరిత్రాలన్నీ తవ్వి వారికంటె నీవు గొప్పవాడవా? అని ఎత్తి పొడిచింది ఏదీ పట్టించుకోక ఆమె తాకడం వల్ల తనకు అంటిన జవాజిని కడుక్కొని వార్చి అగ్నిహోత్రుని ఆవాహన చేసి తన దారిని తాను పోయాడు

వరూధిని మాత్రం నిరాశగా లేదు అతడు ఎప్పటికైనా తన వశం కాగలడనే ఆశ చావలేదు అతడు కనిపించకపోవడంచే ఆమె విరహ వేదనాదోదూయమాన మానస అయింది అతని రూపరేఖాదుల్ని పునఃపునఃస్మరిస్తూ, అతని సంగమాన్నే కోరుతూ, తన బ్రతుకును చీదరించుకొంది చెలికత్తెలు, అతడు కనిపించకపోడు తోటలో కెళ్ళుదాం రమ్మని తీసికొని వెళ్ళారు అచటి ప్రకృతి ఆమెలోని విరహాన్ని ఉద్దీపింపజేసింది ఆ తర్వాత ఆమె బాధను తట్టుకోలేక చంద్రాదుల్ని ఉపాలంభించింది మన్మథావస్థల్ని పొందుతున్న వరూధిని గతి ఏమౌతుందని (సామాజికులు) పాఠకులు ఎదురుచూస్తూన్న సన్నివేశం ఇది ప్రవరుడు వెళ్ళి పోయాడు కాబట్టి ఎలాగూ రాడు ఇక వరూధిని గతిఏమి? ఆమెను కవి చంపునా? ఆమె మనస్సును అన్యథా మరల్చునా? అనే తర్కంలో మనం ఉంటాం ఇలాంటి సన్నివేశ నిర్వహణలోనే కవి చాతుర్యం వ్యక్తం అవుతుంది వరూధిని మరణించినా, తన హృదయాన్ని అన్యథా మరల్చుకొన్నా రసభంగమై విరసంగా ఉంటుంది వరూధిని మనో వాంఛ నెరవేరినగాని ఆ ఘట్టం ఫలవంతం కాదు అది ఎలా సాధ్యం? కవి ఏదో విధంగా ప్రవరుని పట్టి తెస్తాడన్నా అది సాధ్యం అయ్యే పని కాదు ప్రవరుడు వరూధిని వాంఛ నెరవేర్చే వాడైతే ఏనాడో ఆమె వశం అయ్యేవాడు సామాన్య మానవుడు ఎవ్వడూ ఆమె తళుకు బెళుకుల్ని, సౌందర్యాన్ని, మాటల్ని దాటి అడుగిడలేడు ఎంతో నిష్ఠాపరుడైన ప్రవరుడు

మాత్రమే వాటిని అధిగమించ గలిగాడు. అతనికి అవి తుచ్ఛ సుఖాలు. అలాంటి వాడు తిరిగి వస్తాడా? రాడు. కాని రావాలి. ఎలా వస్తాడు? అదే కవి నైపుణ్యం.

రాముడు బాలుడుగా ఉన్న పుడు చందమామ కావాలి అన్నాడు. చందమామ అందేది కాదు. దాన్ని తెచ్చి ఇవ్వడం దుస్సాధ్యం. కాని తేవాలి. లేకుంటే పట్టు విడువని రాముడు రోదించడమే కాక ఇంకే మైనా చేయగలడు

వరూధిని పరిస్థితి కూడా సరిగ్గా ఇదే రాముని కోరికను తల్లి నెరవేర్చింది. ఎలా? చందమామను తేగలిగిందా? కాదు కాని దాని ప్రతిబింబాన్ని అద్దంలో చూపించింది. రాముడు దాన్ని నిజమైన చందమామగానే భావించి ఆడుకొన్నాడు. అలాగే వరూధిని కోరిక నెరవేర్చడానికై ప్రవర ప్రతిబింబాన్ని ప్రవేశ పెట్టాడు కవి. కవిగారికి ఈ చాతుర్యం లేక పోతే అన్యథా జరిగి ఉండేది. ఆవచ్చే మాయాప్రవరుడు కూడా మిక్కిలి మక్కువ (వరూధినిపై) కలవాడై ఉండాలి. లేకుంటే బయట పడిపోతాడు. ఆమెను పూర్వం ఓసారి వలచి తిరస్కృతుడైన గంధర్వుడే దానికి తగ్గవాడని ఆతనికి ఆ అవకాశాన్ని కల్పించడం కవి గారి నైపుణ్యానికి తార్కాణం

అంతా హేతుబద్ధంగా ఉండాలి. ఎక్కడా విపగింపు కలిగించరాదు పాఠకుల్లో ఉత్సుకతను పెంచుతూ కథను సాగించాలి. ఇవీ కవిగారి నియమాలు అతడు 'శాంబరీ' విద్య మహిమచే ప్రవరుడయ్యాడు గంధర్వుడు ప్రవరుడే అయ్యాడు కాని ప్రవర వేషం వేసుకోలేదు. అతడు వరూధిని పొందు కోసం వేచి ఉన్నాడు కాబట్టి ప్రవరుడు వచ్చింది మొదలు వెళ్ళేవరకు పరిస్థితులన్నీ గమనించిన వాడు. ప్రవరుడు మకరాంక శశాంక మనోజ్ఞమూర్తి అని మాత్రమే వర్ణించిన కవి, మాయాప్రవరుని కట్టు బొట్టు అన్నిటినీ వర్ణించడంలో ప్రవరుని బాహ్య సౌందర్యాన్ని మాత్రమే వరూధిని కోరుతుందనీ, అదే ఇచట అవసరమనీ కవి తెలుపుతున్నారు ధర్మనిష్ఠాగరిమ్మని లాగానే ఈ ప్రవరుని ప్రవర్తనను చిత్రించాడు. వరూధిని అతన్ని చూసింది సగమైన వరూధినికి పూర్తి బలం వచ్చింది. అతన్ని సమీపించి వేడుకొంది. కొంత కరిగాడు. ఇదివరకటి ప్రవరుని ప్రవర్తన కొనసాగింపు మాత్రమే ఇక్కడ కలదు. ఆమె ఇదివరకు చెప్పింది సత్యమని తనకు తెలుసన్నాడు కాని రెంటికి చెడ్డ రేవడినౌతానేమో అని అనుమానంతో కొన్ని నియమాలు చేసాడు ఆ పరిస్థితులలో ఎంత కఠినమైన నియమాలైనా, ఎవ్వరైనా వెంటనే అంగీకరిస్తారు వరూధిని అలాగే చేసి తన వలపు పంట పండించు కొంది. ఎంత వేగినదో వరూధిని! అతని మాటలతోనే చల్లదనం ఆవరించింది విరహంలో శైత్యోపచారాలన్నీ వేడిని అధికం చేసాయి ఒక 'ప్రియుని వాక్యం' ఆమె తాపాన్ని పూర్తిగా పరిమార్చ గలిగింది.

ఇలా ప్రవరుని ప్రతిబింబాన్ని కల్పించి వరూధిని మనోవాంఛను తీర్చడంలో ధర్మదృష్టికి లోపం రాదు. ఆమె దేవవేశ్య. కాని అందరిలాంటిది కాదు. అనన్యకాంత అందుకే విరహాన్ని అనుభవించింది. "భ్రమరకీట' న్యాయంతో మానుషత్వ లక్షణాలన్నీ పొందింది నాయకుడు మానవుడు కాబట్టి ఆమెకు అది తప్పదు. కవి గారిది ఎంత హేతుబద్ధ దృష్టో! హేతుబద్ధతతోపాటు తాను నమ్మిన ధర్మంపై అతనికి విశ్వాసం మెండు ఈ విషయం ప్రవర పాత్రే తెలుపుతుంది. గంధర్వుడు ఒకప్పుడు వరూధినిచే తిరస్కరింపబడి చాతక పక్షిలాగా ఎదురు చూస్తూ ఉన్నవాడు. వరూధిని కూడా అప్పుడు ప్రవర తిరస్కృత అయి అతని అనుగ్రహానికై అఱ్ఱులు చాస్తూ ఉంది. ఇలాంటి తిరస్కృత ద్వయానికి సంయోగం కలిగించి, శృంగార రసాన్ని పోషించిన కవి గారి శిల్పచాతురి తలచుకొంటే ఒక విచిత్రానుభూతి కలుగుతుంది వీర, శృంగారాలకు విచిత్ర పోరాటం కల్పించి, వీరం విజయం పొందినట్లు చూపించి, శృంగారాన్ని ఫలవంతం చేసిన ప్రజ్ఞ అనన్య సామాన్యమైంది.

ఈ దేవ, మానవాంశ (వరూధిని దృష్టిలో) ల సంయోగ ఫలితమే స్వరోచి ప్రవర వరూధినీ ఘట్టంలో ఘర్షణ పడ్డ వీర శృంగారాలు స్వరోచిలో సమన్వయం పొందాయి స్వరోచి ఎంత వీరుడో అంత భోగి ఒక దానికి తిరస్కారం గానీ, మరొకదానికి పురస్కారం గానీ లేదు అతనికి దొరికిన అవకాశాలలో రెండింటినీ సమానంగా పోషించాడు రాజ్యపాలన చేస్తున్న స్వరోచి ఒకసారి వేట కేగిన తరుణంలో రాక్షసునిచే వెంబడింప బడుతున్న మనోరమను రక్షించడానికి సిద్ధపడడం వీర లక్షణం అతడు ఆమె విద్యను గైకొని వీరత్వంతో పోరి రాక్షసుని సంహరించి ఆమెను కాపాడాడు ఆ రాక్షసుడైన ఇందీ వరాక్షుడు మనోరమ తండ్రే కాబట్టి తనకూతుర్ని అతనికే ఇవ్వదలచాడు స్వరోచి అంగీకరించి ఆమెను చెట్టబట్టాడు ఇక్కడ వీరంచే శృంగారం సాధించబడింది యుద్ధ వీరంలో విజయుడైన స్వరోచి, మనోరమ పునస్సంధాన సమయంలో దయావీరాన్ని ప్రదర్శించ వలసి వచ్చింది ఆమె కోరికపై విభావసి, కళావతుల రోగాన్ని ఆయుర్వేదంచే పోగొట్టాడు వాళ్ళు తమతమ విద్యల్ని అతనికి ఇచ్చి తమను కూడా పరిగ్రహింపుమని కోరగా మనోరమ అనుమతిచె అలాచేసాడు ఇక్కడ దయావీరంచే శృంగారాన్ని సాధించాడు ఆ తర్వాత ఒకె మారువేటలో వరాహం వెంట బడితే ఒక లేడి అడ్డువచ్చి దానికి మారుగా తనను చంపుమని కోరింది స్వరోచి కారణం అడిగాడు చెప్పింది బహుసక్తుడైన తనను ఆలేడి కోరుతుంది తిర్యక్కుతో మానవ సంయోగం ఎలా? కేవలం అది స్పర్శను (కౌగిలిని) మాత్రం కోరింది స్వరోచి అలాగె చేసాడు దివ్య రూపాన్ని పొందింది ఆలేడి తాను ఆ వనదేవతను అని చెప్పింది దాన్ని పరిగ్రహించాడు వేట రాజధర్మం ఆ ధర్మంలో స్వరోచి ఉత్సాహం చూపించాడు కాబట్టి అది ధర్మవీరం అని చెప్పవచ్చు ఇక్కడ ధర్మవీరంచే శృంగారాన్ని సాధించాడు ఈ విధంగా వీరాన్ని ఆధారం చేసికొని శృంగారపు పంట పండించుకొన్న స్వరోచి తన జన్మకారకులైన

వీర, శృంగార స్వరూపులైన ప్రవర, వరూధినులకు అంటే వీర శృంగారాలకు చక్కని సమన్వయం కలిగించాడు. ఈ సమన్వయ ఫలితంగా సర్వఘర్షణలు శమించి, సర్వభావాలు ప్రశమత్వం పొంది 'శమ' రూపాన్ని దాలుస్తాయి. రక్తి నుండే విరక్తి పుడుతుంది కదా! రతి, ఉత్సాహాలు రక్త స్వరూపాలు వాటినుండి ఉద్భవించిందే విరక్తి 'శమం'.

సర్వభావ ప్రశమైక రూపం అయిన ఈ శమాన్నే మూర్తిగా దాల్చి స్వరోచివల్ల స్వారోచిషమనువు ఉద్భవించాడు 'శమం' ఆవిర్భవించిన తర్వాత మరి ఏభావం కూడా ఉత్పత్తి కావడానికి వీలులేదు. అది చివరి సోపానం. రెండు భావాలు (ఉత్సాహ, రతులు) ఘర్షణ పడి, పడి సమన్వయం చెంది, ఆ సమన్వయ ఫలితంగా నూత్నభావం అంకురించడంతో (శమం) కథా ప్రయోజనం నెరవేరి కావ్యం కూడా ముగిసింది. ఘర్షణలో ఉన్న వేడి (గమ్మత్తు) సమన్వయంలో ఉండదు సమన్వయంతో చల్లార్చబడి గోరువెచ్చదనానికి వచ్చిన ఉష్ణతత్త్వం పూర్తిగా నశించి తర్వాత శీతలత్వం ఆవిర్భవిస్తుంది. పెద్దన గారు కూడా రెండు రసాలకు ఘర్షణ కలిగించి వేడిని పుట్టించారు కొంతసేపటికి ఆ ఘర్షణ తగ్గడంతో సమన్వయం కుదిరి, ఆ సమన్వయంలో వేడి కూడా తగ్గి చల్లదనం వచ్చింది. శృంగార, వీరాలకు ఘర్షణ మొదటి రెండు ఆశ్వాసాలలో చిత్రించి, ఆ ఘర్షణ ఫలితంగా ఈ రెండు లక్షణాలు గల సమన్వయ ఫలితాన్ని గని మూడవ ఆశ్వాసం ముగిసింది ఆ సమన్వయం నాలుగు ఐదు ఆశ్వాసాలలో కూడా నిండి ఉండి ఒక నూత్న ఫలాన్ని ఆరవ ఆశ్వాసంలో అందించింది ఇదీ పెద్దనగారి రస ప్రణాళిక దీనిలో వరూధిని మొదలుకొని స్వారోచిషుడు ఉద్భవించే వరకు శృంగారం చక్కగా పోషింపబడి దానికే పెద్ద పీట వేయబడింది ప్రాసంగికం అయిన పార్శ్వ పుంజిక స్థలల వృత్తాంతంలోనూ రసరాజమే రాజై నిలచి తన గొప్పను చాటుకొంది ఇదివరకు చెప్పినట్లుగా వరూధినీ ప్రవర ఘట్టంలోనూ, స్వరోచి వృత్తాంతంలోనూ రసాభాసాలుగా కనబడుతున్న కారణాలు పరిహరింపబడి శృంగారం రసావస్థ పొందేట్లు చక్కగా పోషించబడింది.

## 5. రసనిర్వహణలో రమ్యమైన పోకడలు:-

పెద్దనగారు తన ప్రబంధంలో ప్రతిపాదించిన నూత్న అంశాలను ఇలా క్రోడీకరించవచ్చు ఈ అంశాలే రస నిర్వహణలో వారికి మిక్కిలి సహాయ పడ్డాయి.

**అవి ఇవి-**

1. వీర, శృంగారాలకు (ప్రవర, వరూధినులకు) మధ్య ఘర్షణను అతి రమ్యంగా చిత్రించడం

2. వరూధినీ ప్రవర మట్టంలో తారాస్థాయికి తీసుకొని వెళ్ళిన వరూధిని ప్రవరుల వాదోపవాదంలో ప్రవరుడు విజయం పొందినట్లు చూపించి, అతని కథను ముగించి, వరూధిని కథను కొనసాగించడం

3. వరూధినీ ప్రవర, వరూధినీ మాయాప్రవర ఘట్టాలను త్రైపాఠు వేసి చూసిన పరిశీలకులకు ఇది శృంగార ఆభాసమా? శృంగార రసమా? అనే మీమాంసను కలిగించడం.

4. మాయాప్రవర, వరూధినుల సంభోగం- భ్రమతో కూడిందా? సంకీర్ణ మైందా ? స్వచ్ఛమైందా? అనే మీమాంసను కలిగించడం

5. స్వరోచి, మనోరమల పునస్సంధానంలో మనోరమ దుఃఖించడంలో గల ప్రయోజనంతో ఇద్దరు నూత్న నాయికలు సాధించబడడం.

6. స్వరోచి బహునాయికా సంభోగాన్ని చిత్రించడం.

7 వైరాగ్యపు మాటలు విన్నా, పురాణ వైరాగ్యం లాగా తర్వాత వాటిని మరచి స్వరోచి మళ్ళీ భోగాసక్తుడవడం.

8. పారర్షి పుంజికస్థలల సన్నివేశం, వరూధినీ ప్రవరుల సన్నివేశానికి ప్రతిగా చిత్రించడానికి ప్రయత్నించడం.

9. వనదేవతా స్వరోచుల శృంగారంలో కథాఫలాన్ని ఇవ్వడం.

10. రసాభాసాన్ని ఆభాసం చేయడం

11. పాత్రలలో దివ్య, మానవ సమ్మేళనం జేయడం.

మొదలగు ఈ అంశాలతో పెద్దన గారు శృంగారాన్ని చక్కగా నిర్వహించారు

### 3. పారిజాతాపహరణం:-

అష్ట దిగ్గజాలలో ఒకరైన నంది తిమ్మనకు ప్రబంధ యుగంలో ఒక విశిష్ట స్థానం ఉంది. ఆయన ప్రబంధానికి కూడా ఒక ప్రత్యేకత గలదు.

ఈ కవితల్లజుడు అరణపు కవి ఈ కవి పారిజాతాపహరణ ప్రబంధాన్ని వ్రాయడానికి కారణం అయిన ఒక కథ లోకంలో బహుప్రచారంలో ఉంది.

ఒక నాటి రాత్రి అంతఃపురంలో శ్రీ కృష్ణదేవరాయలు తిరుమలదేవితో ఏకాంతంలో ఉన్న సమయాన ఆమె అతని ఎడల ఒక ప్రణయాపరాధం (ఆమె పడుకొని ఉండగా, ఆమె

నిద్రను భంగం చేయ వద్దని ఆ మంచం మీదనే కృష్ణరాయలు సాధారణంగా పడుకొన్నాడనీ, తర్వాత నిద్రలో ఆమె పాదం రాయల శిరస్సుకు తగిలెననీ, అందుకు అతడు కోపించి వెళ్ళి పోయాడనీ చెబుతారు) కావింపగా కుపితుడై వెళ్ళిపోయి మళ్ళీ ఆమె ముఖాన్ని చూళ్ళేదనీ, వారిద్దర్నీ కలపడానికే కృష్ణరాయల మిత్రుడూ, వయసులో పెద్దవాడూ అయిన నంది తిమ్మన పారిజాతాపహరణ కావ్యాన్ని వ్రాసి ఆయనకు వినిపించాడనీ, ప్రథమాశ్వాసంలోని కథ విని రాయలు కోపం వదలి తన సతిని కూడి సుఖంగా ఉన్నాడనీ చెబుతారు

ఈ కథలోని నిజానిజాలు ఎలా ఉన్నా ఈ వృత్తాంతం పారిజాతాపహరణ ఇతి వృత్తానికి ప్రేరకంగా ఉందనడంలో సంశయం లేదు. ఆంధ్ర పంచమహా కావ్యాల్లో ఒకటైన పారిజాతాపహరణం పురాణేతి వృత్తం ఆధారంగా కలదైనా రసవత్తర ప్రబంధంగా తీర్చిదిద్ద బడింది

## 1. అంగిరస నిర్ణయం:-

పారిజాతాపహరణానికి మూలమైన కథలోనే శృంగార రసం నిక్షిప్తమై ఉంది దానికి అంగంగానే పారిజాతాపహరణం జరిగింది ఈ కథాంశంలో పూర్వం 'మాన విప్రలంభం' ఆతర్వాత మాన ప్రశమన అనంతరం సంభోగ శృంగారం చిత్రించబడింది ఆ సుఖసాధనకే కృష్ణుడు ఇంద్రునితో యుద్ధంచేసి పారిజాత వృక్షాన్ని పెల్లగించుకొని తెచ్చాడు ఈ సుఖం జీవితాంతం వరకు అనుభవించడానికే సత్య భామ తన సౌభాగ్యాన్ని కోరి, భర్త వశవర్తి అయి ఉండడం కోసం పుణ్యకవ్రతం చేసింది కాబట్టి శృంగారమే కావ్యమంతటా వ్యాపించి ఉందని చెప్పడంలో విప్రతిపత్తి ఉండదు.

పారిజాతాపహరణంలోని ప్రధాన రసం ఏదో సులభంగానే గుర్తించవచ్చు ఇది ఏక నాయకాశ్రయం అయిన ప్రబంధం వస్తువులో ఐక్యత, రసంలో అవిచ్ఛిన్నత కలదు ఒక రకంగా పారిజాతాపహరణంలో సత్యాకృష్ణుల సరసమైన దాంపత్య జీవితం వర్ణించ బడిందని చెప్పవచ్చు దాంపత్య జీవితం లో ఇల్లాండ్లకు కలిగే ఈర్ష్యాదులు, వారిని ప్రసన్నలను చేసుకోవడానికి భర్తలు చేసే వివిధాలైన పనులు, వాటి వల్ల వారి దాంపత్య జీవితం చక్కబడి సుఖ సంసారం సాగించడం అనేవి సాధారణ జీవితంలోని విషయాలు అవే ఇందు వర్ణింపబడ్డాయి ఇది ప్రబంధం కాబట్టి దీంట్లో కావ్య సత్యాలు ఉంటాయి ఇవి కొన్ని లోకంలో ఎబ్బెట్టుగా కనిపించినా శాస్త్రబద్ధమై కావ్యంలో సత్యాలు గానే భాసిస్తూ ఉంటాయి కృష్ణుడు సత్యభామ పాదాల్ని బట్టడం, ఆమె తన్నడం, అలా తన్నినా ఆమె పాదమే నొచ్చిందేమో అని కృష్ణుడు బాధపడడం అనేవి సాధారణ మానవులకు ఎబ్బెట్టుగానే తోస్తాయి కాని ఈ సన్నివేశం కామశాస్త్ర బద్ధం, - కావ్య సత్యం అయి ఉంది సాధారణ జీవితంలోని సన్నివేశాలే కావ్యంలో రమణీయార్థ ప్రతిపాదకాలుగా నిబంధింప బడ్డప్పుడు

అవి లోకోత్తర చమత్కారాలై ఒప్పుతాయి కవి ప్రావీణ్యంచే అవి జిగిబిగులు కలిగి సహృదయ హృదయాల్ని రంజింప చేస్తాయి. అలాంటి రంజకత ఈ పారిజాతాపహరణంలో మెక్కుటంగా ఉంది

రసదృష్టితో చూస్తే ఇందు రెండు రసాలు కనిపిస్తున్నాయి మొదటిది శృంగారం. రెండవది వీరం. ఇవి రెండూ బాగా పోషింప బడ్డాయి. వీర రస ఘట్టం దీంట్లో కొంత ప్రాధాన్యం వహించి ఉన్నా ఏ విమర్శకుడూ ఇందలి ప్రధాన రసం వీరం అని పొరబడలేదు. అలా పొరబడడానికి అవకాశాలూ లేవు. విశ్వనాథ, దివాకర్ల, విన్నకోట లాంటి విమర్శకులంతా ఇందలి ప్రధాన రసం శృంగారం అనే ముక్త కంఠంతో చెప్పారు

"ప్రబంధము లన్నిటి యందువలె పారిజాతాపహరణము నందును శృంగారమే ప్రధాన రసము "135 అని దివాకర్ల వేంకటావధాని గారు.

"వీర రసము అంగముగా శృంగార రస ప్రధానమైన కావ్యము. శృంగార రసవు విభావస్థలు సందర్భాను సారముగా కదయందు వర్ణితములైనవి ఇతర రసములంతగా పరిపోషితములు కావనిసను దోసము కాదు. లోపమును గన పదదు "136 అని విన్న కోటమాధవరావు గారు.

"ఈ కావ్యమంతయు శృంగార రస ప్లావితమైనది. అయ్యును కథావసరమును బురస్కరించుకొని వీరమును వర్ణింపక తప్పలేదు సరసుడైన తిమ్మనార్యుడు వీరమును చేపట్టి సర్వాంగ పరిపూర్ణముగా వర్ణించియు దానిని శృంగారమున కంగముగనే భాసింప జేసినాడు. "137 అని పి. యశోదారెడ్డి గారు శృంగారాన్ని అంగిరసంగా ప్రతిపాదిస్తూనే ఒక చోట పారిజాతాపహరణంలోని తృతీయా శ్వాసంలోని ఒక పద్యాన్ని ఆధారంగా చేసికొని ఒక నూత్న సిద్ధాంతాన్ని ప్రతిపాదించడానికి విఫల యత్నం చేసారు. వారి వాక్యాలు ఇవి.

"ముక్కు తిమ్మనార్యుడు పారిజాతాపహరణము నందొక్క చోట<br>
క అనిమిషపుర జాలకములు<br>
వనితా జనతామెయములు వనితల హృదయం<br>
బనురాగ రసమయంబ<br>
య్యాను రాగము శౌరిమయము నయ్యెద నయ్యెన్<br>
అని రచించినాడు

సూక్ష్మముగా బరిశీలింప నీపద్య మెంతయో విలువైనది 'రస' నిర్ణయమునందు మఱి కొంత స్వాతంత్ర్యమును గన బఱచినట్లుగా నున్నది. సాధారణముగా మన ప్రాచీన లాక్షణికులలో రసములు తొమ్మిది, యెనిమిది యను సంఖ్యా నిర్ణయము నందే

వివాదమున్నది. కాని ధనంజయుడు శాంతమునకు రసత్వము నంగీకరింప లేదు. కావున శాంతమును విడిచినచో రసము లెనిమిదియే. అయ్యును తిమ్మన అనురాగ రసమనుచు నొక్క రస విశేషము నధికముగా బేర్కొనినాడు.

ధనంజయుడు ప్రీతి, భక్త్యాదులను భావములుగనే పరిగణించినాడు. ఇక తిమ్మనార్యుడీ 'యనురాగము' నొక విలక్షణ రసముగా బరిగణించుటయే కాక యయ్యది శౌరిమయమని చెప్పి యాస్త్రీల యనురాగ రసమున కొక యుదాత్తత చేకూర్చినాడు. ఈ విధముగా నీతని రస పోషణ విధానము లక్షణవంతమై హృద్యముగా నున్నది."138

ముందు శృంగారాన్నే అంగిగా నిర్ణయించి తర్వాత మరొక నూత్న రసాన్ని తిమ్మన విలక్షణంగా ప్రతిపాదించారని నిర్ణయింప బూనడం స్వవచో వ్యాఘాతమౌతుంది. 'అనురాగా'న్ని ఒక విలక్షణ రసంగా నిర్ణయించాల్సి వస్తే, దాని స్థాయిని తదితర భావాల్ని నిరూపించాల్సి ఉంటుంది. అసలు 'అనురాగం' అంటే ఏమిటి? అది 'ప్రేమ' కాదా? ప్రేమ, ప్రీతి, అనురాగం మున్నగు పదాలన్నీ శృంగార స్థాయికం అయిన 'రతి'ని వ్యంజింప చేసేవే. 'అయ్యనురాగము శౌరిమయము' అనడంలో శ్రీకృష్ణుడు శృంగార రసాధిదేవత అనే అభివ్యక్తమౌతుంది. అంతే కాని ఈ పద్యం ఏ ఇతర రసాన్ని ప్రత్యేకంగా ప్రతిపాదించడం లేదు. అలా ప్రతిపాదించ వచ్చుని బావిస్తే ఈ క్రింది పద్యాన్ని ఆధారంగా చేసికొని 'ప్రేమ రసం' అనే మరొక విలక్షణ రసాన్ని కూడా ప్రతిపాదించవచ్చు.

"సరసాలాపముల న్వినోద కథలన్సాత్రాజితీ దేవి ప్రే
మరసాంభోనిధి నోలలార్చి కడుసమ్మానంబు గావించిన
ర్భర కౌతూహల వృత్తి నుండ ఘటికాపర్యాప్తి ఘంటారావాం
తర నిర్ణీతములై వినంగ బడియె న్మధ్యాహ్న శంఖధ్వనుల్"139

దీనిలోని 'ప్రేమ రసాంభోనిధి' అనే మాటలో 'ప్రేమరసం' అనే విలక్షణ రసం కనబడుతుంది. కాబట్టి 'అనురాగరసం' లాగానే 'ప్రేమరసా'న్ని కూడా ప్రతిపాదించాడన వచ్చుగదా! కాని అలా కాదు. అనురాగం, ప్రేమ అనే రెండు పదాల్ని పర్యాయ పదాలుగానే గ్రహించ దగ్గవి. ఈ రెండూ ఏ కొత్తరసాన్నీ వ్యంజింప చేయడంలేదు. ఈ విధంగా తిమ్మన గారు తన పద్యాలలో అనురాగ రసం ప్రేమరసం అనే పదాలను ప్రయోగించి శృంగార రసాన్నే ప్రధాన రసంగా ముక్తకంఠంతో ప్రతిపాదించాడని చెప్పడం యుక్తియుక్తం కాని మరొక రసాన్ని ప్రతిపాదింప బూనడం సముచితం కాదు

కథ పూర్వార్ధంలో శృంగార రసం, ఉత్తరార్ధంలో వీర రసం ప్రతిపాదించబడి ఉంది. ఆ వీరం శృంగారంలోనే పర్యవసిస్తుంది అంటే శృంగార సాధన కోసమే వీరం ప్రదర్శింపబడింది .

"వేల్పుఁబ్రమాని యందు వేడుక వదు కూర్మి
సతుల కోర్కి దీర్ప జాలియవుడు
హరియుహరియు బోరి రన్యోన్య జయకాంక్ష
నసుర జీవితావహారుగములు" 140

ఇది ఇంద్ర, ఉపేంద్రుల యుద్ధాన్ని వర్ణించే పద్యం. వారి యుద్ధానికి కారణం ఇందు తెలుపబడింది. వారి భార్యల కోరికలు తీర్చ డానికే వారు యుద్ధానికి తలపడ్డారు. వారిని సంతృప్తలను చేస్తే వారి శృంగారపు పంట పండుతుంది. ఆ శృంగార సాధనకే వీరాన్ని ప్రదర్శించాల్సి వచ్చింది. ఈ పద్యం వల్ల కూడా తిమ్మన భంగ్యంతరంగా తన ప్రబంధంలోని అంగి రసం శృంగారం అనే తెలిపారు. ఈ ప్రబంధంలో అంగిరసం శృంగారమై, దానికి వికాసాన్ని కలిగిస్తూ అంగంగా ఉండి వీరం భాసిస్తుంది.

ఇక సత్యభామ పుణ్యక వ్రతం చేయడం కూడా పతి తనకు అనుకూలుడై వర్తించి, తన కోర్కులు తీర్చడం కోసమే పుణ్యక వ్రతం చేసి తన సౌభాగ్యానికై అంటే పతి అనుకూల్యానికై చాలా శ్రమించి సాధించిన పారిజాత వృక్షాన్ని, ప్రాణప్రదుడైన పతిని కూడా నారదునకు దానం ఇచ్చింది. కాబట్టి పుణ్యక వ్రత ఘట్టం కూడా 'శృంగార రసం' యొక్క అంగిత్వాన్నే బలపరుస్తుందని చెప్పవచ్చు

'పారిజాతాపహరణం' అనే ఈ ప్రబంధ నామానికి సార్ధక్యం కలదు నారదుడు తీసుకొచ్చిన పారిజాత పుష్పం వల్లనే సత్యభామకు ఈర్ష్యామానం కలిగింది ఆ మానోప శమనానికై శ్రీకృష్ణుడు పాద పతన పర్యంతం అనేక పాట్లు పడవలసి వచ్చింది దుఃఖిత మతి అయిన సత్యభామను ఓదారుస్తూ, 'ఒక పారిజాత పుష్పానికే వగల బొగులడం ఎందుకు? పారిజాత వృక్షాన్నే దివినుండి భువికి తీసుకొచ్చి నీ పెరటి చెట్టుగ నాటిస్తాను' అని శ్రీకృష్ణుడు పలికి తత్కార్య సాధనకై ఉద్యమించి విజయం సాధించాడు దాని సాధనకై ఇంద్రుడితో వీరోచితంగా పోరాడి పారిజాతాపహరణం చేసాడు. ఈ వృత్తాంతం అంతా 'పారిజాతాపహరణం' అనే గ్రంధనామం వల్లనే వ్యంజితమౌతుంది. కాబట్టి ఆ పేరు ఈ గ్రంధానికి తగి ఉంది. ఈ గ్రంధనామం వల్ల శృంగారరసం చవ్పన స్ఫురించకపోగా వీర రసమే స్ఫురిస్తుంది. అపహరణానికి ఉత్సాహం అవసరం ఎవరన్నా ఎదుర్కొంటే వారితో పోరడం అవసరం పారిజాతం అనడంలో మార్దవ, సౌకుమార్య స్ఫురణ వల్ల శృంగారం స్ఫురిస్తున్నా దాని అపహరణంలో వీరమే ప్రధానంగా స్ఫురిస్తుంది కాబట్టి గ్రంధ నామాన్ని బట్టి ఎవ్వరైనా ఇందలి ప్రధానరసం వీరం అని ప్రతిపాదించడానికి అవకాశం ఉంది కాని అంతస్సాక్ష్యం వల్ల ఆ ప్రతిపాదన వీగిపోతుంది. పారిజాత పుష్పం మూలాన్నే సత్యభామకు ఈర్ష్యామానం కలిగింది. దాన్ని పోగొట్టే సందర్భంలో శ్రీకృష్ణుడు పారిజాత వృక్షాన్ని తెచ్చి పెరటి చెట్టుగ నాటిస్తానని దాని అపహరణకు పూనుకొన్నాడు. కాబట్టి ఇంతకు పూర్వం చెప్పిన

విధంగా శృంగార సాధనకే వీరం ప్రదర్శింప బడింది. ఇలాంటి వీరం అంగంగా ఉండి శృంగారానికి దీప్తిని కలిగించింది.

"శ్రీమదికిం బ్రియం బెసగ జెర్చిన యయ్యొల లీల వైజయం
తీమిళితాచ్ఛ కౌస్తుభము నిద్దపు గాంతి దనర్చి యాత్మవ
క్షోమణివేది బొల్పెసగ జాడ్కు౯ల పందువుసెయు వెంకట
స్వామి కృతార్థుజేయు నరసక్షితినాథుని కృష్ణరాయనిన్" 141

ఇది దేవతా స్తుతి పద్యం దీంట్లో 'శ్రీమదికిం బ్రియం బెసగ జేర్చిన యయ్యొల లీల' అనే వాక్యంలో పారిజాతాపహరణ ప్రబంధంలోని సత్యభామా ప్రీత్యర్థం పారిజాతాపహరణ రూపమైన ఇతివృత్తం వ్యంజింప చేయబడింది ఇలా వ్యంజింప జెయడంలో ఇది శృంగార రస ప్రధాన కావ్యమనీ, నాయికా ప్రాధాన్యం కలదనీ గమ్యమానం అవుతూంది

"పొలతుల్ గౌగిట గ్రుచ్చి యెత్తి" 142 అనే ద్వితీయ పద్యంలో 'పార్వతి యసూయా వ్యాప్తికిన్నవ్వు' అనే వాక్యం వల్ల వర్ణ్యమాన ప్రస్తంలో సత్యభామ యొక్క ఈర్ష్యామానం వ్యంగ్య మర్యాదచే సూచింపబడింది.

అలాగే నాల్గవ పద్యమైన "సరసపుటల్క దీర్చుటల" 143 అనే పద్యంలో సత్యభామ అలక పూనడం, ఆమెను అనునయించి శ్రీకృష్ణుడు ఆమె అలుకను తీర్చడం అనే కథావస్తువు వ్యంజింపబడింది

ఈ మూడింటిలోనూ ప్రస్తుత కథాంశాన్ని సూచించడమే గాక ఇందలి అంగిరసం శృంగారం అనే కంఠోక్తిగా చాటుతున్నట్లు కనబడుతుంది ఏ విధంగా చూసినా పారిజాతంలో ప్రధానరసం శృంగార రసమని చెప్పడం తక్క అన్యవిధంగా చెప్పడానికే మాత్రం అవకాశం లేదు. కవి గూడా అవకాశం ఈయకుండా అన్యాపదేశంగా ఇందలి అంగిరసం శృంగారం అని సూచించి ఉన్నాడు కాబట్టి శృంగారం అంగిరసం అనడంలో విప్రతిపత్తి లేదు

1. శృంగార రసపోషణ:-

a) విభావాను శీలనం-

**1) ఆలంబన విభావాలు -** ఏకనాయకాశ్రయం అయిన పారిజాతాపహరణంలో ఆలంబన విభావాల గురించి ప్రత్యేకంగా చెప్పవలసిన పనిలేదు శ్రీకృష్ణుడు శృంగార రసాధి దైవతం సత్యభామ శృంగార సర్వస్వం అయిన శృంగార నాయిక ఇలాంటి నాయికా నాయకాశ్రయాలైన ప్రబంధంలో శృంగార రసం చక్కగా పోషింపబడడంలో అనుమానం

ఉండదు. శ్రీకృష్ణుడు శ్రీపతి సత్యభామ శమంతక మణి వల్ల అనేక బారువుల బంగారాన్ని ప్రతినిత్యం పొందినట్టిది. ఇలాంటి వీరి విలాస జీవితానికి ఏ కొఱత ఉంటుంది? విభావ సామగ్రి సమగ్రంగా సిద్ధిస్తుంది. శ్రీకృష్ణుడు దివ్య పురుషుడై కూడా సామాన్యుని లాగా, పరమరసికునిలాగా చక్కగా తనవిధిని నిర్వర్తించి శృంగారానికి దీప్తికలిగించాడు

2. ఉద్దీపన విభావాలు:- ఇక ఉద్దీపన సామగ్రి కావలసినంతగా ఈ ప్రబంధంలో ఉంది. సత్యాకృష్ణుల రూపజవ్వనాలు పరస్పర ఉద్దీపనాలు మానవిప్రలంభంలో సత్యభామ వ్యక్తం చేసిన హావ భావాదికాలు శృంగార ఉద్దీపకాలు "మది పతి యొకతె" 144 ఇత్యాది పద్యంలో 'విభ్రమం' అనే శృంగార చేష్ట వర్ణించబడింది కృష్ణుని కౌస్తుభాది ఆభరణాలు, సత్యభామ అలంకరణ సామగ్రి కూడా పరస్పర ఉద్దీపకం అయినట్టిదే

"ఇందు నిబాస్య మై తొడవులేల ధరింపవు నున్న గావులీ
వెందును మానలేవు తెలుపేటికి కట్టితి వీటి కారుచుల్
కెందలి రాకుమోవి దులకింపగ జేయకయున్కి యేమినీ."145

సత్యభామ చెలికత్తె పారిజాత వృత్తాంతాన్ని తెలిసికొని వచ్చేసరికి శృంగార వనంలో విహరిస్తూ ఉంది అక్కడ తటస్థ ఉద్దీపనాలు వర్ణించబడి ఉన్నాయి

"తన శృంగార వనంబులో నగరి పొంతం జక్కగా దిద్దితీ
ర్చిన పూదేనియ యేటి కాలువ దరిం జెంగల్వ పుప్పొళ్ళునిం
చిన చంద్రోపల వేదిపై సరసగోష్ఠిన్ " 146

దీనిలో పూదేనె ఏటికాలువ, చెంగల్వ పుప్పొళ్ళునింపిన చంద్రోపలవేదికలు తటస్థోద్దీపనాలు 1-72వ పద్యంలో అలికులరావాలు, కోకిల కాకుకాకలీ కలకల నాదాలు, కమ్మని తమ్మికొలంకు తెమ్మెరలు కూడా తటస్థోద్దీపనాలే

"కృతకాద్రి కందరాకేళీ నిగూహన వేళా పరస్పరాన్వేషణములు
పోషిత మాధవీ పున్నాగ పరిణయోత్సవ కల్పితానేక సంభ్రమములు
చాతురీ నిర్జిత ద్యూత పణాదాన కలిత చేలాంచలాకర్షణములు
సాయంసమారంభ చక్రవాక ద్వంద్వ విరహావలోకన విభ్రమములు
సాంద్రతర చంద్రికా కేళి చంక్రమములు.
విధుశిలామయ వేదికా విశ్రమములు
ఫలక చిత్రిత నిజరూప భావనములు
మఱచెనో కాక రుక్మిణి మాయదగిలి" 147

ఈ పద్యం లోని కృతకాద్రికందరలు, మాధవీ పున్నాగాలు, ద్యూతం, చక్రవాక ద్వంద్వం, చంద్రిక, విధుశిలామయ వేదికలు, చిత్రఫలకాలు మొదలగునవన్నీ ఉద్దీపన విభావాలే ఇవేగాక "ఉవిద యెవ్వతె నోచియున్నదో" 148 ఇత్యాది పద్యంలో శమంతక రత్నం, రైవతక శైల చారుకూట విటంకాలు, వసంతారామ కర్పూర కదళికాగారాలు, మణిసౌధజాలకాల్లు, శుకమయూర శారికా బృందాలన్నీ తటస్థోద్దీపన విభావాలే

ద్వితీయాశ్వాసంలో సత్యాకృష్ణుల సంభోగానికి ఉద్దీపనంగా సాయంకాల, అంధకార, దీప, నక్షత్ర, చంద్రోదయాలు, వర్ణించబడ్డాయి చకోర లీలలు కూడా శృంగారోద్దీపకాలుగానే ఉన్నాయి ద్వితీయాశ్వాసంలోని 53వ వచనంలో అనేక ఉద్దీపన విభావాలు వర్ణించబడ్డాయి " . . . అయ్యెడ నయ్యదు వల్లభుండు సత్యయుందాను ననర్ఘ్య మణిదీపితంబును . . మాణిక్య సమున్నతాదర్శ దర్శనీయంబును నగు నాగారంబున . " 149 అనే వర్ణనలో శయనాగారం లోని ఉద్దీపన సామగ్రి ఎంతో మనోహరంగా ఉంది ఈ విధంగా విప్రలంభ, సంభోగ సన్నివేశాలలో ఉద్దీపన విభావాలు రకరకాలుగా చిత్రింపబడి శృంగార రస పోషణకు ఉపస్కారకాలుగా ఉన్నాయి.

**b) అనుభావాలోకనం:-**

"బిసరుహ పత్త్రలోచనకు బెల్లగుమోహము సంమటిల్లెనె
క్కసమగు నెవ్వగల్వొదమె గంపము పుట్టె జెమర్చె మేను మా
నసమున విన్న బాటొదవె నాటెగడుం బరితాప వేదనల్ " 150

ఈ పద్యంలో కంపం, స్వేదం అనే సాత్త్విక భావాలు సత్యభామకు కలిగినట్లు చెప్పబడ్డాయి

"తలవాంచి మగుడ ముసుగిడె
గొలుకుల డిగజాఱ జాలుకొను బాష్పంబుల్
పలుచని చెక్కుల లవలీ
దళ పతిత మరంద బిందు తతి బురుడింపన్" 151
దీనిలో 'అశ్రువు' అనే సాత్త్విక భావం చిత్రింప బడింది.

"వనిత కుచ ద్వయంబుపై" అనే పద్యంలో స్వేదం అనే సాత్త్విక భావం ఉంది "కోపన పదహతి" 153 అనే పద్యంలోనూ,

"ననుభవదీయ దాసుని మనంబున నెయ్యపు గిన్క బూనితా
చినయది నాకుమన్ననయ చెల్వగు నీపద పల్లవంబుమ

త్రను పులకాగ్ర కంటకవితానము దాకిన నొచ్చునంచునే
నని యెద నల్క మానవుగదా! యికనైన నరాళ కుంతలా" 154
అనే పద్యంలోనూ 'రోమాంచం' అనే సాత్త్వికభావం చిత్రించ బడింది

"అనవిని మానినీ తిలకమప్పుడు" 155 అనే పద్యంలో 'స్వేదం'

"ననునెవ్వతెగా జూచితివని" 156 అనే పద్యంలో 'వైస్వర్యం', 'అశ్రువు', అనే సాత్త్విక భావాలు వర్ణించబడ్డాయి

"ఈసున బుట్టి డెందమున హెచ్చిన శోక దవానలంబుచే
గాసిలి యేడ్చె బ్రాణ విభు కట్టెదుటన్ లలితాంగి పంకజ
శ్రీ సఖమైన మోమువయి జేల చెఱంగిడి బాల పల్లవ
గ్రాస కషాయ కంఠకలకంఠ వధూకల కాకలీధ్వనిన్" 157

అనే పద్యంలో 'ప్రళయం' అనే సాత్త్విక భావం ఉందని నాగపూడి కుప్పుస్వామయ్య గారి అభిప్రాయం. దీనిలో 'అశ్రువు' అనే సాత్త్విక బావం కూడా ఉంది

నాకలోకానికి వచ్చిన కృష్ణుని చూస్తున్న వనజాక్షులలో సాత్త్విక బావాలు ఉదయించినట్లు వర్ణించబడింది వాటిని స్థూలంగా పరిశీలిద్దాం

"అలదిన చందనంబు వృథయౌ .. పిల్చెనెచ్చెలిన్" 158

ఈ పద్యంలో స్వేదం, అశ్రువు, రోమాంచం అనే సాత్త్విక భావత్రయం వర్ణించ బడింది.

"అలికులవేణి యొక్కతె మురారి గనుంగొని .. . చెప్పుదున్" 159

అనే పద్యంలో స్తంభం, స్వేదం, వేపథువు(కంపం) అనే సాత్త్విక బావాలు చిత్రించ బడి ఉన్నాయి.

"దనుజ విరోధి మీద నొకతన్వి ..... . మౌక్తికావళుల్" 160

ఇందు అశ్రువు, స్వేదం అనే సాత్త్విక భావాలు ఉన్నాయి

ఈ విధంగా అనుభావాలు ఈ ప్రబంధంలో చిత్రింపబడి శృంగార రసానికి పోషకాలుగా నిలిచాయి

**C. సంచారీ సమాలోచనం:-**

పారిజాత కుసుమ వృత్తాంతాన్ని చెలికత్తె చెప్పగా సత్యభామ "అనవిని వ్రేటువడ్డ" 161 అనే పద్యం మొదలుకొని సత్యభామ కోపగృహ ప్రవేశం చేసే వరకు 'ఔగ్ర్యం' అనే సంచారీ

భావం వర్ణించబడింది ఈ ఘట్టంలోనే రోషం, ఆవేగం అనే సంచారులు కలవు. "పలుదెఱగు ముళ్ళమాటల" 162 ఇత్యాది పద్యంలో వితర్కం, 1-ఆ-88, 90 పద్యాలలో మరణం అనే సంచారీ భావం చిత్రించ బడ్డాయి. ఈ ఆశ్వాసంలోని 94,95 పద్యాలలో చింత, స్మృతి అనే సంచారులు కలవు "మాసిన చీర గట్టుకొని" 163 లో విషాదం, "బిసరుహవక్త్రలోచనకు" 164 లో దైన్యం, మోహం, 1-98లో అమర్షం (రోషం) అనే సంచారీభావాలు చిత్రించబడ్డాయి

"వెడవెడ కన్ను మూయు" 165 అనే పద్యంలో గ్లాని, ఆర్తి, ఆవేగం, చపలత, ఉన్మాదం అనే పెక్కు సంచారీ బావాలు ఉన్నాయి "తనదుకోడంద్రలోన" 166 ఇత్యాది పద్యంలో 'త్రప' అనే సంచారి, "ఉవిదయెవ్వతె" 167 లో మరణం అనే సంచారి కలవు "ఇంకిటు నిన్ను నమ్మినను" 168 అనే పద్యంలో (అసహత) అసూయ అనే సంచారీ భావం కలదు.

ఇలా ఒకటి రెండు సంచారులు తక్క తక్కిన సంచారులన్నీ ఈ ప్రబంధంలో చిత్రించ బడ్డాయి జలజాక్షులు కృష్ణుని జూచే సందర్భంలో అనేక సంచారీ బావాలు చిత్రించబడ్డాయి ఉదాహరణకు ఒకటి రెండు "వేడుకనీకెకాని" 169 లో అసూయ, "జలరుహనేత్రుగాంచి" 170 లో ఉన్మాదం అనే సంచారులు చిత్రించ బడ్డాయి ఇలా సంచారులనేకం శృంగార పోషకాలుగా చిత్రింప బడ్డాయి.

### 3. విప్రలంభ వివేచన:-

అభిలాష విప్రలంబంలో సుమారుగా మన్మధావస్థలన్నీ చిత్రింపబడి ఉంటాయి తదితర విప్రలంభాలలో ఈ అవస్థలు కొన్ని మాత్రమే ఉంటాయి పారిజాతాపహరణంలో సత్యభామ మాన విప్రలంభంలో కొన్ని మన్మధావస్థలు చిత్రించబడ్డాయి. దశవిధ మన్మధావస్థలలో అరతి, హ్రీత్యాగం, ఉన్మాదం, మరణం అనేనాలుగు అవస్థలు మాత్రం చిత్రించ బడ్డాయి

"అలికుల రావముల్ కిసలయాకులకోకిల కాకుకాకలీ
కలకలనాదము ల్సెలగ గమ్మని తమ్మికొలంకు తెమ్మెర
ల్వొలయగ దొంటి చందమున బుద్ధికి నేమియు నింపుగామికిం
గలగుచ .________________. " 171

అనే పద్యంలో 'తొంటి చందమున బుద్ధికి నేమియు నింపు గామికిన్' అనే వాక్యంలో 'అరతి' అనే మన్మధావస్థ ఉంది "వెడవెడ కన్ను మూయు గనువిచ్చు నగుం దలయూచు " 172లో 'ఉన్మాదం' అనే మన్మధావస్థ చిత్రించ బడింది సత్యభామ శ్రీ కృష్ణుని నోటికి వచ్చునట్లు దూరడం, శిరస్సును వామ పాదంతో తన్నడంలో, 'హ్రీత్యాగం' అనే మన్మధావస్థ

గమ్యమానం అవుతుంది ప్రధమాశ్వాసంలో 88, 90, 131 పద్యాలలో 'మరణం' (మరణయత్నం) అనే మన్మధావస్థ వర్ణించ బడింది. ఈ విధంగా యధోచితంగా మన్మధావస్థల్ని చిత్రించి తిమ్మన గారు శృంగార రసానికి దీప్తిని కలిగించారు.

సత్యభామ స్వాధీన భర్తృక. తన స్వాధీన భర్తృకత్వానికి భంగం కలిగినప్పుడు 'ఖండిత' నాయికగా ప్రత్యక్షం అవుతుంది. తన పతిదక్షిణుడైనా అనుకూలుడుగా ఉండాలని ఆమె కోరుకొంటుంది తనపై చూపించే అనురాగాన్ని మరొకతెపై చూపిస్తే ఆమె సహించలేదు. ఆమె సౌందర్యవతి, యౌవనవతి, కీర్తి ప్రతిష్ఠలు కలది కాబట్టి ఆ అసహనత్వం మరింత పెరిగింది సత్యభామలో ఈర్ష్య, అమర్షాలు కలగడానికి తిమ్మన గారు చక్కని హేతువును సృష్టించారు. కలహ భోజనుడైన నారదుడు ఒక పుష్పాన్ని తెచ్చిస్తే దాన్ని కృష్ణుడు రుక్మిణికి ఇచ్చాడు. ఈ విషయం విన్న సత్యకు ఈర్ష్య, అమర్షాలు కలిగాయి. ఈ ఒక్క పారిజాత సుమం నిత్యసంపన్న అయిన సత్యభామకు ఓలెక్కా? ఆమె తలచుకుంటే ఎన్ని పారిజాత పుష్పాలనైనా తెప్పించుకోగలదు అలాంటి ఈమె ఒక్క పారిజాత పుష్పానికై అలగడం వింతగాలేదా? కాని అలాకాదు ఆమె కేవలం పారిజాత సుమానికై అలగలేదు తన సవతికి దాని నివ్వడం, నారదుడు ఆమెను పొగడ్తూ, తన్ను తెగడుతుండగా శ్రీ కృష్ణుడు వినడం అనే ఈ కారణాల వల్ల సత్యభామకు అమర్షం కలిగింది ఆడవాళ్ళకు అసూయ సహజం. సత్యభామలో అది ఎన్నోరెట్లు అధికం. దానికి దగ్గ అహం ఆమెలో ఉండి ఆ అసూయకు వన్నె బెట్టింది

అలా ఈర్ష్యామానం పొందిన సత్యభామ రకరకాలుగా వారి ముగ్గురిని దూరి, కృష్ణుడే ఈ అవమానానికి కారకుడని నిశ్చయించి, అతనికి బుద్ధి చెప్పదలచి కోప గృహ ప్రవేశం చేసింది లోకంలోని భర్తల లాంటివాడు కాదు శ్రీకృష్ణుడు. రసికుడు. సత్యకు కోపం వచ్చినా, బాధ కలిగినా సహింపలేడు. ఎలాంటి స్థితిలో ఉన్నా తనకై పరిగెత్తి రాగలడనే నిశ్చయమతి కలది సత్య కృష్ణునకు ఆమెను గురించిన ఆలోచన నారదుడు పారిజాత సుమాన్ని ఇవ్వగానే కలిగింది అప్పుడు తత్కాలిక ధర్మాన్ని పాటించక అతనికి తప్పలేదు తప్పని పరిస్థితిలో మాత్రమే రుక్మిణికి పారిజాత కుసుమాన్ని ఇచ్చాడు. అసలు ఒకరు ప్రత్యక్షంగా, మరొకరు పరోక్షంగా ఉన్నప్పుడు కాక ఇద్దరూ ఉన్న సమయంలో నారదుడు వచ్చి పుష్పాన్ని ఇచ్చి ఉంటే కథ ఎలా ఉండేదో మన ఊహకు అందందికాదు. రథాన్ని ఎక్కి కేతన పటాంచల చంచలమైన తాల్మితో శ్రీకృష్ణుడు బయలు దేరాడు. సత్య గృహాన్ని ప్రవేశించాడు. శ్రీకృష్ణుడూ సామాన్యుడు కాదు. ఆయుర్వేద వైద్యుని లాంటి వాడు. ఆవేశాన్ని అధికం చేసి తగ్గించే స్వభావం కలవాడు. పారిజాత పరిమళం ఆమె నాసాపుటాల తగిలే విధంగా వీవెన తీసికొని వీచడం ఆరంభించాడు ఆమె మరింత రెచ్చి పోయింది. అనునయం ఆరంభించాడు. 'దాసుని తప్పులు దండంతోసరి' అని భావించి ఆమె పాదాలు పట్టాడు. వాసవాది సురపూజా భాజనంబైన అతని శిరస్సును ఆమె వామపాదంతో తన్నింది. ఇది ప్రణయంలో విచిత్ర

సన్నివేశం. కాని ఇక్కడ సత్యభామ ప్రణయ కోపంతో తన్నలేదు. ఈర్ష్యా మానంతో తన్నింది. ఈ సందర్భంలో విశ్వనాథ వారి మాటలు స్మరణీయాలు." -- నిజముగా శృంగార రసములో నిదియొక క్లిష్ట ఘట్టము. కోపముతో భార్య తన్నినచో లోకములో నిద్దరు భర్తలే యూరకొందురు. ఒకడు కృష్ణుని వంటి మహారసికుడు. రెండవ వాడు వట్టి అసమర్థుడు. సత్యభామ నిజముగా తప్పుచేసినది కృష్ణుడు కోపించి వెడలి పోయినచో కథయే లేదు. "172A కాని సత్యభామ ఈ ప్రవర్తనలోని అనౌచిత్యం 'మానరహితమైన బ్రతుకు మానినికేలా! అని సత్యభామ అనడంలో పరిహారం అయిందని వారిభావం. నిజమే మరి సత్యభామ అభిమానవతి కాకుంటే అలాప్రవర్తించేదే కాదు. కృష్ణుడు ఆమె పాదాలపై బడడం మనకు ఎంతగా కనబడుతున్నా అది కామశాస్త్ర, అలంకార శాస్త్ర సమ్మతమైనట్టిది. అలాచేసి ఆమెను అనునయించి తన శృంగారపు పంట పండించు కొన్నాడు. శ్రీకృష్ణుని అనునయంతో ఆమె మానం ఉపశమించింది

4. సంభోగ సమ్యక్పోషణ:-

ఆమె మానం ఉపశమించింతర్వాత మజ్జనాది ఉపచారాలన్నీ పొంది ఇద్దరూ శృంగారోద్దీపకం అయిన శయనాగారంలో ప్రవేశించారు ఆమె మానం ఉపశమించగానే అతనితో సుఖించినట్లు తిమ్మనగారు చిత్రించక పోవడం ఆతర్వాత మజ్జనాది ఉపచారాలు చిత్రించి, చీకటైన తర్వాత చంద్రుడు, చంద్రిక, చంద్రికా విహారాల్ని వర్ణించి క్రమక్రమంగా శృంగారోన్మీలనం కలిగించడంలో ఎంతో ఔచిత్యం భాసిస్తుంది ఆ శయనాగారంలో కూడా సమయం లభించింది గదా అని సత్యా కృష్ణుల సంభోగ శృంగారాన్ని అతివేలంగా వర్ణించలేదు " -- దర్శనీయంబు నగు శయనాగారంబున వినోదకేలిందేలి నిద్రా ముద్రిత నేత్రుడై శయనించె"173 అని ఒక్క మాటలో సంబోగ శృంగారాన్ని ధ్వనింప జేయడంలో శృంగారం ఔచిత్య భాసురమై శోభిల్లిం ది

అంతకు పూర్వం అంటే సంబోగాత్పూర్వం సత్యభామకు కలిగిన ఈర్ష్యామానం వల్ల మాన విప్రలంభం చిత్రించబడి వియోగంచే బాధ పడుతున్న సత్యా కృష్ణుల తర్వాతి సంబోగం మిక్కిలి సుఖాన్ని కలిగించింది. ఈ మాన విప్రలంభ చిత్రణ వల్ల సంబోగ శృంగారానికి పుష్టి చేకూరిందని చెప్పవచ్చు

తర్వాతి కథ కూడా వారి శృంగారానికి చక్కగా ఉపకరించింది. సత్యభామకు మాట ఇచ్చిన ప్రకారంగా ఆమె కోర్కెలు తీరిస్తే ఆమె ప్రసన్నురాలై అతని కోర్కెలు తీరుస్తూ సుఖాన్నిస్తుంది. ఆమె కోర్కెలు తీర్చడంలోనే కృష్ణునకు మానసికానందం లభిస్తుంది. అందుకే అంతకు పూర్వం నారదునిపై కోపం కలిగినా దాన్ని మాట మాత్రం అయినా తలవక అతడు చెప్పిన వ్రతాన్ని ఆచరించింది ఆ పుణ్యక వ్రతం వల్ల తన భర్త తనకు వశంవదుడై

ఉంటాడు అలా ఉండడం వల్ల నిరంతర భోగాల్ని అనుభవించడానికి వీలౌతుంది. కృష్ణునికి గల మనస్తత్వమే సత్యకు కూడా గలదు పరస్పర ఆస్థ గల వీరిలో 'రతి' మిక్కిలిగా దీపించడంలో ఆశ్చర్యం ఆవంత కూడా లేదు.

ఈ ప్రబంధంలో మొదట శృంగారోన్మీలనం చేసి తర్వాత వీరాన్ని ప్రదర్శించి దాన్ని శృంగారంలో పర్యవసింప జేయడంలో రసౌచిత్యం ఉంది ఏక నాయికా నాయకాశ్రయం అయిన ఈ ప్రబంధంలో మానవిప్రలంభం తర్వాత నాయికా నాయకులు అవిభక్తంగానే ఉన్నారు నాకలోకానికి సత్యభామ వెళ్ళవలసిన అవసరం లేదు. కాని ఆమె కృష్ణుని వెంట ఉంటేనే రసవత్తరంగా ఉంటుంది. దీని వల్ల వారి అవిభక్త శృంగారం కూడా సూచింపబడింది.

దీనిలో మాన విప్రలంభం వల్ల శృంగారానికి దీప్తి కలిగించడం (మానం అనునయం సంభోగం) తిమ్మనగారు చేసిన నూత్న ప్రయోగాంశం ఈ ప్రయోగమే తర్వాత వచ్చిన సాంత్వన కావ్యాలకు (రాధికాసాంత్వనం, సత్యభామా సాంత్వనం) ప్రధాన ఆధారం అయింది.

4. రాజశేఖర చరిత్ర:-

శ్రీకృష్ణదేవరాయల ఆస్థానంలో ఒకడని ప్రతీతి పొందిన మాదయగారి మల్లన 'రాజశేఖర చరిత్రం' అనే ప్రబంధాన్ని వ్రాసి నాదెండ్ల అప్పన మంత్రికి అంకితం ఇచ్చాడు ఈ అప్పనమంత్రి సాళ్వ తిమ్మరుసుకు అల్లుడు ముచ్చటగా మూడాశ్వాసాలలో వ్రాయబడ్డ ఈ ప్రబంధానికి మూలం ఉన్నట్లు కనబడదు దీంట్లో రాజశేఖరుని జననం, అతని వీరాది గుణ ప్రదర్శనం, కాంతిమతితో ప్రేమ, పెళ్ళి అనే అంశాలతో ఈ మూడాశ్వాసాలు కూడి ఉన్నాయి

1 అంగిరస నిర్ణయం:-

రాజశేఖరుడు రాక్షసునితో యుద్ధం చేసి విజయం సంపాదించడంలో వీరరసం స్పష్టంగా ఉన్నా, తర్వాత అతడు కాంతిమతిని చూసింది మొదలు కావ్యాంతం వరకూ శృంగారం సాంగోపాంగంగా చిత్రించబడింది అంతకు ముందు పోషింపబడ్డ వీరం రాజశేఖరుని ఉత్తమ నాయకత్వాన్ని, ధీరోదాత్తతను వ్యక్తపరుస్తూ శృంగార పోషకంగా ఉంది. కాబట్టి ఇందలి ప్రధానరసం శృంగారం. వీరం అంగరసం కరుణ, శాంత, అద్భుతాలు కూడా అక్కడక్కడ అంగ భూతాలుగా చిత్రించబడ్డాయి డా పి. యస్. ఆర్ అప్పారావు గారు ఇందలి ప్రధానరసం, తదితర రసాల గురించి ఇలా చర్చించి ఉన్నారు " రసము చిప్పిలునట్లు కవిత చేయజాలనిచో చేయకుండుటయే మేలని మల్లన్న ఆదిలోనే చెప్పినాడు కదా! అందుచే రస పోషణము నందు మల్లన ఎక్కువ శ్రద్ధను కనపఱచినాడు. ఇందలి

ప్రధాన రసము శృంగారము. ఒకటి రెండు చిన్న వర్ణనలను విడిచి వేసినచో తక్కిన ప్రబంధము నంతటిని బాలురను స్త్రీలను గూడ నిస్సంకోచముగా చదువు కొనవచ్చును. తక్కిన ప్రబంధములలో ఆ అవకాశము లేదు మన ప్రబంధ కవులలో శృంగార రసమును ఇంత సంయమనముతో ఇంత ఉచితజ్ఞతతో పోషించిన వాడు మల్లన్న ఒక్కడే అనుట అతిశయోక్తి కాదు . . . భానుమతీ కథా ఘట్టములో కరుణమును, విశంకట రాజశేఖరుల యుద్ధములో వీరమును, యోగినీ ఘట్టములో శాంతమును అంగరసములుగా పోషింపబడినవి "174

రాజశేఖర చరిత్రానికి 'ప్రస్తావన' వ్రాసిన మధురకవి విద్వాన్ కుందుర్తి సత్యనారాయణ మూర్తిగారు కూడా ఇందలి ప్రధాన రసం శృంగారమే అని చెప్పారు "మల్లన శృంగార రస పోషణమున కవితాపితామహున కేవిధముగను తీసిపోడు "175

ఇతర విమర్శకులంతా ఈ ప్రబంధంలోని ప్రధాన రసం శృంగారమే అని ముక్తకంఠంతో చెప్పారు. కాబట్టి ఇందలి ప్రధాన రసం శృంగారమే

**2. శృంగారరస పోషణ:-**

ఈ శృంగార రసాన్ని మాదయ్య గారి మల్లన తన ప్రబంధంలో ఆలంకారిక శాస్త్రానుసారం గానే పోషించాడు

a) విభావాను శీలనం:- ఇందలి ఆలంబన విభావాలు నాయికానాయకులైన కాంతిమతీ రాజశేఖరులు.

నాయకుడు రాకుమారుడు. నాయిక రాకుమార్తె ఇద్దరికీ కులీనత ఉంది రాజవంశీకులు కాబట్టి మహాభాగ్యాది తదితర లక్షణాలన్నీ వారికి ఉన్నవనడంలో వింతలేదు. నాయిక కాంతిమతి శాపవశాన భూమిపై అవతరించిన గంధర్వకన్య (లత) .

"లేకున్న నంతచక్కని
కోకస్తని, కోమలాంగి, కువలయ సుషమా
లోకమున గలవె! మానవ
లోకరబున నిఖిల రాజలోక వతంసా!"176 ఈపద్యం మొదలుకొని

"అచ్చుగురాకు బోడి నవయౌవన రూప విలాసరేఖనీ
విచ్చుట గంటినంటి వదియెంతయు గల్గ యొకింత చూచినన్
బచ్చుని వింటివాడు తెగబాఱక నిన్నిపుడింత దవ్వరా
నిచ్చునె! రాజశేఖర నరేశ్వర! యంచు శుకంబు వల్కినన్"177

అనే పద్యంవరకు నాయిక అయిన కాంతిమతి యొక్క రూప యౌవన సౌందర్యాలు చిత్రించ బడ్డాయి

"ఆలతకూన యాకలికి --- దలంపగన్"178 లో నాయిక రూపయౌవన గుణాదులు చిత్రింపబడ్డాయి

అలాగే, "చేడియ! యీ నృపాలకుల శేఖరు సంతత దానశీల
.......... మనోహర రూప సంపదల్"179
"ఎక్కడి రాజరాజ సుతుడెక్కడి ---- ------ భాగ్య మెట్టిదో"180

అనే పద్యాలలో నాయకుడైన రాజశేఖరుని రూపయౌవన సౌందర్యాలు దానగుణం చిత్రింపబడ్డాయి ఇంతకు ముందు మునికూతుర్ని అతడు రక్షించడంలో కరుణోద్వేలత, రాక్షసునితో పోరడంలో ధీరత్వం, కాళిని ప్రార్థించడంలో భక్తి మున్నగు గుణాలు చిత్రించబడ్డాయి ఉత్తమ నాయికా నాయకులను పరిగ్రహించడం వల్ల ఉత్తమ శృంగారాన్ని పోషించ గలిగాడు ఉత్తమాలంబనత్వం కావ్యానికి శోభ గూరుస్తుంది. ఈ నాయికా నాయకుల రూప యౌవన సౌందర్య గుణాదులు పరస్పరం ఉద్దీపనం కలిగించి నాయికా నాయకులే ఉద్దీపన విభావాలయ్యారు కాంతిమతి పుష్పాపచయం, జలక్రీడలు చేసి వెళ్ళిపోయేప్పుడు ఆమెనడకలోని ఒయ్యారం, విలాసం, ఆమె అవయవాలందలి సౌరు రాజశేఖరునిలోని 'రతి' ని అంకురింపజేసాయి రాజశేఖరుని చూడడం వల్ల అతని రూప గుణాలు ఆమెలో 'రతి'ని ఉద్భవింపజేసాయి దానికి తోడు నెచ్చెలుల మాటలు ఆమెలో రాజశేఖరుని పై ప్రేమను గాఢత నొందించాయి ఇలా వారిలో రతి అంకురించడానికి కేవలం పురుష కారమే కాకుండా తోడుగా ఆవనం, అచటి సరస్సులు, సౌరభాన్ని వెదజల్లే సుమాలు, తుమ్మెదల ఝుంకారాలు, కోయిలల పాటలు, మలయ మారుతం, చంద్రమన్మథులు నిలిచాయి ఇవి తటస్థంగా ఉన్నా వారి బావాలలో తీవ్ర పరిణామాన్ని తీసికొని వచ్చాయి ఈ విధంగా ఆలంబన, ఉద్దీపన పూర్వకమైన విభావాలను మల్లన చక్కగా చిత్రించాడు

b అనుభావాలోకనం:-

ఈ ప్రబంధం లోని అనుభావాలను ప్రత్యేకంగా తడవాల్సిన పనేలేదు నాయికా నాయకుల పరస్పరాలోకనాల తర్వాత వారిలో భావపరిణామాన్ని వ్యక్తపరచే కటాక్షాదులు, మాటలు, చేష్టలు అన్నీ అనుభావాలే ఈ అనుభావాలకు ఒకటి రెండు ఉదాహరణాలు.

"వెడవెడ జారునీవి, యరపేడిన పెన్నెరి గొప్పునెన్నెడం
దడబడు పద్మములు, దారిన కన్గవచూపు, తోరమై

బడిబడి వెళ్ళు నూర్పుగమి, వయ్యెదయొయ్యన జారగా బయల్
వడు చను గుబ్బలుం గల విలాసిని చందము జూచి నెచ్చెలుల్"181

కాంతిమతిలో 'రతి' అంకురించిన తర్వాత ఆమెలో ప్రస్ఫుటంగా వ్యక్తమైన అనుభావాలు పై పద్యంలో చిత్రీకరించ బడ్డాయి

"చిలుక పురోహితుండగుచు జెంగట నుండగ సిగ్గుపెందెరల్
దొలగగ ద్రోచి, బంధుగతి దోరపు గోర్కులు సందడింపగా
దలపు లతాంగి కన్నుమును తానకనుంగవదోయిలించి చూపుల
దలబ్రాలు పోసె నృప పుత్రునిపై విరహాగ్ని సాక్షిగన్"182
దీనిలో 'కటాక్షం' మొదలగు అనుభావాలున్నాయి
ఇందు సాత్త్విక భావాలు కూడా అక్కడక్కడ వర్ణించబడ్డాయి.

"విరహవన్నగఫణా విహరణంబన వేడియూర్పుల బయ్యెద యొయ్యగదల
ననురాగ జలధి సంజనిత ఫేనచ్ఛాయలన మేని వెలిచాయ లతిశయిల్ల
గాఢ చింతా లతాకలికా కదంబకంబన ఘర్మకణ జాల మంకురింప
నురు మోహ తిమిర ఖద్యోతంబులన గాకబెట్టు కుంకుమ లేర్చిపేటు లెగయ....."183

ఈ పద్యంలో వైవర్ణ్యం, స్వేదం మున్నగు సాత్త్విక భావాలు చిత్రించ బడ్డాయి "ప్రాణ సఖీరత్న ..."184 అనే పద్యంలో (నాయికకు) స్వేదం, "మంగళ సూత్రము గట్టె "185 అనే పద్యంలో (నాయకునికి) రోమాంచం చిత్రించ బడ్డాయి.

**c. సంచారీ సమాలోచనం:-**

సంచారీ భావాలు కూడా దీనిలో ప్రస్ఫుటంగానే కనిపిస్తున్నాయి

"అక్కుమారకుని నింకొక్క మారెదిరించికన్ను లారగ జూడగల్గు నొక్కొ ..."186 అనే పద్యంలో 'చింత' అనే వ్యభిచారి భావం ఉంది.

"అవ్వలనుండునో? కడచి యవ్విభు .."187
"చెలులకు నామనో రథము చెప్పిన ...."188
"తలపున నాథునింగలసి ...."189
"అమ్మాడ్కినే కతంబున ...."190
"ఎచ్చట నుండి వచ్చె నిపుడీ మధుమాసము .."191

"విరహపన్నగ ఫణా విహరణంబున . . . 192
"మనుజేంద్ర! యలకేలి వనములో . . . "193
"ప్రాణ సఖీరత్న మరగౌను గెంగేలు . . . . "194
"మగువయు నాథుడుం బసిడి మంచముపై . . "195

మున్నగు పద్యాలలో శంక, నిర్వేదం, గ్లాని, భ్రమ (భ్రాంతి), తాపం, వితర్కం, హర్షం, త్రప, భీతి, హాసం మొదలగు అనేక సంచారీ భావాలు చోటు చేసుకొన్నాయి

3. విప్రలంభ వివేచన:-

ఈ విధంగా పోషింపబడ్డ విభావానుభావ వ్యభిచారి భావాలచే 'రతి' పుష్టినొంది ఉపచితమై శృంగారమైంది దీనిలో పోషింపబడ్డ శృంగారం రెండు రకాలుగా ఉంది. మొదటిది విప్రలంభం అది అభిలాష విప్రలంభం ఇది శృంగారానికి పుష్టి నిచ్చింది అభిలాష విప్రలంభ పోషణలో చక్షుఃప్రీతి, మనస్సంగమాది దశవిధ మన్మథావస్థలు చక్కగా తోర్పడతాయి అవి ఇందు పోషింపబడ్డాయి

"అడుగు దామరదోయి దొడివెన బంగారు
రవల పావల ముద్దు రవము గులుక
- - - - - - - - - - - - - - - - -
దంత కురువింద కాంతి బిత్తరము చిమ్మ
సరస సల్లాప గోష్ఠి నచ్చువల నయన
యల్లనల్లన రాజాచె నవని విభుడు
వేడ్క మున్నీరు పెల్లుబ్బి వెల్లిగొనగ. "196

"ఆ పుంస్కోకిల వాణి యా జలధి కన్యారత్న సౌందర్య . .
. . . . . మహిభృచ్చూడా వతంసంబు పైన్"197
అనే పద్యాలలో 'చక్షుఃప్రీతి' అనే అవస్థ కలదు.

"కంటి దబో విశేషమున గన్నుల పండువుగా దలోదరిన్
వింటి భవద్వచో రచన వీనులు చల్లగ దద్గుణాళి; పూ
వింటి యతండు నన్ గినిసి వెంపరలాడక మున్నె యల్లవా
ల్గంటి మనోజ్ఞ సంగమ సుఖస్థితి యేగతి గల్గు జెప్పవే"198
ఇందు 'మనస్సంగమం' గమ్యమాన మౌతుంది

"చంచల నేత్ర పోవునెడ ...... నిచ్చు నెచ్చెలీ"199

"కంగినపైడి కుండల ....... మాననేర్చునే"200

వీటిలో 'సంకల్పం' అనే అవస్థ కలదని చెప్పవచ్చును

"ఇంతకు మున్ను లీలమెయి .... కాంతిమతీ సతి నిన్ను జూచి, య

త్యంతమనోనురాగ..... వేడుకన్"201 దీంట్లో నాయికకు కలిగిన చక్షుః ప్రీతి వర్ణించ బడింది

"అంతకు మున్న కాంతిమతి .... దలంపుచున్"202 దీనిలో ఆమెకు 'మనస్సంగమం' చిత్రించబడింది

"అక్కుమారకుని నింకొక్క మారెదిరించి, కన్ను లారగ జూడ గల్గునొక్కొ ... "203

దీనిలో కాంతిమతికి 'సంకల్పం' అనే అవస్థ కలిగింది

"కలికి రాచిలుక జెక్కిలి నొక్కి యూరార్చిముద్దాడ వేటికి ముద్దులాడి?

పసిడి వీణియ గూర్చి పంచమ శ్రుతి మించమ్రోయించ వేటికి మోహనాంగి "204

దీనిలో 'అరతి' అనే అవస్థ కలదు

"అవ్వల నుండునో "205 అనే పద్యంలో 'హ్రీత్యాగం'," తలపున నాథునిం గలసి "206 అనే పద్యంలో 'ఉన్మాదం' అనే మన్మథావస్థలు గమ్యమానమౌతున్నాయి

"చిగురాకులే కత్తులగునేని"207 అనే పద్యంలోనూ,

"భామా! యేటికి జిగురుకైవాడ బాఱ

వనిత! యేటికి దేనిపై వడియబాఱ

వెలది! యేటికి ననలకై వెల్లబాఱ

బోంతి! యేటికి సురటిగాడ్పులకు జాఱ"208

అనే వాక్యాలలో నాయిక 'కృశతా'వస్థ ధ్వనిత మౌతుంది ఈ విధంగా అనేక మన్మధావస్థలకు చోటు కల్పించి అభిలాష విప్రలంభాన్ని అభిలషణీయంగా పోషించాడు మల్లన. నాయిక విరహంలో తాపోపశమనానికై చెలులు చేసిన శీతలోపచారాలు విరహతీవ్రతను విశద పరుస్తున్నాయి 'చిగురాకులే కత్తులగునేని' అనే పద్యంలో ఈ విరహతీవ్రత చాలా స్పష్టంగా తెల్పబడింది నాయిక ఒక్కతే కాదు నాయకుడూ తీవ్రవిరహానికి అగ్గలమయ్యాడు. ఆ రాజు విరహభారం భరింపలేక రాకానిశాకరుని ఉద్దేశించి,

"కరచు కొంచు ద్రావగా గాచియున్నారు

సురలు, నీ యెమ్మెలు స్రుక్కవేల?

యేల్రతుళ్ళెద? విదియేమి మేలునీకు? "209

"రాముడగాను, నిన్నురగరాచిన శూరుడగాను, సీతను
ద్రోహము చేసినట్టి యలరోహిణి తండ్రిగాను, దజ్జగ
న్మోహని, నీలనీలకచ ముద్దుల చక్కెర బొమ్మ, గూర్చక
య్యో! హరిణాంక! తావకమయూఖ ముఖంబులనేచ నేటికిన్"210

అనే రెండు పద్యాలలో చంద్రుని దూషించాడు. ఈ చంద్రదూషణమే అతని విరహాతిశయానికి తార్కాణ. ఇంత తీవ్రవిరహాన్ని అనుభవించడానికి వారి ప్రణయానికి పెద్దలుగాని, దైవంగాని అడ్డుపడలేదు వారి భావమే అంటే వారి భావనాబలమే అనగా వారి భావతీవ్రతే వారిని స్వల్పకాలంగూడా విడిగా ఉండనీయక సంయోగానికై తహతహ పుట్టించి వారి విరహానికి కారణం అయింది. వారి ప్రేమ భావం 'వివాహం' అనే వ్యవస్థలోకి పరిణామం చెందడానికి అట్టే కాలం పట్టలేదు కాని ఆలంకారిక మర్యాదానుసారంగా 'నవినా విప్రలంభేన సంభోగః పుష్టిమశ్నుతే' అనే వచనాన్ని అనుసరించి మల్లనగారు ఇక్కడ విరహాన్ని చిత్రించినట్లుంది అయినా అది అతుకు బెట్టినట్లుగాక సహజం గానే కనిపిస్తుంది.

4. సంభోగ సమ్యక్పోషణ:-

ఈ విధంగా విరహాన్ని చిత్రించిన కవి సంభోగ సమయంలో ఒక పద్యంతో చల్లగా జారుకొన్నారు. ఇది సంయమనానికి లక్షణం అని విమర్శకులు భావించారు (చూ-రా. శే చ. ప్రస్తావన) కాని ఆ కాలపు మర్యాద మాత్రం కాదు సంయోగానికి అంత తహతహ పడి వీర విరహాన్ని అనుభవించిన నాయికా నాయకుల సంయోగాన్ని త్వరగా కల్పించక తల్లి కూతురుకు బుద్ధులు చెప్పడం, అప్పగింతలు మున్నగునవి పెట్టి కాలయాపన చేసాడు కవి. పెండ్లి సింధుపతే జరిపించినా రాజశేఖరుని స్వగృహం చేరే వరకు నాయికా నాయకులకు సంయోగమే లేదు. ఇది కాల విలంబనాన్నే సూచిస్తుంది ఆనాటి సాంఘిక మర్యాదలకు ఈ విషయం పైసంగతులూ దర్పణం పడుతున్నాయి అనాలి. ఏది ఏమైనా కాంతిమతి శోభన కార్యం అత్తవారింట్లోనే జరిగి నాటినుండి వియోగంలేని సంయోగ సౌఖ్యాన్ని అనుభవించింది. రాజశేఖర కుమారుడు కూడా కాంతిమతి కుమారికా సమేతుడై,

"ఈడిత మాధవీ కుటజ హింజాల వంజాల మంజుకానన
క్రోడములన్ విహారగిరి కూటములన్ దమకంపు త్రోపుత్రో
పాడమనోనురాగ మనయంబును లో దొలకాడ, మన్మధ
క్రీడలు సల్పుచుండె నురరీ కృత సౌఖ్య కళాభిరాముడై"211

### 5. శ్రీకాళహస్తి మాహాత్మ్యం:-

శ్రీకృష్ణదేవరాయల కాలంలో వెలువడ్డ ఆంధ్రప్రబంధాలలో ధూర్జటి మహాకవి వ్రాసిన శ్రీకాళహస్తి మాహాత్మ్యం ఎన్నికగన్నది 'స్తుతమతియైన ఆంధ్రకవి ధూర్జటి పల్కుల కేలగల్గె నీ యతులిత మాధురీ మహిమ ..' అని కీర్తింప బడ్డ కవి ధూర్జటి.

శ్రీకాళహస్తి మాహాత్మ్యం మాహాత్మ్య ప్రతిపాదిత గ్రంథాలలో ఒకటి. దీనిలో శృంగార సన్నివేశం ప్రథమాశ్వాసంలోను, అలాంటి స్ఫురణ గల సన్నివేశం మాణిక్యవల్లి అనే వారవనిత తన కూతులకు వారధర్మం ఉపదేశించడంలోను (చతుర్థాశ్వాసంలో) కలదు ప్రథమాశ్వాసంలోని 'దాసి మిండజంగం' కథలో సంభోగ శృంగారం చిత్రించబడింది.

"అంగజారాతి ఒక మిండ జంగమై నారాయణ వనమను పురమున సంచరించు చుండగా దాసి యొకర్తు భక్తి పూర్వకముగ శరణార్థి యొనర్చి.

'బిజమాడు దేవరునిజ కృపాదృష్టిజెన్నా రు నాయిల్లు బిడార మోకు"212

అని చెప్పి, జంగమార్చనకు ఆ జంగాన్ని ఆహ్వానించగా అతడు,

" .. కాంతా! నీయింటికి
జనుదెంచెద నీదు గుబ్బ చను గొండల సం
దున దెరువెఱుగక తిరిగెడి
మనసను తెరువరికి దప్పిమాన్పంగలవే?"213

అని ప్రశ్నించాడు. దానికి ఆదాసి ఇలా సమాధానం ఇచ్చింది.

"అనవుడు నొడయని కిట్లను
వనజానన నీదు మనసు వచ్చిన రీతిం
బని వినియెద మాటలకిక
బని లే దీతలపు నాదు భాగ్యముగాదే!"214

ఆ తర్వాత దాసి ఇంటికేగి ఆ మిండ జంగం ఆమె చేసిన పూజలు గ్రహించి, 'చిఱునగవులు రాజిల్లగ సన్నసేసి రతికెలయింప'గా ఆమె సంతోషం పొంది, ఒక ఏకాంత గృహంలోని పూజాన్పు వద్దకు తీసికొని పోయింది. అక్కడ,

"తాను గుమార జంగమ సుధాకర మౌళియు గూడి మాడియిం
పైన రతి ప్రసంగములు నర్ధనిమీలిత నేత్ర పద్మముల్

మానని చుంబనంబులును మాటల చొక్కులు వీడివీడి పో
నీని కవుంగిలింతలు ననేక విలాసములుం జెలంగగన్"215

"ఎక్కడ బట్టినంగళల యిక్కువ లెక్కడ నోరు సోకినన్
జక్కెరలవ్వు లేమనిన సారసుధారస మెట్టు లుండినన్
జక్కదనంబు పెన్నిధులు సంభ్రమ మొప్పగ నేమి సేసినన్
మక్కువ చెయ్వులై మెఱయు మన్మథకేళి యొనర్చునంతటన్"216

ఇలా రాజదాసి మిండజంగపు శృంగార కేళిలో తేలుతుంది ఈదాసి యాదవరాజుకు భోజన సమయంలో వళ్లెం పెట్టేది. ఆనాడు సమయం దాటిపోగా రాజు ఆగ్రహించి దాన్ని తీసుకొని రావడానికై వేత్రహస్తుల్ని పంపాడు. ఆమె అక్కడినుండి వెంటనే 'కాళహస్తి విభుని తలుస్తూ' రాజు వద్దకు పోయింది రాజు ఆమె జుట్టును కొరిగించడానికి ఆదేశించాడు అలా తల వెండ్రుకల్ని పోగొట్టు కొన్న దాసి జంగం వద్దకు రాగా అతడు ఆమె తలను చేతితో నిమిరాడు మళ్ళీ ఆమె కేశ సంపద ఆమెకు లభించింది. ఆమె సంతోషంతో రాజు వద్దకి పోయింది రాజు ఆ విషయాన్ని తెలుసుకొని ఆ మాయాజంగాన్ని దర్శించాడు

ఇలాంటి సంభోగ శృంగార సన్నివేశం సృష్టించినా, దాని ఫలితంగా శివుని మాహాత్మ్యాన్ని తెలపడమే కవి ఉద్దేశం అయినట్లు మనం గ్రహించవచ్చు

చతుర్థాశ్వాసంలో మాణిక్యవల్లి తన కూతులకు వార ధర్మం ఉపదేశించడంలో కూడా కామస్ఫురణ ఉంది మొత్తం మీద ధూర్జటి సన్నివేశగత శృంగారాన్నైనా అతి చక్కగా చిత్రించాడు.

"ధూర్జటి గొప్పరసికుడు వర్ణింప వలసిన పట్టుల నీతడు శృంగారమునద్భుతముగ వర్ణించెను. _ _ _ _ _ _ _ _ 'విషయానవినర్తన్తే నిరాహారస్య దేహినః'. అనే భగవద్గీతోక్తిని అనుసరించి 'కామిగాక మోక్షకామి' యగుట యసంభవమనుట స్పష్టము "217

అని బులుసు వెంకటరమణయ్యగారు సెలవిచ్చారు

### 6. రామాభ్యుదయం:-

అయ్యలరాజు రామభద్రుడు రామాభ్యుదయం అనే మహా ప్రబంధాన్ని వ్రాసి అళియ రామరాజు మేనల్లుడైన గొబ్బూరి నరసరాజుకు అంకితం కావించాడు ఈ కవి రామాభ్యుదయాన్నే కాక సకల కథా సార సంగ్రహాన్ని గూడా వ్రాసినట్లు కొందరు పండితులు

తెలుస్తున్నారు అది శ్రీరామాది పూర్వ రాజన్యుల చరిత్రాన్ని తెలిపేది, అముద్రితమైంది కాబట్టి దాన్ని పరిశోధనకు గ్రహింపక, రామాభ్యుదయాన్ని ఒక్క దాన్ని మాత్రమే పరిగ్రహించాల్సి వచ్చింది. ఆంధ్ర ప్రబంధ కవులలో రామభద్రునికి ఉన్నత స్థానం లభించడానికి ఈ గ్రంథమే మూలకారణం. ఒకటి రెండు మార్పులు ఆధ్యాత్మ రామాయణాన్ననుసరించి చేయబడినా వాల్మీకి రామాయణ కథే రామాభ్యుదయానికి మూలం.

**1. అంగిరస నిర్ణయం:-**

వీర, కరుణాలు ఈ ప్రబంధంలో మిక్కుటంగా పోషించ బడ్డాయి యుద్ధ ప్రాధాన్యత కలిగిన వీరం ఇందు ప్రధానంగా చిత్రించ బడింది. కాబట్టి ఇందలి ప్రధానరసం వీరం అనవచ్చు. సీతాపహరణం నుండి తక్కిన సీతాచరిత్రం (పునస్సమాగమం వరకు) అంతాకరుణ రసప్లావితం. సీతారామ లక్ష్మణుల అరణ్యగమనం మొదలుకొని రామాదులు దశరథుని మృతిని విని శోకించు వరకు గల చరిత్రలో కూడా శోకమే ఉంది. దీని స్ఫురణం కావ్యంలో మరికొన్ని చోట్ల కూడా ఉంది ఇలా కరుణ, వీరాలు రెండూ ప్రధాన రసాలుగానే భాసిస్తున్నాయి అయినా వీరమే ప్రధాన రసమని చెప్పవచ్చును. కరుణ రస పోషణం కూడా వీర రస ఔత్కృష్ట్యానికే తోడ్పడింది. ఈ వీరానికి గాని కరుణానికి గాని మూలం శృంగారంలోనే కలవని చెప్పవచ్చు దశరథుని చరిత్రలో కాని, శ్రీరాముని చరిత్రలోగాని శృంగారమే గమ్యమానంగా ఉంది. దశరథుని విహారాదులు, పుత్రకామేష్ట్యాదులు శృంగారాన్నే స్ఫురింప చేస్తున్నవి. శ్రీరాముడు హరధనుర్భంగం చేయడం సీతాపరిగ్రహణానికే కదా! రావణుడు సీతను అపహరించడంలో కామదృష్టి ఇసుమంతైనా లేక పోవునా? రాముడు విరహతప్తుడవడం, సీతాపునస్సంయోగానికై వానర సైన్యాన్ని సేకరించి రావణునితో యుద్ధం చేయడంలో గల అంతరార్థం ఏమిటి? ఇదంతా శృంగార ప్రాధాన్యాన్ని వ్యక్తం చేయడం లేదా? కాబట్టి ఇందలి ప్రధాన రసం శృంగారం అని చెప్పవచ్చును కదా! కాని అలాకాదు 'రామో విగ్రహవాన్ధర్మః' ధర్మస్వరూపుడైన నాయకుని ఆశ్రయించి ఉన్న ఉత్సాహం వీరమగును కాని అన్యం కాదు కదా! సీతాదేవి భరించిన శోకం ధర్మ నిర్వహణకే కదా! కాబట్టి రామాభ్యుదయంలోని ప్రధాన రసం 'వీరం' అని నిశ్చయింప వచ్చును. కరుణ శృంగారాలు అంగరసాలు మాత్రమే. ఇందలి శృంగారం గమ్యమానంగా ప్రాధాన్యతను కలిగి ఉన్నా దాన్ని ప్రధానరసం అని చెప్పడం యుక్తి సహం కాబోదు ధీరోదాత్తుడు, అనుకూలుడూ అయిన శ్రీరాముడు ధర్మోత్సాహం కలిగి ధర్మానికే తన జీవితాన్ని అంకితం చేసిన పురుషోత్తముడు. సీతాసాధ్వి పతి అడుగు జాడలలో నడిచి ధర్మపురుషార్థానికి మెఱుగు పెట్టిన స్వీయానాయిక కాబట్టి రామాభ్యుదయంలోని ప్రధాన రసం ధర్మవీరమే అవుతుంది.

2. శృంగార రసపోషణ:-

ధర్మ ప్రాధాన్యత కలిగిన ప్రబంధంలో పోషించబడ్డ శృంగారం ధర్మ శృంగారం అవుతుందనడంలో అనుమానం లేదు. ఈ కావ్యంలో రెండు, మూడు ఘట్టాలలో శృంగారం పోషింపబడింది ఆ ఘట్టాల్ని పరిశీలిస్తే శృంగారం పోషింపబడ్డ తీరు సువ్యక్తం అవుతుంది

రామాభ్యుదయ ప్రబంధంలో శృంగార రసం గల ఘట్టాలు ఇవి -

1. దశరధుని సంబోగ శృంగారం
2. సీతారాముల కళ్యాణానంతరం - వారి సంభోగ శృంగారం.
3. సీతాపహరణానంతరం శ్రీరామునికి కలిగిన విరహం.
4. సీతా వియోగ దుఃఖం

ఈనాలుగు ఘట్టాలలో మొదటి రెండింటిలో సంయోగ శృంగారం, తక్కిన రెండింటిలో వియోగ శృంగారం చిత్రించ బడింది ఇవేగాక శూర్పణఖ రాముని వరించి నాసికాఖండనం పొందడంలో మోహ శృంగారం స్ఫురిస్తుంది కేవల శారీరక వ్యామోహం అధర్మం కాబట్టి శూర్పణఖ దానికి ఫలితాన్ని వెనువెంటనే పొందింది. కాబట్టి రామాయణంలోని ఏ అంశంలోనైనా అధర్మానికి తావు లేదని సువ్యక్తమౌతుంది.

దశరధుడు తన భార్యలతో వన విహారం సల్పడంలో దర్శన, స్పర్శనాదికమైన సంభోగ శృంగారం చిత్రించబడింది

"గుణము కలిగినచో రూపు కొదవ యెందు
గుణము రూపులు గలిగిన గులము కొదవ
కులము గుణమును రూపును గలుగు ధన్య
జనక కన్యయ సుమ్ము రాజన్యమాన్య"218

దీన్ని బట్టి నాయిక లక్షణాలు తెలుస్తున్నాయి ఇంతేగాక "కళ వెచ్చబోని నిర్మల చంద్రబింబంబు ..."219 ఇత్యాది పద్యం మొదలుకొని 4వ ఆశ్వాసంలోని 76వ పద్యం వరకు గల పద్యాలలో సీతాదేవి రూప సౌందర్యాలు చక్కగా చిత్రించబడ్డాయి బంధుగురు పురస్సరంబుగా గల్యాణ వేదికడకు వచ్చి యేక పీఠాసీనులై యవ్వధూవరులు గలసి కూర్చుండ విధ్యుక్తాచారంబునశుభహోమకృత్యంబులు నిర్వర్తించునవుడు ....."220

"ఇరువుర సిగ్గులగ్గలవుటేప గచాకచి బైకొనన్ ముఖాం
బురుహయుగంబు వాంచి తలవుల్ మదినువ్విళులూర జూవులొం
డొరుల పదంబులం దొరయ నొందు నెపంబున మోసులెత్తిప
ల్మఱు మఱు వెట్టి చూడ నెడమంగుడినేయ దొడంగె గంతుడున్"221

దీనిలో దర్శనాదికమైన సంభోగ శృంగారం చిత్రించబడింది

"అధిపుడు మనోజ్ఞశయ్యు నున్నంత సఖులు
సమయ సముచిత సకల భూషా విశేష
రంజితాకార జేసి సంభ్రమ మెలర్ప
నత్తుకొని వచ్చు రొయ్యన నతివనపుడు"222

దీనిలోని సీతాదేవి అలంకారం రామునికి ఉద్దీపనం.

"సిగ్గు వెనుకకు దివియంగ నగ్గలంపు
రాగ రజ్జువు ముందుకు సాగదివియ
నందులకు దోడు తోదోపులాడ జెలులు
నడుమ బిరువీకులయ్యె నప్పడతి కపుడు"223
దీంట్లో 'త్రప' (వ్రీడ) అనే సంచారీ భావం ఉంది.

"స్తంభ గత రత్న పుత్రిక తనదుబోటి
యనివిలోకించి తోడ మాటాడకునికి
నలుగడలు చూచి తెలిసి యచ్చెలువ బెదరి
వెడలనూహింప జేదమ్మి యొడసివట్టె"224
స్పర్శనాదికం అయిన సంభోగ శృంగారం ఇందు చిత్రించ బడింది
"నెలయగు తక్షణంబ . . . . . . తత్తరంబునన్"225
దీనిలో 'స్వేదం' అనే సాత్త్వికభావం చిత్రించ బడింది

"అని చతురోక్తి వేడుకొని యల్లన నంకతలంబు సేర్చిపే
ర్చిన తమిచే వడంక నునుజెక్కిలి నొక్కి కవుంగిలించినన్
దనువున గంప మొంది తనుదాసడలెన్ ధృఢనీవి బంధమో
చన మగు టద్భుతంబె రఘుచంద్రుని ప్రాపొకయింత గల్గినన్"226

ఇందు చిత్రించబడ్డ సంభోగ శృంగారం మిక్కిలి మనోహరం. సీతారాముల శృంగారాన్ని ధ్వన్యాత్మకంగా చిత్రించక రామభద్రకవి ఒకటి రెండు చోట్ల హద్దులు మీరాడు.

"చేకొనె గక్ష్యసీమలు విచిత్ర గతిం గుచశైల దుర్గముల్
చేకొనె మధ్య దేశమును జేకొనె నూరుయుగంబులోనుగా

బైకొనె బాహుశక్తిసతి, బల్మిఱు నాలమునన్ బెనంగి ర
త్నాకరమేఖలా స్థలము నవ్విభుడంతయు జేకొనెందుదిన్"227
"ఇట్లు వివిధ బంధ విశేషంబుల జొక్కి యక్కన్య కౌగిటందక్కి యిట్లనియె"228

"వంట వలంతికిం బొదమి భాసిలు సీతవు గాన జేలతో
నంటిన ఘర్మవారి బదనై పులకోదయ సస్యసంపదన్
గెంటకయున్కి నీకతగునేడిటనా వ్యవసాయ మేర్పడెన్
గంటి నిరంతరానుభవ గౌరవ సౌఖ్యము బండె గోరికల్"229

ఈ పద్యంలో స్వేదం, రోమాంచం అనే సాత్త్విక భావాలున్నాయి. ఈ విధంగా అనేక భావసమన్వితంగా సీతారాముల సంభోగ శృంగారం చిత్రించబడింది. ఇలా వాచ్యంగా సంభోగ శృంగారాన్ని చిత్రించడంలో ఒక ప్రయోజనం కలదు. ఇలా సంయోగాత్ములైన సీతారాములకు వియోగం కలిగితే అది తీవ్రంగా ఉంటుందని తెలపడమే దాని ప్రయోజనం

సీతను రావణుడు అపహరించగా సీతారాములిద్దరికీ విరహం సంప్రాప్తమైంది. ఇద్దరూ (ఒకరికి ఒకరు) ప్రవాసంలో ఉండడంచే సీతారాములకు కలిగిన విరహాన్ని 'ప్రవాస విప్రలంభం' అని చెప్పవచ్చును.

. . . జనక తనయా వియోగ వేదనాధీన దీనమానసుండై రఘువరుండు సౌమిత్రికట్లనియె. "230

"వానల సీతా విరహద
వానల సంతాప మంతకంతకు నధికం
బైనది శమింపదించుక
యైనదటిద్వహ్ని యుతము లౌటనెచెవుమా"231

ఈ పద్యం మొదలుకొని " . . . నక్కాకుత్స్థాన్వయ ఘనుండత్తఱింగురియు నిఖిల నీరంధ్ర ధారాళ వర్షంబునకు లోగుచు నమ్మహా మహీధర గుహా గృహాంగణంబుల వసియించియు విరహ వేదనా విషాద జనిత నిజబాష్పధారావర్షంబున దోగుచు బుడమి ముద్దరాలి చూలిం దలంచుకొని కృశించుచున్న సమయంబున . . "238

అనే వచనం వరకు శ్రీరాముని విరహం వర్ణింపబడింది. ఇందు చంద్రాది ఉపాలంభం కూడా ఉంది. సప్తమాశ్వాసంలో కూడా 45వ పద్యం మొదలుకొని 48వ పద్యం వరకు శ్రీరాముని సీతా వియోగ దుఃఖం చిత్రించబడింది.

అశోక వనంలో సీత అనుభవించిన దుఃఖమంతా విరహంతో కూడిందే శ్రీరాముడు వచ్చి రావణుని ద్రుంచి తన్ను చేపడతాడనే ప్రత్యాశ సీతకు కలదు. కాబట్టి ఇక్కడ కనిపించేది కరుణం అని కాక కరుణ విప్రలంభం అంటే బాగుంటుంది. కాని కరుణ విప్రలంభం కంటే కూడా విరహాతిశయం వల్ల సీతకు దుఃఖం కలిగింది. వారు వేర్వేరు స్థలాలలో ఉండిరి కాబట్టి ఇందలిది ప్రవాస విప్రలంభం అని చెప్పినా చెప్పవచ్చును.

శూర్పణఖకు శ్రీరామునిపై కలిగిన మోహశృంగారం లాగానే రావణునికి సీతపై కలిగిన వ్యామోహం కూడా మోహ శృంగారమే

"ఎలనవ్వులతో జంకెన
మొలకలతో జూవుగొనలు మొనయగనీవే
నెలతా! నావయిబడుమరు
బలు దూవుల దునుముగాని ప్రతి బాణములై"233
ఇక్కడ రావణుని (ఏకత్రానురాగం) మోహ శృంగారం సువ్యక్తమే

ఈ విధంగా సీతారాముల శృంగారం ధర్మబద్ధమైంది గానూ, రాక్షసులైన శూర్పణఖ, రావణులకు కలిగ్గిన వ్యామోహం అధర్మబద్ధమైంది గానూ చిత్రించబడి, యుద్ధంలో రాక్షస సంహారం (శూర్పణఖ ముక్కు చెవులు ఖండించ బడడం) జరగడంచే అధర్మం పరాజితమై ధర్మానికి విజయం చేకూరింది

7. కళాపూర్ణోదయం:-

కళాపూర్ణోదయం అనే కల్పిత ప్రబంధాన్ని సహృదయ హృదయాను రంజకంగా అపూర్వకథాకథన వైచిత్రీధుర్యంగా శృంగారాది రసాల్ని తత్తదుచిత భంగిని పొందువరచి మంచిశైలిలో వ్రాసి తన పాండిత్యాన్ని బుద్ధిచాతురిని లోకులకు అత్యాశ్చర్యం కలిగే విధంగా వెల్లడి చేసిన మహానుభావుడు పింగళిసూరన నంద్యాల కృష్ణమరాజు కు అంకితం ఇవ్వబడ్డ ఈ కళాపూర్ణోదయం 16వ శతాబ్దంలో వెలసిన ఉత్తమ ప్రబంధాల్లో ఒకటి దీనిలో అనేక శృంగార గాథలు చోటు చేసుకున్నాయి శృంగారాన్ని వివిధ రీతుల్లో పోషించిన తీరు ఈ ప్రబంధంలో సుస్పష్టం

1. అంగిరస నిర్ణయం:-

కళాపూర్ణోదయ ప్రబంధం శృంగార రసమే 'అంగి'గా కలది అనడం నిర్వివాదాంశం సూరనగారే స్వయంగా " .. యత్యపూర్వ కథా సంవిధాన వైచిత్రీ మహనీయంబును, శృంగార రసప్రాయంబును, బుణ్యావస్తు వర్ణనాకర్ణనీయంబును నగు కళా పూర్ణోదయంబను

మహాకావ్యంబు నిర్మింపగడంగితి .. "234 అని చెప్పుకొనడం వల్ల ఇది శృంగార రస ప్రధానమైన ప్రబంధం అని విశదమౌతుంది G. V. కృష్ణారావుగారు కూడా ఇందలి 'అంగి' రసాన్ని గూర్చి ఇలా ప్రవచించారు

"The principal rasa in the kalapurnodayam, as it should have been evident is sringara. It is mainly sustained and strengthened by adbhuta which also pervades the poem though in a lesser degree This does not mean that other rasas are altogether absent All the rest are there, but they do not dominate. They are brought in only as parts contributing to the manifestation of the principal rasa . . "235

డాII జి వి సుబ్రహ్మణ్యం గారు ఇందలి రసాన్ని గూర్చి ఇలా సిద్ధాంతీకరించారు

.. పింగళి సూరన తనకు పూర్వమున్న కవులు దర్శించి, కావ్యమున ప్రయోగింపని శృంగార ప్రవృత్తుల నెన్నింటినో కళాపూర్ణోదయమున చిత్రించినాడు వాని సంపుటీకరణముచే శృంగార రస సమగ్ర స్ఫూర్తి భాసించుచున్నది అది యొక సజీవ ప్రయోగము. "236

వీరి మాటల్ని బట్టి కూడా కళాపూర్ణోదయంలోని ప్రధాన రసం శృంగారమని చెప్పకుండానే విదితమౌతుంది కాబట్టి కళాపూర్ణోదయంలోని ప్రధానరసం ఏది? అని వివేచించాల్సిన అవసరం లేదు ఇందలి ప్రధాన రసం శృంగారమే. తక్కిన రసాలు అంగ భూతాలే

. కళాపూర్ణోదయమున నైదునకు దక్కువ గాని విధముల శృంగారము వర్ణింపబడి యున్నది. ఇందు జావళీలకు జేరినది యొకటి మాత్రము అయ్యది యప్రశస్తమనదగిన భాగములో నుండుటచే దాని ప్రస్తావన యిట జేయను తక్కిన వానిలో నొక దానివలె నొకటి యుండదు. అన్నియు రమణీయములు .................. సూరన ప్రతిభావంతుడు కనుక సంపూర్ణముగ బాండిత్య బద్ధుడుగాజాలడు స్వశక్తియే గురువుగ నూతన మార్గములం ద్రొక్కి యాతడు ప్రకటించిన యసాధారణ శృంగారములకు ముఖ్య నిదర్శనము లీ క్రిందివి శల్యాసుర విషయము, సుగాత్రీశాలీనుల వృత్తాంతము, సరస్వతీ చతుర్ముఖ విలాసము, కలభాషిణీ చరిత్రము .. "237

పై కట్టమంచి వారి మాటల ప్రకారం సూరన అనేక అసాధారణ శృంగార ఘట్టాల్ని నిర్మించి, వాటి ద్వారా రమణీయంగా శృంగారాన్ని పోషించాడని వ్యక్తమౌతుంది

కళాపూర్ణోదయంలో శృంగారం బహుముఖాలుగా పోషించబడింది దీనికి ప్రధానంగా ఐదు ఘట్టాలు సమకూర్చ బడ్డాయి. అవి--

1. సరస్వతీ చతుర్ముఖుల శృంగారం.

2. కలభాషిణీ మణికంధరుల; రంభానలకూబరుల ప్రణయ సన్నివేశాలు.

3. సుగాత్రీ శాలీనుల, సుముఖాసత్తి మణిస్తంభుల శృంగారం

4. శల్యాసురుని ఆభాస శృంగారం

5. కళాపూర్ణుని దాంపత్య శృంగారం.

అనేవి ప్రధానమైనవి ఇవిగాక ఆలయంలో స్త్రీ ప్రతిమను కౌగిలించిన సన్యాసి మోహ శృంగారం, పూచప్పురంలో మణిస్తంభుడు కలభాషిణిని కౌగిలించిన సందర్భంలో మోహశృంగారం, యజ్ఞశర్మ భార్యల ప్రవాస విప్రలంభ శృంగారాలు కూడా ఇందు చిత్రించబడ్డాయి

**2. సరస్వతీ చతుర్ముఖుల శృంగారం:-**

మొదటి ఘట్టం అయిన 'సరస్వతీ చతుర్ముఖుల' సన్నివేశమే ఈ ప్రబంధం ఉద్భవించడానికి (అంటే ఇందలి కథ ఏర్పడడానికి) కారణమైనట్టిది. సరస్వతీ చతుర్ముఖుల ప్రణయం నుండే ఈ కథ పుట్టింది బ్రహ్మ ఈ విషయాన్ని చెప్పాడు.

"ఆకళాపూర్ణ మహారాజు కథ తావకీన శృంగార లీలా నిమిత్త
మగుచు మన్ముఖ జాతమగుచు నవశ్యంబు గరము ప్రసిద్ధంబు గా గలయది"238

ఈ సరస్వతీ చతుర్ముఖుల కథలో సంయోగ వియోగాత్మకమైన శృంగారం అతి మనోహరంగా పోషించబడింది ప్రణయభావం చే చతుర్ముఖుడు చెప్పిన కళాపూర్ణుని కథ ప్రస్తుత అప్రస్తుతాలు రెండింటిలోనూ అతిమనోహరంగా ఒప్పి ఉంది ఈ ఘట్టంలో ఆలంబన విభావాలు సరస్వతీ చతుర్ముఖులే వీరిద్దరూ దివ్యులే కాబట్టి తక్కిన నాయికానాయక గుణాల్ని వెదకాల్సిన పనిలేదు సృష్టికర్తే నాయకుడై అతని రాణి వాణి నాయికయై నిలిచిన ఈ శృంగార ఘట్టం జగదాదర్శకమై నిలవడంలో వింతలేదు దివ్యులైనా మానవ చేష్టలే వారి శృంగారంలో భాసించాయి. అసలీ కథ మానవ మేధోద్భవం కదా!

ఇక వారికి పరస్పరోద్దీపకాలైనవి 'అంబరాభరణాంగరాగ సమంచితాకృతులు', భవనారామం, అరవింద వనామోదభరాలస పవనామోదాలు, కృతకమరాళ సమేతమూ నడి మానికపు కంబంతో కాంచన సోపాన ప్రతతులతో ఒప్పు సరస్సు, తరుణ సంతానకచ్ఛాయ దలిరుబాన్పు, ఇంకా వారి రూప యౌవన గుణాదులు ఇలాంటి ఉద్దీపన సామగ్రి కలిగి ఉండగా బ్రహ్మపాదాలను తన ఊరువుల చేర్చుకొని వాణినొక్కుతూ ఉంది

"అంతట నంతకంతకు నిరంతరమై తనరారు మారుదు
ర్దాంతత గాంత బాన్పునకు దార్చెను దన్మధురాధరామృతా
క్రాంతి రసోద్ధతిన్ దన మొగంబులు నాల్గును నొక్కమాటెయ
త్యంతము దత్తతిల్లగ దదాననముందనకై మరల్చుచున్"239
బ్రహ్మ ఇలా చేయగా వాణి 'యధరంబునకు బాణి యడ్డమిడుచు,

"మొలక నగవును గోపంబు జెలువు జిలుకు
తళుకు జూపుల జూపులో దర్జనముల
వక్రిత భ్రూలతా తాండవంబు సిరుల
మిగుల గెరలించె బ్రియు మది మెఱయు మదిని"240

ఇలా చేయబడ్డ వాణి చేష్టల్లో మొలకనగవు, కోపం, తళుకు చూపులు, చూపులో తర్జనముల వక్రిత భ్రూలతా తాండవం మున్నగు అనుభావాలు నిక్షిప్తం చేయబడ్డాయి అలా ప్రవర్తించిన వాణి అజుని భావాన్ని మరింత ఉద్దీపింప చేసింది కాబట్టే ఆయన బలవంతంగా ఆమె మోవిపై దంతక్షతం కావించాడు అప్పుడు ఆమె కంఠంలో ఒక్క మధురాంచిత శబ్దం ఉదయించింది "అంత నా వాగ్దేవి యావిధంబున నొదవిన కళామర్మ భేదన సామ్రాజ్య సంపదనుభవావస్థ మాన లాఘవశంక నప్రకాశంబుగా గడపి వుచ్చుట కుపాయంబు జింతించి తద్విరోధకారిణియైన విభుని యభిమత కేళికి విఘాతంబుగ నధరపీడనాసహత్వ నాటితకంబున నలుక గల్పించుకొని యవ్వలి మొగంబుగా బొరలె____"241

ఇక్కడ సంభోగానికి దీప్తి కలిగించడానికై కవివరుడు ఆ దివ్య దంపతులకు విరహం కలిగింపదలచాడు. 'నవినా విప్రలంభేన సంభోగః పుష్టిమశ్నుతే' అనేది ఆలంకారిక వచనం గదా! తదనుసారం ఇక్కడ విరహం కలిగించడానికి సరస్వతికి ప్రణయ మానం కల్పించబడింది. ఇది కల్పించబడ్డ మానమైనా విరహ హేతువే అసలు సరస్వతీదేవికి కూడా అలక స్వభావ సిద్ధంగా కలుగ లేదు ఆమె అలక కల్పించుకొంది. ఇది కల్పితమైందే అయినా అజుడు తద్విరహదశావికలిత ధైర్యుడయ్యాడు.

వాగ్దేవి అలక తీరితేకాని తన విరహపీడ విరగడ కాదు అందుకే చిలుకకు ఉబుసు పోకకు అన్నట్లు కథ చెప్పడం మొదలెట్టాడు కాని అసలు ఉద్దేశం ఆమె ఆ కథ విని దానిచే 'మానవిముక్తా' అయి తనకు అనంగ సుఖాన్ని ఇవ్వాలని. అలా మొదలు పెట్టిన కథను వింటున్న సరస్వతి తన వర్ణనగా గ్రహించి, చిలుకను 'ఆ కళాపూర్ణుడు ఏమయ్యాడు? అతనికి తల్లిదండ్రులు ఎవరు? అని అడుగమంది ఆయన కథని సాగిస్తూ, " .. . .'అతనికి సుముఖాసత్తి యనునది తండ్రియు మణిస్తంభుడనెడి వాడు తల్లియు'నన వాణి హాసంబుతో గ్రక్కున గ్రమ్మఱి కౌగిలించింది "242

సరస్వతికి కలిగిన ప్రణయమానాన్ని బ్రహ్మ 'రసాంతరం' (హాస్యం)తో ఉపశమింపజేసాడు. మానాన్ని భంగపరచే ఉపాయాలలో రసాంతరం ఒకటి. అలా ఆమె ప్రణయమానం ఉపశమించడంచే బ్రహ్మకు ఆమె కౌగిలి లభించింది ఆయన కథను ఆరంభించిన ఉద్దేశం నెరవేరింది

"ఆ నర్మలీల చేత శ
తానందుండధిక సంభృతానందుండై
తానును మేలొప్పగ న
మ్మానిని మెద గౌగిలించి మక్కువ మీఱన్"243

"వదనములు నాలుగింటికి వరుసగలియ
మెలపుతో దన కంఠంబు మలచి మలచి
యొసగె దదధర పాన మహోత్సవంబు
గళము కౌగిలితోన చెక్కులు నిమురుచు"244

ఇలా బ్రహ్మ సంభోగ శృంగారంలో ఓలలాడాడు అలా సంభోగ సుఖాన్ని పొందుతున్న బ్రహ్మకు, వాణి కోపాన్ని ప్రదర్శించి తక్కిన కథను చెప్పమంది విరహం ఎంత అధికమైతే సంభోగం అంత రుచికరం అవుతుంది కాబట్టి అలా చేసింది ఆయన తక్కిన కథ చెప్పాడు అదంతా 'మన ప్రణయ గాథయే' అని సరస్వతి విమర్శ పూర్వకంగా విప్పి చెప్పింది బ్రహ్మ మరింత ఆనంద రసమగ్ను డయ్యాడు మరింత ఆమెచే సంయోగ సుఖం అనుభవించాడు.

" .. .. తనప్రియభా
మిని పలుకులకును బ్రమోద మేదుర హృదయుం
డును దత్పురి రంభణ పరు
డునునై యా పద్మజాడు గడుం బొలుపొందెన్"245

సరస్వతికి కలిగిన హాస, క్రోధాలు ఇందు వ్యభిచారి భావాలుగానే మనం గ్రహించాలి. సాత్త్విక భావాలు దీనిలో వాచ్యంగా చిత్రించక పోయినా ధ్వన్యాత్మకంగా కథలో గమ్యమానమౌతున్నాయి బ్రహ్మకథ చెప్పినపుడు వాణికి కలిగిన ఆశ్చర్యంలో 'రోమాంచం', సంభోగ సుఖాన్ని అనుభవించేటప్పుడు తక్కిన భావాలూ కలిగినవనే చెప్పాలి

ఈ విధంగా వియోగ, సంయోగాత్మకమైన శృంగారం అంచెలంచెలుగా చిత్రించబడి దివ్యమై ప్రబంధంలోని ఇతర కథలకు 'రసరహదారి'ని చూపుతున్నాయి బ్రహ్మ మిక్కిలి సరసుడు కాబట్టే బ్రహ్మ, వాణుల కథ మిక్కిలి రసవంతంగా ఉంది. చిలుక రంభకు పేరి కథ వివరించి నపుడు వాణి కోపించి, దాన్ని శపించింది. అపుడు బ్రహ్మ 'నాలుకతుదన్

ముక్కొందికొమ్మా విలాసిని' అని రసాంతరంచే ఆమె కోపాన్ని పోగొట్టడానికి యత్నించాడు. సరస్వతి తన క్రోధానికి హాసం తోడుకాగా 'నన్నికం జెనకం రాకుడు చాలు నవ్వుల'ని, 'నిజస్తన గుచ్ఛ ప్రతిమల్ల హల్లక దశోద్యత్కుందుకం' భేసింది.

"అనయంబుంజల మొప్పుగా మఱియు నా యబ్జాసనుండట్ల యా
డెను 'మానుండిది' యంచు వాణియును వేడెన్ జేరితానొక్క చే
తను గ్గంరంబును గౌగిలించి యొక చేతన్ గడ్డమున్ బట్టి చె
క్కున జెక్కానుచు నొక్కచన్మొనయురః కోణంబుతో రాయగన్"246

చతుర్ముఖుడు ఎంతో చతురుడు కాబట్టి మాటి మాటికి వాణిని రెచ్చగొడుతూ, కోప వివశ అయిన ఆమె సౌందర్యాన్ని కంటూ తన హాస్యపు మాటలచే మళ్ళీ ఆమెను ఆకర్షిస్తూ రమిస్తూ ఉన్నాడు ఇదే శృంగారపు ప్రధాన తత్త్వం ఈ తత్త్వాన్ని ఉపదేశించడానికే సూరన ఈ కథను చిత్రించినట్లు మనం భావించవచ్చు ఇంత సమగ్రంగా, సంశ్లిష్టంగా పోషించిన శృంగారాన్ని విప్పిచూసి ఏభావం ఎక్కడుంది? అని విమర్శించడం కన్నా సమగ్రంగా అనుభవించి ఆనందించడం వల్ల కావ్య ప్రయోజనం నెరవేరుతుంది బ్రహ్మ చెప్పిన కళాపూర్ణుని కథలో కూడా సంయోగ, వియోగాత్మకం అయిన శృంగారమే చిత్రించబడింది.

### 3. కలభాషిణీ మణి కంధరుల; రంభానల కూబరుల శృంగారం:-

ఈ ప్రబంధంలోని రెండవ శృంగార ఘట్టం, కలభాషిణీ మణికంధరుల, రంభా నలకూబరుల ప్రణయానికి సంబంధించింది. ఈ ఘట్టంలో శృంగారం అద్భుతంచే మిక్కిలి పుష్టి పొందింది దీనిలోని నాయికలకు, నాయకులకు బింబ ప్రతిబింబ రూప భావం కలదు ఇంచుమించు నాయిక లిద్దరకూ, నాయకులిద్దరకూ రూపగుణాదులు సమాలే రంభ దేవవేశ్య కలభాషిణి మర్త్య వేశ్య నలకూబరుని రూపాన్ని మోహించి అతనిపై అమితాను రాగం కలదై అతనిచే సుఖాన్ని పొందింది రంభ. మణికంధరుని రూపాన్ని మోహించి, అతనిపై అమితానురాగం కలదైనా కలభాషిణి నారద శాపభీతిచే మానవ సహజంగా హృదయ భావాన్ని మరుగు పరచింది. నలకూబరునిలో ఆ రూపురేఖల్ని చూసి మోహచిత్త అయింది కలభాషిణి వేశ్య కాబట్టి దీన్ని సమర్థించ వచ్చు. ఆమె ప్రేమ మాత్రం నిష్కళంకమైందే. అలాగే రంభ కూడా వృత్తిని బట్టి వాసవాజ్ఞ వల్ల మణికంధరునిచే రమించినా ప్రవృత్తిచే ఆ సమయంలో కూడా నలకూబరునే పలవరించింది. ఈ ఇద్దరు నాయికలూ సమమైన పట్టుదల గలవారే అని, వారిద్దరు ఏకరూపంలో ఉన్నపుడు జరిగిన వాగ్వివాదంలో వ్యక్తమైంది

మణికంధరుడు భక్తుడు అయినా రక్తిలేని వాడుకాదు. రంభ రూప విలాసాలకు లొంగి అనంగ క్రీడలో ఆనందపు అంచులు చూసాడు. రంభకు తృప్తి కలిగించడానికై

(గంధర్వుడైన) తాను నలకూబరుని రూపాన్ని ధరించి, ఆమెను రతుల దేల్చాడు. అంతేకాక మాయా నలకూబర వేషంలో ఉండి మాయా రంభ అయిన తన ప్రియ కౌగిటిలోనూ కరగిపోయాడు. ఇక నలకూబరుని గూర్చి చెప్పవలసిందేమీ లేదు. రంభా సంభోగాన్నే నిరంతరం కోరుతూంటాడు. ఇలాంటి నాయకులను, అలాంటి నాయికలను గ్రహించి పింగళి సూరన చమత్కారావహంగా శృంగారాన్ని పోషించాడు ఆలంకారిక పద్ధతిలో శృంగారం పోషించబడక పోయినా చమత్కార పద్ధతిలో పోషింపబడ్డ ఈ శృంగారం పాఠకులకు అనిర్వచనీయ ఆనందాన్నే ప్రసాదించింది ఇలాంటి శృంగారాన్ని పోషించిన వారు ఇంకెవ్వరూ లేరు. ఈ ఘట్టంలో సంభోగ శృంగారమే మిక్కిలిగా చిత్రించబడింది కలభాషిణి నలకూబరుని కూటమి కోసం ఎదురుతెన్నులు చూడడంలో విరహం కలదు ఇద్దరు రంభలు, ఇద్దరు నలకూబరులు ప్రత్యక్షం అయినపుడు అందు ఒక్కొక్కరికి అంటే ముగ్గురిలో ఒకరికి స్వల్ప, దీర్ఘ విరహాలు సంభవించాయి. రంభాద్వయ మేళనంలో నిజమైన రంభకు నిజం బయటపడేవరకు జరిగిన వాగ్వివాద కాలమంతా విరహకాలమే. నలకూబర ద్వయ ఘటనంలోనూ నిజమైన నలకూబరునికి కూడా వాస్తవం వెల్లడి అయ్యే వరకూ విరహమే అని చెప్పవచ్చును ఇది ఆలంకారికంగా కాకున్నా తత్కాల పరిస్థితుల్ని బట్టి చెప్పవచ్చు రంభా మణికంధరుల, మాయా రంభా మాయా నలకూబరుల, మాయా, నలకూబర నిజమైన రంభల సంభోగ శృంగారం ప్రత్యక్షమే కదా! చివరకు రంభా నలకూబరులు, మణికంధర కలభాషిణులు కలిసి పోయి శృంగారంలోని అద్భుతాన్ని అంతం చేసారు.

రంభామణికంధరుల శృంగారం అర్థ శృంగారం అని జి ఎ కృష్ణారావు గారి అభిప్రాయం. అర్థం అంటే ప్రయోజనం అనీ, డబ్బు అనీ అర్థాలు ఇక్కడ రంభ ఒక ప్రయోజనాన్ని ఉద్దేశించి మణికంధరుని కూడింది కాబట్టి ఇది అర్థ శృంగారం.

"The love between Rambha and Manikandhara is illustrative of artha Sringara because the heroine has gained some other object. Rambha spoiled the penance of Manikandhara."247

అలాగే మాయారంభ, మాయానలకూబరులది కామ శృంగారం అని వారిభావం . నిజమేమరి కామం కొరకే వారి కలయిక జరిగింది ఇతర ఉద్దేశం లేదు మాయారంభను మాయానలకూబరుడు నిజమైన రంభ అని భావిస్తున్నాడు. మాయారంభ మాయానలకూబరుని నిజమైన నలకూబరుడని భావిస్తుంది. ఇక్కడ ఇద్దరూ మాయావేషధారులవడంచే రసాభాసంగా కన్పించే అవకాశం ఉంది కాని అలాకాదు ఎందుకంటే రంభానలకూబరులు పరస్పరానురక్తులు. ఆ మాయావేషంలో ఉన్న నాయికా నాయకులిద్దరూ కలభాషిణీ మణికంధరులు. వారు మొదటి నుండీ పరస్పర అనురక్తులే నిజరూపంలో అయినా, మాయా రూపంలో అయినా వారు పరస్పర అనురక్తులే కాబట్టి వారి శృంగారం ఆభాసం కావడానికి వీలులేదు వారిది శృంగారమే

ఈ ఘట్టంలో మణికంధర రంభల కలయికలో దివ్యాదివ్య శృంగారం, మాయారంభ మాయానలకూబరుల కలయికలో దివ్య రూప మానవ శృంగారం, చివర నిజమైన రంభానలకూబరుల కలయికలో దివ్య శృంగారమూ చిత్రించబడ్డాయి. ఈ ఘట్టాన్ని చిత్రించే సమయంలో కవి అనేక మెలకువలను సహేతుకంగా ప్రదర్శించి, రక్తి గట్టించాడు. రంభ గోత్రస్ఖలనం చేయడం వల్ల మాయానలకూబరుడైనాడు మణికంధరుడు తన కోరిక నెరవేర్చుకోవడానికి నారదుని వల్ల పొందిన వరంతో మాయారంభ అయింది కలభాషిణి. నిజ రూపంలో ఉన్న రంభానలకూబరులు నిజరూపంలోనే ఉండి తమ రూపాల్నే అద్దంలో చూసినట్లు చూసి భ్రాంతి పాల్పయ్యారు అలా వచ్చిన మాయా, నిజరూప రంభల్ని చూసి నలకూబర రూపధారియైన మణికంధరుడూ, మాయా, నిజమైన నలకూబరుల కని రంభా తత్తరాన్ని, భ్రాంతిని పొందారు. ఇక్కడ ఏర్పడ్డ మాయారూపాల్ని కూడా నైపుణ్యంతో కవి తొలగించాడు. అర్థ, కామ రూపాల్లో ద్విముఖంగా సంభోగ శృంగారం భాసించడం ఈమట్టంలోని ప్రత్యేకత

కలభాషిణి వారవనిత అయినా నలకూబరుని కూడాలనే కోరిక నారద మహర్షి ఆశీర్వచనం వల్లనే వృద్ధి పొందింది. అతడు కూడా నిష్కళంక ప్రేమ కలిగిన కలభాషిణిని చెరపదలచలేదు.

"కొమ్మ నీవాత్మలో మునుగోరునట్టి
కాంతు రంభా మనోహరా కారుడగుచు
మెఱయు వానిని గూడి రమింప గలవు"248 అన్నాడు

దీనిలో 'నలకూబరుని కూడెదవ'న లేదు 'నలకూబరాకారుని కూడెదవ'న్నాడు. ముని వాక్యం అమోఘం. కాబట్టి కలభాషిణికి అలాంటి కోరిక కలిగినా అది అన్యథా తీర్చబడింది నిజం తెలిసిన పిదవ కలభాషిణి వగవడంలోనే ఆమె హృదయం వ్యక్తమయింది.

"శ్రీయుతమైన దివ్యమణి చేతికి నబ్బగ బారవైచి త
చ్ఛాయ యొకింత యున్కిగని చాల గృశించితి గాజుపూసకై
నా యవివేకమేమనుకొనందుద దన్మణియబ్బెనన్నన
త్యాయత తత్సమాగమ సుఖాప్తికి నోచమినెంచి కుందెదన్"249

కాబట్టి వారవనితను నాయికగా గ్రహించిన పింగళి సూరన దానిని ఒక నిష్కళంక ప్రేమమూర్తిగా తీర్చిదిద్ది, విచిత్ర ప్రణయానికి ఆలవాలంచేసి శృంగార పోషణలో తనకు ఉపయుక్తంగా చేసికొన్నాడు. నాలుగు పాత్రలతో ఒకరీతి శృంగారాన్ని పోషించడానికై వాటికి బింబ, ప్రతిబింబ భావం కల్పించి చమత్కారంగా శృంగారాన్ని పోషించాడు.

4. సుగాత్రీ శాలీనుల :- } శృంగారం:-
సుముఖాసత్తి మణిస్తంభుల

సుగాత్రీశాలీనుల దాంపత్య శృంగారం, వారు (మరు జన్మలో) సుముఖాసత్తి, మణిస్తంభులై విపరీత రతేచ్ఛతో శృంగారాన్ని అనుభవించేది మూడవ ఘట్టం

సుగాత్రీ శాలీనుల కథలో సుగాత్రి నాయిక. పూజారి కూతురు, నాయకుడు శాలీనుడు ఇల్లటపు అల్లుడు ఇద్దరూ వైవాహిక జీవితంలో అడుగు పెట్టారు శోభనం రోజున వివిధ ఆభరణాలచే అలంకరించి సుగాత్రిని పతి వద్దకు పంపారు. అతడు సహజ సౌందర్య ప్రియుడు కృత్రిమ అలంకరణాలంటే అతనికి వెగటు పుడుతుంది భార్యను కన్నెత్తినా చూడలేదు సుగాత్రి లజ్జ, అభిమానవతి చెలుల మాటలచే పతికి సపర్యలు చేసింది. కాని ఫలితం కానరాలేదు ఆమె పతివ్రతా శిఖామణి. తనమంగళ సూత్రమే తన సౌభాగ్యం అనుకొంది ఆభరణాలు ధరించడమే మంగళకరం, భర్తకు ఆయురభివృద్ధికరం అనుకొంది. తల్లితో తనభర్తను కోపపడ వద్దని బ్రతిమాలింది శాలీనుడు వ్యర్థుడుగా భావించబడి తోటపనికి అప్పగించబడ్డాడు ఆ తోటపని లో తన నైపుణ్యాన్ని ప్రదర్శించాడు సుగాత్రి అతనికి తోడ్పడడానికి ఉత్సుకిత అయింది కాని (లోకానికి వెరచి) సిగ్గుతో వెనుకంజ వేసింది ఒక రోజు సాహసించి వెడలింది తోట పనిలో భాగస్వామి అయి ఆ తరుణంలోనే అతని జీవిత భాగస్వామి కూడా అయింది ఉబ్బితబ్బిబ్బై ఆ రాత్రి అధికంగా ఆభరణాలంకృతై పతిశయ్యకు చేరింది. కాని పాతపాటే ఆమెకు ఏమీ పాలుపోలేదు. 'మీ మనసు అన్యథా ఉంటే చెప్పు' మంది, ముగ్ధాత్వాన్ని కొంత వీడి ముచ్చటించింది. కాని శాలీనుడు సుముఖుడు (భావోన్ముఖుడు) కాలేదు తర్వాత అతని మనసుని పసిగట్టి అతని ఇష్ట ప్రకారం ప్రవర్తించింది ఇది ఉత్తమనాయికా లక్షణం

అలంకారికంగా చూస్తే అలంకరణాదులు నాయకునికి ఉద్దీపనం కలిగించాలి కాని దానికి ప్రతిగా ఇక్కడ వెగటును కలిగించాయి ఆమె సహజ సౌందర్యానికి మాత్రమే అతడు భ్రమసాడు. సహజత్వమే ఉద్దీపనత్వం అతనికి ఆమె తోట పనిలో శ్రమపడి చెమట పట్టినపుడే అతనిలో భావం కలిగింది

" అపుడతడట్లు పేర్చు కుసుమాస్త్రుని యుద్ధతి యాపలేక వె
ఱ్ఱిపడుచ యెంత మాన్పిన నెఱింగెడు దానవుగావు, నీకు దో
ట పనుల కెంత దూరమకటా! యనుచుం దన యుత్తరీయ వ
స్త్రపుముని కొంగు నందుడి చెదన్వి క పోలపు ఘర్మ బిందువులో250

దీనిలో 'శ్రమం' అనే వ్యభిచారీ భావం, స్వేదం అనే సాత్త్విక భావం ఉన్నాయి సాత్త్విక స్వేదానికి ఈ క్రింది పద్యం చక్కని ఉదాహరణం.

"తుడిచిన బోక మన్మథుని దుర్జనతా మహిమన్ బొరింబొరిం
బడతి మెఱుంగు చెక్కిళుల బర్వెడు ఘర్మము గాంచి యంతనా
బడలిక చూడలేకిదుమ పాట్లకు జొచ్చి నలంగితంచునె
ఖ్కుడు తమకంబు తోడ దలగ్రుచ్చి కవుంగిట గూర్చె నత్తఱిన్"251

శాలీనుని ఆభరణాలపై ఉన్న వెగటుచే నాయికా నాయకు లిద్దరకూ విరహం సంప్రాప్తమైంది "ఈ విరహం కూడా విచిత్రమైంది ఇది ఆలంకారిక అనుసారంగా విరహ విప్రలంభం కాదు, అభిలాష విప్రలంబం కాదు, ప్రవాస విప్రలంభం కాదు, మాన విప్రలంభం కాదు నాయకుడు దరి చేరకుండడంచే నాయికకు మానమూ కలుగలేదు నాయకుడు ప్రవాసానికీ పోలేదు. ఇది అభిలాష విప్రలంభం అని చెప్పడానికి ఒకింత అవకాశం ఉంది కాని అదీ నిజం కాదు వారి కలయికకు పూర్వం ఏర్పడ్డ విప్రలంభమవడం వల్ల మాత్రం దీన్ని అభిలాష విప్రలంభం అనవచ్చు సాధారణంగా నాయికకు ఏర్పడే మన్మథావస్థలు గాని, ప్రేమ తతంగం కానీ ఇందు లేవు ఇద్దరూ దంపతులే. వారి సంగమానికి ఎవరూ అడ్డులేరు బాహిరమైన ఏ కారణాలూ ఆటంకం కలిగించడం లేదు. సుగాత్రి సంభోగానికి సిద్ధమై వచ్చింది సాంఘిక పరమైన ఆటంకాలేవీ ఇటలేవు శాలీనుని మనస్తత్వ కారణం వల్లనే వారికి విరహం సంప్రాప్తమైంది ఇలాంటి విరహం కలగడానికి ఏ ఆలంకారిక నియమాలూ కారణం కాక పోగా ఆ నియమాలేవీ వారి విరహంలో చోటు చేసుకోలేదు. వారి సంయోగాన్ని కాలమే సంధించింది. కాలమే వారి దూతిక అయింది.

అయినా 'దౌత్యం' అనే కార్యం ఎక్కడా జరుపబడలేదు. దంపతులు కాలక్రమేణ ఒకరిని ఒకరు అర్థం చేసుకొని సంసారం చక్కదిద్దుకొనే సామాన్య లౌకిక పద్ధతి మాత్రమే ఇందు వినూత్నంగా భాసించింది ఈ విధమైన సహజమైన శృంగార రస నిర్వహణకు ఏ అలంకార శాస్త్రాలు అవసరం లేదు (కాని అలంకార శాస్త్రాలలోని నియమాలు మాత్రం మౌలికంగా అంతర్గతంగా ఇందు చోటు చేసుకొనే ఉంటాయి. ) ఇలాంటి కవిత్వమే సహజ కవిత్వం.

అలా కౌగిటిలో చేర్చిన సుగాత్రిని శాలీనుడు,

"తదనంతరంబ మిక్కిలి
పొదిగొన్న చిగుళ్ళ జొంపముల సొంపగు పూ
బొదరింటికి దార్చి సతిన్
మదన మహారాజ్య భోగ మహిమం దేర్చెన్"252

ఈ ఒక్క వాక్యంలోనే సూరన సంభోగ శృంగారాన్ని చక్కగా చిత్రించాడు. వారి వియోగం, సుగాత్రి తోటలో శ్రమించే సమయంలో ఆమె ముగ్ధ మధుర సౌందర్యం అతని మనసును ఉద్రేక పరచడంతో తీరిపోయింది. ఇక అతడు సామాన్యుల దారిలోకి వచ్చాడని

. భావించింది సుగాత్రి నాటి రాత్రి, అత్యంత ఉత్సాహంతో ఆభరణ అలంకృత అయి భర్త వద్దకు వెళ్ళింది. (ఆ సమయంలో "గతి సంభ్రమంబున గరము బెడంకుచు . . . ."253 అనే పద్యంలో స్వేదం, కంపం మున్నగు సాత్త్విక భావాలు చిత్రించ బడ్డాయి )

మళ్ళీ పూర్వస్థితి విరహం ఆరంభం ఆ తర్వాత సుగాత్రి ఆయన మనస్తత్వాన్ని గుర్తించి, ఇక మీద విరహం లేకుండా చేసికొంది.

ఇలా ప్రవర్తించిన సుగాత్రి ఉత్తమ నాయికే కాదు. ఉత్తమ ఇల్లాలు, ఉత్తమ పతివ్రత, ఉత్తమ ప్రకృతిగల వనిత స్త్రీకి ఉండవలసిన సహనం సౌశీల్యాలు ఆమెకు ఉన్నాయి ఆమె విరహానికి తలిరుల పాన్పులు, చందనాదులు అవసరం లేక పోయినవి. ఆమె తాపానికి ఎవర్నీ నిందించ లేదు ఆమె ప్రబంధ నాయిక లాగ గాక ఉత్తమ ఇల్లాలు లాగ ప్రవర్తించింది శాలీనుడూ ఆమెకు తగ్గ భర్త సహనాదులు ఆయనకూ సహజ గుణాలే. కాబట్టి నాయికా నాయకు లిద్దరికీ పొందిక కుదిరింది ఈ ఇద్దరిలో ఏ ఒక్కరైనా విపరీత గుణాలు గలవారైతే ఆ దాంపత్యం కడగండ్ల పాలయ్యేది శృంగారం వియోగ సంయోగాత్మకం గాక ఆభాసం పాలయ్యేది అలాగాక దీనిలో ఆరోహణ అవరోహణ క్రమంలో శృంగారం చక్కగా పోషించ బడింది.

సౌందర్య పిపాసి అయిన శాలీనుడు ఆమె సౌందర్యం చెడకుండడానికై సంతానాన్ని ఇవ్వవద్దని శారదాంబను కోరాడు సుగాత్రి తన వంశాన్ని ఉద్ధరించే పుత్రుని ప్రసాదించమని కోరింది. ఇద్దరూ శారదా దేవి భక్తులే ఆ తల్లి ఇద్దరికీ వరాలిచ్చింది. కాని వీటిలో ఒకటి నెరవేరితే మరొకటి నెరవేరదు రెండూ ప్రసాదించింది రెండూ నెరవేరడం ఎలా? అందుకే వారికి మళ్ళీ జన్మ అవసరమైంది ఈ జన్మలో పుత్రుడు కలుగలేదు ఆ వరప్రదానముల కారణం వల్లనే వారి జన్మలు అంతమైనాయి. వారే అంటే సుగాత్రే సుముఖాసత్తిగా, శాలీనుడే మణిస్తంభుడుగా జన్మించారు. ఈ సరస్వతీదేవి వరం ఆ బ్రహ్మ చెప్పిన కళాపూర్ణుని కథలో అతని తండ్రి ఆడుమానిసి, తల్లి మగవాడూ అని చెప్పిన కథలో సిద్ధించింది.

మహాశక్తి భవనంలోనే కొన్నాళ్లుండి తర్వాత అక్కడి నుండి బయలుదేరి ఒక వనంలో,
"రతి సలిపి రందు సిద్ధుడో యతివ! నీవు
పురుష డవుగమ్ము నారీత్వమును భజింతు
నేననుచు విపరీత రతేచ్ఛ బలికె
బలుకుటయు నాదరమున నజ్జలజ ముఖియు"254

"స్త్రీత్వము నీవొందుము పురు
షత్వము నే దాల్తు'నని నిజ ప్రియు బలికెన్
సత్వరత నట్లు వారల
స్త్రీత్వము పురుషత్వము విపరీతము లయ్యెన్"255

ఆవిధంగా సుముఖాసత్తి మణిస్తంభులకు విపరీత సురతేచ్ఛ కల్గింది.

"అదియునుగాక యంగనల కంగజ సంగర కేళికావిశే
షదశల యందు నెక్కుడట సౌఖ్యగతుల్ మగవారి కంటె నా
కిదియు నెఱింగి కోనిపుడభీష్టము, గావున నిట్లయుండగో
రెదనొక కొన్ని నాళ్లు విహరింపుము నీవును బూరుషాకృతిన్"256

ఇది కామశాస్త్ర రహస్యం. స్త్రీకి గాని పురుమనికి గాని సంపూర్ణ సిద్ధి విడివిడిగా లభించదు. ఇద్దరి ఆనంద సమగ్ర స్వరూపమే కామం. ఒకరే రెండింటిని అనుభవించడం దుర్లభం. కాని సుముఖాసత్తి, మణిస్తంభులకు అది లభించింది వారు అలా లింగరూప వినిమయంతో సంపూర్ణ కామాన్ని అనుభవించారు సంభోగ శృంగారానికి దీని వల్లనే పూర్ణత్వం సిద్ధిస్తుంది ఈ విధంగా సమగ్ర సంభోగ శృంగారాన్ని సూరన గారు పోషించారు. విపరీత రూపాన్ని పొందిన మణిస్తంభుని స్త్రీ రూపాన్ని చూసి సత్వదాత్ముడు అనే రాజు మోహం పొందాడు అలా అతనికి మోహం కలిగించడంలో రూప వినిమయంలోని సహజత్వాన్ని నిరూపించే ఉద్దేశం కవికి ఉంది. వారికి ఆరూపంలోనే కళాపూర్ణుడు ఉదయించాడు కథలో వీరి విపరీత రతి ఎంతో ఆవశ్యకత కలిగి ఉంది కావ్య నాయకుడు ఉద్భవించడానికి ఈ ఘట్టమే మూలం.

ఈ విధంగా ఒకే నాయికా నాయకులకు రెండు జన్మలని ప్రసాదించి, వారు సంపూర్ణ సంభోగాన్ని అనుభవించడానికి అవకాశం కల్పించి, సమగ్ర శృంగారాన్ని పోషించడానికి అవకాశం కల్పించుకొని ఈ ఘట్టాన్ని కవీశ్వరుడు అతిమనోహరంగా, అతి మెలకువతో చిత్రించి, శృంగార పోషణలో ఇతర కవుల్ని అధిగమించాడు అనడంలో ఏ మాత్రం అతిశయోక్తిలేదు

### 5. శల్యాసుర ఆభాస శృంగారం:-

నాలుగవ ఘట్టం అయిన శల్యాసుర వృత్తాంతంలో ఆభాస శృంగారం చిత్రించబడింది. మన ఆలంకారికులు శృంగారానికి మాదిరిగానే ఆభాస శృంగారానికి కూడా సముచిత స్థానాన్ని ఇచ్చారు దీనిలో ఏకత్రానురాగం రమణీయంగా చిత్రించబడింది

శల్యాసురుడు మహిషాసురుని బావమరిది మహిషాసురుని చంపిన కాళికాదేవిపై మత్సరం పూని ఉన్నాడు ఒక వనంలో అతడు ఉండగా అప్సరోజాతి కన్నె అయిన అభినవ కౌముది అక్కడికి వచ్చింది

"వచ్చిన దద్విలాస విభవంబున కద్దనుజేంద్రు మానసం
బచ్చెరు వంది మున్నుటి సమస్త విచారము దక్కి మిక్కిలిన్

హెచ్చిన పచ్చవిల్తు వస నెంతయు జంచల భావ మొందదా
నచ్చపలాక్షి కిట్టనియె నద్దివిజ ప్రతివక్షుడయ్యెడన్"257

అభినవ కౌముదిని చూడగానే అతనిలో అనురాగం అంకురించింది అలాంటి భావమే అభినవ కౌముదికి కూడా కలిగితే శృంగారం రసవంతమయ్యేది. కాని అలా కలుగ లేదు. ఎలా కలుగుతుంది? కలగడానికి అవకాశాలూ తక్కువే అతడు రాక్షసుడు ఆమె గంధర్వాంగన అతడు 'తాను కామరూపిని. ఏ మగ రూపు కావలెనన్న దాని ధరింతు'ను అన్నాడు కాని ఆమె మనస్సంగీకరించలేదు అతడు బెదిరించి చూసాడు ఆమె చలమూని 'నిన్ను మడియించిన వానిని దక్కనే అన్యుని వరింపను? అని ప్రతిన బూనింది ఆ ప్రతినకు వాడూ కోపగించి ఏకీడూ చేయక ఎప్పుడు ఏవిధంగా దాని సంగమం లభిస్తుందో అని పోనిచ్చాడు ఇద్దరూ తమ తమ ప్రయత్నాలలో ఉన్నారు మృగేంద్ర వాహనచే ఇద్దరూ సిద్ధ ప్రయత్నులయ్యారు. కాళికాదేవి వద్ద ఖడ్గాన్ని పొంది వచ్చే అభినవ కౌముదితో శల్యాసురుడు "నావయి వచ్చిన నీకు నిష్ట దైవతముల యానసుమ్ము వరవర్ణిని! యెందు దలంక నేను దుర్మతివయి నీవు నాకు దెగి మ్రగ్గెదవేయని తల్లడిల్లెదన్"258 అని అనడంలో అతని అవ్యాజానురాగం, నిష్కళంక ప్రేమ సువ్యక్తమౌతుంది అతన్ని ఆమె శ్రీశైల పర్యంతం తీసికొని పోయింది మన్మథాతురుడు కాబట్టి వెళ్ళాడు

ఆ రాక్షసుడు తనశక్తిని ప్రదర్శించేప్పుడు కూడా ఆమెకు తాకకుండే విధంగా శలల వృష్టిని కురిపించాడు

"ఇత్తెఱంగున దనశక్తి యెఱుక పఱచి
యిక వరింపక చనియెదే యీవు చనిన
చోటులన్నియు నా బలస్ఫూర్తి చేత
బిడుగు పాఱిన డొంకయై పెంపడంగు

దానవఖిల భయ నిదానంబవగుదునీ
యన్వయమున లేని యట్టి తిట్టు
కుడువ నీకు దగునె కోమలి? యది యెంచి
యైన నను వరింపు' మనుచు బలికె "259

ఈ 'అనునయ' విధానం ఆ రాక్షసునికి ఉచిత రీతిగానే ఉంది ఇంతటి ప్రేమ, అనునయం, ఉదారత్వం, జాలి మొదలగు భావాలెన్ని ప్రదర్శించినా అది ఏకత్రానురాగ మవడంచేత ఆభాస రూపం పొందింది. కె. వి ఆర్ నరసింహంగారి అభిప్రాయం చూడండి.

"ఇందలి రాక్షస శృంగారము సాధుత్వ మెఱుగని మోటు మనుష్యుల ప్రణయ భగ్నత కొక నిదర్శనము. ఇది నిజముగా నాభాస రూపము"260

ప్రణయం భగ్నమైన మాట వాస్తవమే కాని శల్యాసురుడు రాక్షసుడైనా సాధుత్వం ఎఱుగని మోటు మనుష్యుని లాగా ఎక్కడా ప్రవర్తించలేదు ఆమెకు ఏ విధమైన బాధా కలుగకుండ అతి సుకుమారంగా రక్షించాడు మాటలలో ఒకింత కఠినత్వం కనిపించినా హృదయ మృదుత్వం మాత్రం అతని చేష్టలలో కొట్ట వచ్చినట్టు కనిపిస్తూనే ఉంది అతడు నిజంగా రాక్షసత్వాన్నే ప్రదర్శించి ఉంటే కథ మరో లాగుండేది. రాక్షసుడైనా రమ్యంగానే ప్రవర్తించి ఆభాస రూపంలో అయినా శృంగారాన్ని రక్తి గట్టించాడు

## 6. కళాపూర్ణుని దాంపత్య శృంగారం:-

కళాపూర్ణుని దాంపత్య జీవితంలోని శృంగారం ఈ ప్రబంధంలోని చివరి ఘట్టం దీనిలో ప్రబంధ సాధారణమైన శృంగారం చిత్రించ బడింది. ఇంతకు పూర్వం చిత్రించబడ్డ ఘట్టాలలో నవ్యత కలదు ఈ ఘట్టంలో శాస్త్రీయత కలదు.

కళాపూర్ణుడు గాంధర్వ విధిని వివాహమాడాడు ఆమె గంధర్వకన్య కాబట్టి 'దివంబునకుం జనక యావజ్జీవంబు నవ్విభుండునిచిన చోటన యునికికి నొడంబడినది ఇక రూపానుభూతి మదాశయుల కూతురైన మధురలాలసను కూడా రెండవ భార్యగ వరించాడు కళాపూర్ణుడు కాని వీరిద్దరిలో వివాహం కంటె ముందు కలిగిన ప్రేమ అంకురిత, వల్లవితాది అవస్థలతో చక్కగా చిత్రించబడింది శిశువుగా ఉన్న పుడే మధురలాలస రాజా పాటలు పాడితే కేరికేరి నవ్వేదట అన్యుల పాటలు పాడితే ఏడ్చేదట వారి ప్రేమ పూర్వజన్మాది సిద్ధమని దీనివల్ల వ్యక్తమౌతుంది అభినవ కౌముది వివాహం కూడా రాజా యొక్క పూర్వజన్మానుగతమైనట్టిదే ఆమె గంధర్వ కన్య కాబట్టి వేచి ఉండింది.

మధురలాలస శైశవ, బాల్యాలను గడచి యౌవనవతి అయింది సంగీత సాహిత్య విద్యలన్నీ నేర్చింది రాజా ఆమెను మరిచాడు కాని మధుర లాలస మాత్రం "జవ్వనము ప్రాపించి, యంకురిత మదన వికార యగుచు నాకళాపూర్ణు పాణిగ్రహణం బభిలషించు చున్నది. "261 అలాంటి మధురలాలసకు మన్మథావస్థలు సంభవించాయి.

"మును కొని కూర్మి నెచ్చెలులు ముచ్చట వేళల దద్గుణౌఘముల్
వినివిని విన్న యర్థ మొక వేళను మానని నిత్య భావనం
గనికని కన్న యంతయును గావ్యవినిర్మితి చేత దార్చుచుం
గొనకొని మిక్కిలింబెనిచె గోమలి ప్రేమము నామహీశుపైన్"262

ఈ పద్యంలో నాయిక నాయకుని గుణాలను వినివిని తద్భావనచే తద్రూపాన్ని దర్శించింది. అంటే వినుకలి తద్వారా కనుకలి ఇందు చిత్రించ బడింది ఈ వినుకలి, కనుకలిల వల్ల ఆమెలో రతి అంకురమైంది. అంటే 'ప్రేమ' కలిగింది ఈ పద్యంలో 'చక్షుఃప్రీతి' అనే మన్మథావస్థ నాయికకు కలిగినట్టు చిత్రించబడింది

"అంతట బ్రత్యక్షంబుగ
గాంతుం గనుగొనగ బిగువు గౌగిట జేర్పం
గంతు విహారంబుల న
త్యంతము మోదింప గోరెనంగన మదిలోన్"263

దీనిలో 'మనస్సంగం', 'సంకల్పం' అనే అవస్థలు ఉన్నాయి.

"ఒక్కతె బిల్వబోయి మఱియొక్కతె బేర్కొని బిల్చు . . . ."264
ఇత్యాది పద్యంలో 'ఉన్మాదం' అనే అవస్థ చిత్రించబడింది
"తరుణితాబగళ్ళు తామర సాక్షియన్ . . . "265 పద్యంలో 'జాగరం',
"సితకరుని శుక్లపక్ష. . . ."266 ఇత్యాది పద్యంలో 'కృశత',

"వీణియ ముట్టుటల్ మిగుల వింతలు . . . ."267 అనే దాంట్లో 'అరతి' అనే అవస్థ చిత్రించ బడ్డాయి.

"కొమ్మ కడు జిక్కుచున్నది. . . . "268 ఇత్యాది పద్యంలో 'కృశత' అనే అవస్థతో పాటు వైవర్ణ్యం, చింత అనే భావాలు ఉన్నాయి

ఆమె కళాపూర్ణుని మీది చింతతో విరహం పాలైంది. ఆమె అవస్థల్ని గ్రహించిన చెలులు వనవిహారానికి ఆమెను తీసుకొని వెళ్ళారు అక్కడ జలక్రీడలు కూడా చేసారు

దేగవేట కారణాన కళాపూర్ణుడు అక్కడికి రాగా నాయికా నాయకులిద్దరూ రోమాంచం కలుగగా చూసుకొన్నారు వారి చూపులలో 'త్రప' దోబూచులాడింది తర్వాత ఏదో విధంగా కళాపూర్ణుడు వెళ్ళిపోయాడు మధుర లాలసకు విరహం అధికమైంది అంగజతాపం అతిశయించింది చెలులు ఆమెకు సర్వశైత్యోపచార విధులు నిర్వర్తించారు ఆమె చంద్రుని, చిలుకను, స్వల్పంగా ఉపాలంభించింది

"వేయు నేటికి శీఘ్రంబ విభుని పొందు . . . "269 ఇత్యాది పద్యంలో 'మరణం' అనే మన్మధావస్థ ఉంది చెలి కళాపూర్ణునితో సంగమం శీఘ్రంగా సిద్ధిస్తుందని సమాశ్వాసించింది

కళాపూర్ణుడు కూడా కేళివన భూమిలో మధురలాలసను కాంచినప్పటి నుండి అతని మనసులో వికారం కలిగి విరహానికి దారితీసింది. ఒక వృద్ధ విప్రుని పిలిపించుకొని తన మనసులోని విషయాన్నంతా వివరించాడు. మధురలాలసను మనసారా వర్ణించాడు బ్రాహ్మణుడు ఆ మధురలాలస సంగతి తెలిపాడు ముహూర్తాన్ని కూడా నిర్ణయించాడు. రాజు తలిస్తే జరుగందేమి? అభినవ కౌముది అనుమతిని కూడా పొందాడు. పెండ్లి తతంగం అంతా సాంప్రదాయ బద్ధంగా నిర్వహించబడింది ప్రథమ సమాగమ వేళ ఆసన్నమైంది.

ప్రియుడు ఏకారణం వల్లనో ఆలసించాడు. మధురలాలస రకరకాలుగా ఊహచేసింది. అభినవ కౌముదిని శంకించింది ఎట్టకేలకు రాజా రాగా చెలికత్తెలు ఆమెను రాజాకడ కూర్చుండ బెట్టి పాద సంవహనం చేయ నియోగించి వారు జారుకొన్నారు.

"ప్రధిత మిధోరాగ కథల మంతనములవ్వాదయంబు లోపలి బెదురు దీర్చి
నవ్యాజకృత కుచ స్పర్శాది లీలలనంగాంగ మేళన మలవరించి
జిలిబిలి నెయ్యంపు జిట్టకంబుల చేతనెలనవ్వు చెక్కుల మొలవజేసి
లజ్జాపదంబు లల్లన మాటి మాటికిజెనకుచు నొక్కింత సిగ్గు వఱచి
అపుడు కుసుమ సాయ కాగ మాధ్యయనాధి
కారసిద్ధి గొంత కలుగ జేసె
నావసుంధరాధిపా వతంసుండు రూ
పానుభూతి తనయ కాదరమున --"270

ఈ విధంగా మధుర లాలసను సంభోగానికి ఉన్ముఖీకరణం చేసాడు ఇక్కడ నుండి అనేక పద్యాలలో సంభోగ శృంగారం చిత్రించ బడింది.

"భీతియు లజ్జయుం దనర ---జాంబనాదులన్"271
"మిక్కిలి మిక్కుటంబగు తమిన్----నంతటన్"272
"పరిరంభ రోధంబుపై----యింపొనర్చె"273
"కపటపు నిద్రవోవుతఱి ---వేడ్కలోన్ "274
"పాలిండ్లు ప్రియపడి ---వెనుక"275

ఇలా మధురలాలసతో సంభోగ శృంగారాన్ననుభవిస్తూ, దక్షిణ నాయకుడై అభినవ కౌముదితో కూడా సుఖిస్తూ ఉన్నాడు.

ఓసారి అభినవ కౌముది వీణ వాయిస్తుండగా రాజా దాన్ని వినడానికి మధురలాలస ను పిలిపించాడు. ఆమె విన్న తర్వాత ఆమెను కూడా పాడు మన్నాడు ఆమె మధురంగా పాడింది.

రాజా, అభినవ కౌముది ఇద్దరూ ఆశ్చర్య పడ్డారు. వీణెల ప్రసంగం కొంత జరిగింది. మృగేంద్ర వాహనా మందిరంలో దాచి పెట్టబడ్డ తన విపంచిని గురించి ఆలోచించి మధుర లాలసకు అదే తగిందని ఆమెతో రాజా చెప్పాడు. ఆ సమయంలో అభినవ కౌముది చెలికత్తెలు ఆమెను వక్కకు తీసికొని పోయి,

"మధుర లాలస పాటపై మదిని దనకు
నింత వేడుక గలిగిన నేకతమున
సతతమును వింట కాక యిట్లతడు నిన్ను
నోటు వఱచుట తగునె? నీకోర్వ దగునె"276

అని చెలులు అభినవ కౌముదికి ఈర్ష్యను కలిగించి, మానం ఊనేట్లుగా చేసారు. ఆరాత్రి మౌనంగా పతికి పరిచర్యలు చేసింది. అతడు ఆమె ప్రవర్తనకు కారణం ఏమిటి అని ప్రశ్నించగా,

"పాటల గెల్చినట్టి సతి పల్కులు పల్కులు గాక యిట్టునే
దోటమి నున్న మావలుకులో నృప! యేటికి నీకు! వట్టియా
మాటల కేమి పోదు? మది మక్కువ వేఱొక చోట నుండగా
బోటు దనాలు చన్నె మిము బోంట్లకు దక్కిన వారికిన్ బలెన్"277

అని సమాధానం ఇచ్చింది. ఆమె కోప కారణం తెలిసికొని అనునయించాడు
"పలుకొని నన్ను నిట్లు మరుబారికి లోనుగ జేయబూని నీచరణంబు మీదియా
.........న యనుచు లేచి వచ్చి పతి నాతి పదాబ్జము పట్టె బట్టినన్"278

'మోహపు దేవుల కాళ్ళు బట్టుకొ' మ్మంది 'నీకంటె మోహపు దేవులెవ్వరొని కౌగిలిలోనికి తీసికొన్నాడు ఆమె చింతను పోగొట్టి 'విచిత్రవల్లకి' ఒక్కటి తెచ్చి ఇచ్చెదను అని ఆ మానమును ఉపశమింపజేసి సంతసింప జేసాడు

ఈ విషయాన్ని విని మధురలాలస మానమూనింది. ఆమె కాళ్ళ మీద కూడావడి, 'శ్రీమమ తత్పద భూపలష్ట దిగ్గనపతి దారమౌళి మణి సంతతి జేయ గృత ప్రతిజ్ఞా' డయ్యాడు

ఈ విధంగా నంది తిమ్మన గారి లాగా సాంత్వన ఘట్టాలను ఏర్పరచి వాని మూలాన నాయకునికి స్వల్ప దుస్సహ వియోగం ఏర్పరచి, పాద పతనంతో నాయికల ఈర్ష్యామానాన్ని ఉపశమింపజేసి రాజు శృంగారంలో తేలినట్లు చిత్రించాడు కవి.

ఈ విధంగా అనేక రకాలుగా శృంగారాన్ని పోషించి, సాంప్రదాయాను సారంగా, స్వయం నిర్మాణ నవ్య మార్గాన నడిచి, ప్రాచీన ఆధునిక పండిత వర్యులందరకూ మోదాన్ని కలిగించాడు సన్యాసి ప్రతిమను చూసి స్త్రీనిగా భ్రమించు చోట మోహ శృంగారాన్ని భ్రాంతి యుతం అయిన దాన్ని చక్కగా చిత్రించాడు యజ్ఞశర్మ తనవ్రత నిర్వహణానికై స్వభార్యలనే అమ్మివేసి దైవికంగా విరహం పాలయ్యాడు ఇలాంటి చోట ప్రవాస విప్రలంభం అతి రమణీయంగా చిత్రించబడింది.

## 8. ప్రభావతీ ప్రద్యుమ్నం:-

కల్పనామయ కావ్యం కళాపూర్ణోదయం తర్వాత సాధారణ ప్రబంధ ఫక్కీలో ఒక ఉత్తమ ప్రబంధాన్ని వెలయింప దలచి 'ప్రభావతీ ప్రద్యుమ్నం' అనే ఉత్తమ ప్రబంధాన్ని

సూరన కవి సృష్టించాడు. దీనిలోని ప్రదాన రసాన్ని గూర్చి ప్రత్యేకంగా చర్చించాల్సిన అవసరం లేనప్పటికీ ఆద్యంతాల్లో వీరం, మధ్య భాగం అంతా శృంగారం వ్యాపించి ఉండడంవల్ల ఇందలి ప్రధాన రసం ఏది? అనే ప్రశ్న ఉదయించడానికి అవకాశం ఉంది.

**1. అంగిరస నిర్ణయం:-**

"వజ్రనాభుని వధయే ప్రధానమను వారు ఈ కావ్యము వీరరస ప్రధానమందురు. కాని యాకథ నిమిత్తమాత్రమే యనియు అది ప్రభావతీ ప్రద్యుమ్నుల వివాహమునకు నడ్డుగాకుండుటకు జరిగిన దనియు నాయికా నాయకుల పరస్పరానురాగ పోషణమగు కావ్యమగుట శృంగార రస ప్రధాన కావ్యమని రెండవ వర్గము వారందురు. ఇదియే సముచితము. శృంగార రసపోషణయే విపులముగ నిందు జరిగినది"279 అని విన్నకోట మాధవరావు గారు వివేచించారు.

ప్రభావతీ ప్రద్యుమ్నంలో వీర, శృంగారాలు రెండూ నేనంటే నేను అనే విధంగా పోటీ పడి మిగుల ఒప్పు ఉన్నవి ఈ ప్రబంధంలోని నాయకుడైన ప్రద్యుమ్నుడు కూడా వీర శృంగార మూర్తి వీరం కోసం శృంగారం, శృంగార రక్షణకై వీరమూ పరస్పరం పోషింపబడ్డట్లు కనిపిస్తున్నాయి

"అరయ నింకనే మడిగె దల్లవె యాతడు శంబరిం ద్రిలో
కారిని ద్రుంచునప్పటి ప్రహార కిణంబు లురంబునందునా
హారతి కంకణాంకములు నల్లవిగా మెడ యందు వీర శృం
గార కళాఢ్యు నిట్లతని గట్టిగ నెవ్వరెఱింగి వ్రాసిరో"280

వీర శృంగార కళాఢ్యుడు నాయకుడైన ప్రబంధంలో వీర శృంగారాలు సమ ప్రాధాన్యాన్ని పొందడంలో వింతలేదు అదీగాక అతడు నెర వేర్చాల్సిన పనులూ రెండు రసాలకు సంబంధినట్టివే ఒకటి దేవ కార్య నిర్వహణ దీన్నికై వీరత్వ ప్రదర్శనం అవసరం. రెండవది ప్రభావతి (యొక్క) తన (యొక్క) విరహతాపాల్ని తీర్చడం దీన్నికై అతడు శృంగారంలో తమి గలిగి ఉండడం ఆవశ్యకం శృంగార సాధనకు వీరం, వీరత్వ ప్రదర్శనకు శృంగారం ఈ ప్రబంధంలో పరస్పరం ఆవశ్యకాలైనాయి కాబట్టి ఈ ప్రబంధం లో ఈ రెండూ సమ ప్రాధాన్యం కలిగినవి గానే కనిపిస్తున్నవి కాని వీర శృంగారాలు రెండింటినీ ప్రధాన రసాలని చెప్పడం ఉచితమా? కాదు రెండింటిలో ఏదేని ఒకటి 'అంగి' స్థానాన్ని, మరోటి 'అంగ' స్థానాన్ని గ్రహించ వలసి ఉంది. బాహ్యాంతర కారణాలచే ఈ రెండింటిలో ఏది 'అంగి' రసమో నిర్ణయిద్దాం

ఇంద్రుడు వచ్చి శ్రీకృష్ణునితో వజ్రనాభుని ఆగడాల్ని వివరించి అతన్ని అంతమొందించడానికై ఉపాయాన్ని ఆలోచించాడు శ్రీకృష్ణునికి కూడా వసుదేవ

యజనావసానంలో భద్రుని ప్రదర్శనల్లో వటువుల వాక్యాల వల్ల ఒక ఆలోచన కలిగింది. ఇంద్రుడు హంసల్ని రప్పించి వేగు నడువుమని కోరాడు. శుచిముఖి ప్రభావతి వృత్తాంతాన్ని తెల్పి, ప్రభావతీ ప్రద్యుమ్నుల ప్రణయం ఫలిస్తే వజ్రనాభుడు నిహతుడౌతాడని శుచిముఖి చెప్పింది. దాని కోసం శుచిముఖి చాలా శ్రమించి వారిని కలువగా ప్రభావతి గర్భవతి అయి పుత్రుని కన్న తర్వాత రహస్య భంగమై వజ్రనాభుడు ప్రద్యుమ్నాదులతో యుద్ధం చేసి వారితో నిహతుడయ్యాడు. ఇది ప్రధాన కథ. దీన్ని బట్టి ఇందలి ప్రధాన రసం లేదా అంగిరసం వీరం అనీ, అంగరసం శృంగారం అనీ నిర్ణయించవచ్చు. కాని అలాచేయడం యుక్తియుక్తంకాదు. కావ్యం పఠించేప్పుడు, ఆ తర్వాత మననం చేసుకొనేప్పుడూ ఏ వృత్తాంతం మనస్సులో చర్వితమౌతుంటుందో దాని ప్రాధాన్యాన్ని బట్టి ప్రధాన రస నిర్ణయం చేయాలి. కావ్యాదిలో, అంతంలో కొద్దిగా ఉన్న వజ్రనాభ వధ వృత్తాంతమే కావ్యమంతా వ్యాపించి లేదు. 'ప్రభావతీ ప్రద్యుమ్నా'న్ని చదివేప్పుడు మన మనసులో భాసించేది వారి ప్రణయ విషయమే కాని అన్యం కాదు. అలాగే పఠనానంతరం ప్రబంధాన్ని ఒకసారి సింహావలోకనం చేసికొని మననం చేసికొంటే వారి వృత్తాంతమే చర్వితమౌతుంది. కాబట్టి వారి ప్రణయ వృత్తాంతమే ఇందు ప్రాధాన్యం వహించి ఉండడం చేత ఇందలి ప్రధాన రసం శృంగారం అని నిశ్చయించవచ్చు.

"ఆశీర్నమస్క్రియావస్తు నిర్దేశోవాzపి"281 అనే సాంప్రదాయం ప్రకారంగా ప్రభావతీ ప్రద్యుమ్నం లోనూ ఆది పద్యంలో ఆశీస్సులతో కూడిన వస్తు నిర్దేశం కలదు.

"శ్రీమదుమామహేశు లతి చిత్ర విలాసులు దారుమున్ వియో
గామిత చింత నొందొరులకై నగమౌటలు విచ్చ దెల్పుకాం
క్షామ హిమంబుచే జెఱి సగంబుగ నొక్క యొడల్ధరించు స
త్ప్రేమపు దంపతుల్కృతి పతిం దనరింతురు గాతగీర్తులన్"282

ఉమామహేశ్వరులది అర్ధనారీశ్వర తత్త్వం. వారి కావ్యంలోని నాయికా నాయకులుగా సంకేతింపబడ్డారు. వారు 'అతి చిత్రవిలాసులు' అనడంలో ప్రద్యుముడు 'అతిచిత్రంగా' నటుని వేషంలో వజ్రపురి చేరడం, నాయికను చేరేప్పుడు పూవుల్లో తుమ్మెదై ఆమె కర్ణావతంసంలో ఉండి అతి చిత్రంగా సమయం వచ్చినపుడు విలాసంగా నాయికను సమీపించడం అనే అర్థం స్ఫురిస్తుంది. 'వియోగామిత చింత నొందొరులకై నగమౌటలు' అనే దాని వల్ల కనుకలి, వినుకలులచే ప్రభావతీ ప్రద్యుమ్నులు పరస్పరం విరహాన్ని పొంది కార్శ్యావస్థ పొందడం వ్యక్తమౌతుంది. 'చెఱి సగంబుగ నొక్కయొడల్ధరించు' అనే దాంట్లో వియోగ బాధితులైన నాయికా నాయకులు చిక్కి సగమై సంయోగాన్ని పొంది ఏక శరీరులు అయ్యారని ధ్వనిస్తుంది. 'సత్ప్రేమపు దంపతుల్' అనడంలో సజాతీయ విజాతీయ భావాలచే అన్యవిధంగా చక్కటి ప్రేమను కలిగి గాంధర్వ విధిని దంపతులైన ప్రభావతీ ప్రద్యుమ్నులే

'సత్త్రేమవు దంపతుల'ని వ్యంజింపబడింది ఈ విధంగా ఈ పద్యంలో కావ్యంలోని వస్తువు నిర్దేశించ బడడమే గాక నాయికా నాయకుల సంయోగ వియోగాత్మకమైన శృంగారం చక్కగా సూచింపబడింది ఇందలి సూచనను, వస్తు నిర్దేశాన్ని బట్టి ప్రభావతీ ప్రద్యుమ్నంలోని ప్రధాన రసం శృంగారమే అని మనం నిర్ణయించవచ్చు.

'ప్రభావతీ ప్రద్యుమ్నం' అని ప్రబంధానికి కవి పెట్టిన పేరును బట్టి నాయికా నాయకులైన ప్రభావతీ ప్రద్యుమ్నుల ప్రేమ, శృంగార కథే ఇందలి ప్రధాన వస్తువని స్పష్టమౌతుంది ఇందు వీరాన్నే ప్రధానంగా నిర్వహింపదలిస్తే సూరనగారు దీనికి 'ప్రభావతీ ప్రద్యుమ్నం' అనే పేరుగాక 'వజ్రనాభవధ' అని నామకరణం చేసి ఉండే వారు. ఇందు ప్రభావతికి కనుకలిచే, ప్రద్యుమ్నునికి వినుకలిచే పరస్పరం 'రతి' అంకురించింది. ఇది ఇంతింతై వృద్ధి పొంది సంగమ పర్యంతం త్వరపెట్టింది వారి సంగమానికి ముఖ్య ఉపకరణంగా 'శుచిముఖి' తోడ్పడింది వారి ప్రేమ ఫలించడం, గాంధర్వ విధిన వివాహమాడి, రతులదేలి కుమారుని గనడం అనే అంశాలన్నీ 'ప్రభావతీ ప్రద్యుమ్నం' అనే నామకరణాన్నే బలపరుస్తున్నాయి. ఆది అంతాల్లో వజ్రనాభుని ప్రస్తావన, దాని గురించిన ఆలోచన, వాని వధలున్నా వాని వృత్తాంతం ఈ ప్రబంధంలో ఆనుషంగికమైందనే చెప్పాలి. కాబట్టి 'వీరరసం' అంగంగా 'శృంగారం' 'అంగి' అయి ఇందు విరాజిల్లింది

ఈ ప్రబంధంలోని ఆది, అంతాలలో వీరం కనిపిస్తున్నా అది శృంగార నిర్వహణకే ఉపకరించింది ఈ ప్రబంధంలో శృంగార ప్రధానమైన ఇతివృత్తమే ఆధిక్యతను కలిగి ఉండడం వల్ల 'ప్రభావతీ ప్రద్యుమ్నం' శృంగారస ప్రధానమైన ప్రబంధం అని చెప్పవచ్చును.

కావ్యాంతంలో వజ్రనాభుడు సునాభాదులతో తమ మీదికి రావడం చూసిన ప్రభావతి పితృవత్సల భావము బాఱనూకుచున్

"తానచని మూలనున్నయ
సూనతదీయాసి దెచ్చి యొసగి గెలువుమీ
దానవపతి దక్కినయను
మానము మానుమని పలికె మానవతి పతిన్"283

నాయిక తన సౌఖ్యానికే ప్రాధాన్యం ఇస్తూ, తమ శృంగారానికి అడ్డువచ్చే తన తండ్రినైనా సరే గెలువుమని తానే స్వయంగా నాయకునికి ఖడ్గాన్ని తెచ్చి ఇచ్చింది. దీని వల్ల కూడా ఇందలి ప్రధానరసం శృంగారమే అనీ వీరం అంగరసం మాత్రమే అనీ నిశ్చయించవచ్చును.

2. శృంగార పోషణ:-

a) విభావాను శీలనం:-

1. ఆలంబన విభావాలు:-ఇందలి ఆలంబన విభావాలు నాయికా నాయకులైన ప్రభావతీ ప్రద్యుమ్నులు. ప్రద్యుమ్నుడు వీరుడు. ధృతిమంతుడు. కాబట్టి ఇతన్ని ధీరోదాత్త నాయకుడని చెప్పవచ్చు. అతని పరాక్రమం ఇలా వర్ణించ బడింది.

"అకట తమ మహిమ తారెఱు
గకయోమటి యేలొ తెగరుగాక మరుత్క్రం
టకు బీచమదంవనెన
న్నొకనినె వంపినను దమనియోగము బలిమిన్"284

"భిదుర ధరుండు జక్రియును ....... గుమారకా"285
"కయ్యపు వేడ్క రేచుకొని ....... యుక్తమెన్న గన్"286
"తమకు దామె ప్రల్దదంబున ....... బిరుదు మగలు"287
ఇలాంటి వీరుడు కాబట్టే ఎలాంటి పని చేయడానికైనా వెనుదీయలేదు
"శౌర్య మయుండతండు భుజసత్త్వ నిధానము ....."288
ఇందు ప్రద్యుమ్నుని ధీరోదాత్త లక్షణాలు వర్ణించబడ్డాయి.

ప్రభావతితో సంభోగించు సమయంలో 'రతి'ని స్మరించినట్లు శ్లేష సామర్థ్యంతో కవి చిత్రించాడు ప్రద్యుమ్నుడు ప్రభావతి రతి లోనే పరవశత్వాన్ని దెలిపాడు. కాబట్టి ప్రద్యుమ్నుని వర్తనాన్ని బట్టి అతడు 'అనుకూలుడు' అనే శృంగార నాయకుడని చెప్పవచ్చును.

ప్రభావతి తండ్రిచాటు బిడ్డ అయినా ప్రేమ విషయంలో యధేచ్ఛగానే ప్రవర్తించింది ప్రద్యుమ్నుడు ప్రభావతిని గాంధర్వ విధిని వివాహమాడడం వల్ల ఆమె స్వీయానాయిక శృంగార రసాన్ని బట్టి ఆమె స్వాధీన భర్తృక అని చెప్పాలి. నాయికా లక్షణాలన్నీ ఆమెలో కలవు చిలుక ఉరిలో తగుల్కొన్నప్పుడు దయతో దాన్ని విడిపించింది సిగ్గు, అభిమానాలు కలిగిన నాయిక ప్రభావతి. ఇతర సమయాల్లో ధైర్యస్థురాలిలాగా మాట్లాడినా పతి సమీపించగానే 'ప్రీడ'చే అవాక్కౌతుంది ప్రద్యుమ్నునికి శుచిముఖి ప్రభావతి రూప సౌందర్యాలు వర్ణించగా 'వినుకలి' చేతనే ప్రేమ అంకురించింది ప్రభావతికి స్వప్నంలో పార్వతి ప్రత్యక్షమై చిత్రఫలకాన్ని ఇచ్చి ఈ ఫలకంలోని ప్రద్యుమ్నుడు నీకు మగడవుతాడని చెప్పింది ఆ చిత్రం చూడడంతోటే అంటే 'కనుకలి' తో ప్రభావతికి ప్రేమ అంకురించింది ఇలా నాయికా నాయకులిద్దరిలో 'రతి' ఉద్భవించి వారి ప్రణయ కథకు నాంది పలికింది.

2. ఉద్దీపన విభావాలు:- నాయికా నాయకులలో కలిగిన 'రతి'కి వారి రూపయౌవనాలు ఉద్దీపకాలైనాయి.

"నెత్తమ్ములంచు క్రొన్నెలలంచు వటఫల
శ్రీలంచు తాబేటి చిప్పలనుచు. .. "289

ఇత్యాది పద్యం మొదలుకొని 2-89వ పద్యం దాకా ప్రభావతి సౌందర్యాన్ని శుచిముఖి వర్ణించింది ఆ వర్ణనలోని ప్రభావతి రూపు రేఖలన్నీ ప్రద్యుమ్నునికి ఉద్దీపనాలే అయినవి. ఉద్యానవనంలో కెళ్ళిన ప్రద్యుమ్నునికి అచటి నిండు పూగుత్తులు, నూతన పల్లవాలు, ఎలతీగెలు, గండు తుమ్మెదలు, విరులు మధురసం మొదలగునవన్నీ ఉద్దీపనాలైనాయి.

"నిబిడంబు జిగితోడ నిండు పూగుత్తులు
బిగువు పాలిండ్ల యొప్పిదము నెరవ
- - - - - - - - - - - - - - - - - -
నతని చూడ్కికి జూడనుద్యాన భాగ
మంతయు బ్రభావతీ మయంబగుచు దోచె"290

ఇలాగే నాయిక అయిన ప్రభావతికి కూడా చిత్ర ఫలకంలో చూసిన ఆతని రూపం విరహం కలిగిస్తే సరస్సు దగ్గర అమంద కందర్ప తాపాన్ని పొందింది ఆ తాప ఉపశమనానికై వనవిహారం చేసింది. సరస్సు, ఉద్యానాలు ఇచటి ఉద్దీపనాలు అచటి పల్లవాలు, ప్రసూనాలు, పుష్పంధయాలు, పరాగాలు, శుకపికాల కలకలాలు అన్నీ ఉద్దీపన విభావాలే. ప్రభావతి ఉపాలంభానికి గురైన చంద్రమల యానిలులు కూడా ఉద్దీపన విభావాలే

b) అనుభావాలోకనం:- విరహార్త అయిన ప్రభావతి చిత్రఫలకాన్ని తెప్పించి, దర్శించి "ఓర్వజాల నేననుచు రసోద్ధతిం గదియనక్కున జేర్చి నిజేశురూపమున్,

చేర్చి యొక్కింత తడవు నిశ్చేష్ట యగుచు
జొక్కి కనుగవ యరమోడ్చి శోభనాంగి. "291
అనే దానిలో 'స్తంభం' అనే సాత్త్విక భావం ఉంది ఈక్రింది పద్యంలో ప్రభావతికి కలిగిన అశ్రు, వైవర్ణ్యాది సాత్త్విక భావాలు చిత్రించబడ్డాయి

"నెలత ముక్కర యందు నీలంబుగాదుసూ
తెలిదళు కొత్తు ముత్తియము గాని
- - - - - - - - - - - - - - - - - - - - -
యూర్పువేడిమి, గృశత, బాష్పోదయమున
గండ పాండిమ దత్తత్ప్రకారములను .. . ."292

ప్రభావతి సౌందర్యాన్ని వర్ణించగా ప్రద్యుమ్నుడు ఔకాదనక ఉన్నాడని శుచిముఖి అనగా ప్రభావతి

"అనవిని మనసు చివుక్కు రు
మనగ బ్రభావతి వివర్ణమగు వదనముతో "293 ఉందట,
ఇందు వైవర్ణ్యం అనే సాత్త్విక భావం ఉంది

ప్రద్యుమ్నునితో శుచిముఖి ప్రభావతి యొక్క స్థితిని వర్ణించే చోట ఆమెకు కలిగిన సాత్త్విక భావాలు కొన్ని తెలుపబడ్డాయి

"భవదమలా కృతి ప్రతిమ బర్వినయప్పుడు చూపు క్రమ్మఱన్
దివగ దలింపరాక సుదతిన్గతచేష్టిత జేసెనోయదు
ప్రవరుడు . . . . . . . . . . . . . ."294 దీనిలో 'స్తంభం', కలదు.

"కొసరక చూపు చేత . . . . . . . . . . . . . . .
. . . . . . . . . . . . . కాకరకాయ రీతిగా
గిసలయ పాణి చన్నుగవ క్రేవ గగుర్పొడిచెం బొరింబొరిన్"295
ఇందు 'రోమాంచం' కలదు.
ప్రద్యుమ్నుడు నట వేషంలో వజ్రపురి ప్రవేశించిన తర్వాత

"ననునేలికొను మవశ్యం
బును నీయూడిగము చిత్తమున కెక్కగనే
నొనరింతు నేటి తమి నీ
మనమున నెంతయు విడుకొని మన్నింప దగున్"296అని తెలుపగా,

"అనవిని కపోల యుగళము
ఘన పులకితము మరల్చె . . . "297
"అవుడు తదీయ పార్శ్వగత......
. . . . . . . గరుదాల్చె గపోలము చాల నావుడున్" 298
వీనిలో 'రోమాంచం' వర్ణించబడింది.

"అతి శీఘ్రంబున నాలతాంగియు . .
బతిగన్ ఱెప్పులు విచ్చిచూచి భయ, కంప, స్వేద, లజ్జాత్మయై" 299
ఈ పద్యంలో కంపం, స్వేదం అనే సాత్త్విక భావాలున్నాయి.

"అవుడించుక తడవన్యో
న్యపాణి సంస్పర్శ సంభృతానందస్తం

భ పరీతాత్మత నుండిరి
ప్రపంచ మంతయును మఱచి పతియున్నతియున్" 300ఇందు 'స్తంభం',

"నళిన దళాక్షి సిగ్గరితనంబు గదా ....." 301అనే దానిలో స్వేదం, రోమాంచం,
"స్వకుతుక పూర్తిగాగ రతిసల్పి ....... 302
అనే పద్యంలో 'రతి'లో శ్రమ వల్ల కలిగిన 'స్వేదం', వర్ణించబడ్డాయి
ఇలా చిత్రింపబడ్డ సాత్త్విక భావాలు రసపోషణలో మిక్కిలి ఉపయుక్తాలైనాయి.

c) సంచారీసమాలోచనం:-

"చిత్తరువన్న నిశ్చయముచే .... " 303 ఇత్యాది పద్యంలో చిత్తరువులో ఉన్న పురుమని చూడడం వల్ల ప్రభావతికి 'వ్రీడ' కలిగింది ఇది 'త్రప' అనే సంచారీభావం.
"తన తనయుడు రాక్షసుపై. ..." 304 అనే పద్యంలో 'శంక',
"కనుదొద్దనున్న వానిని ....." 305 అనే పద్యంలో 'చాపలం',

"ఆ రూపు మది జాల పత్తెంచు ...."306 అనే పద్యంలో 'నిర్వేదం', దైన్యం చింత, రోషం మున్నగు అనేక సంచారీ భావాలు కలవు

"శివనన్నె వ్రాసియిచ్చిన వక్షముననను ..." 307 లోనూ, "పోవునొకో సరోజ ముఖి పొంతకు. . .." 308 లోనూ 'వితర్కం' "తరుణి కెంగే లంచు దమిబట్టి.. "309 లో 'ఆవేగం', "అకటా యిట్టిది ప్రొద్దుపుచ్చుట.. .."310 లో 'మతి', "సంతోషంబవుదాత్మ బిక్కటిలుచున్ .. ." 311 లో 'ముదం', 'త్రప', 'అవహిత్థ' అనే సంచారులు ఉన్నాయి.

"నెలత ముక్కర యందు నీలంబుగాదుసూ.. .." 312 లో 'ఆర్తి', "విను ప్రద్యుమ్నుని దక్కన్ ...." 313 లో 'అంతం', అనే సంచారులు కలవు.

"అనుచున్ తెప్పలు తేలవైచుచు ......" 314 లో 'మోహం' "అతి శీఘ్రంబున నా లతాంగియు ...." 315 లో 'బోధం', 'త్రాసం', 'త్రప', 'జాడ్యం' అనే సంచారులు కలవు.

ఈ విధంగా ఒకటి రెండు తక్క తక్కిన సంచారీ భావాలన్నీ ఈ ప్రబంధంలో నిర్వహించబడి శృంగార పోషణకు మిక్కిలిగా తోడ్పడ్డాయి.

3. దశవిధ మన్మథావస్థల దర్శనం:-

'రతి' యొక్క అంకురితాది అవస్థల్ని తెలిపే దశవిధ మన్మథావస్థల్లో చాలావరకు ఈ ప్రబంధంలో స్థానం సంపాదించుకొన్నాయి

"సంకల్ప మాత్ర తత్క్షణ సన్నిధాపితం బగు చిత్ర ఫలకంబు నందు నొక్క..." 316 దీనిలో ప్రభావతి చిత్రఫలకాన్ని దర్శించింది చిత్రఫలకాన్ని దర్శించడం వల్ల ఆమెకు 'చక్షుఃప్రీతి' కలిగింది.

"చిత్తరువన్న నిశ్చయముచే నెదురుండి. _ 317 దీనిలో ప్రభావతికి కలిగిన తత్తఱం, త్రపలు వర్ణించబడి ఉండడంచే ప్రద్యుమ్నునితో ఆమెకు 'మనస్సంగమం' కలిగిందని తెలుస్తుంది.

"ఇచ్చుకమాడు మాటలివియెల్ల . . . 318ఈ పద్యంలో ప్రభావతి ప్రద్యుమ్నునితో సంగమ చింతను వ్యక్తం చేసింది కాబట్టి ఇది 'సంకల్పం' అనే మన్మధావస్థ ఈ సంకల్పావస్థ తర్వాతి అనేక పద్యాలలో చిత్రించబడింది.

"కలలంగూడిన వేళ నెట్టి వాలయల్క . . . "319 ఈ పద్యంలో ప్రభావతి 'నిద్రనెఱయన్వర్జించె' అనడంలో 'జాగరం' అనే మన్మధావస్థ స్పష్టంగా వ్యక్తమౌతుంది

"నెలత ముక్కర యందు నీలంబు గాదు సూ . . . "320 ఈ పద్యంలోని రెండవ పాదంలో ప్రభావతి కృశించిన విషయం విశదమవుతుంది కాన ఇది 'కార్శ్యం' అనే మన్మధావస్థ.

"రోలంబ నికురంబ నీలిమ శ్రీ బోలెవేణి ముట్టుట కడు విరసమయ్యె .. " 321

ప్రభావతికి దేనిపైనా ప్రీతి లేదనే విషయం ఈ పద్యం చాటుతుంది. కాబట్టి ఇది 'అరతి' అనే అవస్థ,

"ఆరతికి గరంబు లైతిరే నవ్విభు
గౌగిలింపగ నబ్బుగరములార ...." 322 ఇత్యాది పద్యంలో

వ్రీడను ఉజ్జగించి సంగమ ఇచ్ఛను ప్రభావతి వ్యక్తపరుస్తూ ఉంది కాబట్టి ఇది 'హ్రీత్యాగం' అనే మన్మధావస్థ.

"వెదకికొనితానె . ". " 323 అనే పద్యంలో ప్రభావతి యొక్క 'ఉన్మాదం' అనే అవస్థ గమ్యమాన మౌతుంది

"ఆ వడతి యడలజేసెను. " 324 అనే పద్యంలో 'మరణం' అనే అవస్థ చిత్రించ బడింది

ఈ విధంగా దశవిధ మన్మధావస్థలు నాయికకు వర్ణించి, అంకురించిన రతిని ఫలావస్థకు తీసికొని వచ్చి శృంగారాన్ని చక్కగా పోషించి రస్యమానం గా చేసాడు కవి

## 4. వియోగ, సంయోగాల వివేచనం:-

వియోగ సంయోగాత్మకం అయిన శృంగారం దీనిలో చిత్రించబడింది. పూర్వరాగ విప్రలంభం ప్రద్యుమ్నునికీ, ప్రభావతికీ కలిగినట్లు వర్ణించాడు కవి ప్రభావతికి దైవ ప్రసాదంగా ప్రేమ లభించింది పార్వతీదేవి స్వప్నంలో కనబడి ప్రద్యుమ్నుని చిత్రఫలకాన్ని ఇచ్చి ఇతడే నీభర్త కాగలడని చెప్పింది ప్రభావతి ప్రణయ, పరిణయాలు దైవ నిర్ణయాలు ఆ చిత్రఫలకాన్ని గనినంతలోనే ప్రభావతికి ప్రద్యుమ్నునిపై ప్రేమ కలిగింది ఇలా ప్రభావతికి 'కనుకలి' వల్ల ప్రేమకలుగగా ప్రద్యుమ్నుడు తన వ్యాసంగంలో తానుండగా దేవ కార్యార్థి, ప్రభావతీ కార్య నిర్వహణార్థి అయిన శుచిముఖి వచ్చి అవకాశం తనంతట తాను కల్పించుకొని ప్రభావతి యొక్క అంగాంగాలను వర్ణించి అతని మనసు ప్రభావతిపై తగిలే విధంగా చేసింది. ప్రభావతి రూపరేఖాదులు వినడం వల్లనే అతనిలో 'రతి' ఉద్భవించింది. అంటే 'వినుకలి' చేతనే ప్రేమ కలిగింది ఇలా పరస్పర ఆస్థ కలిగిన ప్రభావతీ ప్రద్యుమ్నులు ఒకర్ని ఒకరు ప్రత్యక్షంగా చూడకుండానే హంస దౌత్యంతో చూసిన వారిలాగా విరహంలో మునిగారు

ఇక్కడ ప్రద్యుమ్నుడు విరహం పొంది ఉద్యానానికి వెళ్ళి అచటి వస్తువులన్నిట్లో ప్రభావతే దర్శనం ఇవ్వగా విరహార్తుడయ్యాడు విరహాన్ని, కాల విలంబనాన్ని సైపలేక ఒక లేఖను వ్రాసి చిలుక ద్వారా శుచిముఖికి పంపాడు. అక్కడ విరహావస్థలో ఉన్న ప్రభావతికి అది చాలా ఉపశమనాన్ని కలిగించింది. ఆ తర్వాత శుచిముఖే ఇంద్ర, ఉపేంద్రుల అనుమతి పొంది నటవేషంలో ప్రద్యుమ్నుని వజ్రపురిలో ప్రవేశ పెట్టింది. ఆ తర్వాత మాయలు చేయడంలో సమర్థుడైన ప్రద్యుమ్నుడు పూవులో తుమ్మెదైవచ్చి ప్రభావతిని కలిశాడు. అంతటితో విరహం తీరి వారు సంభోగాన్ని అనుభవించారు ఈ విరహానంతర సంభోగం మనోహరంగా ఉన్నా, సంభోగానంతరం కూడా మళ్ళీ ఒక స్వల్ప విరహాన్ని గోత్రస్ఖలనం అనే వ్యాజంతో కల్పించాడు ఇంతకు పూర్వం నాయికా నాయకులకు కలిగిన విరహం అభిలాష విప్రలంభం కాగా, ఇప్పుడు వాళ్ళకు కలిగింది మాన విప్రలంభం అందులో ఇది ఈర్ష్యామానంతో కూడింది

"ప్రద్యుమ్నుండు ప్రభావతీ రతివిహార ప్రౌఢిసారస్య సం
వద్యుక్తిన్ గదుజొక్కి దక్కి తి రతీమత్ప్రాణమానీకునం
చుద్యత్ప్రేమ సమృద్ధి బల్కె నదియాయోషా లలామన్ శ్రవ
స్సద్యః పాత నిశాత శూలసమమై చాలంగ నొంచెన్వెసన్" 325

ప్రద్యుమ్నుడు పలికిన మాటలను శ్లేషసామర్థ్యంతో 'రతీదేవి'గా భావించి మాత్సర్యాన్ని పూని ప్రభావతి శయ్యాంతరాన శయనించి ప్రద్యుమ్నునికి విరహాన్ని కలిగించింది కారణం తెలియని ప్రద్యుమ్నుడు అనేక విధాల అనునయించాడు ఆమె నిష్ఠురంగా మాట్లాడినప్పుడు

'అదికాదు' అని సముదాయింప చూసినా ఫలితం దక్కలేదు ఇంతలో ప్రద్యుమ్నుడు అక్కడ నుండి వినవచ్చే కలకలాన్ని విని వెళ్ళిపోయాడు. అతడు తనను ఉపేక్షించి పోతున్నాడని భావించిన ప్రభావతి అతని వెన్నంటింది కాని అతడు వెనుదిరిగి చూడకుండా వెళ్ళిపోయాడు ఇక్కడ "ఉపేక్ష" అనే మానోపశమన ఉపాయం ప్రయోగించబడింది ప్రభావతివెనక్కి వచ్చి విరహార్త అయింది. ఆత్మదూషణ చేసుకొంది. సఖిచే మాట్లాడి ఆమె తొడను దిండుగా చేసుకొని పడుకుంది రాగవల్లరి (చెలికత్తె) ఉపాయంతో అక్కడ ప్రద్యుమ్నుని కూర్చుండబెట్టి తాను వెళ్ళిపోయింది. మెడపై చేయి వేసి చెలికత్తె అని లాగగా ప్రద్యుమ్నుడు ప్రత్యక్షమయ్యాడు అలక దీరి సిగ్గు ముంచుకొచ్చింది నేను నీపతిని కానా అని ప్రభావతిని మళ్ళీ కౌగిట చేర్చాడు వారి మాన విప్రలంభం తొలగి సంభోగం సిద్ధించింది ఈ విధంగా విరహం, సంబోగంలను రెండుసార్లు చిత్రించడంలో సంభోగ పూర్వావర విశేషాలు తదనుభూతి పొందడానికి అవకాశం ఏర్పడింది

మొత్తంమీద అలంకార శాస్త్రాను సారంగా శృంగార రసం 'ప్రభావతీ ప్రద్యుమ్నం'లో పోషించబడింది. అభిలాష విప్రలంభంలో అవకాశం పొందని చంద్ర, మలయానిల ఉపాలంభనాలకు మాన విప్రలంభంలో అవకాశం కల్పించాడు అలా చేసి పరిపూర్ణ మయిన శాస్త్రీయ శృంగారాన్ని సూరన మన కందించాడు

9. వసు చరిత్ర:-

సంగీత సాహిత్యాలను మేళవించి సంపూర్ణ సరస్వతిని ఆంధ్రులకు అందించిన పుంభావ సరస్వతి శ్రీ రామరాజ భూషణుడు రాయల కాలంలో ఉన్న ప్రబంధ కవులలో భట్టు మూర్తి మేటి. ఆంధ్ర పంచ కావ్యాలలో ప్రౌఢ ప్రబంధాలైన ఆముక్త మాల్యద ఒక వైపు, వసు చరిత్రం ఒక వైపు నిలువ దగ్గవి. శ్లేషలో భట్టుమూర్తి దిట్ట. ఈ కవి హరిశ్చంద్ర నలోపాఖ్యానం అనే ద్వ్యర్ధి కావ్యాన్ని, నరసభూపాలీయం అనే అలంకార శాస్త్రాన్ని కూడా వ్రాసాడు. ఈయన అసాధారణ ప్రజ్ఞకలవాడు. ఈ విషయాన్ని నరసభూపాలీయం లోని ప్రధమాశ్వాసంలో గల 13,25 సంఖ్య గల పద్యాలు బలపరుస్తున్నాయి. ద్వ్యర్ధి కావ్యాలలో హరిశ్చంద్ర నలోపాఖ్యానం అగ్రగణ్యమైంది ఇవి కవి యొక్క పాండిత్య ప్రకర్షను పట్టి ఇస్తాయి ద్వ్యర్ధి కావ్యాలను పరిశోధనకు పరిగ్రహించడంలేదు. కావ్యాలంకార సంగ్రహం అలంకార శాస్త్రం ఇక మిగిలింది వసుచరిత్ర. భట్టుమూర్తి గ్రంధాలలో అది శిఖరాయ మానమైంది

వసు చరిత్ర మిశ్రమకథ కలది ఇలాంటివి సానలు దీరిన జాతి రత్నాలని భట్టుమూర్తి అభిప్రాయం పెద్దనగారి మనుచరిత్రకు పోటీగా దాన్ని మించే విధంగా వసుచరిత్రను భట్టుమూర్తి వ్రాసాడని పండితాభిప్రాయం అయినా పెద్దన కవిత్వం పెద్దన కవిత్వమే.

భట్టుమూర్తి కవిత్వం భట్టుమూర్తి కవిత్వమే ఇద్దరూ రెండు దిగ్గజాలే ప్రబంధయుగంలో ఏకనాయికా నాయకాశ్రయం అయి శృంగారాన్ని ఆది మధ్య అంతాలలో ఆలంకారిక శాస్త్రోక్తంగా పోషించి విప్రతిపత్తి లేని శృంగార రస ప్రధాన ప్రబంధం అని పండిత విమర్శకులచే కీర్తింపబడ్డ ఏకైక ప్రబంధరాజం వసుచరిత్ర

**1.అంగిరస నిర్ణయం:-**ఇందలి కథాంశాన్ని అనుసరించి నాయికా నాయకుల ప్రణయం, విరహం, సంయోగం అనే విషయాలతో ఒప్పి ఇది శృంగారరస ప్రాధాన్యతను చాటుతూ ఉంది.

"వసుచరిత్రము నూటికి నూఱుపాళ్ళు శృంగార ప్రబంధము ప్రధానమగు రసము శృంగారమే " 326 అని ఏ. వి ఎల్ నరసింహారావుగారు,

"వసుచరిత్ర మందలి ప్రధానరసము శృంగారమే. ఇందు శుక్తిమతీ కోలాహలుల వృత్తాంతమున శృంగార రసాభాసమును, తృతీయ, చతుర్థాశ్వాసములందు వియోగ శృంగారము, షష్ఠాశ్వాసమున సంభోగ శృంగారమును గోచరించుచున్నవి. " 327 అని కిళాంబిజ్యోతిర్మయి గారు,

"వసుచరిత్ర లో అంగిరసము శృంగారము" 328 అని ఎం సుజాతారెడ్డి గారు,

"కథయందు శృంగారము ప్రధానరసము . వసు చరిత్రమంతయు శృంగార రసమునకు ద్రాక్ష పందిరి వంటి కావ్యము శృంగారమెంత మధురమైన రసమో యంత క్లిష్టమైన రసము. సర్వమానవ హృదయాకర్షక మైనట్టి నించుక దారి తప్పినచో ననౌచిత్య దోష మాపాదించును. ఇది కత్తిమీది నడక వంటిది. భట్టుమూర్తి దీనిని మిక్కిలి సమర్థతతో నిర్వహించినాడు." 329 అని కోవెల సుప్రసన్నా చార్యులు గారు చెప్పారు.

ఈ విధంగా అనేక మంది విమర్శకులు, పరిశోధకులు ముక్త కంఠంతో వసుచరిత్ర లోని ప్రధానరసం శృంగారమే అని ఘోషిస్తూ ఉండగా మళ్ళీ వసుచరిత్రలో అంగిరసం ఏది? అని చర్చించ బూనడం వృథాప్రయాసే అవుతుంది

**2.శృంగార రస పోషణ:-** ఈ ప్రబంధంలోని కథనుబట్టి ఇందు పోషింపబడ్డ రసం శృంగారమే అని చెప్పకుండానే తెలుస్తుంది. ఒకే కథాంశంతో ఏకబిగిన వస్తువు నిర్వహింపబడడంతో ఇందలి శృంగార రసం విభావాది సామగ్రితో చక్కగా పోషింపబడింది ఆ పోషణ విధానాన్ని పరికిస్తే ఇది విశదమౌతుంది

ఇ). విభావానుశీలనం:-

1) ఆలంబన విభావాలు:- వసుచరిత్రలో అంగిరసం శృంగారం కాబట్టి ఆలంబన విభావాలు నాయికా నాయకులు. ఈ ప్రబంధంలోని నాయిక గిరిక నాయకుడు వసురాజు గిరిక ముగ్ధా నాయిక. ఈమెరూపవతి యౌవనవతి సర్వకళాప్రవీణ అయిన శృంగార నాయిక. వసురాజు కూడా రూపవంతుడు, యువకుడు పరాక్రమశాలి. గంభీర స్వభావం గలవాడు కీర్తి ప్రతాపాది ఉత్తమ నాయక లక్షణాలు కలిగిన వసురాజు ఉత్తమ శృంగార నాయకుడు. నాయకుడు రాజు నాయిక నదీ పర్వతుల పుత్రిక. ఆమె ప్రకృతి స్వరూపిణి. ఇంద్రసఖుడైన వసురాజు పురుషుడు ప్రకృతి పురుషుల ప్రణయాన్ని చిత్రించి, వారికి వియోగం తర్వాత సంయోగాన్ని కలిగించి భట్టుమూర్తి ప్రణయ తత్త్వంలో అద్వైత తత్త్వాన్ని ధ్వనింప జేసాడు ఇదే వసుచరిత్ర ప్రబంధ తత్త్వం ఈ తత్త్వాన్ని ఆలంబన విభావాలైన నాయికానాయకుల్ని ఎన్నుకొనడంలోనే కవీశ్వరుడు ప్రతిధ్వనింపజేసాడు. ప్రకృతి వైపు పురుషుడు పురుషుని వైపు ప్రకృతి ఆకర్షింపబడడం సృష్టి రహస్యం ఈ రెండింటి ఐక్యమే సృష్టితత్త్వ పరమావధి. ప్రతిపాదించే తత్త్వానికి ఆధారమైన ఆలంబనం సరిగా లేకుంటే ఆ తత్త్వం శిథిల స్వరూపాన్ని పొందుతుంది కాబట్టి ఆలంబనాల ఎన్నికలోనే కవి నైపుణ్యం కనిపించి తీరుతుంది.

2. ఉద్దీపన విభావాలు:- నాయికా నాయకులు ఇద్దరూ యౌవనంలో ఉన్నవారే వారిప్రాయం పరస్పర ఉద్దీపకంగా ఉంది.

"తన యశో విశద ముక్తాసౌధ పాళికి నంబుదాయనము వాతాయనముగ... .. వరలు భవ్య విభావిభావసుడు వసుడు" 330 అనే పద్యంలో వసురాజు యశం, శౌర్యం, దానగుణం, మున్నగు లక్షణాలన్నీ గిరికకు ఉద్దీపనాలౌతాయి.

"తరువుల పొంత బొంచి వసుధావర మిత్రుడు గాంచె నచ్చటం
దరుణి తమోవినీల కచ దామరసోదర సోదర ప్రభం
దరళ విలోచనం దతనితంబ దటిన్నిభగాత్ర వల్లరిం
దరుణ శశాంకఫాల నొకతన్వి దరంగ వళిందలోదరిన్" 331

దీనిలో గిరిక సౌందర్యం వర్ణించబడింది. ఆ సౌందర్యానికి వసురాజు ఆకర్షితుడయ్యాడు ఇది ఆయనకు ఉద్దీపన కలిగించింది 2వ ఆశ్వాసంలో 31వ పద్యం నుండి 52వ పద్యం వరకు వర్ణించబడ్డ గిరికా సౌందర్యం అంతా వసురాజుకు ఉద్దీపనం కలిగించేదే.

"కలికి ముఖేందు కాంతికర కాంత వయోజలదాంత మేళవ
ర్తుల కుచగండశైలములుదోవ . . . బనన్" 332లో గిరిక యౌవనం చిత్రించబడింది. ఇదికూడా వసురాజుకు ఉద్దీపన విభావమే.

"అలికులవేణి యారు నవ యౌవనమన్ వలరాచ తోటలో
బొలుచునితంబవేదికడ బొక్కిలిడిగ్గియ చెంతనుండి సం
కలిత నవాంబు యంత్ర మగుగానియెడన్ రసగుంభనంబునం
దిలబుటముబ్బునే నడుమ నిల్చి ఘనస్తన సూనగుచ్ఛములో" 333

గిరిక యౌవనం మన్మథ ఉద్యానంలాగా సర్వజన మనోరంజకమై ఉంది. స్తనాలు ఘన గుచ్ఛాలుగా చెప్పబడటం వల్ల ఉబ్బునిబ్బరం సూచింప బడింది యౌవనం మన్మథ ఉద్యానం అనడం ఉపభోగార్హమైందీ, నితంబవేది అనడం వల్ల విరివీ ఉన్నతి గొని ఉండెననీ, బొక్కిలిడిగ్గి అనడం లోతుగా ఉండెననీ, నూగారు నీలాలు తాపిన జలయంత్రం అనడం వల్ల నలుపుచే బొలుపారి ఉన్నదనీ తెలుస్తుంది మన్మధుని ఉద్యానంలో గల ప్రసూన గుచ్ఛాలు రస గుంభనంగా ఉండెననడం వల్ల నెలత చన్నుగవ శృంగార భావాల్ని అభివృద్ధి చేస్తూ ద్రష్టవ్యాలుగా ఉండడంచేత ఇందలి వర్ణన వసురాజుకు మన్మధ ఉద్దీపకం అనడంలో ఎట్టి సంశయమూలేదు

నాయికా నాయకుల పరస్పర వీక్షణాలు. గిరికాదేవి లజ్జ, మొదలగు చేష్టలు ఉద్దీపన విభావాలు ఎదుటి వారికి ఉద్దీపనాలైన చేష్టలు వారికి అనుభావాలే అవుతాయి 3వ ఆశ్వాసం 48వ పద్యంలో సంపూర్ణ శృంగార రసం చిత్రించబడింది చూడండి

"అనుపమ కాంతి వైభవ సమన్వితునా వసురాజు గాంచు వ
ద్మిని సరసాంత రంగమున మించె వినూతన రాగకందళం
బొనరె నఖండ వాసనలు నుత్కలిక ల్విలసిల్లెనల్లన
ల్లన నిగిడెంబ్రమోద తరళస్థితులై తమి జూపు తుమ్మెదలో" 334

దీనిలో గిరికా పరమైన అర్థంలో సంపూర్ణ శృంగార రసం చెప్పాడు వసురాజు ఆలంబన విభావం. కాంతి ఉద్దీపన విభావం 'సరసాంత రంగమున మించె వినూతన రాగ కందళం' అంటే అనురాగంతో కూడిన అంతరంగంలో ఆ అనురాగం పూర్ణమైందనడం అనురాగం అంటే 'రతి' అనే స్థాయిభావం. కందళం అనే పదం పరిపూర్ణత్వాన్ని తెలుపుతుంది. మించెననడం వల్ల పూర్ణత్వం తెలుస్తుంది. అపరి పూర్ణమైతే భావం అనీ, పరిపూర్ణమైతే రసం అనీ గ్రహించాలి అఖండ వాసనలు అంటే సాత్త్విక భావాలు ఉత్కళికలు అంటే సంచారి భావాలు చూపులు అంటే అనుభావాలు ఇందు రసోత్పత్తికి కావలసిన భావాలన్నీ ఉన్నాయి. విభావ అనుభావ సాత్త్విక సంచారి సముల్లసితం అయి స్థాయిభావమైన అనురాగ కందళం సంపూర్ణమైన శృంగార రసమౌతుంది.

"అనయము నీ మహావనము - చిన్నట నాట నుండియున్"335 ఇందలి గానం, కధాకధనం, రెండూ తటస్థ ఉద్దీపన విభావాలు. వసంత ఋతువు, అచటి గిరికాననాలు కూడా తటస్థ ఉద్దీపనాలే.

"అలికులవేణి యిట్లువలయాంకబిసాంకుర వన్న గాళికిం
జలమరి చల్లగాలికిని జక్కొర ఖాణవు తేజిదోలుపూ
విలుతువయాళికింజిగురు విందులనీలిగయాళికిన్
వలా వలగుళి కాభ దుర్మద ఘనాళికిలోగియాత్మలోన్" 336

తమ్మితూళ్ళు, చల్లగాలి, పూవిలుతుడు, చిలుక, కోయిల, తుమ్మెద మొదలగునవన్నీ గిరిక విరహాన్ని అధికం చేసే తటస్థ ఉద్దీపన విభావాలు.

"సకియ గనుమొఱగి. _ _ _ _ నివ్వెఱపఱుపన్" 337 దీనిలో ఉపవనం గిరికా దేవికి ఉద్దీపనంగా ఉంది ఈ విధంగా ఉద్దీపన విభావాలను యథోచితంగా చిత్రించి నాయికా నాయకులకు మన్మథోద్బేదనం కలిగించాడు కవి.

b) అనుభావాలోకనం:-

"అనుపమ కాంతి వైభవ _ _ "338 "తొలు దొలుతన్ విలోలగతి _ _ "339 " వసుధా సుధాంశు బొదవుచు _ _ "340 " వనజ దళాయతాక్షి నిడువాలిక. _ _ "341 " కౌతుకము పూని యొండొరు. _ _ "342 మున్నగు అనేక పద్యాలలో కటాక్షాదికాలైన అనేక అనుభావాలు చిత్రించ బడ్డాయి "అళి హస్తావలంబనంబదర _ _ గన్నీట బడి గడంగి" 343 దీనిలో 'అశ్రువు' అనే సాత్త్విక భావం వర్ణించబడింది "అగకూటాగ్రముడిగ్గి _ _ "344 అనేపద్యంలో 'స్వేదం' "సుమనో మార్గణవశుడై _ _ బాండిమంబలరెనెమ్మేనన్" 345 " అనే పద్యంలో 'వైవర్ణ్యం' అనే సాత్త్వికభావం చిత్రించ బడింది

"లలనారత్నము నొయ్యనొయ్య మొన వ్రేలన్నేల వ్రాయించిని

శ్చలవృత్తిన్ వరవర్ణ పూర్ణ ఫలకాసంగంబు నొందించి. 346 ఈపద్యంలో నిశ్చల వృత్తి అంటే 'స్తంభం' అనే సాత్త్వికభావం కలదు "ప్రసవశరాఖ్యయోగి బహుభంగుల భావనలిచ్చు మర్దనం బెసగగ ధాతువేర్చి బలియించి _ _ 347

ఈపద్యంలో ధాతువేర్పడం అంటే ఇంద్రియ మూర్ఛనాన్ని బుట్టించడం అని అర్థం ఇది 'ప్రళయం' అనే సాత్త్విక భావం

" అఱమి రమాకుమారుడవు డగ్రతలంబున వచ్చి నిల్చిన
ట్లఱిముఱి దోచినం గువలయాక్షి వడంకి కడంకదూలి _ 348

ఈ పద్యంలో వడంకి అనేది 'వేపథువు' అనే సాత్త్వికభావం. ఈ విధంగా ఆలంకారిక మతానుసరణంగా సాత్త్విక భావాల్ని చిత్రించి శృంగార రసాన్ని చక్కగా పోషించాడు

C. సంచారీ సమాలోచనం:-

గిరికా వసురాజుల ప్రణయ ఘట్టంలో వారి విరహంలో, తర్వాత వారి సంయోగం వరకు అనేక సంచారి భావాలు వర్ణించబడి రసానికి పుష్టిని చేకూర్చాయి.

"తొలు దొలుతన్ విలోలగతి"349లో 'వ్రీడ',

"కనుగల వింటజొక్కపు చవుల్పుట్టించి " 350 లో మోహం, చింత, ఔత్సుక్యం, చాపల్యం మున్నగు సంచారి భావాలు కలవు

"అలికుల వేణి కీలెఱిగి" 351 లో అమర్షం, వ్రీడ

"కనుగొంటి లతకూన నని డాయుగాకున్న" 352 లో గిరికా దేవిని చూసానని సమీపించ బోవడం ఉన్మాదం, భ్రాంతి గోపనం సేయడం అవహిత్థ, తరళత్వాదులు చాపల్యం అనే సంచారులు కలవు.

"ఆ రామామణి మీది ప్రేమమున" 353 అనే పద్యంలో 'అనంగరుజ' అంటే 'వ్యాధి' అనే సంచారిభావం కలదు

"అవనీ నాథుడు వల్కు జూచితె వయస్యా " 354 లో గిరికాస్వరూపం నిశ్చలంగా నిలిపి ఉండడంలో 'చింత' అనే సంచారి, "మించిన వేడ్కతో నచట మీన విలోచన" 355 లో వీణావాదనాదిస్మృతిని జెప్పుడంలో స్మృతి, చలాచలత్వం అనడంలో చాపల్యం, "అగకూటాగ్రముడిగ్గి" 356 లో ఘర్మాకారగోపన రూపమైన'అవహిత్థ' అనే సంచారి భావం చెప్పబడింది

"అతివలు ద్రిప్పునారతులయట్ల" 357 లో అనాస్థతో ఉన్న చోట'ఆలస్యం' అనే సంచారీ భావం ఉంది.

"అనిశధ్యాత నదీసుతావయవుడై" 358 లో 'చింత' అనే సంచారి, "లలనారత్నము నొయ్యనొయ్యమెున వ్రేలన్నేల వ్రాయించి" 359 అనే పద్యంలో చింత, ఆవేగం మున్నగు భావాలు కలవు

"ప్రసవశరాఖ్య యోగి బహుభంగుల భావనలిచ్చి" 360 లోవసురాజును సర్వత్రాచూడడం ఉన్మాదం, మైమరవడం, గళత్ భూషణం సవరింపక పోవడం, సఖులకు మారుత్తరం ఇవ్వక పోవడం అనేవి'మోహం' అనే సంచారిభావాన్ని తెలుపుతున్నాయి

"పవమాన మానవ ప్లవమాన కైరవచ్యవ

మాన రజము మైనంటదివురు" 361 లో పుష్పపరాగం పృథివీతత్త్వం, మకరందరసం జలతత్త్వం, 'మదనానల ప్రభా సదనాగ్రమకోమలచ్ఛదానార్చి' తేజస్తత్త్వం, మలయానిలం

వాయుతత్త్వం, శబ్దగుణం ఆకాశం కాబట్టి మధుకర ఝంకార ధ్వనులు ఆకాశ తత్త్వం. వీనిలో 'తనలో ఉన్న పంచ మహా భూతాంశాలను కలుపుకరణి' అనడం వల్ల 'మరణం' అనే సంచారి భావం ఇందుకలదు.

"సోలుచు జెలికెదురాడకొ" 362లో సోలడం, తొయ్యలిమేన వ్రాలడంలో 'గ్లాని', తూలడంలో 'ఉన్మాదం', కంటదెగడటంలో 'అమర్షం' అనే సంచారులు గమ్యమానమౌతున్నాయి.

"కుసుమ వాసన లెల్ల గొల్ల లాడితి మింక బఱచుటామని యెంత పర్వులిడునో...
" 363 లో 'శంక' అనే సంచారి కలదు
"అఱమి రమా కుమారుడపుడగ్రతలంబున వచ్చి .. 364లో 'మోహం',
"ఏమంద మేమిసేయుద" 365 లో 'విషాదం', "ఆవాక్యంబులతో . . ."366 లో 'బోధం'

"ఉసురను గన్ను మోడ్చు దలయూచుదలంచు ."367 ఈ పద్యంలో చింత, స్మృతి, ఉన్మాదం అనే సంచారి భావాలు కలవు

ఈ విధంగా సంచారి భావాలనేకం యథోచితంగా గిరికా వసురాజాల ప్రణయంలో చోటు చేసుకొని సముద్రంలోని తరగల లాగా పుడుతూ, గిడుతూ స్థాయి అయిన 'రతి'ని పరిపుష్టం చేస్తూ శృంగార పోషణలో అత్యంత సహకారులై నిలిచాయి.

వసు చరిత్ర ప్రబంధంలో వసురాజా కథే ప్రధానమైంది శుక్తిమతి కోలాహలుల ఘట్టంలోను శృంగారం రసాభాస రూపంలో చిత్రించ బడ్డా దానిలో కూడా వసురాజా వీరత్వాన్ని వ్యంజింప జేయడమే ప్రధానోద్దేశం, అలాంటి వీరుడు కాబట్టే తర్వాత గిరికకు తగిన వరుడయ్యాడు శృంగార నాయకునిగా ప్రధాన చరిత్రంలో అతడు ప్రత్యక్షమౌతాడు ఈ ప్రధాన ఘట్టానికి ఆనుషంగిక ఘట్టమైన శుక్తిమతి కోలాహలుల చరిత్ర పరిపోషకంగా ఉంది పరిపూర్ణమైన గిరికా వసురాజాల శృంగారాన్ని చిత్రించి, ఆభాస రూపమైన శృంగారానికి కూడా ఆలంకారికులు ఉచిత గౌరవాన్నిచ్చి ఉండడంచే ప్రయోగ రూపంలో దాన్ని కూడా చూపి ఉన్నాడు

### 3. విప్రలంభవివేచన:-

గిరికా వసురాజాల శృంగారం విప్రలంభ సంభోగాత్మకమైనటు వంటిది. దీనిలో చిత్రించబడ్డ విప్రలంభం అభిలాష విప్రలంభం సంయోగం కంటె ముందే గిరికా వసురాజాలకు విప్రలంభం కలిగింది కాబట్టి ఇది అభిలాష విప్రలంభం దీని పుష్టికి దశవిధ మన్మథావ స్థల చిత్రణ మిక్కిలి సహాయకారిగా ఉంటుంది.

వసుచరిత్ర లో ఇవి ఎలా చిత్రించ బడ్డాయో చూద్దాం
"అనుపమ కాంతి వైభవ సమన్వితు...... .."368
"తొలుదొలుతన్ విలోల గతి .. . ..." 369
"వసుధాసుధాంశు బొదవుచు ......" 370
"వనజదళాయతాక్షి నిడువాలిక...... " 371
"కౌతుకము పూని యొండొరు గాంచదివురు... ." 372

ఈ పై పద్యాలలో గిరికా దేవికి ప్రధమావస్థ అయిన నయనోత్సవం చెప్పబడింది. అంటే 'చక్షుఃప్రీతి' అనే అవస్థ, దీంట్లో కలదు.

"కలికియు నాన్నృపాలకుని గ్రమ్మఱ జూచుచు నేగె" 373

ఇందు గిరిక ఊరక వెళ్ళిపోక చూస్తూ పోయింది కాబట్టి ఆమెకు మనస్సంగమమైందని గ్రహించాలి. ఇదే 'మనస్సంగమం' అనే రెండవ మన్మధావస్థ.

"ఆ నగరాజ భేదియును నానగరాని మనోరథంబుతో

మానిని నాత్మనిల్పి ధృతిమాని ......" 374 లో 'మానిని నాత్మనిల్పి' అని చెప్పడం వల్ల వసురాజు కు కూడా 'మనస్సంగమం' ఆరంభమైందని తెలుస్తుంది.

"గిరికన్యమేన నేకీభవించిన గాని తియ్యవిల్తుని నిరోధింపరాదు . నేర్పున నటంచు నృపతి యానెలత దలచి" 375

ఈ పద్యం మొదటి నాలుగు చరణాల్లో వసురాజు కు 'సంకల్పం' అనే అవస్థా, గీతి మొదటి చరణంలో 'కృశత' అనే అవస్థా చెప్పబడింది.

"అనిశధ్యాత నదీసుతావయవుడై .... " 376

దీనిలోని 'ఏనామ్ముగైకొనకపోవుట' అనేది 'అరతి' అనే అవస్థను తెలుపుతుంది

"కన్య లావణ్య రస సుధా గానమున .... . " 377 దీనిలో వసురాజు కు చతుర్ధ అవస్థ అయిన 'జాగరం' చెప్పబడింది.

"శ్రమము నొందింపదో జగదద్భుతాఖండ"378లో 'సంకల్పం' కలదు
"పెనుగట్టుగోట మీాటిన మేటికి ఇపుడెంత యరుదయ్యె"379 దీనిలో గిరికా దేవికి 'మనస్సంగమం' కలిగిందని తెలుపబడింది

"ప్రసవశరాఖ్య యోగి బహు భంగుల భావనలిచ్చు . "380లో 'బహుభంగుల భావనలు' అంటే 'సంకల్పం' అనే అవస్థా విశేషం. ఇది గిరికకు కలిగింది

"పూట పూట శరత్కోటి పొడముకతన . . .   ." 381 లో గిరికకు 'కార్శ్యం' అనే అవస్థ చెప్పబడింది

"పవమాన మానవ ప్లవమానకైరవచ్యవమానః. ....."382 లో గిరికకు 'మరణం' అనే అవస్థ చిత్రించబడింది

"శ్రీవాణీ ధరణీ ముఖాంగనలపై జిత్తంబు లేకున్కి  .. ." 383 దీనిలో 'అరతి' అనే అవస్థ చిత్రించబడింది.

ఈ విధంగా దశవిధ మన్మథావస్థల్ని చిత్రించి గిరికా వసురాజుల అభిలాష విప్రలంభంలో అంకురితాది అవస్థల్ని సూచించి పరిపూర్ణ విప్రలంభ శృంగారాన్ని చిత్రించాడు కవి. దీనిలో నాయికా విరహంలోనేగాక నాయక విరహంలో కూడా 'చక్షుఃప్రీతి' మొదలు కృశత్వాది అవస్థలన్నిటినీ వర్ణించడం వల్ల నాయికా నాయకుల విరహం సమాన స్థాయిలో ఉన్నట్లు మనం గ్రహించవచ్చు. విప్రలంభ శృంగారం తర్వాత పోషించబడే సంభోగ శృంగారం మిక్కిలి ఆస్వాదయోగ్యంగా ఉంటుంది. షష్ఠాశ్వాసంలో సంబోగ శృంగారం పుష్టి, పూర్ణత్వాలు కలిగి ఉండేట్లు చేయడానికే గిరికా వసురాజుల విరహం మూడు, నాలుగు ఆశ్వాసాలలో తీవ్రంగా చిత్రించబడింది నాయికా నాయకులలో 'రతి' ఉద్భవించగానే సంయోగం కలిగితే వారి వలపు ఘాటుగా ఉండి దీర్ఘకాలం నిలవడానికి అవకాశం లేక పోతుంది విరహంచే 'రతి' లోని మాలిన్యం ప్రక్షాళనం చేయబడి కరగబెట్టిన చొక్కపు బంగారం లాగా దేదీప్యమానంగా వెలుగొందుతూ ఆ వలపు జీవితాంతం వరకు నిలచి ఉంటుంది అందువల్లనే విరహం వల్ల సంభోగానికి పుష్టి కలుగుతుందని ఆలంకారికులు చెప్పడం

"రామరాజ భూషణుడు పరస్పరానుయుక్తమైన అయోగ, వియోగ, సంయోగములు అను త్రివిధ భేదములతో కూడిన సంపూర్ణ శృంగార రసపోషణమును కావించినాడు" 384 అని సుజాతారెడ్డి గారు చెప్పారు అయోగ వియోగాలనడం కంటే అభిలాష విప్రలంభం పోషింప బడిందని చెప్పడం యుక్తంగా ఉంటుంది ఈ వియోగంలో చంద్ర, మన్మథ దూషణలు కూడా వారి వియోగ తీవ్రతకు వన్నెపెట్టాయి

### 4. సంభోగ సమ్యక్పోషణం:-

గిరికా వసురాజుల సంబోగ శృంగారం ఇందు చక్కగా పోషింప బడింది "వాసనా విశిష్టమయిన సాత్త్విక భావోదయము నాయికా నాయకులకు అభ్యుదయ రాగహేతువు. గిరికారూప బ్రహ్మము వసురాజు నాత్మకు ఆనంద సంధాయకము ఆమెకు కాంతి వైభవ సమన్వితుడగు నావసురాజు సూర్యుడై గోచరించెను ఆ సూర్యునిముందామె పద్మిని" 385

"కావ్యాంతమున నాయికా నాయకుల సంభోగాంత సుఖస్వరూపము నిరూపించుచు బ్రహ్మానందానుభవమును దెలిపెనని కవి వర్ణించెను. కావ్యమందలి శృంగారమునకీ సందర్భము పరాకాష్ఠ రసమును నిర్వచింప బూనిన యాలంకారికులెల్లరును దానిని బ్రహ్మానంద సహోదరమన్నారుగాని కేవల బ్రహ్మానందమని యనలేదు కాని భూషణ కవినాయికానాయకుల సుఖమును పునర్జన్మ ఖేదము లేని బ్రహ్మానందానుభూతిగనే చెప్పెను ఈ వైరుధ్యమేమని ప్రశ్నింపవచ్చును భూషణ కవి చెప్పినది ఆలంబన విభావమయిన నాయికా నాయకులకు బ్రహ్మానందానుభూతి యని మాత్రమే సామాజికునకైనచో ఆయను భూతి బ్రహ్మానంద సహోదరమే" 386 అనే ఏ ఏ ఎల్ నరసింహారావు గారి సిద్ధాంతానికి విప్రతిపత్తి లేదు

ఏ నాయికా నాయకుల సంభోగాన్నైనా అద్వైతపరంగా అన్వయింప వచ్చును కాని గిరిగా వసురాజుల సంభోగాన్ని వర్ణించిన పద్యాలలో అద్వైత సిద్ధాంతాన్ని తెలిపే పదాలనేకం వాడబడ్డాయి (పూర్తి వివరణకు 'భూషణ కిరణావళి' అనే గ్రంథం చదువాలి)

"అనుచు నరపతి కెంగేల నచలకన్య
కాత్రపార్శుర గూఢాంగములు దడవె
నొయ్య నాభీ కుచాదిని మ్నొన్నతప్ర
దేశములు దద్వగా హెచ్చు దెలియుకరణి" 387

ఈ పద్యం మొదలు కొని సంబోగ శృంగారం అతిరమ్యంగా చిత్రించ బడింది

"భూనుత కీర్తి వేద నుడి వోవని తావులగుబ్బ గుత్తులన్
దేనియలాననానగడ తేరని వాచవి పండు నిచ్చెభూ
షాని వహంబు రాల్చె మృదుశాటిక మున్న యొసంగు సింధుసం
తానము గావునంగడునుదారత నాలతకూన యొప్పుచున్ " 388

ఈ పద్యంలో దీని తర్వాతి నాలుగు పద్యాలలో సంబోగం మనోహరంగా వర్ణించ బడింది దర్శన, స్పర్శన, చుంబనాది సంబోగ శృంగార చేష్టలన్నీ దీనిలో కలవు "ముప్పిరిగొన్న వాచవుల మోహమొకింతయుదప్పనీదు . " 389 "సతిసాహిత్య రహస్య మొకు వలనన్ సాధించి . " 390 ఈ పద్యాల్లోనూ సంభోగం చక్కగా చిత్రించ బడింది

"భూనాధా గ్రణికిన్వ ధూమణికి సంభోగాంత సౌఖ్యంబు బ్ర
హ్మానందాను భవంబుదెల్పెనన పద్యం బైయ వేద్యాంతరం
బై నిర్దేవకలాపమై, క్రమ విముక్తానేక బంధానుసం
ధానంబై, యపునర్భవ ప్రభవ ఖేదం బై విజృంభించుచున్ "391

దీనిలోని బ్రహ్మానందానుభవం, అవేద్యాంతరం, అపునర్భవ ప్రభవ ఖేదం మున్నగునవి అద్వైత తత్త్వాన్ని స్పష్టంగా వ్యంజింపజేస్తూ కావ్య ప్రయోజనాన్ని విశద పరుస్తున్నాయి. అద్వైత సిద్ధాంత తత్త్వ ప్రతి పాదనకు ఈ పద్యం మూలకందం.

"సుమనో నాళీకార్చిత
సుమనో నాళీక కలన జొక్కు చు వసుధీ
రమణియు రమణియు నీక్రియ
రమణీయత గాంచి రనవరత నవరతులన్" 392

వారి నిరంతర సంభోగాన్ని ఈ పద్యం విశదపరుస్తుంది

"అభిరామ నవ పల్లవారామ కుంజ వాటిక..... ." 393

ఈ పద్యం పై తత్త్వ ప్రతిపాదనకు ఉపబలకంగా ఉంది. ఈ విధంగా సంభోగ శృంగారాన్ని వాచ్యంగానూ, వ్యంగ్యంగానూ చిత్రించి రసపోషణలో మేటి అయ్యాడు కవి వియోగ సంయోగాత్మక మైన శృంగార ప్రపంచంలో భట్టుమూర్తి అర్ధనారీశ్వర తత్త్వాన్ని కూడా ధ్వనింప జేసాడు నాయికా నాయకులకు వియోగం కలిగింది. దాని తర్వాత సంయోగం కలిగింది తర్వాత వారికి ఎప్పుడూ వియోగం లేదు. మొదట వర్ణించిన వియోగం కూడా అయోగ, వియోగం కాని సంయోగానంతర వియోగం వారికి లేదు వారికి వియోగం ఉన్నట్లు చిత్రింపబడినా అది ఒక 'యోగం' గా చిత్రించబడిందని విమర్శకులు పేర్కొన్నారు. అయోగం ద్వారా వారు సంయోగాన్ని సాధించారు. ఆ సంయోగం అంతం లేనిది అర్ధనారీశ్వరులకు వియోగం ఎక్కడిది? అది ఉన్నట్లు కనిపించినా సంయోగ గతమైనట్టిదే గిరికావసురాజుల శృంగార తత్త్వం గూడా ఇలాంటిదే. తాత్త్విక మూలకం అయిన ఈ శృంగార పోషణ ప్రబంధ సాహిత్యం లో కలికితురాయి లాంటిది

5. రసాభాసం - రమ్యత:-

ఆలంకారికులు రసానికి లాగా రసాభాసానికి కూడా సముచిత స్థానం ఇచ్చి ఉండడం వల్ల 'రసాభాస' చిత్రణం కూడా రసపోషణం లోని ఒక అంశం గానూ, శృంగార రసాంగంగానూ భావించి భట్టుమూర్తి గూడా శృంగార రసాభాసాన్ని చిత్రించి ఉన్నాడు శుక్తిమతీ కోలాహలుల ఘట్టంలో ఇది స్పష్టమౌతుంది. కోలాహలుడు బ్రహ్మకొలువుకేగి వస్తున్న శుక్తిమతిని చూసి వ్యామోహితుడై ఆమెను సమీపించాడు. ఆమె అతిధి మర్యాదల్ని చేసింది అప్పుడు కోలాహలుడు.

"చెప్పెడిదేమి నాకుగల జీవనమంతయు నీకు గూర్చియె
ల్లప్పుడు నిన్ను బాయక ప్రియాచరణం బొనరింప నేర్తు నీ

చొప్పన కీవు నియ్యకొని, చొక్కపు జక్కవ గుబ్బలాడిమేల్
దప్పక యంతరంగమున దాలిచి నన్ను నదీను జేయవే" 394

అని అతిదైన్యంతో కోరాడు శుక్తిమతి అదరిపడి అతనికి ఏవగింపు కలిగించడానికై, అన్యథా మరల్చడానికై,

"నిలువెల్లనీచాతి నీచోప సరణంబుప్రకృతి యెల్లను జాడ్యపరిణతంబు,
పెంపెల్ల నియత గాంభీర్య మానవిహీనమంతరం బెల్ల పంకావిలంబు
ననఘు గతికి, నభంగ శీలునకు నీకు" 395

"పుడమిన చలేంద్రు లెచ్చుట
జడవాహిను లెచట, నెచటి సఖ్యము వినజాల
. . .     . . . మహాత్మా" 396

అని అతన్ని వారింప యత్నించింది. శుక్తిమతి ఎన్ని విధాల జెప్పినా కోలాహలుడు వినక రాగాంధుడై,

"అతనుభూతి ఘటింపదయ్యెనే చదలేఱుసికదాల్బు
నిందాన చిత్రకునకు ..     .. ."
వారికే లాఘవము వచ్చెవనిత! యెంత
మారుపసలేదు వట్టి నేమములు చాలు
నేలునన్ని సతికమలాలివట్ల
ప్రబలతర దీర్ఘ భుజశాఖ బట్టుటయును" 397

ఈ విధంగా అననురాగిణి అయిన శుక్తి మతిని రాగాంధుడైన కోలాహలుడు బలాత్కారం చేసాడు ఆలంకారిక శాస్త్రానుసారంగా ఇది ఏకత్రానురాగం అంతేగాక పర్వతపుత్రుడు కోలాహలుడు నదికూడా పర్వతం నుండే ఉద్భవిస్తుంది కదా! కాబట్టి లౌకిక దృష్టితో చూస్తే కోలాహలుడు శుక్తిమతిని బలాత్కరించడంలో అనౌచిత్యం ప్రవర్తిల్లింది.

"అనౌచిత్యా దృతే నాన్య ద్రసభంగస్య కారణమ్" 398 అని కదా!

ఆలంకారిక వచనం. తదనుసారంగా ఇచట అనౌచిత్యం ప్రవర్తిల్లి రసభంగం కలిగింది ఇక్కడ రసం భంగమవడం వల్ల రసాభాసమే మిగిలింది

మనుచరిత్ర లోని రసాభాస చిత్రణకూ దీనికీ పోలికే లేదు అక్కడి రసాభాసం కూడా రసంగా ఉంటుంది. కాని వసుచరిత్ర కారుడు చిత్రించింది రసాభాసమే అయినా మనుచరిత్రం లో లాగా ఈ రసాభాస చిత్రణం కూడా ప్రధాన కథాగతికి మూలకందమై

నిలచింది కాబట్టి ఈ ఘట్టం ప్రయోజన శూన్యమైంది కాదు భారత కాలం నుండి (తిక్కన గారి కీచకవధ) ఈ రసాభాసాన్ని కవులు చిత్రిస్తూనే ఉన్నారు. ఈ విధంగా శృంగారాన్ని శాస్త్రానుసారంగా సమగ్రంగా చిత్రించిన ఘనత రామరాజభూషణుడు దక్కించుకొన్నాడు రసాభాస చిత్రణం, సంయోగ వియోగాత్మకమైన శృంగారాన్ని భట్టుమూర్తి చిత్రించి వసుచరిత్రను సమగ్ర శృంగార ప్రబంధాన్ని గావించాడు

'వసుచరిత్ర విమర్శనము'లో వజ్ఝల చిన సీతారామ స్వామి శాస్త్రులవారు వసుచరిత్రలో శృంగారం పోషింపబడడానికి మూలమైన భావాలు ఎక్కడెక్కడ ఉన్నాయో ఇలా వివరించారు.

"విప్రలంభ శృంగారము - 3వ ఆశ్వాసము లోని 74వ పద్యము మొదలు 4వ ఆశ్వాసము 123వ పద్యము వరకు గలదు

మన్మథ దశావస్థలు.- 3వ ఆశ్వాసము లోని 94వ పద్యము మొదలు 99వఱకు. 3వ ఆశ్వాసములో 106వ పద్యము

సంభోగ శృంగారము - 6వ ఆశ్వాసము 77వ పద్యము మొదలు 97వ పద్యము వఱకు, 3వ ఆశ్వాసము 48వ పద్యము మొదలు 70 వరకు

(ఇంకను నాయికా నాయకుల పరస్పర దర్శనాదులును సంభోగ శృంగారములోనివే గాన నిందియ్యది పెక్కుచోట్ల గలదు)

ఉద్దీపన విభావములు - 3వ ఆశ్వా 102, 111, 5వ ఆశ్వా 73, 6వ ఆశ్వా 72,73,74,106

సాత్త్విక భావములు - 3ఆశ్వా 98,100, 106,111

4 ఆశ్వా 81, 6 ఆశ్వా 79 వ పద్యము

సంచారి భావములు - 3 ఆశ్వా 82 మొ. 93 వరకు;

3 ఆశ్వా 106,111,118,119, 4 ఆశ్వా 81, 6 ఆశ్వా 11,16 పద్యములు

రసాభాసము - 2 ఆశ్వా 100 పద్యము మొదలుకొని 140 పద్యముల వరకు "399

ఈ భోగట్టాను చూస్తే వసుచరిత్రలో శృంగారరసం పోషించబడ్డ రీతి వ్యక్తమౌతుంది

## 10. తెనాలికృతులు:-

ప్రబంధ కాలంలో వెలసిన గ్రంధాలన్నీ ప్రబంధాలు కావు కాని ప్రబంధ యుగంలో రావడంవల్ల అవీ ఆ నామంతోనే వ్యవహరింపబడు తున్నాయి కాని ఇందు ప్రబంధ లక్షణాలు కానరావు తెనాలి రామకృష్ణుడు కూడా ప్రబంధ కవుల కాలం వాడే. అయినా ఆయన రస ప్రధాన దృష్టితో ప్రబంధాలు వ్రాయలేదు. వ్రాసినవాటిలో మూడు మాత్రమే మనకు ఉపలబ్ధాలు అందు ఘటికాచల మాహాత్మ్యం, పాండురంగ మాహాత్మ్యం, ఉద్భటారాధ్య చరిత్ర అనేవి. ఘటికాచల, పాండురంగ మాహాత్మ్యాలు రెండూ క్షేత్ర మాహాత్మ్యాలు ఉద్భటారాధ్య చరిత్రమూ అలాంటిదే ఇవన్నీ భగవత్తత్త్వాన్ని ప్రతిపాదించేవి వీటిలో శృంగారాన్ని అన్వేషింప బూనడం కుందేటి కొమ్ము కోసం వెదక బూనడం లాంటిదే. అయినప్పటికీ శృంగార స్ఫుర్శ గల శృంగార ఘట్టాలు ఒకటి, అర కలవు. వాటిని స్థూలంగా పరిశీలిస్తే అవీ భగవన్మాహాత్మ్యాన్ని ప్రతిపాదించడానికై కల్పింపబడ్డవే అని వ్యక్తమౌతుంది.

### a) ఘటికాచలమాహాత్మ్యం:-

ఇలాంటి శృంగార స్ఫుర్శగల ఘట్టాలు రెండు ఘటికాచల మాహాత్మ్యంలోని ద్వితీయాశ్వాసంలో కలవు. తక్కిన ఆశ్వాసాల్లో అలాంటి వాటి వాసనే లేదు. ఆరెండు ఘట్టాలు ఇవి.

హరిచక్రం అనే ఒక పట్టణం ఉంది దానిలో గోవిందశర్మ అనే విష్ణుభక్తుడు ఒకడు ఉన్నాడు ఆయన భార్యపేరు భద్రాంగి ఆ దంపతులకు నలుగురు కొడుకులు ఉన్నారు వారు నలుగురు కూడా కృతాధ్యయన సంపన్నులు పితృవాక్య పరిపాలకులు గోవిందశర్మ ప్రతిదినం భగవంతుని ఆరాధించి అతిధి సంతర్పణం చేసి, బాలరామాయణ పారాయణాన్ని ముగించి, అర్ధాంగి ఇచ్చే విడెమును సేవించి, విష్ణు కథలలో మనసు లగ్నం చేసి కాలం గడుపుతాడు. వారి ఇంట్లో తరళ అనే ఒక పని మనిషి ఉంది. ఆ ఇంటి పక్కన ఉన్న హరిశర్మ అనే బ్రాహ్మణునితో ఆ తరళకు సంబంధం ఏర్పడింది వారికి నారదుడు (అంటే నారదుని పూర్వజన్మపు వ్యక్తి) జన్మించాడు.

ఈ కథలో హరిశర్మ, తరళల శృంగారం మాత్రం వర్ణించబడింది హరిశర్మ ఔదార్య కర్ణుడు, రేఖాచేతోభవమూర్తి, కాంతిజిత రాకాకోక విద్వేషి, విద్యాచాతుర్య ఫణీశ దేశికుడు, ప్రేమాయత్తచిత్తుడు, త్రయ్యాచారాచరణ ప్రచారి ఈ విశేషణాల్లో హరిశర్మ ఉదార స్వభావం, సౌందర్యం, విద్య, ప్రేమ స్వభావం, ఆచార రీతి వ్యక్తమైంది అతడు యౌవనోదయంలో నవమన్మధునిలాగా ఉన్నాడట అలాంటి ఆ హరిశర్మ.

"ఏటి ఏటకోటి భ్రమియించు లేటి చూపు
వలపు వాడులగని తలవాంచు నతడు
దైవకృత మెట్టిదియొ కాని తరళ జూచి
తరళతర చిత్తవృత్తియై తత్తరించు "400

ఆ హరిశర్మకు తక్కిన వారిపై మోహంలేదు అతనికి కలిగింది మోహం కాదు ప్రేమ అందుకే తరళను చూడగానే మనస్సులో వికారం పొడమి 'తరళతర చిత్తవృత్తియై తత్తరించు' తున్నాడు. హరిశర్మ తరళను జూడడంలో 'చక్షుః ప్రీతి', తరళతర చిత్తవృత్తి కలిగి ఉన్నాడనడంలో 'మనస్సంగమం' అనే మన్మధావస్థలు వర్ణించబడి ఉన్నాయి

"ఏచిన మోహముచే నత
డా చెలి చెలువంబు దలచి యాచరిత త్ర
య్యాచార నిత్యకృత్యుం
డై చేతోజాత దశల నలజడి బడుచున్"401

ఈ పద్యంలో అతడు 'చేతో జాత దశల నలజడి బడుచున్నాడు' అనడంలో మన్మధావస్థలు పొందినట్లు వాచ్యంగానే చెప్పబడింది "సిగదువ్వన్ ముడివైచు .."402 అనే పద్యంలో ఉన్మాదం, స్వేదం అనే సాత్త్వికభావాలు చిత్రించబడ్డాయి.

హరిశర్మ ఇలా చేతో జాత దశలను పొందుచుండగా తరళ,

"చిత్తంబుకరగి కరుణా
యత్తమతిం జెలియ సజ్జనా చారముతో
బొత్తుడిగి మరుని చివురుం
గత్తిక లోనయ్యె నయ్యగారని ప్రేమన్"403

ఇలా వర్ణించడం విచిత్రంగా ఉంది అతని మనస్తాపాన్ని చూసి అయ్యో! పావం అయ్యగారు బాధ పడుతున్నారని ఆ పనిపిల్ల ప్రేమించిందట. జాలితోనే ప్రేమించింది కాని నిజంగా ఆమె హృదయంలో మన్మథోద్భేదం కలుగలేదా! కలిగింది కాని దానికి కారణం పరస్పర ఆస్థ కలిగి ఉండడంగాక 'జాలి'ని చెప్పడం అంత ఉచితంగా లేదు.

ఆ ప్రేమ కలిగిన నాటి నుండీ ఆమెలో శృంగార చేష్టలు చెలరేగాయి. కాబట్టి వారికి 'పరస్పరాస్థ ఉన్నట్లు మనం భావింపవచ్చు.

"నును వెండి కడియముల్ ... "404 అనే పద్యంలో ఆమె చేష్టలు వర్ణించ బడ్డాయి

"వారిరువురు నిటు వలపుల
కోరిక లీరికలు గొనగగు సుమశరకర

స్ఫార ధనుర్ముక్త శరా
సార విమూర్ఛిత మనోంబు జాతద్వయులై"405

ఈ పద్యంలో తరళ హరిశర్మలు పరస్పర ఆస్థ కలిగి ఉన్నట్లు వర్ణించడం వల్ల 'రతి' అనే స్థాయి అంకురించింది హరిశర్మ కులాచారాలను కట్టిపెట్టాడు తరళ కూడా తన పనులు మరచి, అతనితో కూడింది.

"ఇత్తెఱగున జెలిహత్తుక
చిత్తజ రణకేళి జాళిజిక్కి ధరా దే
వోత్తముడు క్రీడ సల్పగ .. "406

అనే పద్యంలో వారి సంబోగ శృంగారం చిత్రించ బడింది. ఈ కథలో ఉత్తమవంశ జాతుడు నాయకుడు అధమనాయిక తరళ వారిద్దరి ప్రేమ కేవల శరీర సౌఖ్యానికే పరిమితమైంది వారికి వ్యవస్థా బద్ధమైన ప్రేమ, వివాహాలు ఇందు చిత్రించ బడలేదు. ఇందు విప్రలంభం సూచింపబడి, సంభోగం సంక్షిప్తంగా వర్ణించ బడింది ఈ కథ కేవలం నారదుని పూర్వజన్మ వృత్తాంతం కోసం నిర్దేశింప బడ్డట్టిది కాబట్టి కవి శృంగార పోషణలో ప్రత్యేక శ్రద్ధ కనబరచలేదు

ఇక రెండవ ఘట్టంలో శతశృంగ పర్వతంపై తపస్సు చేస్తున్న సప్త ఋషుల తపస్సును భంగం చేయడానికై దేవేంద్రుడు రంభను పిలిపించి, ఆ పనికి ఆమెను పురమాయించాడు. రంభ మేనకాది అప్సరసలతో అక్కడికి చేరింది అప్పుడే వసంతం అలముకొంది. శృంగారానికి అనుకూలమైన వాతావరణం చిత్రించ బడింది వారిని సమీపింప జాలని రంభాదులు దూరం నుండే వారి విలాసాలను జూపారు. జలక్రీడలు సలిపారు. సూర్యాస్తమయమై చీకటి వ్యాపించి, చంద్రోదయం అయింది ఇదీ శృంగారోద్దీపకం అయిన వాతావరణమే కాని మహర్షులు చలించలేదు వచ్చిన అప్సరసలు వ్యర్థ ప్రయత్నులయి వచ్చిన జాడనే పోయారు

ఇక్కడ శాంతం ముందు శృంగారం వెలవెల బోయింది. అప్సరసల విలాసాలలో శృంగార స్ఫురణ ఉంది. దానికి అనుకూలమైన వసంత ఋతువర్ణన, చంద్రోదయ వర్ణనలు చేయబడ్డాయి శృంగారోద్దీపక వాతావరణం సృష్టింపబడ్డా ఆ సప్త ఋషుల దీక్షతో ఆ ఉద్దీపనం చల్లారింది. దీన్ని కేవల శృంగార సన్నివేశంగా మాత్రమే గ్రహించాలి నాయికా నాయక గతమైన శృంగారంలో లాగా ఇందు విభావాదులు పోషించ బడలేదు.

**b) పాండురంగ మాహాత్మ్యం:-**

పాండురంగ మాహాత్మ్యంలో ప్రధాన రసం శృంగారం అని చెప్పడం ఉచితం కాదు. ఇందలి తృతీయాశ్వాసంలోని నిగమశర్మ ఉపాఖ్యానంలో శృంగారం కలదు కాని అది ఉత్తమ

శృంగారం కాని, మధ్యమ శృంగారం కాని కాదు అది కేవలం 'మోహశృంగారం' అని చెప్పవచ్చు.

కళింగదేశం లోని పీఠికాపురంలో వేద వేదాంగ వేత్త, ఉత్తమ శీలుడు అయిన 'సభాపతి' అనే బ్రాహ్మణోత్తముని పుత్రుడు నిగమశర్మ. ఈ నిగమశర్మ విద్వాంసుడైనా పోకిరై తిరుగుతూ, ఇంట్లోని వస్తువులన్నిటినీ విక్రయిస్తూ, భూముల్ని కుదువ బెడుతూ సంపదను నాశనం చేసాడు. అతన్ని బాగుచేయ దలచి వచ్చిన అక్క మాటల్ని విన్నట్టే విని కొద్ది రోజుల తర్వాత ఒక నాటి రాత్రి నిదురిస్తుండగా వారి ఆభరణాలన్నిటినీ అపహరించి అడవిదారిలో పోసాగాడు. ఆ అడవిలో ఒక దొంగల గుంపు అతన్ని కొట్టి దోచుకొంది అక్కడ పడి ఉన్న నిగమశర్మను ఒక కాపు తన ఇంటికి తీసికొని పోయి తగిన చికిత్స చేయించి కాపాడి తన ఇంటనే ఉంచుకొన్నాడు ఆ కాపు కోడలు నిగమశర్మపై మరులుగొని, అతన్ని మరులు గొల్పింది కృతఘ్నుడై ధర్మం తలపక ఆతడామెతో రహస్యంగా క్రీడిస్తూ ఉండెను ఒకసారి ఆ ఊళ్ళో జరిగిన జాతరలో ఆమెను తీసికొని (నడిరాత్రి) ఇల్లు వదలి పోయాడు వారు బోయలలో కలిసారు నిగమశర్మ కిరాతుడై వేటాడి ఆహారం సంపాదిస్తూ ఉండేవాడు. కొన్నాళ్ళకు ఆ కాపు కోడలు మరణించింది తర్వాత అతడొక చండాల వనితను కూడి ఆమె వల్ల సంతానాన్ని కూడా పొందాడు అతడు వేటకు పోయిన సమయంలో గుడిసె కాలి భార్యాపిల్లలు మరణించారు అతడు మతిచెడి నిద్రాహారాలను వదలి దేశాలు తిరుగుతూ నరసింహ క్షేత్రంలో ప్రాణాలు విడిచి, పరమపదం పొందాడు

ఇలాంటి నీచునికి పరమ పదం లభించడం కేవలం క్షేత్ర మాహాత్మ్యం తప్ప అన్యం కాదు నిగమశర్మ జీవితమంతా హేయంగా కనబడుతూంది.

"అతడనూచాన సంతతి నవతరిలియు
సకల నిగమ శిఖా రహస్యములు గనియు
మనసు తార్తీయ పురుషార్థమునకె తార్చె"407

అనడంలో అతని భ్రష్టత్వం స్పష్టంగా వ్యక్తమౌతుంది.

"భార్య పాలిండ్లు రిక్త కుంభములు రోయి
వెలది చనుదోయి నిండు కుండలు, కులంబు
తరుణి ఫాలంబు చవితి చందురుడు, వేశ్య
నుదురు వానికి ప్రతి పదిందుండు నయ్యో"408
"ఉష్ణ నిహోమాగ్ని యూదనొల్లడు గాని
విరహజ్వరార్తితో వెచ్చ నూర్చు . . . "409

అనే పద్యాల వల్ల నిగమశర్మ మనస్తత్వం, నైచ్యం వ్యక్తమౌతున్నవి

విధ్యుక్తంగా వివాహమాడిన భార్య పరిచర్యలు అతనికి పనికిరావు ఆతనికి నచ్చినవన్నీ ధర్మవిరుద్ధాలైనవే కాపు కోడలు కూడా దుర్వర్తనం కలిగినట్టిదే.

"కలదా శూద్ర వసతి శశి
కలదాననజాలు నొక వికారపు గోడల్
చలదాలోల కటాక్షాం
చలదామని బద్ధ తరుణ జనఖంజనయై"410 అదీ 'వికారపు కోడలే'

"ఇంటను నద్దమాక ..... బిసాళి జావనిం ..................
పంటది కోరు జారుకుచ పంజర కీరముగా రచింపగన్"411
ఇద్దరూ దుర్వర్తనులే ఇక కాముక క్రీడలకు ఏమి తక్కువ?
"దుర్లలితా తను విలసన ....."412, "దృష్టి పాతంబు నొడివి ....413, "తేలెడు కన్నుదోయి ....."414

పై పద్యాలలో ఆ కాపు కోడలి 'అతను తాపం' వర్ణించ బడింది ఆమె ప్రౌఢ కాబట్టి తన తనుతాపాన్ని ఆరీతిగా వెల్లడించింది. దాన్నికని 'అంగజ బాధిత' అని నిగమశర్మ గ్రహించాడు అలా గ్రహించి.

"బళిరా! తేరకుదేర దక్కె నిటులీ బంగారు కుండంచు జం
కలుదాటించుచు గెంపు మోవి దొడుకంగా గుబ్బ పాలిండ్లుబి
ట్టల మంగా ముఖ గంధ పారణము సేయంగా గటిసీమ ను
త్పుల వస్త్రాళి ఘటింపగా దివురు మిత్రద్రోహి మోహాంధతన్"415

ఇది మోహ శృంగారం గాక మరేమిటి? అందునా అధమాధమం అని చెప్పినా దోసగులేదు

అట్టి మోహాన్ని తీర్చుకోవడం నలుగురిలో సాధ్యం కాదు రహస్యంగా భయం భయంగా క్రీడ సల్పేవారికి తనివి తీరదు అందుకే దాన్నెత్తుకొని పోవడానికి సిద్ధమయ్యాడు నిగమశర్మ జాతరలో వానికి ఆ తరుణం లభించింది అలా చేసాడు దానితో కొన్నాళ్ళు గడిపాడు. అది మరణించింది. వాడి మదం అణగలేదు మరో యువతి వానికి కావలసి వచ్చింది అది చచ్చిందనే చింతలేదు. ప్రేమ ఉంటే కద! చింత, బాధ అతడిది పట్టి శరీర వ్యామోహం

"కావుం గెంజిగురాకుబోడి పరలోకంబంత ప్రాపింపుడున్
వ్యాపాదంబున నాతడొండుకడ రూపాజీవ రాజాననం
దా పెంచచ్చుదగుచ్చు నచ్చువి మదాంధన్ బంధుర శ్రోణి పీ
ణాపాణింధమ వాణి నొక్క ప్లవకన్యం గూడి క్రీడింపగన్"416

అతనికి అపవిత్రమైన పుత్రలాభం అయిందట కొన్నాళ్ళు గడిచిన తర్వాత అగ్నిహోత్రుడు ఆగ్రహోదగ్రుడై పుత్రకళత్ర యుక్తంగా అతని గృహాన్ని దహించి వేసాడు. దీంతో దిమ్మదిరిగింది

"ఎల్లరు నెల్లచో ధనములిచ్చి మృగాక్షుల గొంద్రుగానియో
పల్లవపాణి! యే బరమ పావన వంశము నిచ్చి కొంటి నీ
నల్లని రూపు నిక్కమని నమ్మి, ధ్రువంబది గాక నేడు వి
ద్యుల్లతి కాధికాభినయ ధూర్వహమౌట యెఱుంగ నింతయున్"417

అని వాపోయాడు ఆ తర్వాత విరక్తి పుట్టింది. ఇంతటి వ్యామోహం గలవాడు, దుష్టవర్తన గలవాడు కూడా పుణ్యక్షేత్రంలో పరమపదం పొందుతాడని చెప్పడానికే కవి ఈ కథను ఇంత నీచంగా చిత్రించాడు కవి కూడా నిగమశర్మ దుశ్శీలతను అడుగడుగునా అసహ్యించు కొంటూనే అతని పాత్రను చిత్రించాడు ఈ కథలో విభావాదులచే పోషింపబడ్డ శృంగారం లేదు

కేవల శరీర తాపాలు తీర్చుకోడానికే కాపు కోడలు నిగమశర్మ ఏకమయ్యారు అతని కామవాంఛ అతి మిక్కుటమైంది కాబట్టే తల్లిదండ్రులను, ధర్మపత్నిని సులభంగా మరిచాడు. అంతేకాదు కాపుకోడలు మరణించిన తర్వాత కూడా ఏమాత్రం విచారం లేక రూపాజీవ అయిన ప్లవకన్యను చేపట్టి సంసారం సాగించి, పుత్రులను కన్నాడు ఇక్కడ మాత్రమే అతని కామ ప్రవర్తనలో కూడా జీవిత లక్ష్యం పొడసూపింది భార్యా పుత్రులు అగ్ని దగ్ధులవడం వల్ల అతడు మిక్కిలి పరితాపం పొందాడు ఇది ఎంతో చక్కగా వర్ణింప బడింది. ఈ దెబ్బతో అతడు విరక్తుడయ్యాడు

ఈ రెండు మాహాత్మ్య కావ్యాలలోనూ ఈ మాత్రపు శృంగారమే చిత్రించ బడింది.

c. ఉద్భటారాధ్య చరిత్ర:-

ఉద్భటారాధ్య చరిత్రలో కూడా ద్వితీయాశ్వాసంలో కాశీక్షేత్ర మాహాత్మ్యాన్ని తెలుపడానికి చెప్పబడ్డ 'మదాలసు'ని వృత్తాంతంలో మోహశృంగారం కలదు

సర్వశాస్త్ర పారంగతుడైన 'ధీనిధి' కుమారుడు 'మదాలసుడు' యుక్తవయస్సులో చంద్రకళ అనే యువతిని పెళ్ళిచేసారు అతడు నాలుగంచుల నవ యౌవనంలో

"చతురామ్నాయ విహారముల్ మఱచె శాస్త్ర క్రీడ చాలించెమా
నిత పౌరాణిక వాక్య సంశ్రవణమున్ నిర్ధూతముంజేసె శ్రీ
సుత వాత్స్యాయన కూచిమార మతముల్ చూచెన్ గులాచారసం
గతికిన్ దూరము చేసె నెమ్మనము దుష్కర్ముండు పాఖండుఁగిన్"418

ఆ మదాలసుడు వీధులలో తిరుగుచు కామినులతో క్రీడిస్తూ ఉన్నాడు. అతడు జూదరి వరధనాపహర్త. విటుడు బ్రహ్మవిద్యా విదూరుడు తన భార్యతో సంసారం చేయడు. తండ్రి ఏమీ తెలియని వానిలాగా ఉన్నాడు. ఇల్లాలు ఎదురాడలేదు బంధుమిత్రులు పట్టించుకోలేదు. జనులు ఛీఛీ అన్నారు తర్వాత తల్లి దండ్రి మొదలగు వారు బుద్ధులు చెప్పారు కాని ఫలితం లేదు. అతడు తృతీయ పురుషార్థంలో ఆసక్తి కలిగి వారిని తిరస్కరించాడు తన వారందరినీ విడిచి మదాలసుడు దేశాంతరం పోవడానికి చింతించి, ఒకనాటి రాత్రి శివాలయం జొచ్చి స్వామి అలంకారాల పెట్టెను అపహరించి, ఆ ఊరు వదలి అడవి ప్రవేశించి, అక్కడ కన్యకుబ్జాన్ని చూసాడు. అక్కడ ధనవంతుడైన ఒక్క బేహారుని వశపరచుకొని, తాను తెచ్చిన సొమ్ము అతనికి దాచడానికి ఇచ్చి సజ్జనుని లాగా అతడు ఉన్నాడు పాతబడ్డ తర్వాత మళ్ళీ వారకాంతలకు పసిడి పంపుతూ ఉండేవాడు

అందు కనకలత అనే జాణ అయిన వారకాంత ఉంది. ఒకనాడు ఆమె శివుని భజించడానికి పోయి శివుని వద్ద పాటలు పాడింది అప్పుడు అక్కడికి మదాలసుడు వచ్చి ఆమె పాట విని అచటనే నిలబడ్డాడు ఆమెను చూడడంతో అతనిలో సాత్త్వక భావాలు కలిగాయి ఈ భావాలు 2వ ఆశ్వా 155వ పద్యంలో వర్ణించబడ్డాయి అతని మనస్సు ఆమెపై తగుల్కొంది

మదాలసుడు వరభావవేది అనే తన స్నేహితుని వల్ల ఆమె సానిదని తెలుసుకొన్నాడు. అతని సాయంతో మదాలసుడు ఆమెను పొందాడు అతడు ఆమెతో మన్మథాద్వైత సుఖవార్ధిమజ్జనంలో దోగి పరితాపాన్ని పోగొట్టు కొన్నాడు అతడు వారికి తన ధనమంతా ఇచ్చి, ధనహీనుడు కాగా వారతన్ని వదిలేసారు

కనకం ఆర్జించి కనకలతను పొందుతానని కృతనిశ్చయుడై వింధ్యపర్వత ప్రాంతపు పట్టణాలలో ధనం అపహరించడానికి బయల్దేరి వడదెబ్బ తాకి పడిపోయాడు విద్యాపాలుడు అనే బ్రాహ్మణుడు తన తనయుడితో అక్కడి నుండి పోతూ మదాలసుని గాంచి నీళ్ళు చల్లి తాపం పోగొట్టాడు తర్వాత అతని వద్ద విద్య నేర్చుకొంటానని వెంట పోయి ఒక చోట తండ్రీ కొడుకులు నిద్రిస్తుండగా మదాలసుడు మధ్యరాత్రి లేచి వాళ్ళను చంపి వారి దగ్గర ఉన్న ధనాన్ని అపహరించుకొని కనక లతకు ఇస్తానని బయలు దేరి దోవతప్పి కాశీకి చేరాడు అక్కడ ఒక పొదలో పడుకొని సర్పదష్టుడై మరణించాడు అతన్ని శివుడు తనలో చేర్చు కున్నాడు విభావాది సామగ్రి దీనిలో సరిగా పొందు పరచబడకున్నా, వియోగ సంయోగాత్మకమైన మోహశృంగారం చిత్రించబడింది. కనకలతను చూసిన నాటి రాత్రి మదాలసుడు విరహం పాలయ్యాడు. తన స్నేహితుని సాయంతో దాన్ని పొంది తన విరహాన్ని పోగొట్టుకొన్నాడు తర్వాత సంయోగ సుఖాన్ని అనుభవించి కూడా ధనాభావం వల్ల అక్కడి నుండి దూరం చేయబడి ధనార్జన కోసం బయలుదేరి ఇద్దరు బ్రాహ్మణులను, తనను కాపాడిన వాళ్ళనే హతమార్చాడు.

నిగమశర్మ తనను కాపాడిన కావు కోడల్ని కృతఘ్నుడై మరిగిన విధంగా మదాలసుడు కూడా తనను కాపాడిన బ్రాహ్మణుని అతని కుమారుని ప్రాణాలను తీసాడు అతనిలాగే ఇతడు కూడా భార్య ఉండి కూడా ఆమెతో కాపురం చేయలేదు, వేశ్యల వెంట బడడంలో దీనిలో కూడా 'మోహశృంగారమే' చిత్రించబడింది.

ఘటికాచల, పాండురంగ మాహాత్మ్య గ్రంథాలలో క్షేత్ర మాహాత్మ్యాలు తెలుపడం కోసం శృంగార ఘట్టాలు చిత్రించ బడ్డాయి ఉద్భటారాధ్య చరిత్రంలో కూడా పై రచనా ప్రణాళికే అనుసరింప బడింది ఈ మూడూ ఒకే కవి రచనలు కాబట్టి కథాకల్పనలోనూ, రసపోషణంలోనూ అంతర్గతంగా ఒకే ప్రణాళిక అనుసరించ బడింది. మూడింటిలోనూ 'మోహశృంగారమే' పోషించ బడింది.

## 11. కవికర్ణ రసాయనం:-

1. అంగిరస నిర్ణయం:- సంకుసాల నృసింహకవి 'కవికర్ణ రసాయనం' అనే ప్రబంధం వ్రాసాడు. దీనిలో ముందు యుద్ధవీరం, తర్వాత శృంగారం, ఆ పిదప శాంతం నిర్వహింప బడ్డాయి. వీరం శృంగారంలో పర్యవసిస్తే శృంగారం శాంతంలో పర్యవసించింది కాబట్టి ఇందలి అంగిరసం శాంతం అని చెప్పవచ్చు

2. శృంగార రసపోషణ:-

a) విభావాను శీలనం:-

1) ఆలంబన విభావాలు:- ఇందు నాయకుడు యౌవనాశ్వుని కుమారుడు మాంధాత ఈ మాంధాత మహావీరుడు. రావణునితో మాంధాత పోరడం, శివుడే స్వయంగా వచ్చి వారి ద్వంద్వ యుద్ధాన్ని ఆపడంలో అతని వీరత్వం స్పష్టమౌతుంది. వీరునే స్త్రీ కామిస్తుంది ధీరోదాత్తుడైన నాయకుని చిత్రించడానికే యుద్ధవీరం ముందు ప్రదర్శింపబడింది ఈ వీరం శృంగార పార్యంతికం. నాయకుడు రాజు కావడం వల్ల ఆలంబనంలో ఏ కొరతాలేదు ఇక నాయిక రాజకుమార్తె అయిన విమలాంగి వీరిద్దరి చిత్రపటాలను పరస్పరం దర్శింపజేసి చిత్రకారులు వారిలో 'రతి'ని ఉద్భవింపజేసారు

2) ఉద్దీపన విభావాలు:- రాజు యొక్క పరాక్రమాది గుణాలన్నీ నాయికకు ఉద్దీపనాలే. చిత్రకారులు వర్ణించిన మాంధాత గుణాలన్నీ నాయికకు ఉద్దీపన విభావాలే ఆయన ప్రాయం, యౌవనాలు నాయికకు ఉద్దీపకాలైనట్టే ఆమె సౌందర్య యౌవనాదులు, అలంకరణాలన్నీ నాయకునికి ఉద్దీపన విభావాలే "స్మరశాతాసి .. "419 పద్యం మొదలుకొని "స్మర సమ్మోహన మంత్ర దేవత .."420 అనే పద్యం వరకు నాయిక యౌవనం, సౌందర్యం మొదలగునవన్నీ వర్ణింపబడ్డాయి

b) అనుభావా లోకనం:- వివాహవేదిక పైకి వచ్చే వరకు నాయికా నాయకులకు పరస్పర దర్శనాదికాలు లేవు వివాహ సందర్భం నుండి వారి సంభోగాంతం వరకు అనేక అనుభావాలు సాత్త్విక భావాలు చక్కగా చిత్రించబడ్డాయి అంతకు పూర్వం నాయకుడు నాయిక సౌందర్యాదులు విన్నపుడూ, చిత్రఫలకాన్ని దర్శించినపుడూ అతనిలో కలిగిన మనో విక్రియలన్నీ అనుభావాలుగానే గమ్యమాన మౌతున్నాయి అలాగే నాయిక నాయకుని గుణగణాదుల్ని విన్నపుడు అతని చిత్రపటాన్ని తిలకించేప్పుడు నాయికలో కలిగిన భావ విక్రియలన్నీ అనుభావాలు అనే చెప్పాలి ఇక సాత్త్విక భావాలు కొన్ని ఈ కింది పద్యాల్లో చోటు చేసుకున్నాయి

"చిప్పిలు చెక్కుపై చెమట చిత్తడులం గరపల్లవంబులం
గప్పుచుగన్నుగ్రేవ బులకంబులు పయ్యెదనొత్తి, యోరగా
ద్రిప్పిన మోము వంచి జగతీవరు చిత్రమపాంగ దృష్టిచే
దప్పక చూచి రాజ సుతదానును జిత్తరువయ్యెనత్తరిన్ "421

దీనిలో స్వేదం, రోమాంచం అనే సాత్త్విక భావాలతో పాటు 'త్రప' అనే సంచారి కూడా చిత్రించబడింది

"తూలిన మోము చెల్వు, బయిదూకొను ఘర్మజలంబు వెల్లువం
దేలిన మేను ..."422 అనే పద్యంలో వైవర్ణ్యం, స్వేదం అనే సాత్త్విక భావాలు కలవు
"తలిమము జేరకున్న ..."423 అనే దానిలో రోమాంచం, "తలవంచుటయె కాని .. 424 అనేదానిలో రోమాంచం, స్వేదాలు, "బలిమి రసాతిరేకమున బయ్యెద కొంగెడలింప గంపముందళుకునుగల్గు ..."425 అనే దానిలో కంపం, "కేలితో గెంగేలు గీలించుచో .. "426 అనే పద్యంలో రోమాంచం, కంపం, స్వేదాలు చోటుచేసుకొన్నాయి.

c. సంచారీ సమాలోచనం:- నాయకుడు ధీరుడు కాబట్టి దైన్యాది భావాల్ని వెలికి పోవనీయలేదు నాయిక మాత్రం మాంధాత చిత్రపటం చూసింది మొదలు మోహం, దైన్యం, గ్లాని, చింత, అవహిత్థ, మూర్ఛ మొదలగు వ్యభిచారి భావాలు ఆమెలో పొడసూపాయి. మన్మధపూజ, చంద్రాది ఉపాలంభనాదుల్లో దైన్యం, త్రాసం,త్రప, ధైర్యం మొదలగు అనేక సంచారి భావాలున్నాయి.

ఈ విధంగా భావ పుష్టితో శృంగారం చక్కగా పోషింప బడింది

3. విప్రలంభ సంభోగ వివేచన:-

నాయికా నాయకుల సంభోగం ఇందు విపులంగా చిత్రించ బడింది ఈ సంభోగం పుష్టిమంతం కావడానికి నాయికకు అభిలాష విప్రలంభాన్ని కలిగించి, దాన్ని దశవిధ మన్మధావస్థాయుతంగా పోషించాడు

నాయికా నాయకులకు చిత్రదర్శనాల వల్లనే 'రతి' ఉద్భవించి వారి పరస్పర మననం వల్ల అది వృద్ధి పొంది, అభిలాష విప్రలంభంచే వడియగట్టబడి తర్వాత సంభోగంలో అది సిద్ధి పొందింది అభిలాష విప్రలంభంలో దశవిధ మన్మధావస్థలను కవి వాచ్యంగానే చిత్రించాడు నాయకునికి గూడా ఇవి చిత్రించబడ్డాయి.

"వినునెడ గరగిన మనము, న
యన మార్గంబున స్రవించి యవయవములలో
నెనయంగ జేయునట్లుగ
గనుగొనియెన్ విభుడు కన్యకా రూపంబున్"427

ఇత్యాది రెండు మూడు పద్యాలలో రాజుకు కలిగిన 'చక్షుఃప్రీతి' అనే ప్రథమావస్థ చిత్రించబడింది.

"వనిత నతనాభి దుంగ
స్తనముల గడచి చన లేవు జనపతి చూడ్కుల్
మనమున 'సుయ్యో' గొందో
యని యాందోళించు వారికగునే తెగువల్"428
దీనిలో 'మనస్సంగమం' చిత్రించబడింది

"మౌనము మాఱు మాట ముఖమండల మెత్తగనీయ కొల్లకే
పైనిగిడించు నూర్పు ప్రసభా చరణంబులకున్ బ్రతిక్రియల్
గానొనరించుచున్ నృపతి కన్యక నూతన సంగమంబునన్
బానుపుపై మదీయ భుజ పంజరమెన్న డలంకరించునో"429

ఇత్యాది రెండు మూడు పద్యాలలో 'సంకల్పం' కలదు

"దొరల విమర్దంబు బొరయు తల్పము దక్క గెలన నిద్రాహాని దెలియనీక
వదలెడు భూషణావళి దక్క నితరులమేనిపై గార్శ్యంబు గాననీక
మొనయని యింద్రియంబులు దక్క నన్యులక్రియల యందరుచి లక్షింప నీక
తగవు మానిన కోర్కి దక్క దక్కొరులకుహ్రీపరిత్యాగంబు నెఱుగ నీక
మలయ పవమాన చలన గలిగియైన
దవ్వులకు నిశ్చలంబైన తరువుపోలె
మదన వికృతి క్రమాక్రమ్య మానుడయ్యు
బలుక కవికారుడై యుండె పార్థివుండు"430

"ఇట్లు దినదిన ప్రవర్ధమాన మనోభవ దశావిశేషంబుల వలన
నమ్మహీపాల శేఖరుం డేటికెదురీదు చందంబున దుర్భరంబైన
కాలంబు గడుపుచుండె ....431

పైపద్యంలో రాజుకు జాగరం, కృశత, అరతి, హ్రీత్యాగం అనే అవస్థలు చిత్రించబడ్డాయి. ఇలా మన్మథావస్థలు చిత్రించబడడం వల్ల రాజుకూ అభిలాష విప్రలంభం చిత్రించబడింది.

ఇక నాయికకు కలిగిన మన్మథావస్థలు -

"ఆ కంఠ ప్రణయ ప్రమత్తముల పూర్వాశ్చర్య నిష్యందముల్
సాకూతాయత పాతముల్ సుఖ విశేషాంతర్ముహుర్ముగ్ధముల్
హ్రీకోణాంచల చంచలాలస వశప్రీతి ప్రసాదోదయ
వ్యాకోచంబులునైన వీక్షణములన్ వామాక్షి సూచెంబతిన్"432

ఇత్యాది రెండు పద్యాలలో 'చక్షుఃప్రీతి' అనే అవస్థకలదు

"పూర్ణ చంద్రుని జూచి పూర్ణచంద్రుని యందు
విపుల నేత్రయుగంబు వెదకజూచు .."433
ఇత్యాది రెండు పద్యాలలో 'మనస్సంగమం' అనే అవస్థ ఉంది.

"వల్లభుపేర జిత్తరువు వ్రాసిన రూపము జూచినంత నా
యుల్లము నీరమై కరగుచున్నది నిక్కమతండు వేడ్కరం
జిల్ల గవుంగిటం బిగియ జేర్చినమేని యురంబుపై దనూ
వల్లియు నేను బెంజెమట పట్టగ బిట్టు కరంగి పోవనే"434
ఇందు 'సంకల్పం' అనే అవస్థ చిత్రించబడింది.

"ఉదయమె కాని యస్తగతి నొందక ..."435లో జాగరం,
"అంగన కౌను యౌవన సహాయమునం ....."436లో కృశత,
"వారణ రాజయాన కనువారము ..."437లో అరతి
"తాపమును బాండిమయు ...."438లో హ్రీత్యాగం,
"లేని ప్రియుండు గన్గొనగ ...."439లో ఉన్మాదం,
"తూలిన మోము చెల్వు ...."440లో మూర్ఛ,
"చాలు మన సేయు ..."441లో మరణం.

అనే దశవిధ మన్మథావస్థలు చక్కగా చిత్రించబడి ఇందు అభిలాష విప్రలంభం చక్కగా పోషింపబడింది. ఆతర్వాత వారి వివాహం జరిగింది. తర్వాత వారి ప్రథమ సంభోగాన్ని కవి అనేక పద్యాలలో చక్కగా చిత్రించాడు.

"చెట్ట యొడిసి పట్టి సెజ్జకు దివియుచో
నడుగు బిగ్గ ద్రొక్కి యతివ యవుడు
కూర్మి విభుని మీద గొనయ మెక్కించుచో
నల్లవంగు మరుని విల్లు వోలె"442

"తలిమము జేరకున్న మది దత్తఱమెత్తి విభుండు బాలికన్
నిలువున గౌగిలింప రమణీ రమణీయ శరీర యష్టిము
త్పులకితమైన బొల్పెసగె భూవర కల్పక బాహుశాఖలన్
వలగొని యున్న కోరకితవల్లిమతల్లియు బోలెనయ్యెడన్"443

"కేలితో గెంగేలు గీలించు చోబులకోద్గమమున్వెంట వెలువరించి
యొయ్యనొయ్యన మీది పయ్యెద దివియుచోబొడము కంపములతో నెడలదూల్చి
కదునించు మెత్తని కౌగిట జేర్చుచోగ్రమ్ము లేజెమటల గరగజార్చి
మరపించి మెల్లని మర్మంబు లంటుచోబుణికిళ్ళ నెలవులు వుణికవైచి ... 444

"నెమ్మోవి దాచెడి నెపమున జెక్కులు
చుంబింప నెడ మెచ్చు సుదతి నేర్పు ... 445

ఇత్యాది అనేక పద్యాలలో దర్శన, స్పర్శన, చుంబన, ఆలింగనాదిక మైన సంభోగ శృంగారం విపులంగా వాచ్యంగా చిత్రించబడింది. లక్షణ గ్రంథాలకు ఉదాహరణ ప్రాయంగానే ఇందలి శృంగారం పోషింపబడింది ఇతర ప్రబంధ కవుల లాగా గాక నృసింహకవి వివాహవేదిక మీదకు వధూవరులు వచ్చే వరకు వారికి పరస్పర ప్రత్యక్ష దర్శనం లేకుండా జేసాడు ఇది ప్రాచీన సంప్రదాయ పద్ధతి

సశాస్త్రీయంగా వధూవరులిద్దరూ సుముహూర్త కాలంలోనే పరస్పరం దర్శించు కొన్నారు ఈ ప్రబంధంలో మొదట నాయకుడైన మాంధాత పరంగా పోషింపబడిన (యుద్ధ) వీరం శృంగారంలో పర్యవసించింది సంభోగసిద్ధితో ప్రబంధం ముగిసి ఉంటే ఇది చక్కని శృంగార ప్రబంధమై ఉండేది కాని కవి తాను చేసిన ప్రతిజ్ఞ నిలుపుకొనడానికై తర్వాత శాంత రసానికి స్థానం కల్పించాడు.

"యతి విటుడు గాక పోవుటెట్లస్మదీయ
కావ్య శృంగార వర్ణనాకర్ణనమున?
విటుడు యతిగాక పోరాదు వెస మదీయ
కావ్య వైరాగ్య వర్ణనా కర్ణనమున"446

ఈ ప్రతిజ్ఞను ఈ కవి నిర్వహింప గలిగాడా? అనే ప్రశ్నకు ఈ గ్రంథానికి ఉపోద్ఘాతం వ్రాసిన మోచర్ల రామకృష్ణయ్య గారు తమ ఉపసంహార వాక్యాలలో,

"ఈ ప్రతిజ్ఞను నృసింహ కవి నిర్వహింప గల్గెనా? యని మనము సమీక్షించినచో నూటికి డెబ్బది పాళ్ళ గుణము లీతడు సాధించెననియే తోచును. మానవ జీవితమునకు గావలసిన రక్తికిని విరక్తికిని దుల్య ప్రాధాన్యము సేకరించు కొనగల్గిన యీ కావ్యము ఆంధ్రుల కవశ్య పఠనీయము " అని సెలవిచ్చారు. ఇది కొంత వరకు వాస్తవమే అని అంగీకరించ వచ్చును మొత్తం మీద ఈ కవి ఆలంకారిక శాస్త్రానుసారంగానే శృంగారాన్ని పోషించాడు.

12.రాధామాధవం:-

కావ్యనామాన్నే తన బిరుదు నామంగా పొందిన ఏకైక ప్రబంధ కవి చింతలపూడి ఎల్లనార్యుడు కృష్ణరాయల గౌరవ, ఆదరాలను పొంది అష్టదిగ్గజాలలో స్థానాన్ని పొంద నవ్వుటకీ రాయల అవసాన కాలానికి ఇతడు అతని ఆస్థాన కవి అయి ఉండినట్లు తెలుస్తూ ఉంది. రాధామాధవుల ప్రణయ జీవిత వృత్తాంతాన్నే కాక వారి దాంపత్య జీవితాన్ని వ్యవస్థా బద్ధంగా చిత్రించడంలో ఈ కవి సర్వతంత్ర స్వతంత్రంగా వ్యవహరించాడు

1 అంగి రస నిర్ణయం:-

ఈ కావ్యంలోని ప్రధాన రసం శృంగారం అనడంలో విప్రతిపత్తి లేదు కథాంశం, బహిరంత స్సాక్ష్యాలన్నీ ఈ విషయాన్నే ధృవపరుస్తున్నాయి.

శివుడు, లక్ష్మీ సమేతుడుగా విష్ణువును భూమిపై ఉద్భవించి, ఆమెతో క్రీడించుమని కోరాడు వారు భూమిపై రాధాకృష్ణులుగా అవతరించడం, పరస్పరం 'వినుకలి'చే ప్రేమగల వారై వారి ప్రేమను సఫలం చేసుకోడానికి దౌత్యాలు నెరపి, ఆటంకాలను తొలగించుకొని స్వయంవరంలో ఒకటయ్యారు అలా అంకురిత, కోరకాది అవస్థల్ని పొందిన వారి ప్రేమ వారి స్వయంవర, వివాహానంతరం ఫలవంతం అయింది. ఇందు యుద్ధ వర్ణనలో వీరరసం చిత్రించబడింది. భద్రకుడు కోతి రూపు నొందడంలో హాస్యానికి స్థానం లభించింది. అయినా శృంగారానికి వీర, హాస్యాలు రెండూ అంగాలే కాబట్టి కథాసారాన్ని బట్టి ఇందలి అంగిరసం శృంగారమని నిర్ణయించవచ్చు

కావ్యాదిలో ఉన్న ఈ క్రింది పద్యంలో కూడా శృంగార రస సూచన చేయబడింది.

"శ్రీ లావణ్య రసాధి దేవతలు నా జెన్నొందు రాధాది గో
పాల స్త్రీల బదాఱు వేల వివిధ ప్రాయంబులంగూడి బృం
దాలీలావన కేళి సల్పు తరుణీ తత్త్వజ్ఞు గంధర్వ గో
పాల స్వామి మదీయ చిత్త విక చాబ్జ స్థాయి గావించెదన్"447

లావణ్య రసాధి దేవతలైన రాధాది గోపాల స్త్రీలతో గోపాల స్వామి కేళి సల్పుననడంలో శృంగారం వాచ్యంగానే ప్రధానరసం అనిచెప్పబడింది. వస్తు నిర్దేశం వాచ్యంగానే చేయబడి ఉండడం వల్ల ఇందలి ప్రధాన రసం శృంగారం అని ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరం లేదు.

ఆశ్వాసాంత గద్యలలో రాధామాధవ కావ్యం 'శృంగార ప్రబంధం' అని కవిచే కంఠోక్తిగా చెప్పబడింది.

"ఇది శ్రీ మన్మదన గోపాల చరణ కమల సేవాధురీణ సత్కళాపారీణ కృష్ణభట్టారక పాత్ర చింతలపూడి కామయ ప్రభు సుపుత్ర సుకవి వర్య రాధామాధవ యెల్ల నార్య ప్రణీతంబైన రాధామాధవంబను శృంగార ప్రబంధంబునందు బ్రథమాశ్వాసము "448

ఇక ఈ గ్రంథానికి పెట్టిన 'శ్రీరాధామాధవం' అనే నామాన్ని బట్టి గూడా శృంగారమే ఇందలి ప్రధాన రసం అని వ్యక్తమౌతుంది. రాధామాధవం అంటే రాధకు మాధవునికి సంబంధించిన ప్రణయ గాథ అని వ్యక్తమౌతుండడంచే గ్రంథ నామాన్ని బట్టి తదితర అంశాల్ని బట్టీ రాధామాధవ కావ్యంలోని ప్రధాన రసం శృంగారమని చెప్పవచ్చు. ప్రథమాశ్వాసంలోని 89, 90 పద్యాల వల్ల గూడా ఇందలి అంగిరసం శృంగారం అనే తెలుస్తోంది ఈ పద్యాలలో వియోగాన్ని సహించని సంయోగం కలదని తెలుస్తుంది

2. శృంగార రస పోషణ:-

రాధా మాధవ ప్రబంధంలో శృంగారం చక్కగా పోషించ బడింది అనడంలో సందేహంలేదు అయినా స్వల్పంగా అందు పోషింప బడ్డ భావాలను తద్వారా రసాన్ని గూర్చి పరిశీలించాలి.

a) విభావాను శీలనం:-

(1) ఆలంబన విభావాలు:- ఇందలి ఆలంబన విభావాలు నాయికా నాయకులైన రాధా మాధవులు వీరిద్దరూ దివ్యులే. శివుని కోరిక మేరకు మర్త్యులై భూమిపై జన్మించారు అవతార పురుషులలో దైవాంశ ఉన్నట్లే దివ్యులే మానవులై జనించినపుడు దైవమాన వాంశలు సమ్మేళనం పొంది ఉండడం లో అనుమానం ఉండదు శృంగార రసం కూడా ఇలాంటిదే. లౌకికం, అలౌకికం అని రెండు విధాలుగా ఇది ఉంటుంది. అలాగే నాయికా నాయకులలోని దివ్యత్వం అక్కడక్కడ కవి వాచ్యంగా వర్ణించి ఉన్నా మర్త్య సంబంధి శృంగారమే అంటే లౌకిక శృంగారమే ఇందు చిత్రించ బడింది. అంతర్నిహితంగా అలౌకికత్వం భాసిస్తున్నా లౌకికత్వమే ఇందు ప్రాధాన్యం వహించి ఉంది. దీన్ని బట్టి ఇందలి నాయికా నాయకులు గూడా దైవాంశ కలిగిన మానవులు.

శ్రీ కృష్ణుడు సాక్షాత్తు శృంగార రసాధి దేవతే రాధ కూడా శృంగార సర్వస్వం అని చెప్పవచ్చు శ్రీ కృష్ణుడు ఇందు స్త్రీలోలుడుగా చిత్రించ బడ్డట్లు కని పిస్తున్నాడు. ధీరోదాత్తునిగా ఉండ వలసిన కృష్ణుడు దీనిలో ధీరలలితునిగానే ప్రత్యక్షం అవుతున్నాడు ఆయన స్వభావాన్ని బట్టి, అందరి ఎడ ప్రేమగలవాడు కాబట్టి అతడు దక్షిణ నాయకుడే ప్రథమా శ్వాసంలోని 105వ పద్యం ఈ విషయాన్ని తెలుపుతూంది హలగ్రీవుని తదితరులను భండనంలో భంగ పరచి శ్రీ కృష్ణుడు తన ధీరోదాత్తతను నిలబెట్టుకున్నాడు లలిత ఉదాత్త స్వభావాలు శృంగార నాయకులలో సమ్మిశ్రితంగా కనబడడం సహజం నాయిక అయిన రాధ ఇతర కావ్యాలన్నింటిలో 'పరకీయ'గా చిత్రించబడి మోహ శృంగారంలో మునకలు వేసింది ఇందు 'స్వీయగా చిత్రించబడి ధర్మ శృంగారానికి ఆలంబనమైంది ధవుని రమింప చేసేది రాధ అనే మాటకు ప్రతిబింబమై నిలచి శృంగార ప్రవాహానికి ఊత అయింది. కావ్యాదిన ముగ్ధగా కనిపించిన రాధ, తర్వాత 'మధ్యా' లక్షణాలు కలిగి ఉండి సంభోగ సమయానికి 'ప్రౌఢ' అయి ప్రకాశించింది రాధ దీనిలో 'స్వాధీన భర్తృకౌగా చిత్రించబడింది. ఈరాధా మాధవు లిద్దరూ పరస్పర ఆలంబనంగా నిలబడి శృంగారాన్ని పోషించారు.

(2) ఉద్దీపన విభావాలు:-వారి రూప, యౌవనాలు, గుణాలు నారదాదులచే చక్కగా వర్ణించబడి అవి వారికి పరస్పర ఉద్దీపకాలైనాయి ఈ క్రింది వచనంలో శ్రీ కృష్ణుని యౌవనం, దాని తర్వాత పద్యంలో రూపమూ వర్ణించబడి ఉన్నాయి.

.. .. సర్వజగన్మోహనంబును సర్వలోక లోచనాహ్లాదకరంబునగు నవయౌవనారంభంబు రతి రాజు విజయ లీలా సంరంభంబునుంబోలె విజృంభణంబు జూవనయ్యం భోరుహాక్షుండు సర్వలక్షణ సంపన్నుండై విభ్రమాతి శయంబున నిబ్బరపు గబ్బిజవ్వనంబున నుల్లసిల్ల గొల్లపూబోండ్ల యుల్లంబుల గామ కళాశంక యంకురింపంజేయుచు గన్నుల పండువైయుం డి"449

"ఇంద్ర నీలములతో నెనయు దేహచ్ఛాయసరసఘన స్ఫూర్తి బరిహసింప
రాకేందు మండలి జోక మీఱెడు ప్రసన్నాననం బంభోరు హంబు నొరయ
జంద్రిక సరివచ్చు సరస మందస్మితకళ మౌక్తి కాంశుల గ్రచ్చుఱింప
గంద కోరక దీప్తి గొనసాగు పదనఖపఙ్క్తియుడు వ్రజ ప్రభలదెగడ
దివ్య తేజో బలంబులు దేజరిల్ల
భూరి సౌందర్య సంపద పొదలు కొనగ
గలికి తనమును వేడుకల్గడలు కొనగ
జాలనొప్పారె గోప వేషమున శౌరి"450

ఈ క్రింది వచనంలో, పద్యాలలో రాధ రూప, యౌవనాలు వర్ణించ బడ్డాయి.

వ. "అక్కన్యా రత్నంబు జగన్మోహనాకారంబున దుషారకర రేఖయుంబోలె గాంతియు బారిజాతలతికయుంబోలె నవకంబునుమాణిక్య శలాకయుంబోలె మెఱుంగునుం గలిగి దిన దినప్రవర్ధమానయై మాననీయయై యుండు జంద్ర మండలంబునకుంగళాపూరణంబును, జలజంబునకు వికాసంబును సంభవించిన చందంబున జొక్కమైన చక్కదనంబునకు నలంకారంబై మవ్వంపు జవ్వనంబు సంప్రాప్తం బయ్యె మఱియును"451

"సృష్టి నిలుపుచు మొదల రాజీవభవుడు
చెలువ మెల్లను నొక ప్రోక చేసి దాచి
ముజ్జగంబును రాగాబ్ధి ముంపనేర్చు
మెఱసి యాచంచలాక్షి నిర్మింపబోలు"452

"ఆలలితాంగి మైసొబగు నాతరలాక్షి కటాక్ష లీలలా
బాల మనోజ్ఞ మార్దవము భంగియు నాయలి వేణి కుంతల
శ్రీల తెఱంగు జెప్పమఱి చెప్పుగ నేటికి నొప్పు చున్నయా
నీల శిరీష పుష్ప సిత నీరజ వల్లుల మాటి మాటికిన్"453

ఇవే గాక నారదుడు శ్రీకృష్ణుని వద్ద వర్ణించిన రాధ సౌందర్యం, సరస్వతి రాధ వద్ద వర్ణించిన శ్రీకృష్ణుని సౌందర్యాన్ని మనం ఇక్కడ గ్రహించాలి.

కృష్ణుని లావణ్యం, విహారం, మోహనాకారం, లీలావిభవం, కరుణ, విక్రమం , ఆలాపాలు మొదలగునవన్నీ రాధకు ఉద్దీపనంగా చెప్పబడ్డాయి.

"నీలావణ్యము నీవిహార కలనల్ ... 454 అనే పద్యంలో ఈ విషయం గమ్యమాన మౌతుంది వారి వారి భూషణాలు కూడా పరస్పర ఉద్దీపకాలే.

రాధలోని హావ భావాది శృంగార చేష్టలన్నీ శ్రీకృష్ణునికి ఉద్దీపనం. కృష్ణుని విలాసాదులు రాధకు ఉద్దీపనాలు

"రాజీవ భవుడ హోరాత్రంబు నొక్కంత
నేసి తూపగనిద్ద త్రాసనంగ ..
........ నుల్ల సిల్లంగ మధూత్సవంబు"455

ఇత్యాదిగాగల పద్యంలో వర్ణింపబడ్డ వసంత ఋతువు తటస్థ ఉద్దీపన విభావం

"ఏమిటి నోములమ్మ ... "456 ఇత్యాది పద్యంలో చేయబడ్డ మన్మథ దూషణలో మన్మథుడు కూడా తటస్థోద్దీపనమే ఉద్యానవనం, చంద్ర, మలయాని లాదులు కూడా దీనిలో

చేరుతాయి ఈ విధంగా ఉద్దీపన సామగ్రి ఈ కావ్యంలో సమకూర్చబడి శృంగార పోషణకు దోహద పడింది

**b)అనుభావాలోకనం:-**

ఈ ప్రబంధంలో అనుభావాలు, సాత్త్వికభావాలు చక్కగా పోషించ బడ్డాయి ఉద్దీపనం కలిగించే శృంగార చేష్టలే అనుభావాలు కూడా అవుతాయి నాయికానాయకుల భావ, హావ, హేలలు, శోభ కాంత్యాదులు, లీలా, విలాసాదులను అనుభావాలుగా చెప్పవచ్చు

"ఎన్నడు నే వికారము వహింపనియోగి ...457 ఇత్యాది పద్యాలలో శ్రీకృష్ణునిలో కలిగిన భావ, హావాది అనుభావాలు వర్ణించ బడ్డాయి

"బాలిక చెక్కుటద్దములపై నునులజ్జబెనంగు నవ్వుగ్రె
వ్రాల బయోధరద్వయి నవారణ వేబులకల్జనింపగా ... 458

"మరుతాపం బధరామృతంబున హరింపంజేసి .. 459పై రెండిటిలో 'రోమాంచం' అనే సాత్త్విక భావం ఉంది "కనుగవగెంపుదోప నలుకం గయిసేయక .. 460 లో అశ్రువు, కలదు. 2ఆశ్వా లోని 52 వ వచనంలో అనేక సాత్త్విక భావాలు చిత్రించబడ్డాయి " ..... వెడద కనుదోయి నెడతెగక విభిన్న సూత్రముక్తా ఫలంబులంబోలె దొరగునశ్రు ధారాలవంబుల గుచకుంభంబులలంకరింపుచు నిశాంత రజనీకాంత బింబంబు వగిదింగాన వచ్చు పరిపాండురగండ మండలంబునం బాణి పంకజంబు హత్తించి .. " 461 దీనిలో అశ్రువు, వైవర్ణ్యాలు కలవు "నవ్వులు మాలెవిచ్చె. .." 462 ఈ పద్యంలో వైవర్ణ్యం, "ఉడుగని వేడి నిట్టూర్పులు వడగాలి. గదిసి కయ్యమునకు గాలుద్రవ్వ ..." 463 అనే పద్యంలో కంపం, వైవర్ణ్యం, రోమాంచం, స్వేదం మున్న గు సాత్త్విక భావాలు చక్కగా చిత్రించ బడ్డాయి.

"ఘన పీనస్తన కుంభ మండలముపై ..." 464 అనే పద్యంలో రోమాంచం, అశ్రువులు కలవు.

రాధా స్వయంవరానికి పోయే శ్రీకృష్ణుని తలచి వ్యధ నొందుతున్న వల్లవ స్త్రీలలో కలిగిన భావాలు ఈ కింది పద్యంలో అతి మనోహరంగా చిత్రించబడ్డాయి

"మేనుమ్రాన్పడ నొక్క మెలత యూరక యుండెఘర్మాంబువుల దోగె గాంత యొకతె
యశ్రులు దొరగించె నలి నలివేణి యొక్కతెవైవర్ణ్యమును బొందె వనిత యొకతె
చెలియోర్తు తక్క థనెలుగు రాల్పడ బల్కె జలజాక్షియొక్కతె చంచలించె
గలయికల్ దలచియొకర్తుక పులకించెమూర్ఛలసత నొక్కముదిత వ్రాలె[1]

ప్రాణదయితుండు మదన గోపాలవరుదు
తమ్మువంచించి రాధపై దలవుజేర్చి
పెండ్లి యాడంగ బోయెదు పెంపునొంపు
మదన తాపము మనముల బొదలజేయ" 465

దీనిలో స్తంభం, స్వేదం, అశ్రువు, వైవర్ణ్యం, వైస్వర్యం, కంపం, రోమాంచం మున్నగు భావాలు కలవు

"ప్రేమరసార్ద్ర దృష్టియు .. " 466 అనే పద్యంలో రోమాంచం, స్వేదం అనే సాత్త్విక భావాలూ పంచమాశ్వాసంలోని 39 వ పద్యంలో అనేక సాత్త్విక భావాలూ చిత్రించబడ్డాయి

c. సంచారీ సమాలోచనం:-

ఈ ప్రబంధంలో వ్యభిచారీ భావాలు కూడా చక్కగా పోషింప బడ్డాయి స్థాలీపులాక న్యాయంగా వాటిని పరిశీలిద్దాం శ్రీకృష్ణునితోకలిగిన 'నిర్వేదం' ఈ కింది పద్యంలో వర్ణించ బడింది

"కలికియొయ్యారంపు గతుల వ్రేతలగన్ను లార్చి యిక్కువలకు దార్ఢ్యడయ్యె .. 467
"తెలిగన్ను గొనల గెంజాయలు దేర దదేక చింత హరియుండ మదిన్ .. 468

దీనిలో 'చింత' అనే వ్యభిచారి భావంగలదు ద్వితీయాశ్వాసంలోని 12వ పద్యం మొదలు కొని 22 వపద్యం వరకు వితర్కం, చింత, శంక అనే సంచారి భావాలు కలవు "అమృత రసోపమాన .. 469 పద్యంలో 'ముదం' అనే వ్యభిచారిభావం గలదు

"చంద్ర మరీచిసంచయ బాడబానలజ్వాలాముఖములకు వచ్చుననుము ... నీకు ప్రాణంబు లర్పించు నిక్కనుము "470 ॥

ఈ పద్యంలో 'అంతం' (మరణం) అనే సంచారి గలదు 2 ఆశ్వా 206వ పద్యంలో, 207 వచనంలో రాధాదేవిలో కలిగిన సంచారీ భావాలన్నీ ఒక్క చోట కుప్పబోసినట్లు చిత్రించబడ్డాయి

"అంతర్బాష్ప విలోచనాగ్రములపై నట్టాడు దైన్యంబు వ్రా
చ్చింతా తంతువు జిక్కువెట్టవగల స్వేవంతయుందూలిదు
ర్దాంతానంగభుజంగవక్త్రమునకుందప్పింప రాకున్న న
న్నింతీ కృష్ణుడుగావడే కరుణనీవీ చందముల్చెప్పినన్" 471
"వ. అని సంభ్రమోత్సాహ వ్యళీక సమాకులంబగు చిత్తంబున
నుత్తలపడి ........ నిలుపోవక మూర్ఛిల్లిన ... "472

దైన్యం, చింత, గ్లాని, నిర్వేదం, స్మృతి, ఔత్సుక్యం, త్రప, త్రాసం, ఉన్మాదం, ధృతి, ఆవేగం, ఆర్తి, మోహం, మున్నగు అనేక సంచారీ భావాలు, ఇందుచిత్రించబడి ఉన్నాయి.

ఈ విధంగా విభావాను భావాలతో పాటుగా సంచారీ భావాలూ చక్కగా పోషించబడి శృంగార రస నిర్వహణకు తోడ్పడ్డాయి.

## 3. విప్రలంభ సంభోగాల వివేచన:-

రాధామాధవ ప్రబంధంలో రాధామాధవులకు సంయోగాత్పూర్వ విప్రలంభమే కాని సంయోగానంతర విప్రలంభం చిత్రించబడలేదు కాబట్టి అభిలాష విప్రలంభమే ఇందు ప్రతిపాదించ బడింది. అభిలాష విప్రలంభంలో నాయికకు దశవిధ మన్మధావస్థలు కలుగుతాయి. ఆ అవస్థలలో ఏవేవి ఈ ప్రబంధంలో చిత్రించబడ్డాయో చూస్తే విప్రలంభం పోషింపబడ్డ తీరు వ్యక్తమౌతుంది.

రాధకు ". .. .. .. మదన గోపాల లీలా రూప లావణ్య తేజో గుణంబులు కర్ణ భూషణంబులుగా బోటకత్తియల వలన విను"473 ట వల్ల అనురాగం అంకురించింది నాయికకు నాయకుని రూప లావణ్య తేజో గుణాలు వినడం వల్ల మనసులో ప్రథమ వికారం కలిగింది ఇదే 'చక్షుః ప్రీతి' అనే ప్రథమావస్థ ఇక్కడ 'వినుకలి' వల్ల నాయకుడు నాయికకు చర్మ చక్షువుకు గోచరంగాకున్నా మనోనేత్రంలో- రూపు కట్టి వలవు రేపుతాడు కాబట్టి 'వినుకలి' వల్ల కలిగిన వికారం కూడా 'చక్షుఃప్రీతే'

"హరిమీది మోహమనుసా
గరమున మరు డనెడు నెసరు గాడ్పునధైర్య
స్ఫురణ మనునోడ వగిలిన
గురుకుచ మనసనెడు వర్తకుడు వడిమునిగెన్"474

'వినుకలి' వల్ల రాధ మనస్సు కృష్ణునిపై తగుల్కొన్నట్టు ఇందు చిత్రించ బడింది. కాబట్టి ఇది 'మనస్సంగమం' అనే ద్వితీయావస్థ. ఇది తర్వాతిఅనేక పద్యాలలో చిత్రించబడింది.

మనస్సు నాయకునిపై తగుల్కొనగానే నాయికకు అతని సంగమ చింత ఆరంభమౌతుంది. ఆ సంగమ చింతే విరహానికినాంది. "ఇవ్విధంబున నారాధ సంతత ప్రవర్ధమాన విరహ సంతాపభారంబున విగత బోధయైయయ్యె విధంబుల మనోనురాగంబు నిగూఢంబుగా నొక్కభంగి, గాలంబు గడుపుచుండె"475 ఇందలి విరహవృద్ధిలో 'సంకల్పం' అనే మన్మధావస్థ గమ్యమానమౌతుంది.

వాణి మధుర వాణి అయి సహస్రగోపుని మందిరానికి పోయినప్పుడు అందు ". .. .. . నొక్క యేకాంత గృహంబున బద్మరాగవేదికా మధ్యంబున గనకలతా కీలిత రత్న డోలికాసనంబున బద్మదళోపధానంబున, నొత్తిగిలి చిత్తజాయత్తంబై యుత్తలపడు చిత్తంబున నిరంతర చింతాతంతు సంతానంబు చిక్కువడ గ్రొక్కారు మెఱుంగునుంబోలె నాభీల మద నకరవాల ధారకు జలదరింపుచు జాగరణోద్భూతరాగంబున గోకనద దళోదర కాంతి నవనయింపంజాలు వెడద కనుదోయి నెడతెగక విభిన్న సూత్రముక్తా ఫలంబులంబోలె దొరగు నశ్రుధారాలవంబుల గుచ కుంభంబు లలంకరింపుచు నిశాంత రజనీకాంత బింబంబు వగిదిం గానవచ్చు పరిపాండుర గండ మండలంబునం బాణి పంకజంబు హత్తించి వదన పద్మ గంధంబునకుం గ్రందుకొను బృందంబులకు దగ్గఱరాక మొగ్గరంబైన క్రొవ్వేడి నిట్టూర్పులచేత బరిమ్లాన సహకార కిసలయంబు చందంబున గందిబిఱుసు వారిన వాతెఱయును ననంగ జ్వరదాహ భారంబున దప్తకాంచన శలాకాకృతి ముట్టరాక వేడియై కృశంబైన మేనుదీగెయు, నింద్రనీల మాణిక్య తేజఃపుంజంబుల విడంబింప వెడవెడ జాఱి వెన్నునందూలు వేనలియును నవస్థాంతరంబులు దెలుప దూరీకృతాంగుళీయక హారకేయూర ముఖనిఖిల పరిష్కారయు వివర్జిత మృగమద కాశ్మీర ఘనసార గంధసార పంకచర్చయు విరహిత సరస కుసుమమాలికానేపథ్య రచనయు సఖీజన పరివృతయు నిరాలాపయు గృష్ణ లావణ్యా గుణమణి గణనా తత్పరయునై యున్న రాధా కన్యకం గనుంగొని . . . . "476 అనే ఈ వచనంలో సంకల్పం, జాగరం, కృశత, అరతి అనే మన్మథావస్థలు రాధకు కలిగినట్టు చిత్రించబడ్డాయి

"చంద్ర మరీచి సంచయ బాడబానల
జ్వాలాముఖములకు వచ్చుననుము . ."477

వ. "అనియిట్లు మన్మథోద్రేకంబున విగతలజ్జాభిమానయైయనుమానింపక తెంపు కలిమి బ్రౌఢవచనంబులు పలికినవిని యవ్వల్లి వాధర రాధ కిట్లనియె . . . . "478

పైపద్యంలోను, వచనంలోను హ్రీత్యాగం, ఉన్మాదం, మరణం అనే అవస్థలు కలవు.

ఇలాదశవిధ మన్మథావస్థలను పోషించడం వల్ల రాధ విరహం అతి ఉన్నత స్థాయిలో పోషించబడి శృంగారానికి పుష్టిని చేకూర్చింది. అభిలాష విప్రలంభం ఈ విధంగా పోషించడంలో రాధా మాధవుల ప్రణయ మాధుర్యం సువ్యక్తం చేయబడింది. అభిలాష విప్రలంభం ఒక మధుర భావ మిళితమైన శృంగారానికి పరాకాష్ఠ. రాధామాధవేతర కావ్యాలన్నింటా రాధ కేవలం 'కసరు బట్టిన మోహశృంగారిని'గా చిత్రించబడింది రాధ తన ప్రకృతికి భిన్నంగా పరకీయగా చిత్రించబడి పరకీయా శృంగారంలో నాయిక అయింది. ఈ

కవి మాత్రం రాధ తత్త్వాన్ని పసికట్టి ఆమెను పరకీయగా చేసి పాడుచేయక స్వీయగా చిత్రించి ఆమె పవిత్రతను కాపాడి దాంపత్య శృంగారానికి ఆలంబనంగా చిత్రించాడు రాధామాధవుల సంభోగ శృంగారం వాచ్యంగా చిత్రించడంలో కవి హద్దులు మీరినట్టు కనిపించినా, దాంపత్య శృంగారం కాబట్టి ఇతర కావ్యాలలో చిత్రించబడ్డ పరకీయా వ్యామోహశృంగారాని కంటె వేయిమణుగులు మెరుగు ". . . .లక్ష్మీనారాయణులనే రాధామాధవులనుగా జేసికొని యిమ్మనోహర కావ్య రాజమును శృంగార రసాను ప్రాణితమైన భక్తిరస సుధాసాగరముగా జేసి వ్రైచినాడు . . . ."479 అని నడికుదుటి వీర్రాజు గారు చెప్పిన విధంగా భక్తిరసం అక్కడక్కడ మెరుపు తీగెలాగా ఛణక్కుమని కనిపించినా శృంగారమే సర్వాంతర్యామిగా వ్యాపించి ఉంది దివ్యులే మానవులుగా జన్మించడం వల్ల శృంగారంలో ఒక పవిత్రత నెలకొంది రాధ తత్త్వాన్ని వెలువరచి, రాధా కృష్ణుల ప్రణయతత్త్వాన్ని, దాంపత్య శృంగార విశిష్టతను చాటడానికే రాధామాధవ కవి రాధామాధవ కావ్యాన్ని ప్రాసాదనడంలో విప్రతిపత్తి ఉండబోదు. కాని యుగధర్మాన్ని బట్టి సంభోగాన్ని అతిగా వర్ణించడంవల్ల, కొన్ని చోట్ల అతి వేలంగా మోహాన్ని వర్ణించడం వల్ల అనౌచిత్య వాసన స్ఫురిస్తుంది.

ఏది ఏమైనా ఇందు విరహాన్ని కూర్చి, శృంగారానికి పుష్టికలిగించి, సంయోగ వియోగాత్మకమైన శృంగారాన్ని మనోహరంగా పోషించడంలో యెల్లనార్య కవి కృతకృత్యుడయ్యాడు

13. యయాతి చరిత్ర:-

పొన్నెకంటి తెలగనార్యుని యయాతి చరిత్రలో రావణుడు రంభను బలాత్కరించడంలో రసాభాసం, దేవయాని యయాతి రహఃక్రీడలలో సంభోగ శృంగారం, శర్మిష్ఠయయాతులకు అభిలాష విప్రలంభ శృంగారం, తర్వాత వారి కలయికలో సంభోగ శృంగారం చిత్రించబడ్డాయి (శృంగారం అంతా పంచమాశ్వాసంలోనే కలదు )

ద్వితీయాశ్వాసంలో 88వ పద్యం నుండి 101 వరకు రావణుడు రంభను బలాత్కరించిన ఆభాస ఘట్టం కలదు.

పంచమాశ్వాసంలో 2వ పద్యం నుండి 35వ పద్యం వరకు దేవయాని యయాతుల రహః క్రీడలు చిత్రించ బడ్డాయి. ఇది సంభోగ శృంగారం.

70వ పద్యం నుండి 88వ పద్యం వరకు శర్మిష్ఠకు కలిగిన విరహం ఆమెకు చేసిన శిశిరోపచారాలు చిత్రించ బడ్డాయి.

88వ పద్యం నుండి 108వ పద్యం వరకు విరహబాధ గల యయాతి, శర్మిష్ఠ కలయికలో సంభోగ శృంగారం వర్ణించబడింది

సంభోగ చిత్రణకు ఒక ఉదాహరణం:-

"ఇది రేయిది పగలనుచున్
మది నెఱుగక చాల బొదలు మరు పోడుములన్
సదమద మగుచుండిరి య
మ్ముదితయు నాతఁడు గూర్మిముంచు కొనంగన్"480

## 14. తపతీ సంవరణం:-

అద్దంకి గంగాధరకవి 'తపతీ సంవరణం' అనే ప్రబంధాన్ని వ్రాసాడు ఇందు సంప్రదాయ బద్ధం, శాస్త్రీయం అయిన శృంగారం పోషించ బడింది దూత అయిన చిలుకవల్ల తపతీ సంవరణులకు 'వినుకలి'చే పరస్పరం ప్రేమ కలిగింది. ఆ చిలుక నాయకుని వద్ద నాయిక సౌందర్యాన్ని, నాయిక వద్ద నాయకుని సౌందర్యాన్ని వర్ణించి వారి 'రతి'ని ఉద్దీపింప చేసింది. ఇందునాయకుడు సంవరణుడు మానవుడు నాయిక సూర్యపుత్రి అయిన తపతి దేవకన్య ఇద్దరూ పరస్పరం కలిగిన మోహంవల్ల విరహం పాలయ్యారు ఈ విరహం అభిలాష విప్రలంభం ఇద్దరూ దశవిధ మన్మథావస్థల్ని పొందారు నాయిక విరహతీవ్రతచే చంద్రుని, మన్మథుని ఉపాలంభించింది సంవరణుడు తపస్సు చేసిసూర్యుని ప్రసన్నుని చేసి కొన్నాడు చివరకు వసిష్ఠుని వల్ల వారికి సంయోగం కలిగి విరహం తొలగింది ఇందు అను భావాదులన్నీ చక్కగా తీర్చిదిద్దబడ్డాయి

"సారస సంభవుండఖిల సర్గ నిమిత్తము గూర్చియున్న ..."481

ఇత్యాది అనేక పద్యాలలో నాయిక సౌందర్యం వర్ణించబడింది.

"అతని రూపంబు గను గొన్న యబ్జముఖులు . . . ."482
ఇత్యాది అనేక పద్యాలలో నాయకుని రూపురేఖలు చిత్రించ బడ్డాయి.
"వెడవెడ నార్చె మన్మథుడు బిట్టుగ . . . ."483

ఇత్యాది అనేక పద్యాలలో నాయిక విరహం, ఆమెకు కలిగిన మన్మథావస్థలు చిత్రించబడ్డాయి.

'వసుచరిత్ర'లో లాగానే సంప్రదాయబద్ధమైన శాస్త్రీయ శృంగారం పోషింపబడ్డ ప్రబంధాలలో ఇది ఒకటి.

## 15. నిరంకుశోపాఖ్యానం:-

శ్రీకృష్ణదేవరాయల భువన విజయ సభాభవనం లోనిఅష్టదిగ్గజాలలో ఒకరుగా పేర్కొన బడుతున్న వారు కందకూరు రుద్రకవి సుగ్రీవ విజయం అనే యక్షగానం, జనార్ధనాష్టకం, నిరంకుశో పాఖ్యానం అనే గ్రంధాలు రుద్రకవి వ్రాసినా పరిశోధనకు పరిగ్రహించే ప్రబంధం నిరంకుశో పాఖ్యానం ఒకటే.

1. నాయకుడు:- ఈ ప్రబంధంలో నాయకుడు నిరంకుశుడు. ఇతడు భూసుర వంశ సంభూతుడు చంచదుపాయశీలి వేదాది విద్యలలో నిరంకుశుడు కాని స్త్రీలోలుడు కామమే జీవిత పరమార్ధంగా తలచిన వాడు. అలాగయినా నిగమశర్మ లాగాగాక చివరకైనా తన ధర్మపత్నిని చేరదీసి కుమారుల కన్నాడు. ఇలాంటి లక్షణాలు గల ఈతడు ధీరోదాత్తాది నాయకులలో ఎవ్వడౌతాడని ప్రశ్నిస్తే డా రేవూరి అనంతపద్మనాభ రావు గారు నిరంకుశుడు నిస్సంశయంగా ధీరశాంతుడే అని చెప్పారు వారి మాటలు ఇవి

"చతుర్విధ నాయకులలో నిరంకుశుడు ధీరశాంతుడన నొప్పును. మృచ్ఛకటిక నాటకము నందలి చారుదత్తుడు ధీరశాంతుడు. నిరంకుశుడు ఈ కోవలోని వాడే శృంగార నాయకులలోని శఠుని లక్షణములు నిరంకుశుని యందు కానిపించును

తన సతికి పరితాపమును గలిగించి వేశ్యాలోలుడైన నిరంకుశుడు శఠుడు ధీరశాంత లక్షణములలో బ్రాహ్మణ వంశమున జన్మించుట, వివేకత్వము నిరంకుశుని యందు గలవు "484

"సామాన్య గుణైర్భూయాన్ ద్విజేమధీర ప్రశాంత ఇత్యుక్తః"485

నాయక సామాన్య గుణాలుగల బ్రాహ్మణుడు ధీరశాంతుడని చెప్పబడింది కులీనత, మహాభాగ్యం, ఉజ్జ్వలత (స్ఫురద్రూపం), ఔదార్యం, తేజస్విత, ధర్మాకలనం, వైదగ్ధ్యం, మున్నగు గుణాలు నాయక సామాన్యాలు. వీటిలో "విశ్వంభరాధిపత్యం యత్తన్మహా భాగ్యముచ్యతే"486 అనే మహాభాగ్య లక్షణం తప్ప తక్కినవన్నీ ఇంచుమించుగ నిరంకుశునిలో పొందుపడి ఉన్నాయి అతడు ధీరశాంతుడనడం యుక్తియుక్తమే ధీరశాంత పదానికి విగ్రహం 'దీరశ్చఅసౌశాంతః' ధీరత్వం, శాంతత్వం కలవాడు అనేదానిచే అతనిలో శివునితో పాచిక లాడటంలో ,పాషాణంతుమురొనరింపజేసి ఇంద్రుని మెప్పించడంలో ధీరగుణం కనిపిస్తుంది ప్రత్యక్షమైన పరమశివుని స్తుతించే చోట శాంతగుణం కనిపిస్తుంది. చివరకు భార్యను చేరదీసి కుమారుల కని ధర్మా కలనం కలిగి ఉండినా వేశ్యాలోలత్వం ధీరశాంతత్వానికి మచ్చుగా ఉంది ద్వితీయాశ్వాసంలోని 'చల్లడమామీద' అనే పద్యంలో నాయకుడు ధీరలలితుడుగా వర్ణించ బడ్డాడని రేవూరి వారే సెలవిచ్చారు. ఆపద్యం ఇది

"చల్లద మామీద జలువ బట్టిన దట్టిదలిమంపు దువ్వుటి దానిమీద
మొలజముదాళి చాయల విడియంబుచేబడగ సూరియు జిల్లబటువు చేత
దనువున మంచి గంధము దానిపై గందవొడియందు మీద గప్పురపు రజము
వలకారి నగతాయెతులు వానిపై జాజివిరులందు పైనొంటి పొరరుమాలు.
మీఱ ఘనసార తాంబూల సౌరభ ప్ర
వాహ వహగంధవాహ ప్రరోహమోహ
వశ విశాలేక్షణా జన స్వాంతుడగుచు
రాత్రుల జరించుచుందు నాబ్రాహ్మణుండు"487

అతడు రాత్రివేళ వేశ్యావాటికకు వెళ్ళేటప్పుడు ధరించిన వేషం అది ఆ వేషం వల్ల నిరంకుశుని విలాస లక్షణాలు తెలుస్తున్నాయి. కాని అతడు ధీరలలితుడని తెలియడం లేదు.

"నిశ్చింతో మృదరనిశం కలాపరో ధీర లలితః స్యాత్"488

అనే లక్షణాన్ని బట్టి నిశ్చింతుడు, మృదు స్వభావం కలవాడు, కళాపరుడు అయిన వాడే ధీరలలితుడని తెలుస్తుంది ధీరలలితునకు పౌరుషంతో పాటు భోగలక్షణం కూడా చెప్పబడి ఉంది భోగలక్షణం అంటే స్త్రీలోలత్వం కాదు ధర్మబద్ధమైన భోగమే ధీరలలితునకు ఉండేది. ద్యూతకళాపరత్వం కలవాడు నిరంకుశుడు కాబట్టి అతడు ధీరలలితుడు అని అనుకోవడానికీ అవకాశం ఉంది. కాని బ్రాహ్మణుడై ఉండి నాయక సామాన్య లక్షణాలు కలిగి ఉన్న నిరంకుశుని ధీరశాంతుడని చెప్పడమే సముచితంగా ఉంది వేశ్యాలోలత్వం అతని నాయకత్వ లక్షణానికి భంజకంగా ఉన్నా, శృంగార నాయకులలోని 'శఠ' లక్షణం వల్ల అది పరిహారమౌతుంది కాబట్టి నిరంకుశుడు 'ధీరశాంతశఠ' నాయకుడు

2. నాయికలు:- ఇక ఈ ప్రబంధంలో నాయిక అతని ధర్మపత్ని అని చెప్పాలి. ఆమె స్వీయానాయిక ముగ్ధ కామలోలుడైన భర్తచే చిన్నచూపు చూడబడి విరహార్త అయింది. అత్తతో చెప్పి మందలింప చేసి కూడా, భర్తృనిరాకృత అయి నిగ్రహంచూపిన మహాసాధ్వి

"రతిగద యాకృతిమతిభా
రతిగద హైమవతి గద నిరంతర సమసం
భృతివతి యందు రతినరుం
ధతి గద యిన్నియును గలవు తావక సతికిన్"489
దీనిలో నాయిక గుణాలు పొందు పరచబడ్డాయి
"అకటా! యింతకు దెచ్చెనే యనుచునత్యావన్నయై జాలవ
ల్లికలో పీడియముంచి పంచశరకేళీ వాంఛ చాలించి చం
పక గంధిన్ మదిలోనె మెచ్చు కొనుచున్ పద్మాసనుందిట్టుచున్
వికలంబైన మనంబుతో నిదుర జెందెందత్సుమీప స్థలిన్"490

అనే పద్యంలో ఆవిడ నిగ్రహం వ్యక్తం చేయబడింది. అలాంటి ఉత్తమ ఇల్లాలు కాబట్టే ఆమె వ్రతం ఫలించి, కథాంతంలో భర్తను చేరి పుత్రవతి అయి ధన్య అయింది.

ఈమెగాక దీనిలో ఇద్దరు 'సామాన్య' నాయికలు కలరు చంపక గంధి మానవవేశ్య. రంభ దేవవేశ్య నిరంకుశుని కామప్రవృత్తికి అనుకూలంగా అతని కామవాంఛను, ధనాన్ని గ్రహించి తీర్చిన వేశ్యచంపక గంధి దానిపై నిరంకుశుడు 'అనురాగం' కలిగి ఉన్నా అది కేవలం కామవాంఛతో పుట్టిందే అభిసరణమే ప్రవృత్తిగా కలిగిన చంపక గంధి 'అభిసారిక' అనే శృంగార నాయిక నిరంకుశుని అభినివేశానికి, మూఢభక్తికి ఫలితంగా లభించిన నాయిక రంభ ఇదీ సామాన్య నాయికే దీని ప్రవృత్తి కూడా అభిసరణమే. ఈమె ఇంద్రుని మాట నెరవేర్చడానికి నిరంకుశుని జేరి అతని కౌగిలి సుఖానికి తన్మయం చెందుతూ బాహ్యప్రపంచాన్ని, భవిష్యత్కర్తవ్యాన్నీ ఏమరి నారద కోపానికి గురై ఇంద్రుని వల్ల శాపం పొందింది చంచదుపాయశాలి అయిన నిరంకుశుని వల్ల శాపవిముక్త అయి ఇంద్రాదేశంచే అతని భోగానికి సమర్పింపబడింది. చంపక గంధిధనఫలితం. రంభ శౌర్య, దీక్షల ఫలితం. ఒకతివేశ్య, రెండవది దేవ వేశ్య ఈ ఇద్దరివల్లా నిరంకుశుని తృతీయ పురుషార్థాన్ని తృప్తి నొందించి, అతన్ని శరనాయకాగ్రేసరునిగా చేసింది

ఈ విధంగా ఇందలి నాయికా నాయక లక్షణాలే ఇందలి ప్రధాన రసాన్ని వ్యంజింప చేస్తున్నాయి

ఈక్రింది కావ్యారంభ పద్యంలో ప్రధానరసం వ్యంజింపబడింది
"శ్రీభాషారమణీ విమృష్టపద రాజీవేత్త మాంగార్యుడా
ర్యాభామా పరిణేత సర్వజగదారాధ్యుండు మూర్తిత్రయీ
శోభాకందము కందుకూరి నగరీ సోమేశ్వర స్వామిలో
కాభీష్టంబు లొసంగుగాత ,గరుణాయత్తక, చిత్తంబునన్"491

"అందు శంకరునకు పత్నులుగా గంగా పార్వతుల నిరువురినే చెప్పక, త్రిమూర్త్యాత్మకునిగా వర్ణించి, యార్యానాధుడనియు, లక్ష్మీసరస్వతులు మిక్కిలి నిర్మలముగా చేయబడిన చరణములును, ముఖమును గలవాడనియు చెప్పుటచే నీమహాకావ్యము శృంగారమంగిగా గలదని సూచితము. కథానాయకుడు సమస్త విద్యలందు సంపూర్ణుడు, విశేష శృంగారలోలుడు, సర్వజ్ఞుడు కాగలడని ధ్వని ముఖ్య నాయిక కులశీలాదులు గలదియు, పాణి గృహీతయు, విద్యాకౌశలము గలదనియు తెలుపబడినది వేరొక నాయిక (చంపకగంధి) సమస్త సంపదలకు నిధి. ఆర్యాసమేతుండనక నాధుడనుటచే ముఖ్యనాయికకు నాయికా ప్రకాశత్వమల్పము. "492

"కొమ్ముపై సవతిగైకొని నిల్పెనని నాథు
తొమ్ముపై నిల్పెనారూఢి మహిమ."493

అనే దానిలో "విఘ్నస్తుతిలో కొమ్ముపై సవతి గైకొని నిల్పిన వాడని స్తుతించి దక్షిణ నాయకుడనుట సూచింపబడినది."494

అనడంలో రేవూరి వారికి స్వవచో వ్యాఘాతమైంది. నిరంకుశుని శఠునిగా చెప్పి మళ్ళీ దక్షిణ నాయకుడనడం అనుచితం తన భార్యపై అనురాగం చూపని వాడు దక్షిణుడు ఎలా అవుతాడు? కాబట్టి ఇది అసంగతం.

3. అంగిరస నిర్ణయం - దోషణ:-

"చెక్కిట బత్రవల్లరి సృజింపగ బూని మనోజకేళినా
యక్కఱ దీర్చవేయనుచు నక్షర పంక్తి లిఖింపగా దద
న్యక్కృత కైతవంబు హృదయంబున నారసి ప్రాణనాధుతో
నొక్క పిసాళి నవ్వునన లొత్తగ నవ్వెడు వాణి గొల్చెదన్"495

ఈ పద్యంలో సరస్వతిని శృంగార ప్రసంగావస్థలో ఉన్నట్లు వర్ణించడం వల్లనే కావ్యం శృంగారరస భూయిష్ఠం అని కవి భంగ్యంతరంగా చెప్పినట్లయిందని రేవూరి వారి నిర్ణయం

షష్ఠ్యంతాలలో సోమేశుడు అపరిమేయ శృంగారుడుగా వర్ణింపబడడం గూడా ఇందలి ప్రధాన రసం శృంగారమే అని తెలుపుతుంది.

ఇవేగాక సంతానం లేని సురశర్మకు విష్ణుమూర్తి స్వప్నంలో ప్రత్యక్షమై.

" - - - - - - - - - - - - - - - - - - - - - -
- - - - నలిన ప్రభవాన్వయ చింతయేటికిన్
నీకొక పుత్రుడార్య మహనీయ చరిత్రుడు గల్గునంచుల
క్ష్మీకుచ గంధలిప్తమగు చేత ఫలంబొకటిచ్చె నావుడున్"496

'లక్ష్మీకుచ గంధలిప్తమైన హస్తంతో ఫలమివ్వడంవల్ల అతనికి కలుగ బోయే నిరంకుశుడు తృతీయ పురుషార్థంలో మిక్కిలి ఆసక్తి గలవాడై ఉంటాడని ధ్వనింప జేయబడింది ఇది ఈ ప్రబంధంలోని ప్రధాన రసం శృంగారమే అని నొక్కి వక్కాణిస్తుంది

"వ్యసనములలోన బ్రథమ
వ్యసనము సంభోగ కాంక్షయది దోషమల
మసమనగ నెందు నందుం
బ్రసరించిన వాడు పాప బాహ్యుడు కలడే?"497

అనే ధర్మశీల మహారాజుగారి ప్రశ్నకు సమాధానంగా పులహమునిచే నిరంకుశోపాఖ్యానం చెప్పబడింది కాబట్టి ఈ ప్రబంధం వేరే ఏ సాక్ష్యం లేకుండానే శృంగార ప్రధాన మైందని తెలుస్తుంది కాబట్టి నిరంకుశోపాఖ్యానంలోని అంగిరసం శృంగారం. కాని ఇందు చిత్రించబడ్డ శృంగారం ఉత్తమమైంది కాదు వేశ్యాసంభోగంలో, రంభా సంభోగంలో శారీరిక వ్యామోహమే ప్రాధాన్యం వహించి ఉండడం వల్ల ఇందలి శృంగారం 'మోహ శృంగారం' అని చెప్పవచ్చు ఈ మోహ శృంగారం ఈ ప్రబంధంలో వాచ్యంగా ఉన్నా అంత స్సూత్రంగా (అతర్గతంగా) ధర్మ శృంగారం కూడా ధ్వనిస్తుంది

నిరంకుశుని ధర్మపత్ని విరహార్త అయినా అతని వైముఖ్యాన్ని గమనించి పంచశర కేళీవాంఛను నిగ్రహించు కొని తన భర్త తనను చేరదీసే మంచి కాలం కోసమై ప్రతీక్షిస్తూ ఉంది మనస్సులో అనురాగం లేక పోతే తన భర్త కోసం అన్నాళ్ళు వేచి ఉండేది కాదు. ఆ తర్వాత భర్త అనుగ్రహం పొంది ఆమె పుత్రవతి అయింది. ఇది ధర్మ శృంగారం. దాంపత్య శృంగారం నిరంకుశుడు విధ్యుక్తంగా పాణి గ్రహణం చేసుకోవడంతో ధర్మ శృంగారం ఆరంభమై, అతని వేశ్యాలోలత్వంతో తిరస్కృతంగాక, అతని ధర్మపత్నిలో నిలచి కావ్యాంతంలో ఆమెను స్వీకరించే వరకు ఉండి ఫలవంతం అయింది కాబట్టి ఇందలి శృంగారం ధర్మ శృంగారం అన్నా దోషం లేదు

నిరంకుశుని ధర్మపత్ని అనుభవించిన నిగ్రహంతో కూడిన విరహం విశిష్టమైంది ఇందు విరహ, ప్రవాస విప్రలంభ లక్షణాలు మిళితమై ఉన్నాయి అంతే కాదు ఆమెతో నిరంకుశుడు ఒక్కసారి భోగించిన లక్షణాలు కూడా ఇందు కనిపించడం లేదు కాబట్టి అభిలాష విప్రలంభ లక్షణాలు, అతడు ఆమెను నిరాకరించగా బాధపడి చంపక గంధి భాగ్యాన్ని మనసులో తలచుకోవడంలో మానవిప్రలంభ లక్షణాలు ఈషద్వ్యక్తంగా ఉన్నాయి కాబట్టి అన్ని లక్షణాలు కలసిన విప్రలంభాన్ని నిరంకుశుని ధర్మపత్ని అనుభవించింది. అంత దీర్ఘమైన, సాంద్రమైన విరహాన్ని అనుభవించడానికి ఎంతో 'నిగ్రహం' కావాలి అది కలిగిన 'నిరంకుశుని' ధర్మపత్ని మహాసాధ్వి' అనడంలో సందేహం లేదు

నిరంకుశుడు చంపక గంధితో సంచరించడంలో కేవల వ్యామోహమే గలదు. కాని రంభా సంభోగంలో కొంత విశేషం కలదు రంభ కూడ వేశ్యే ఇచటి సంభోగానికీ వ్యామోహమే హేతువు. కాని రంభ వరప్రసాదిని నిరంకుశునకు శివుడిచ్చిన వరప్రసాదం ప్రత్యక్షమైన శివుని నిరంకుశుడు తురీయ (చతుర్థ) పురుషార్థాన్ని కోరగా అతడు తృతీయ పురుషార్థాన్నిచ్చాడు. ఈ రంభా సంభోగంలో నిరంకుశుని దీక్ష, చంచదుపాయ శాలిత్వం, వివేకాలు విశదమైనాయి. రంభా సంభోగం మానవులకు సామాన్యంగా లభించేది కాదు. అలాంటి దాన్ని నిరతం పొందేట్లు నిరంకుశునికి ఇంద్రుడు అనుగ్రహించాడు.

ఇంద్రుని శాపం వల్ల రంభానిరంకుశులకు ఎడబాటు కలిగింది. ఈ శాపంవల్ల కలిగిన విప్రలంభానికి రంభ పడలిపోయింది. కాని నిరంకుశుడు నైపుణ్యంతో విరహాన్ని అనతికాలంలోనే అతిక్రమించి నిరంతర సంబోగాన్ని సిద్ధింప జేసుకొన్నాడు ఈ ప్రబంధంలో వాచ్యంగా సంభోగ శృంగారాన్ని వర్ణించినా విభావాను భావాదులచే శృంగారం సమ్యక్పరిపుష్టం కాలేదనే చెప్పవలసి ఉంటుంది

" -- తన యంగన యందు సునయ తనయుల గాంచెన్"498

అని సంక్షిప్తంగా జెప్పుదం వల్ల ధర్మ శృంగారం వ్యంజింపబడి, దీర్ఘ విరహం విడివడి సంభోగం సిద్ధించి ఫలవంతమైనట్లు చెప్పబడ్డ చోట శృంగారం పరిపుష్టి నొందింది ఇక్కడ కూడా విభావాను భావాదులచే అది వ్యక్తం కాలేదు అయినా ఇక్కడ సంబోగాన్ని వాచ్యంగా వర్ణించక ధ్వనింప చేయడంలో శృంగారం రక్తి కట్టిందనవచ్చు

మొత్తం మీద ఈ ప్రబంధంలో విప్రలంబ, సంభోగ శృంగారాలు వర్ణించబడినా విప్రలంభం ధ్వన్యాత్మకంగాను సంబోగం అధికంగా వాచ్యంగాను వర్ణించ బడితృతీయ పురుషార్థ సేవనంలో నిరంకుశుడు దశదిశా పూరకీర్తి మండలుడై చెలంగెనని చెప్పబడింది

వేశ్యాలోలురై ఉండికూడా ధర్మబద్ధంగా జీవించడం ఆనాటి సాంఘిక ధర్మం అని ఈక్రింది పద్యం వల్ల తెలుస్తూంది

"లేరా భోగ పరాయణుల్ జగతిలో లీలా వినోదంబుగా
బోరా వేశ్యల యింద్లకున్ వివిధ సంభోగార్థులై గుట్టుతో
రారావైదిక ధర్మ మార్గ పథిక ప్రావీణ్యముంజూపరా
యేరా తండ్రి పరిత్యజింతురటరాయీరీతి సత్కర్మముల్"499

## 16. చంద్రబాను చరిత్రం:-

తరిగొప్పుల మల్లన వ్రాసిన 'చంద్రభాను చరిత్రం'లోని నాయకుడు చంద్రభానుడు. నాయిక కుముదిని. ఈ కుముదిని పూర్వజన్మలో చంద్రకళ అనే అచ్చర భరద్వాజ ముని తపోభీతిచే త్రస్తుడైన సురరాజు ఆనతిచే తపస్సుకు అంతరాయం కలిగించి శపింపబడి నరలోకంలో జనించింది చంద్రభానుడు లోక సామాన్యంగా విద్యార్థి వేషంలో తుంబురు పరిచర్య చేస్తూ ఒకనాడు కార్యవశాన వచ్చిన నాయికను చూసి మదన పరతంత్రుడై తుదకు ఆమె పాణిని గ్రహించాడు.

చంద్రభాను, కుముదినులను ఏకం చేయడానికి తరళిక దౌత్యం నెరపింది నాయిక కంకణం గొనిపోయి నాయకునికి ఇచ్చి నాయకుని ఉంగరాన్ని తెచ్చి నాయికకు ఇచ్చింది ఇలా వారి విరహాలు కొంత ఉపశమింప జేయబడ్డాయి.

"మేరు సంగతి గేయ సౌరవాహిని. . . . ."500 అనే పద్యంలో నాయిక అయిన కుముదిని నాయకుడైన చంద్ర భానుని చూడడం చిత్రించ బడింది. "జలజ దళాక్షినాస . . . ."501 అనే పద్యం మొదులు కొని "అలరె వారిజనేత్ర పదాంగుళీన ఖాళి . . "502 అనే పద్యం వరకు గల పంద్రెండు పద్యాలలో కుముదినీ సౌందర్యం వర్ణించ బడింది. నాయికా నాయకులకు దశవిధ మన్మధావస్థలతో గూడిన విరహం చిత్రించ బడింది

ఈ ప్రబంధంలో మల్లన కవి నాయికా నాయకులకు అభిలాష విప్రలంభాన్ని చిత్రించి, వారి పెండ్లితో దానికి భరతవాక్యం పలికి వారికి సమాగమం కలిగించాడు

# అధోజ్ఞాపికలు


1. ఆముక్తమాల్యద - శ్రీకృష్ణదేవరాయలు; ఆశ్వా - 5 పద్యం - 135.

2 & 3. ఆముక్తమాల్యదా పర్యాలోకనము - ప్రభాకరరావు, వెల్దండ - పుట - 65 నుండి 67 & 92.

4 & 5. ఆముక్తమాల్యద - ఉపోద్ఘాతం - వేంకటరమణాచార్యులు, మేడేపల్లి, పుట 28 & 66.

6. విజయనగర ఆంధ్రకవులు - లక్ష్మీకాంతశాస్త్రి, శిష్టా; పుట

7,8,9. ఆముక్తమాల్యదా సౌందర్యము - కోటేశ్వరరావు, తుమ్మపూడి; పుట 51, 57, 69

10 &11. ఆముక్తమాల్యద - పీఠిక - శ్రీకృష్ణదేవరాయలు; పద్యం - 14 & 1.

12 & 13. నాట్యశాస్త్రము - (భరతుడు) - శ్రీరామ అప్పారావు, పోణంగి, పుట

14 నుండి 18 ఆముక్తమాల్యద - శ్రీకృష్ణదేవరాయలు, ఆశ్వా - 5 పద్యం 38, 8, 37

19 & 20. కావ్యాలంకార సంగ్రహము - సూర్యనారాయణశాస్త్రి, సన్నిధానం; పుట 374,

21 నుండి 38 ఆముక్తమాల్యద - శ్రీకృష్ణదేవరాయలు, ఆశ్వా - 5, పద్యాలు, 89, 60, 153, 76, 150, 61', వచనం - 51, పద్యాలు 76, 78, 80, 81, 95, 145, 149, 147, 148.

39 సాహిత్య దర్పణః - విశ్వనాథః , పుట - 205.

40 to 53 ఆముక్తమాల్యద - శ్రీకృష్ణదేవరాయలు ; ఆశ్వా-5 పద్యం- 37, 40, 84,83, 88, 147, 76, 145, 80, 81, 119, 135

54 కవి చౌడప్ప శతకము - చౌడప్ప - పద్యం - 96.

55 విజ్ఞాన సర్వస్వము - సంపు - 4 - లక్ష్మీకాంతం, పింగళి; పుట 930

56 మనుచరిత్ర - పీఠిక - సూర్యనారాయణ శాస్త్రి, వెంపరాల; పుట 75,76

57 కావ్యరీతులు - మాధవరావు, విన్నకోట, పుట - 58 నుండి 63

58 త్రివేణి - రాధాకృష్ణారావు, వై; పుట - 71 నుండి 73.

59. కావ్యలహరి - వేంకటావధాని, దివాకర్ల; పుట - 70 నుండి 73.

60. ప్రథమాంధ్ర మహాపురాణము - వేంకట సుబ్రహ్మణ్యం, గూడ , పుట - 513.

61. మను, వసు చరిత్రల తులనాత్మక పరిశీలన - సుజాతారెడ్డి, ముదిగంటి ,

62. ప్రబంధ వాఙ్మయ వికాసము - దుర్గయ్య, వల్లా ; పుట - 296

63. సాహితీసుధా లహరి - నాగయ్య, సముద్రాల; పుట - 108 & 109.

64. మనుచరిత్ర, ఉపోద్ఘాతము - సూర్యనారాయణ శాస్త్రి, వెంపరాల;.

65 to 134. మనుచరిత్ర - పెద్దన, అల్లసాని, ఆశ్వా - 1 - పద్యం - 51
ఆశ్వా - 2 - పద్యం - 25, 36, 29, 27, 41, 22, 45, 55.
ఆశ్వా - 6 - పద్యం - 3, 5, 42, 56, 62.
ఆశ్వా - 2 - పద్యం - 28, to 33.
ఆశ్వా - 3; పద్యం - 53, 86, 91, 136, 137. ఆశ్వా - 5. పద్యం - 63, 62, 65, 66, 67, 70, 86. ఆశ్వా - 6 - పద్యం - 34. ఆశ్వా - 3 - పద్యం 7, 8, 9, 93,
ఆశ్వా - 2; పద్యం - 50, 56, 57 ఆశ్వా - 3 - పద్యం - 31, 119, 112, 97, 98, 99, 116.
ఆశ్వా - 5; పద్యం - 68, 70, 85, 81, 83 ఆశ్వా - 2; పద్యం - 28 నుండి 33, 35, 51, ఆశ్వా - 3, పద్యం - 3, 9, 66, 53, 52, 31, 8, 9

135. కావ్యలహరి - వేంకటావధాని, దివాకర్ల - పుట - 46

136 కావ్యరీతులు - మాధవరావు, విన్నకోట; 77.

137&138 పారిజాతాపహరణ పర్యాలోచనము - యశోదారెడ్డి, పి, పుట - 89

139 to 173 పారిజాతాపహరణము - తిమ్మన, నంది, ఆశ్వా - 2, పద్యం - 3; ఆశ్వా -5 - పద్యం - 23; ఆశ్వా - 1 - పద్యం - 1,2,115, 71, 95, 131; ఆశ్వా - 2 - పద్యం 53.
ఆశ్వా - 1 - పద్యం - 100, 111, 113, 122, 123, 124, 132, 133,
ఆశ్వా - 3 పద్యం - 12, 17, 19; ఆశ్వా - 1 - పద్యం - 82, 85, 99, 100, 101, 130, 131, 126; ఆశ్వా - 3 - పద్యం - 16, 20, ఆశ్వా - 1 - పద్యం- 76, 101,
ఆశ్వా - 2 - పద్యం - 53

174. అష్టదిగ్గజములు - శ్రీరామ అప్పారావు, పోణంగి; పుట - 189

175. రాజశేఖర చరిత్ర - ప్రస్తావన - సత్యనారాయణమూర్తి, కుందుర్తి పుట - XI.

176 to 211. రాజశేఖర చరిత్ర - మల్లన, మాదయగారి; ఆశ్వా - 3, పద్యం -67, 75, 5, 133, 135, 82, 131, 104, 171, 172, 97 నుండి 101, 103, 104, 145, 171, 180;
ఆశ్వా - 2 - పద్యం - 169, 170, ఆశ్వా - 3, పద్యం - 77, 78, 79, 87, 95, 97, 106, 98, 100, 111, 149, 150, 233.

212 to 216 కాళహస్తి మాహాత్మ్యము - ధూర్జటి, ఆశ్వా - 1 - పద్యం - 35, 37, 38, 42, 43.

217 కాళహస్తి మాహాత్మ్యము - (ధూర్జటి) వేంకటరమణయ్య, బులుసు, పుట - 6

218 to 233. రామాభ్యుదయము - రామభద్రుడు, అయ్యలరాజు, ఆశ్వా - 4 - పద్యం - 63, 125, 126, 153, 154, 158, 160, 164, 174, 175, 176; ఆశ్వా - 6 - పద్యం - 19, 20, 32, 148.

234. కళాపూర్ణోదయము - సూరన, పింగళి; ఆశ్వా - 1 వచనం - 16

235. Studies in Kalapurnodaya - Krishna Rao, G V, Page - 243

236. వికాసలహరి - సుబ్రహ్మణ్యం, జి వి, పుట - 74

237. కవిత్వ తత్త్వవిచారము - రామలింగారెడ్డి, కట్టమంచి, పుట - 167 to 181

238 to 246 కళాపూర్ణోదయము - సూరన, పింగళి, ఆశ్వా - 5 - వచనం - 69, పద్యం - 16, 18, వచ - 20, పద్యం - 28, 29, 30, 48, 67

247. Studies in Kalapurnodaya - Krishna Rao, G. V, Page 246

248 to 259. కళాపూర్ణోదయము - సూరన, పింగళి, ఆశ్వా - 4 పద్యం - 26, 100, 101, 102, 107, ఆశ్వా - 5 - పద్యం - 95, 96, 106, ఆశ్వా - 6; పద్యం - 35, 62, 68, 69

260 ఆంధ్ర ప్రబంధము - అవతరణ వికాసములు - నరసింహం, కె వి ఆర్ - పుట 110

261 to 278. కళాపూర్ణోదయము - సూరన, పింగళి, ఆశ్వా - 6 - వచ - 208, పద్యం - 210, 213, 215, 216, 217, 220, 272; ఆశ్వా - 7 - పద్యం - 156, 158, 160, 164, 165, 169, 210, 224, 230.

279 కావ్యరీతులు -మాధవరావు, విన్నకోట; పుట - 158.

280 to 325. ప్రభావతీ ప్రద్యుమ్నము - సూరన, పింగళి; ఆశ్వా - 3, పద్యం - 61, పీఠిక - పద్యం - 1, ఆశ్వా - 5, పద్య - 198; ఆశ్వా - 2. పద్యం - 56, 58, 59, 60; ఆశ్వా - 3, పద్యం - 82, ఆశ్వా - 2 పద్యం - 64, ఆశ్వా - 3 - పద్యం - 18, 40, 87, 92, ఆశ్వా- 4 - పద్యం - 74, 75, 107, 108, 109, ఆశ్వా - 5, పద్యం - 9, 35, 43, 49, ఆశ్వా - 1 - పద్యం - 139; ఆశ్వా -2 - పద్యం - 18, 108, 111, 10, 13, 21, 37, 84, 87, 102; పద్యం - 5 - పద్యం - 6, 9, ఆశ్వా - 1 - పద్యం - 126; ఆశ్వా - 4, పద్యం - 77, ఆశ్వా - 3, పద్యం - 87, ఆశ్వా - 4 - పద్యం 79, ఆశ్వా - 3 - పద్యం - 105, ఆశ్వా - 4 - పద్యం 80 81 ఆశ్వా - 5 - పద్యం - 109

326 భూషణ కిరణావళి - వేంకట లక్ష్మీనరసింహారావు, వాసిలి; పుట - 53

327 వసురంజని - జ్యోతిర్మయి, కిళాంబి, పుట - 146

328. మను, వసుచరిత్రల తులనాత్మక పరిశీలనము - సుజాతారెడ్డి ఎం; పుట - 291.

329 వసుచరిత్ర - ఉద్దీపన - సుప్రసన్నాచార్యులు, కోవెల; పుట - 13, 14.

330 to 383. వసుచరిత్ర - భట్టుమూర్తి, ఆశ్వా - 1 - పద్యం - 116; ఆశ్వా - 2 - పద్యం - 25, 39, 40, ఆశ్వా - 3, పద్యం - 48, 56, 112, 117, 48, నుండి52, 77, 90, 98, 100 106, 179, 49, 53, 66, 82, 83, 84, 86, 90, 93, 95, 100, 106, 118, 131, 151, 179, 181, 183 ఆశ్వా - 4 - పద్యం - 81, ఆశ్వా - 3 - పద్యం - 48 నుండి 52, 78, 79, 94, 95, 96, 97, 99, 106, 109, 118, ఆశ్వా - 4 - పద్యం - 115.

384 మను, వసుచరిత్రల తలనాత్మక పరిశీలనము - సుజాతారెడ్డి, ఎం; పుట - 295

385&386 భూషణ కిరణావళి - వేంకట లక్ష్మీ నరసింహారావు, వాసిలి పుట - 84 & 125.

387&398. వసుచరిత్ర - భట్టుమూర్తి - ఆశ్వా - 6, పద్యం - 86, 92 నుండి 97. ఆశ్వా - 2 - పద్యం - 130, 132, 133, 137

399 వసుచరిత్ర విమర్శనము - చిన సీతారామస్వామి శాస్త్రులు, వఝుల, పుట - 79, 80.

400 to 406 మటికాచల మాహాత్మ్యము - రామకృష్ణుడు, తెనాలి, ఆశ్వా - 2 , పద్యం - 29, 30, 32, 35, 36, 37, 39

407 to 417 పాండురంగ మాహాత్మ్యము - రామకృష్ణుడు, తెనాలి, ఆశ్వా - 3 - పద్యం - 8, 11, 12, 60, 61, 63, 64, 65, 67, 88, 93

418 ఉద్భటారాధ్య చరిత్ర - రామకృష్ణుడు, తెనాలి - ఆశ్వా - 2 - పద్యం - 74

419 to 446. కవికర్ణ రసాయనము - నృసింహకవి, సంకుసాల , ఆశ్వా - 3 - పద్యం - 29, 68, 94, 210, 212, 213, 221, 34, 37, 52, 56, 57, 66, 77, 82, 84, 85, 86, 89, 92, 94, 142, 209, 210, 221, 223, పీఠిక - 22.

447 to 478 రాధా మాధవము - ఎల్లనార్యుడు, చింతలపూడి, ఆశ్వా - 1, పద్యం - 1, చివరిగద్య; వచనం - 102, పద్యం - 103, వచనం - 117, పద్యం - 118, 119, 144, ఆశ్వా - 2, పద్యం - 117, 179, 6, 13, 14, 16, వచనం - 52, పద్యం 111, 196; ఆశ్వా - 3 - పద్యం 145; ఆశ్వా - 4 - పద్యం - 18, 332, ఆశ్వా - 2 - పద్యం - 8, 10, 81, 97, 206, 207, ఆశ్వా - 1. వచనం - 122. 124, 129, ఆశ్వా - 2 - పద్యం - 52, 97, 98

479. శ్రీ రాధామాధవము - (మునిపలుకు) - వీరరాజు, నడికుదుటి; పుట - 33.

480. యయాతి చరిత్ర - తెలగనార్య, పొన్నెగంటి; ఆశ్వా - 5, పద్యం - 152.

481 to 483 తపతీ సంవరణము - గంగాధరకవి, అద్దంకి; ఆశ్వా - 2 - పద్యం - 11, ఆశ్వా - 3 - పద్యం - 27, 45.

484. నిరంకుశోపాఖ్యానము - (రుద్రకవి, కందుకూరి); ముందుమాట - అనంత పద్మనాభరావు, రేవూరి; పుట - 73

485. సాహిత్య దర్పణమ్ - విశ్వనాథః - పుట - 123.

486. ప్రతాప రుద్రీయమ్ - విద్యానాథః - పుట - 201.

487. నిరంకుశోపాఖ్యానము - రుద్రకవి, కందుకూరి; పుట - 24

488. సాహిత్యదర్పణం - విశ్వనాథః - పుట - 211.

489 to 499. నిరంకుశోపాఖ్యాము - రుద్రకవి, కందుకూరి, పుట - 37, 39, 1, (పీఠిక) - 2, (పీఠిక), 15, 83, 37.

500 to 502. చంద్రభాను చరిత్రము - మల్లన, చదలువాడ, ఆశ్వా - 3, పద్యం - 118, 133, 144.

# ప్రబంధ శృంగారం - ప్రయోగాలు

## 1. ప్రయోగ శబ్ద నిర్వచనం:-

శృంగారం రసరాజం. శృంగారం ప్రబంధాలలో పోషించ బడ్డ ప్రధాన రసం. ప్రబంధాలలో శృంగారాన్ని ప్రపంచించడంలో ప్రబంధ కవులు వివిధ పోకడలు పోయారు. వాటిని క్రోడీకరించి విశ్లేషిస్తే ప్రబంధాలలోని ప్రయోగాలు శృంగార రస విషయంలో ఎన్ని విధాలుగా ఉన్నాయో మనం గుర్తించవచ్చు అసలు "ఆంధ్ర ప్రబంధం ప్రత్యేక ప్రక్రియగా గుర్తించ బడటానికి కారణం ఆకవుల ప్రయోగ ప్రావీణ్యమే"1 అని ఆచార్య జి వి సుబ్రహ్మణ్యం గారి అభిప్రాయం ప్రబంధాలలోని ప్రయోగాల్ని పరిశీలిస్తే వీరి అభిప్రాయం వాస్తవం అని అంగీకరించక తప్పదు ప్రయోగం అంటే ఏమిటి? ప్రయుక్తమైంది ప్రయోగం ఈ ప్రయోగ శబ్దం ఆంగ్లంలోని experiment అనే పదానికి సమానార్థకంగా కొన్ని చోట్ల వాడబడుతూంది. experiment అనే పదానికి chambers twentieth century Dictionary లో "a trial, some thing done to test a theory or to discover something unknown, to make experiment or trial to search by trial, to make trial of (adj)"2 అనే అర్థాలు ఇవ్వబడ్డాయి.

Shankarnarayanas (English - Telugu) నిఘంటువులో "experiment అనగా పరీక్ష చేసి చూచుట, శోధన, Trial, test, పరీక్షించు, చేసి చూచు, తార్కాణము చూచు test or try"3 అనే అర్థాలు ఇవ్వబడ్డాయి.

పైన ఇవ్వబడ్డ అర్థాలను పరిశీలిస్తే పరిశోధన ఎంతటిదో ప్రయోగం అంతటిదే అని తెలుస్తుంది కొత్త విషయాన్ని కనుగొనడంగానీ, ప్రతిపాదించడం గానీ, దాని కోసం ప్రయత్నించడం గానీ, దాన్ని శోధించడం గానీ, చివరకు పరీక్షించడం గానీ ప్రయోగం అనబడుతుందని పై అర్థాల సాధారణ భావంగా వ్యక్తమౌతుంది. ఒక కొత్త విషయాన్ని కనుగొనడం గానీ, తన మదిలో మెదిలిన కొత్త విషయాన్ని సువ్యక్తం చేయడంగానీ, కొత్త దనానికై యత్నించడంగానీ ప్రయోగం అని మనం సాధారణ నిర్వచనాన్ని చెప్పవచ్చు సాహిత్య పరంగా ఆలోచిస్తే, 'శృంగారరసం' అనే దాన్ని ప్రబంధ కవులు కనుగొనవలసిన అవసరం ఏదీ లేదు. పూర్వకవులచే ప్రపంచింపబడ్డ, పూర్వ ఆలంకారికులచే నిర్వచింప బడ్డ

ఆ రసాన్ని తమ ఇష్టం వచ్చిన మార్గాల్లో నడిపించడమే ప్రబంధ కవులు చేసిన పని. అదే వారు చేసిన ప్రయోగం. వారు చేసిన ప్రయోగాలలో శృంగారం తన రూపులో గుణంలో అనేక మార్పుల్ని సంతరించుకొంది శృంగారం ధరించిన వివిధ స్వరూపాలను విశ్లేషిస్తే ప్రబంధ కవుల ప్రయోగ ప్రావీణ్యం సువ్యక్తమౌతుంది ఒక రసాన్ని కవి ప్రయోగించడం ద్వివిధంగా ఉంటుంది మొదటిది పూర్వోక్త మార్గంలో రసాన్ని ప్రపంచించడం రెండవది. పూర్వం ఉన్న రసాన్నే కొత్త కొత్త రూపాలలో ప్రదర్శించడం నిపుణులైన కవులెవరైనా రెండవ మార్గాన్నే ఎన్ను కొంటారు. ప్రబంధ కవులు అనేకులు రెండవ పంథానే ఎన్ను కొన్నారు ఈ మార్గంలో ప్రబంధ కవులు ఒకర్ని మించాలని మరొకరు తహతహతో ప్రయోగాల్ని సాగించారు

2. ప్రయోగ బుద్ధి:-

ఒక కవికిగానీ, ఒక వ్యక్తికి గానీ ప్రయోగం చేయాలి అనే బుద్ధి ఎందుకు కలుగుతుంది చైతన్యవంతుడైన మానవుడు నిరంతరం నూత్నత్వాన్ని అపేక్షిస్తూ ఉంటాడు దానికోసం నిరంతర యత్నం సాగిస్తూ ఉంటాడు ఒక వస్తువు లేదా ఒక విషయం కొన్నాళ్ళయిన తర్వాత పాత బడుతుంది ఆ పాతను వదలుకొని కొత్తను స్వీకరించడం కోసం యత్నం జరుగుతూ ఉంటుంది. ఆ యత్నంలో పూర్తి కొత్తదనం రాక పోయినా పాత వస్తువైనా కొత్త రూపంలో దర్శన మిస్తే మానవుడు దాన్ని సాదరంగా స్వీకరిస్తాడు ఈ కొత్త దనాన్ని సంపాదించడం కోసం ఒక వ్యక్తి చేసే పనుల్నే ప్రయోగాలనీ వాటి వల్ల లభించే కొత్త దనాన్నే ఆ ప్రయోగ ఫలితం అనీ మనం తలంచవచ్చును ఈ ప్రయోగం చేయాలి అనే కోరిక ఎవరికి ఉంటుందో వారి (బుద్ధి)ని "ప్రయోగ బుద్ధి" అని చెప్పవచ్చును

సాహిత్య రంగంలో కూడా మనం పై విషయాన్ని అన్వయించుకోవచ్చు తెలుగు సాహిత్యరంగంలో ఎందరో కవులు ఉద్భవించారు ఎన్నో కావ్యాలు వ్రాసారు కాని అందరూ సమానమైన కీర్తి ప్రతిష్ఠల్ని సంపాదించుకో గలిగారా? అందరూ చిరస్థాయిగా నిలబడగలిగే కావ్యాలు వ్రాయగలిగారా? ప్రతిభ ఉన్నా దానికి తోడు పరిస్థితులు, అవకాశాలు సరిగా ఉన్నపుడే కవితాను పండింపదలచిన కొత్త సాహిత్యపు పంటను పండించ గలడు ఆదికవి మొదలుకొని నేటి వరకు ఉన్న కవులలో ఎంతమంది చిరస్థాయిగా నిలువ గలిగారు? అవకాశాలు లభించడమే కాదు వారి ప్రయోగాలు కూడా తీవ్రంగా ఉంటేగాని ఆకవి కావ్యం కాల ప్రవాహానికి ఎదురొడ్డి నిలవజాలదు నన్నయగారు అస్తవ్యస్తంగా ఉన్న తెలుగుకు ఓ కొత్త రూపు నివ్వడానికై సంస్కృత పదజాలంపై తెలుగు ముద్ర వేసి భాషలో అనేక ప్రయోగాలు చేసి ఒక నూత్న సరళిలో వ్యాస భారతాన్ని ఆంధ్రీకరించారు అది అనువాదమైనా స్వతంత్ర కావ్యంలాగా నిలబడడానికి నన్నయ గారు భాషలో, రచనలో తదితర కావ్య లక్షణా లెన్నింటిలోనో అనేక ప్రయోగాలు చేసారు. ఆయన చేసిన ప్రయోగాలలో కొన్నిటిని తన కవితా గుణాలుగా 'సారమతింకవీంద్రులు' అనే పద్యంలో

పేర్కొన్నారు. ఇందులో పేర్కొనబడినవి ఆయన సాహిత్యంలో చేసిన తీవ్ర ప్రయోగాలు. వీటితో గూడా ఇతర ప్రయోగాలు తోడ్పడి వాటి ఫలితంగా ఆంధ్ర మహాభారతం మనకు పూజనీయంగా, చిరస్థాయిగా నిలబడ గలిగింది తిక్కనగారు చేసింది హరిహరనాథ తత్త్వ ప్రతిపాదన. అలతి అలతి పదాలతో కాహళ సంధించిన విధంగా కవిత్వాన్ని సృష్టించడం. నన్నయగారి కృషికి భిన్నంగా తాను శ్రమించి సంస్కృత పదజాల ప్రవాహం నుండి కొంత పక్కకు జరిగి తెలుగు పదజాలానికి కావ్యంలో సముచిత స్థానం కల్పించి అల్ప పదజాలంతో అనల్పార్థాన్ని సృష్టించిన తిక్కనగారి తీవ్ర ప్రయోగాలు ఆయనకు తెలుగు సాహిత్యంలో ఎనలేని కీర్తితో బాటు చిర స్థానాన్ని సంపాదించి పెట్టాయి ఈ విధంగానే ఎఱ్ఱన గారు కూడా తన ప్రయోగ ప్రావీణ్యంచే వారితో సమాన స్థాయిలో నిలబడ గలిగాడు శ్రీనాథ మహాకవి కవిత్రయ మార్గాలను వదలి సంస్కృత కావ్యాను వాదంలో, తదితర సాహిత్య సృష్టిలో నూత్న ప్రయోగాలు చేసి తన ప్రత్యేక స్థానాన్ని స్థిరంగా నిలుపుకో గలిగాడు. ఆయన సమకాలికుడైన పోతన గారు కూడా భక్తి భావ శబలితమైన హృదయంతో వ్యాస భాగవతాన్ని నవ విధ భక్తులలో వివిధ ప్రయోగాలు చేసి తీవ్ర భావా వేశంతో నూత్నత్వాన్ని సంపాదించి ఆంధ్ర భాగవతానికి ఆంధ్ర సాహిత్యంలో అగ్రస్థానాన్ని సంపాదించాడు ఈ విధంగా ఏదో ఒక మార్గంలో నూత్నత్వాన్ని తమ ప్రయోగాల ద్వారా సంపాదించి ప్రాచీన కవులంతా తమ స్థాన్నాన్ని స్థిరంగా, చిరంగా నిలుపుకో గలిగారు వారి లాగా ప్రయోగాలు చేయజాలని వారు, అలా చేయడానికి అవకాశాలు లేని వారు, ఉన్నా ఉపయోగించు కోనివారు వారి వెనుక స్థానాల్లో నిలబడి ప్రత్యేక అవసరాలలో మాత్రమే పైకి కనబడుతూ ఉంటారు కాబట్టి ప్రయోగ ప్రావీణ్యమే కవులకు స్థిరత్వాన్ని, చిరత్వాన్ని ఇస్తుందని తెలుస్తుంది తెలుగు సాహిత్యంలో ఏర్పరచ బడ్డ యుగాలలో ప్రతిదానిలోనూ ఇద్దరో, ముగ్గురో ప్రముఖ కవులు మొదటి స్థానంలో నిలబడి కనబడతారు. కాని ప్రబంధ యుగంలో అలాకాదు ఒకరిద్దరే ప్రముఖ కవులని ఈ యుగంలో చెప్పడానికి వీలులేదు. ఈ యుగంలో అనేకులు నూత్నత్వాన్ని సంపాదించడం కోసం వస్తువులో, పాత్రలలో, రసంలో, అలంకారాలలో, రచనలో వివిధ ప్రయోగాలు చేసి ఆ కాలంలో వెలసిన కావ్యాలన్నిటికీ ప్రత్యేక ప్రక్రియ స్థాయిని సాధించారు 'ప్రబంధం' అనే ప్రత్యేక ప్రక్రియ తెలుగు సాహిత్యంలో నిలబడడానికి ఆ కాలపు కవుల ప్రయోగాలే కారణం అని వేరే చెప్పవలసిన అవసరం లేదు. సాహిత్యంలో ఒక కాలంలో వెలసిన కావ్యాలన్నీ ఒక ప్రక్రియగా నిలబడి స్వతంత్ర ప్రతిపత్తి కలిగి ఉండడం సాహిత్య చరిత్రలోనే అపూర్వం దీని ప్రభావం తరువాతి కాలం మీద కూడా పడి ఆయుగానికి అనంతర ప్రబంధ యుగం అనే పేరు తెచ్చి పెట్టింది ఈ విధంగా ఈ యుగంలో వెలసిన ఈ ప్రక్రియకు తెలుగు సాహిత్యం లో ప్రత్యేకమైన కీర్తి ప్రతిష్ఠలు రావడానికి ఆ కాలపు కవుల ప్రయోగ ప్రావీణ్యం ప్రధాన ప్రత్యక్ష కారణం కాగా ఆనాటి రాజకీయ, సాంఘిక పరిస్థితులు, కవితా లతకు లభించిన ఆలంబనం, కవులకు లభించిన తదితర అవకాశాలన్నీ పరోక్ష కారణాలు.

కవితా రసాస్వాదనా సమర్థుడైన వ్యక్తి రాచరిక వ్యవస్థలో రాజుగా ఉంటే ఆకాలంలో సాహిత్య సరస్వతికి పట్టం కట్టబడడంలో ఆశ్చర్యం ఉండదు పదహారవ శతాబ్దంలో విజయనగరాన్ని ఏలిన శ్రీకృష్ణదేవరాయలు రాజ్యపాలనాదక్షుడే గాక సాహిత్య రంగంలో కూడా సార్వభౌముడు ఆయన స్వయంగా 'ఆముక్తమాల్యద' అనే ప్రబంధాన్ని సృష్టించిన కవి అల్లసాని వారి మనుచరిత్రకు, తిమ్మన గారి పారిజాతాపహరణానికి భర్త అయిన ఈ భూభర్త ప్రబంధ సాహిత్యలత పుష్పించి ఫలించడానికి అనేక దోహదాలు చేసాడు ఆయన పాలనా ప్రభావం వల్ల ఇతరులకు అంకితం ఇవ్వబడ్డ ప్రబంధాలు కూడా పెద్దన, తిమ్మన గార్ల ప్రబంధాల స్థాయిలో నిలబడ గలిగాయి ఆ కాలపు కవులకు యథేచ్ఛగా ప్రయోగాలు చేసుకోవడానికి చక్కటి అవకాశాలు లభించాయి రాజరికపు విరోధి అయిన ధూర్జటి లాంటి మహా కవి కూడా సర్వతంత్ర స్వతంత్రంగా సాహిత్యంలో తన మనోభీష్ట ప్రయోగాలచే సాహిత్య రంగంలో నిలబడ గలిగాడు కాబట్టి ఆనాడు ప్రబంధ కవులకు సాహిత్య రంగంలో యథేచ్ఛగా వర్తించడానికి అన్ని అవకాశాలు కలవని చెప్పవచ్చు వారి ప్రయోగాల ఫలితంగానే 'ప్రబంధం' అనే ప్రత్యేక ప్రక్రియ వెలసి ఆయుగానికి మేలు చేయడమేగాక తెలుగు సాహిత్యానికి కొత్త రూపు రేఖల్నిచ్చి సాహిత్యంలో ఘనమైన కీర్తి ప్రతిష్ఠలను సంపాదించి పెట్ట గలిగింది ఆలంకారికులు చెప్పిన సాహిత్య ప్రయోజనాలైన ఆనంద, ఉపదేశాలు రెండింటినీ సామాజికునికి అందించి ప్రబంధ ప్రక్రియ ధన్యఅయింది

## 3. ప్రయోగ భేదాలు:-

వివిధ మార్గాలలో ప్రబంధ కవులు ప్రయోగాలు అనేకం చేసినా ఒక రస ప్రస్థానంలో వీరు చేసిన ప్రయోగాలను మాత్రమే నేను పరిశీలిస్తాను రసాలలో శృంగారం ప్రధాన మైన రసమనీ, అసలు శృంగారమే రసరాజమనీ ప్రథమాధ్యాయంలో నిర్ణయించాను ద్వితీయాధ్యాయంలో వివిధ ప్రబంధాలలో పోషింపబడ్డ ప్రధాన రసాన్ని నిర్ణయించి అలంకార శాస్త్రానుసారంగా శృంగారం పోషింపబడ్డ తీరును పర్యాలోకించాను దానిని ఆధారంగా చేసుకొనే ప్రబంధ కవులు శృంగార రసంలోనే ఎన్ని ప్రయోగాలు చేయడానికి అవకాశం ఉంది? అని ప్రశ్నిస్తే సమాధానం చెప్పడం చాలా కష్టతరం. ప్రయోగాలు చేయడానికి అనేక మార్గాలు కవి ప్రతిభను బట్టి లభిస్తూ ఉంటాయి ప్రతిభావంతుడైన కవి తానే స్వయంగా కొన్ని మార్గాలను ఏర్పరచు కొంటాడు. పఠన సౌకర్యార్థమో, విశ్లేషణ సౌలభ్యానికో భేదాల్ని నిర్ణయించ వచ్చును కాని ప్రయోగాలన్నీ ఈ భేదాల కిందకే వస్తాయని చెప్పడం సమంజసంకాదు. అసలు ఈ ప్రయోగం ఈ శాఖకు చెందిందనీ, ఈ శాఖలో చేరుతుందనీ చెప్పడం కష్టం. ఉజ్జాయింపుగా మాత్రమే ఇది ఈ ప్రయోగం అని చెప్పవచ్చు.

స్థూలంగా సాంప్రదాయిక, నవ్య మిశ్ర ప్రయోగాలని ముప్విధాలుగా ప్రయోగాలను వింగడించవచ్చును సాధారణంగా కవులంతా (ఎక్కువమంది) ఈ మూడు ప్రయోగాలను

ఎక్కువో తక్కువో కలిపే చేసారు. ప్రాధాన్య వ్యపదేశాన్ని బట్టి మాత్రమే ఇది ఈ ప్రయోగం అని చెప్పబడుతుంది. ప్రబంధాలలోని ప్రయోగాల్ని కూడా పైవిధంగానే విభజించవచ్చు. ఈ ప్రయోగత్రయాన్ని ఇలా నిర్వచించ వచ్చు

సాంప్రదాయిక ప్రయోగం అంటే పూర్వ కవులు, పూర్వాలంకారికులు నిర్మించిన మార్గంలో ప్రయోగం చేయడం అని చెప్పుకోవచ్చు. సంప్రదాయం అంటే కట్టుబాటు, నిర్ణయం, పూర్వోక్త మార్గం అనే అర్థాలను చెప్పవచ్చు. ఈ మార్గాన్ని అనుసరించి చేయబడ్డ ప్రయోగాలన్నీ సాంప్రదాయిక ప్రయోగాలని చెప్పవచ్చు.

నవ్య ప్రయోగం అంటే సంప్రదాయం నుండి పక్కకు జరిగి అంటే సంప్రదాయాతీతంగా లేదా సంప్రదాయ భిన్నంగా చేసిన ప్రయోగం అని అర్థం

ఇక మిశ్ర ప్రయోగం అంటే కొంత సంప్రదాయాన్ని కొంత నవ్యతను మేళవించి, 'పాత కొత్తల మేలి కలయిక కొమ్మెరుగులు చిమ్మే' విధంగా చేసే ప్రయోగం అని అర్థం.

a) సాంప్రదాయిక ప్రయోగాలు:-

సాంప్రదాయిక ప్రయోగాలలో ప్రధాన భేదాలు మూడు

1 సంబోగ శృంగారం 2. విప్రలంభ శృంగారం 3 ఆభాస శృంగారం

మళ్ళీ సంబోగ శృంగారం 1. నాయికా నాయక భేద పరమైన సంబోగం 2 పరిమిత సంబోగం. 3 అపరిమిత సంభోగం 4 సన్నివేశ గత సంభోగం

నాయికా నాయక పరమైన సంబోగంలో 1 దివ్య 2 అదివ్య 3 దివ్యాదివ్య (ఇక్కడ అదివ్య అంటే మానవ అని అర్థం) 4. సన్నివేశ గత సంభోగం అని చతుర్విధం. ఇందులో మళ్ళీ ఒక్కొక్కటి నాయికలను బట్టి స్వీయ పరకీయ, సామాన్య భేదాలచే చతుర్విధాలౌతుంది అవే నాయక భేదాలైన ధీరోదాత్తుడు, ధీరోద్ధతుడు, ధీరశాంతుడు, ధీరలలితుడు అనే భేదాలచే నాలుగు విధాలు. రాక్షస సంభోగంలో మాత్రం ధీరోద్ధతుడొక్కడే నాయకుడుగా గ్రహింప దగినవాడు తక్కిన నాయకులు రాక్షస సంభోగానికి ఇష్టపడ్డా, ఆచరించినా తత్కాల పరిస్థితుల్ని బట్టి ధీరోద్ధతుడుగానే ఉంటారు

సాంప్రదాయిక సంభోగ శృంగారంలో మొత్తం ముప్పైమూడు (33) రకాలుగా ప్రయోగాలు నిర్వహించవచ్చు. ఇంకా అనుకూల, ధృష్ట, శఠ, పీటమర్ద, విటనాయకులనూ, స్వాధీన భర్తృ కాది అష్ట విధ శృంగార నాయికలను గూడా పరిగణనలోనికి తీసుకొంటే మొత్తం భేదాలు ఎనభై (80) అవుతాయి ఇంకా సూక్ష్మంగా పరిశీలిస్తే ఒక సంబోగ శృంగార భేదాలే శతమానం అవుతాయి.

ఇక రెండవ భేదమైన విప్రలంభ శృంగారం అభిలాష, మాన, ప్రవాస, విరహ భేదాలచే చతుర్విధం అభిలాష విప్రలంభం సకారణం, అకారణం అని ద్వివిధం. మాన విప్రలంభం ప్రణయ, ఈర్ష్యా భేదాలచే ద్వివిధం ప్రణయ మానం నాయికా నాయకులకు కలగడం, ఈర్ష్యామానం నాయికకు కలగడం అనే వాటిచే నాయికా గత ప్రణయ మానం, నాయకగత ప్రణయమానం, నాయికా గత ఈర్ష్యామానం అని అది త్రివిధం

ప్రవాస విప్రలంభం శాపవశాన గాని, తదితర కారణాలచే గాని కలుగుతుంది నాయిక పరదేశంలో ఉండడం వల్ల నాయకునకు, నాయకుడు పర ప్రదేశానికి పోయి రాకుండడం వల్ల నాయికకు ఇది కలుగుతుంది నాయిక గత, నాయక గత భేదాలచే ఇది ద్వివిధం

శృంగారంలో ఆభాసం మూడు విధాలని ఆలంకారికులు చెప్పారు

"ఏకత్రైవాను రాగశ్చేత్ తిర్యఙ్మ్లేచ్ఛగతేzపివా
యోషితో బహుసక్తశ్చేత్ రసాభాస స్త్రిధామతా "4

1. ఏకత్రానురాగం 2 తిర్యఙ్మ్లేచ్ఛగతం 3 యోషితో బహుసక్తి

ఈ ఆభాసం రసస్థితి పొందక భావంలో కూడా ఆభాసం పొందవచ్చు అప్పుడు దాన్ని భావా భాసం అంటారు భావాభాసం, రసాభాసం మూడు విధాలు కలిపి మొత్తం ఆభాసం చతుర్విధం

ఈ విధంగా సాంప్రదాయికంగా కవులు చేస్తూ వస్తున్న ప్రయోగాలే సుమారు అర్ధ శతం దాకా ఉంటాయి వీటిలో కొన్నింటిలో అయినా ప్రబంధ కవులు ప్రయోగాలు చేసే ఉన్నారు ఇవేగాక ధర్మ, అర్థ, కామ అనే భేదాలతో సాంప్రదాయిక శృంగారం త్రివిధ మౌతుంది ఈ భేదాల్ని అతిక్రమించి ప్రయోగింపబడే మోహ శృంగారాన్ని కూడా సాంప్రదాయిక భేదాలలో చేర్చవచ్చును

**b) నవ్య ప్రయోగాలు:-**

నవ్య ప్రయోగాలు ముఖ్యంగా మూడు విధాలు

1 వినూత్న శృంగారం 2 విచిత్ర శృంగారం. 3. విపరీత శృంగారం

సంబోగ, విప్రలంభాది సాంప్రదాయిక మార్గాన్ని వదలి వినూత్న రీతిలో శృంగారాన్ని పండించడమే వినూత్న శృంగారం.దీనిలో అంగాంగ వర్ణన ఉండదు. మానసిక శృంగార చిత్రణ, ఆరాధనాభావం, అమలినత్వం, నిరంతర ప్రేమ- అనే అంశాలతో అది నాలుగు విధాలుగా ఉంటుంది

విచిత్ర శృంగారం అద్భుత రస సమ్మిశ్రితమై విచిత్రంగా ఉంటుంది. బింబ ప్రతిబింబత్వం, భ్రాంతి ప్రణయం, - అనే అంశాలతో ఇది రెండు రకాలుగా ఉంటుంది

విపరీత శృంగారం విపరీతమైన భావనలను కలిగి విపరీత ధోరణిలో చిత్రించబడి ఉంటుంది ఇది లింగవ్యత్యయ రూపంతో ఉంటుంది మానవ రూప లింగ వ్యత్యయం, జంతు రూప లింగ వ్యత్యయం, అనే అంశాలతో రెండు విధాలుగా ఉంటుంది

c) మిశ్ర ప్రయోగాలు:-

మిశ్ర ప్రయోగాలలో ప్రాచీనతలో నవ్యత్వ మేళనం ఉంటుంది దీనిలో ఆభాసస్ఫూర్తి, తత్పరిహారం, నిరంతర శృంగారం అనే దాన్ని గ్రహించ వచ్చు నవ్యతలో ప్రాచీనత్వ మేళనమూ ఉంటుంది నవ్య రీతిలో ప్రయోగం చేస్తూ మళ్ళీ ప్రాచీన మార్గంలో పయనించడం దీనిలో ఉంటుంది. ఇవేగాక ఇంకా ఇతర ప్రయోగాలుంటే వాటిని ప్రత్యేక ప్రయోగాలుగా గ్రహించవచ్చు మోహ, శృంగారం కూడా అనేక రీతులలో ఉంటుంది కాబట్టి వాటిని ప్రత్యేక ప్రయోగాలుగా గ్రహించడం న్యాయంగా ఉంటుంది

4. పెద్దనగారి ప్రయోగాలు:-

ఆంధ్ర సాహిత్యంలోని ప్రబంధ యుగంలో పెద్దపీటను వేయించు కొన్న ధీశాలి పెద్దనగారే, శృంగార రసంలో ప్రయోగాలు చేయడంలోను అగ్రతాంబూలానికి అర్హులై ఉన్నారు పైన వింగడించిన మువ్విధాలైన ప్రయోగాలకూ మూల పురుషుడు పెద్దన గారే అని చెప్పినా చెప్పవచ్చు వారి ప్రయోగశాల మనుచరిత్ర ప్రయోగానికి ఉపయోగించు కొన్న రసాయన పదార్థం ఐక్యత లేని ఏకవాక్యతగల స్వారోచిషమను సంభవ ఇతివృత్తం ప్రయోగ కాలంలో పెద్దనగారు ఉపయోగించిన విధానాలు ప్రాచీన, నవ్య, మిశ్రమాలు ఏతత్ఫలం శృంగారం సాధారణ భావ పరిపుష్టమైన శృంగారం కాదు అది అసాధారణ భావ మిశ్రితమై ఆశ్చర్య, ఆహ్లాదపూర్వకమైన ఆనందాన్ని కలిగించేది పెద్దనగారి ప్రయోగాలు ప్రయోగ మాత్రాలుగా నిలవక రస పర్యవసాయులైనాయి అందుకే ఆయన ప్రబంధానికి ఆనందం పర్యవసానమైంది

పాత్రచిత్రణలో సన్నివేశ కల్పనలో, రసనిర్వహణశిల్పంలో, తదితరాల్లో ప్రణాళికాబద్ధంగా ప్రయోగాలను నిర్వహించి ప్రయోగ పూర్వక (ఫల) శృంగారం మేలిమి బంగారం లాంటిదని పెద్దన గారు నిరూపించారు ఇందు ఇతివృత్తం ఆది మధ్యాంతాల్లో గల శృంగార ఘట్టాలు ఇవి:-

1. వరూధినీ - ప్రవర (మాయా ప్రవర) ఘట్టం

2 స్వరోచి - మనోరమ (విభావసి, కళావతు) ల ఘట్టం

3. పారర్షి - పుంజిక స్థలల ఘట్టం.

4 స్వరోచి - వనదేవత (లేడి) ల ఘట్టం

ఈ నాలుగు ఘట్టాల్లో నిర్వహించబడ్డ శృంగారంలో ప్రయోగాలు చేయబడ్డాయి మూడవది అయిన పారర్షి - పుంజిక స్థలల ఘట్టంలో మోహ శృంగార పద్ధతిలో సాధారణ ప్రయోగమే చేయబడింది ఇక మిగిలిన ముడు ఘట్టాలలోనూ ప్రణాళికాబద్ధ ప్రయోగం చేయబడింది ఈ మూడిటినీ విశ్లేషించి చూస్తే పెద్దనగారు చేసిన ప్రాచీన ,నవ్య, మిశ్ర ప్రయోగాలు తమంతటతామే సువ్యక్తమౌతాయి

1. వరూధినీ - ప్రవర (మాయాప్రవర) ఘట్టం:-

పెద్దనగారు గ్రహించిన పాత్రలలోనే వారి ప్రయోగ బుద్ధి స్పష్టమౌతుంది మొదటి ఘట్టంలో వరూధిని దివ్యనాయిక అప్సర స్త్రీ ఆమె అనన్య కాంత అలాంటి కాంతకు అదివ్యుడు, మానవుడూ అయిన ప్రవరునిపై వలపు కలిగించడంలోనే ప్రయోగ బుద్ధి ఉంది నాయికా నాయకులిద్దరూ దివ్యులైనా, అదివ్యులైనా ఏక జాతికి చెందిన వారైతే ఆ శృంగారం ప్రాచీన మార్గంలో సాధారణంగా సాగి పోయేది భిన్న జాతి పాత్రలతో ప్రారంభమైన శృంగారం ప్రయోగ రూపాన్ని సంతరించుకొంది. వరూధిని దేవతా స్త్రీ అనిమేషస్థితి గలది అస్వేదగాత్రి జరామరణాలు లేనట్టిది. ప్రవరుడు మానవ మాత్రుడు కాబట్టి పైలక్షణాలతో భిన్నుస్తాడు ఈ ఇద్దరి సంయోగం అసాధ్యం అని చెప్పకుండానే తెలుస్తుంది కాని అసాధ్యాన్ని సాధ్యం చేయడమే గొప్ప ప్రయోగం అలాంటి ప్రయోగం కోసం పెద్దనగారు ఇక్కడ 'భ్రమర కీట' న్యాయాన్ని ఆశ్రయించి కథ నడిపారు

"అనిమేష స్థితి మాన్పె బిత్తరపు జూప స్వేద తావృత్తిమా
న్పె నవస్వేద సమృద్ధి బోధకళ మాన్పెన్ మోహ విభ్రాంతితో
డనె గీర్వాణ వధూటికిన్ 'భ్రమర కీట' న్యాయ మొప్పన్ మను
ష్యని భావించుట మానుషత్వము మెయింజూపట్టెనా నత్తఱిన్"5

మకరాంక శశాంక మనోజ్ఞమూర్తి అయిన ప్రవరుని తన ప్రియునిగా భావించి ఆ భావనాబలంతో తన దివ్యత్వాన్ని వదలి తాత్కాలికంగా అయినా వరూధిని అదివ్యత్వాన్ని ఆశ్రయించింది లేకుంటే సంయోగం సంభావ్యమయ్యేది కాదు తన కోరిక నెరవేర్చు కోవడానికి వరూధిని తన సహజ లక్షణాల్ని వీడింది. కాని ప్రవరుడు అలాంటి వాడుకాడు

వరూధిని దివ్య వనిత అయినా వేశ్య కాబట్టి మార్పు ఆమెకు చెల్లుతుంది. ప్రవరుడు ధర్మ నిష్ఠా గరిష్ఠుడు. అతనిలో మార్పుకలగడానికి వీలు లేదు. అతడు గృహస్థు. అతనిలో మార్పు కలిగితే 'ధర్మచ్యుతి' కలిగి పెద్దన గారు తలపెట్టిన ప్రయోగానికే 'చ్యుతి' కలిగేది. పెద్దనగారు సాధారణ కవికాదు కదా! కాబట్టి ప్రవరుని స్వత్వాన్ని నిలబెట్టాడు. వరూధిని తను మారైనా ప్రవరుని మార్చడానికి యత్నించింది ప్రవరుడు తను మారడు. ఇతరులు మారితే సహించడు అందుకే కవి వర్యుడు ఇక్కడ జాత్యైక్యాన్ని సూచించినా, భావైక్యాన్ని కూర్చలేదు. అలా చేస్తే చేయతలపెట్టిన ప్రయోగానికి పటుత్వం ఉండేది కాదు ఆ పటుత్వం కోసం రెండు భిన్న తత్వాలకు సంఘర్షణ కలిగించడం తప్పలేదు ఈ సంఘర్షణ వల్ల 'మథనం' ఏర్పడుతుంది ఈ మథనం వల్ల మొదట హాలాహలం పుట్టినా తర్వాత అమృతం పుట్టక తప్పదు అమృత ఫలమే ఆనందం కదా! తత్ సాధనకే ఈ సంఘర్షణ ఈ సంఘర్షణ సృష్టి కోసమే భిన్న జాతులు, భిన్న తత్వాలు కలిగిన స్త్రీ పురుష పాత్రల్ని ఎన్నుకోవడం వాళ్ళ వాళ్ళ స్వరూప స్వభావాల్ని ముందే అతి స్పష్టంగా నిరూపించి వాళ్ళను రంగంలో వదిలాడు కవి ఈ సంఘర్షణ సాగి సాగి వరూధిని వాదం వీగి ప్రవరుడు హవ్యవాహనుని సాయంతో తన గృహానికి వెళ్ళాడు ఇంతటితో ఈ ఘట్టాన్ని ముగిస్తే ప్రయోగం అసంపూర్ణ స్థితిలో ఉండి పోవడమే గాక అమృత ఫలానికి బదులు విషాదాంతత్వం సిద్ధించేది. వరూధిని నెగ్గాలి ప్రవరుడూ నెగ్గాలి ఇద్దరూ నెగ్గాలి భిన్నతత్వాలు గల ఇద్దరూ నెగ్గడం ఎలా? ఇది సాధ్యమా? సాధ్యం చేయగల నేర్పు కవి కలానికి ఉంది కాని అలా చేయలేదే! ప్రవరుడే నెగ్గాడే వరూధిని విషాద విరహాలతో కుంగి పోయింది కదా! కాని ఇప్పుడు వరూధినికి కలిగిన విరహ విషాదాలు తరువాత కలుగ బోయే సంభోగం సమ్యక్పరి పుష్టం కావడానికే వరూధినికి కలిగిన విరహ విషాద ధ్వాంతంలో కవిగారు ఒక వెలుగు రేఖను ప్రవేశ పెట్టారు అతడే మాయా ప్రవరుడు అతడు మనకు మాత్రమే మాయా ప్రవరుడు వరూధినికి మాత్రం ప్రవరుడే. అతనిని చూడగానే వరూధినిలో ఉత్సాహం పెల్లుబికింది

"పసిడి తోరము తోడి బాహువల్లన యెత్తి
సారెకు బొదలపై జాచి చాచి ‐‐
‐‐‐‐‐‐‐‐‐‐‐‐‐. కపట భూసురుని గనియె."6

"కాంచి కలక్వణత్క్వనక కాంచికయై యెదురేగి యవ్వుడ
క్కాంచన కేతకీ కుసుమ గాత్రి వయస్యలడించి తన్నికుం
జాంచల వీధి దాఱుచు ఘనాంత చలచ్చపలా కృతింగల
గాంచిన వస్తువుం దెలిసి కాంచిన యట్లను రక్తి గాంచుచున్"7

ప్రవర మాయా ప్రవర దర్శన మధ్య కాలంలో జరిగిన సంవాదం వరూధినికి ఒక కలలాంటిది. ప్రవరుని చూసినప్పుడు ఆమె మనస్సు ఎలా ఉందో ఇప్పుడూ అలాగే ఉంది.

అప్పుడు "చూచి ఝళంఝళత్కటక సూచిత వేగ పదార విందయై లేచి" అతనికి ఎదురేగింది. ఇప్పుడు 'కాంచి కలక్వణత్కనక కాంచిక యైయెదురేగింది'. అప్పటికీ ఇప్పటికీ ప్రవరునిపై గల దృక్పథంలో వరూధినిలో ఎలాంటి మార్పు రాలేదు. కాని అప్పటికీ, ఇప్పటికీ మధ్య ఏర్పడ్డ (పీడ) కల యొక్క ఛాయ మాత్రం వరూధిని మనః ఫలకంపై స్పష్టంగా ప్రతిబింబిస్తూ ఉంది అందుకే 'కలగాంచిన వస్తువుం దెలిసి కాంచిన యట్లు' అతన్ని చూసింది. నాటి చూపు, నేటి చూపు ఏక భావగతాలే అయినా కాలవ్యవధానంలో ఏర్పడ్డ 'కనలు' మాత్రం స్పష్టంగా మనం గుర్తించే విధంగా పెద్దనగారు పైరెండు చూపుల భేదాల్లో స్పష్టపరిచారు. తొలిచూపులో ఉన్న చురుకుదనం మలిచూపు నాటికి మాటు పడింది. కారణం ప్రవరుని ప్రతిఘటనే! అయినా వరూధిని ఆశ చావలేదు ఆమెకు ఆత్మ విశ్వాసం అధికం.

"ఆ కమలాక్షి యింపున దృగంచల మించుక మూసి హర్షబా
ష్పాకుల కోణశోణ రుచులగ్రమునం జనజూచు చూపుతీ
రై కనుపట్టె దమ్మరసమంటు కొనన్ వెడవింటి వాడు క్రో
ధైక ధురీణతం గఱచి యేసిన సింగిణి కోలయోయనన్"8

తనకు అతడు లభింపగలడు అనే విశ్వాసం వల్ల వరూధిని హర్ష బాష్పాకులిత అయింది. అలా ఆనందాన్ని పొంది కూడా అతని పూర్వ ప్రవర్తన స్మృతి పథంలో మెదలగా,

"తొలుదొల్త వాని గన్నుల గాంచినప్పుడు వల్ల వాధర గుండె జల్లు మనియె
నట రెండు మూడంజలరుగు నప్పుడు కాళ్ళ బంక జాక్షికి తొట్రు పాటు గదిరె
డాయంగ జను నప్పుడ ముఖాంబు జంబున గంబు కంధరకు దైన్యంబు దోచె
గదిసి నిల్చిన యప్డకను దోయి ఱెప్పల లలనకు మిగుల జంచలత బెరసె
గటకటాయను నపుడ గద్గదిక వొడమె
జెఱగు వట్టిన యపుడలేజెమట గ్రమ్మె
నొలసి మాటాడనుంకింప దలచి మోము
దేఱుకొన జూచునపుడ కన్నీరు వొడమె "9.

ఈ పద్యంలోని గుండె జల్లు మనడం, తొట్రుపాటు, దైన్యం చంచలత, గాద్గద్యం, స్వేదం, బాష్పం - అనే భావాలన్నీ రెండు సన్నివేశాలలో కలుగుతాయి ఒకటి శృంగార సన్నివేశం రెండవది భయానక సన్నివేశం అతడు తనను తప్పకుండా చేపడతాడనే ఆత్మ విశ్వాసంతో కూడిన శృంగార భావం ఇది వరకే తిరస్కరించిన ఈతడు తనను ఇక చేపట్టడు అనే భయానక భావం. ఈ రెండూ పైపద్యంలో విశదమౌతున్నాయి. భిన్న రసభావ సమ్మేళనం భిన్న రస భావ సంఘర్షణం. ఈ రెండూ పెద్దన గారికి వెన్నతో పెట్టిన విద్యలు (ఇలాంటి ప్రయోగాలు సన్నివేశగతాలే గాక పద్యాలలో అనేకాలు చేసాడు కవి) ఇలా వరూధినికి నిజ

ప్రవర భ్రాంతిని కలిగించ గలిగిన ఈ మాయా ప్రవరుడు ఎవరు? కవిగారు ఈ పాత్రను ఎందుకు గ్రహించారు? దీని వల్ల సాధించిన ప్రయోగ ఫలితం ఏమిటి? అని మనం ప్రశ్నించు కొంటే దానికి సమాధానం ఇది

"ఏ గంధర్వుడు తద్విలాసముల మున్వీక్షించి తానెంతయున్
రాగాంధుండయి కోరి హత్తకకడున్ రారాపులం గంతుడు
ద్వేగంబందగ జేయ నెవ్వగల నువ్విళ్ళూరుచున్ వేగువా
డా గంధర్వ కుమారు డంగభవ విద్యాపార గుండాత్మలోన్"10

ఈ గంధర్వుడు వరూధినిని ప్రేమించి ఆమెచే తిరస్కృతుడయిన వాడు ఆమెచే ప్రేమింపబడడానికి వేచిఉన్న వాడు దేవ జాతిత్వజనిత విమలజ్ఞాన పాటవం గలవాడవడం వల్ల ప్రవరతిరస్కృత అయిన వరూధినిచే తాను ప్రవర రూపంలో పునఃపురస్కృతుడనౌతానని ఎంచి, కామరూపుడైన ఆగంధర్వుడు,

"అర్ధ చంద్రుని తేట నవఘళించులలాట
పట్టె దీర్చిన గంగ మట్టితోడ
- - - - - - - - - - - - - - - - - - - - - - - - - -
బ్రవరుడయ్యె వియచ్చుర ప్రవరుడపుడు "11

ఈ గంధర్వుడు ఎలారాగాంధుడో, వరూధిని కూడా రాగాంధయే. ఏవిధంగానైనా వరూధినిని పొందాలి అనే కోరిక గంధర్వునికి కలదు ఏవిధంగానైనా ప్రవరుని పొందాలి అనే కోరిక వరూధినికీ గలదు. ఇద్దరి మనో రథాలు ఒక్కటే. ఇద్దరూ దేవ జాతులే వాళ్ళ వృత్తిలోనూ ప్రవృత్తిలోనూ ఎలాంటి భేదం లేదు ఇక వారి సంయోగానికి అడ్డు తగిలేది గంధర్వుని భౌతిక రూపం వరూధినికి కావలసింది కూడా ప్రవరుని భౌతిక రూపమే అతని ప్రవృత్తి కాదు గంధర్వునికి కావలిసింది కూడా వరూధిని భౌతిక రూపమే కాని ఆమె ప్రవృత్తి కాదు ఆమె వరుని వలచిందని గంధర్వునికి తెలుసు అయినా అతనికి కావలిసింది. ఆమె భౌతిక శరీరమే! ప్రవరుడు 'గృహస్థుడను, వ్రతిని' అని చెప్పుకొన్నాడు కాని వరూధిని అతని మాటలు చెవిని బెట్టక అతని భౌతిక శరీరాన్నే కోరి అతనిపై బడి అధరం ఆసించింది.

వరూధినీ గంధర్వుల మనోవృత్తులలో ఏ మాత్రం భేదం లేదు కాని వరూధిని అనన్యకాంత. ప్రవరుని తప్ప అన్యుని ఒల్లదు ఈ సంగతి గంధర్వునికి తెలుసు. కాబట్టి తన భౌతిక రూపాన్ని మరుగు పరచి ప్రవర రూపాన్ని ధరించాడు. వరూధిని ముందు ప్రవరుడు తన స్వత్వాన్ని నిలబెట్టుకొన్నాడు. వరూధిని అదివ్యుడైన ప్రవరునికి అనుకూలంగా మారింది అయినా తిరస్కృత అయింది. తను కామాంధయై ఏ పురుషునైనా కోరడం లేదు. అనన్యకాంతయై ప్రవరునే కోరుతుంది. ఇంతకు పూర్వమే వరూధినిచే తిరస్కృతుడైన

అప్పుడు "చూచి ఝుళంఝుళత్కటక సూచిత వేగ పదార వింధయై లేచి" అతనికి ఎదురేగింది. ఇప్పుడు 'కాంచి కలక్వణత్కనక కాంచిక యైయెదురేగింది'. అప్పటికీ ఇప్పటికీ ప్రవరునిపై గల దృక్పథంలో వరూధినిలో ఎలాంటి మార్పు రాలేదు. కాని అప్పటికీ, ఇప్పటికీ మధ్య ఏర్పడ్డ (పీడ) కల యొక్క ఛాయ మాత్రం వరూధిని మనః ఫలకంపై స్పష్టంగా ప్రతిబింబిస్తూ ఉంది అందుకే 'కలగాంచిన వస్తువుం దెలిసి కాంచిన యట్లు' అతన్ని చూసింది. నాటి చూపు, నేటి చూపు ఏక భావగతాలే అయినా కాలవ్యవధానంలో ఏర్పడ్డ 'కనలు' మాత్రం స్పష్టంగా మనం గుర్తించే విధంగా పెద్దనగారు పైరెండు చూపుల భేదాల్లో స్పష్టపరిచారు. తొలిచూపులో ఉన్న చురుకుదనం మలిచూపు నాటికి మాటు పడింది కారణం ప్రవరుని ప్రతిఘటనే! అయినా వరూధిని ఆశ చావలేదు ఆమెకు ఆత్మ విశ్వాసం అధికం

"ఆ కమలాక్షి యింపున దృగంచల మించుక మూసి హర్షబా
ష్పాకుల కోణశోణ రుచులగ్రమునం జనజూచు చూపుతో
రై కనుపట్టె దమ్మరసమంటు కొనన్ వెడవింటి వాడు క్రో
ధైక ధురీణతం గఱచి యేసిన సింగిణి కోలయోయనన్"8

తనకు అతడు లభింపగలడు అనే విశ్వాసం వల్ల వరూధిని హర్ష బాష్పకులిత అయింది. అలా ఆనందాన్ని పొంది కూడా అతని పూర్వ ప్రవర్తన స్మృతి పథంలో మెదలగా,

"తొలుదొల్త వాని గన్నుల గాంచినప్పుడు వల్ల వాధర గుండె జల్లు మనియె
నట రెండు మూడంజలరుగు నప్పుడు కాళ్ళ బంక జాక్షికి తొట్రు పాటు గదిరె
డాయంగ జను నప్పుడ ముఖాంబు జంబున గంబు కంధరకు దైన్యంబు దోచె
గదిసి నిల్చిన యప్డకను దోయి ఱెప్పల లలనకు మిగుల జంచలత బెరసె
గటకటాయను నపుడ గద్గదిక వొడమె
జెఱగు వట్టిన యపుడలేజెమట గ్రమ్మె
సొలసి మాటాడనుంకింప దలచి మోము
దేఱుకొన జూచునపుడ కన్నీరు వొడమె "9.

ఈ పద్యంలోని గుండె జల్లు మనడం, తొట్రుపాటు, దైన్యం చంచలత, గాద్గద్యం, స్వేదం, బాష్పం - అనే భావాలన్నీ రెండు సన్నివేశాలలో కలుగుతాయి ఒకటి శృంగార సన్నివేశం రెండవది భయానక సన్నివేశం అతడు తనను తప్పకుండా చేపడతాడనే ఆత్మ విశ్వాసంతో కూడిన శృంగార భావం. ఇది వరకే తిరస్కరించిన ఈతడు తనను ఇక చేపట్టడు అనే భయానక భావం ఈ రెండూ పైపద్యంలో విశదమౌతున్నాయి భిన్న రసభావ సమ్మేళనం భిన్న రస భావ సంఘర్షణం ఈ రెండూ పెద్దన గారికి వెన్నతో పెట్టిన విద్యలు (ఇలాంటి ప్రయోగాలు సన్నివేశగతాలే గాక పద్యాలలో అనేకాలు చేసాడు కవి) ఇలా వరూధినికి నిజ

ప్రవర భ్రాంతిని కలిగించ గలిగిన ఈ మాయా ప్రవరుడు ఎవరు? కవిగారు ఈ పాత్రను ఎందుకు గ్రహించారు? దీని వల్ల సాధించిన ప్రయోగ ఫలితం ఏమిటి? అని మనం ప్రశ్నించు కొంటే దానికి సమాధానం ఇది

"ఏ గంధర్వుడు తద్విలాసముల మున్వీక్షించి తానెంతయున్
రాగాంధుండయి కోరి పత్తకకడున్ రారాపులం గంతుడు
ద్వేగంబందగ జేయ నెవ్వగల నువ్విళ్ళూరుచున్ వేగువా
డా గంధర్వ కుమారు డంగభవ విద్యాపార గుండాత్మలోన్"10

ఈ గంధర్వుడు వరూధినిని ప్రేమించి ఆమెచే తిరస్కృతుడయిన వాడు. ఆమెచే ప్రేమింపబడడానికి వేచిఉన్న వాడు దేవ జాతిత్వజనిత విమలజ్ఞాన పాటవం గలవాడవడం వల్ల ప్రవరతిరస్కృత అయిన వరూధినిచే తాను ప్రవర రూపంలో పునఃపురస్కృతుడనౌతానని ఎంచి, కామరూపుడైన ఆగంధర్వుడు,

"అర్ధ చంద్రుని తేట నవఘళించులలాట
పట్ట దీర్చిన గంగ మట్టతోడ
-----------------------------
బ్రవరుడయ్యె వియచ్చర ప్రవరుడపుడు "11

ఈ గంధర్వుడు ఎలారాగాంధుడో, వరూధిని కూడా రాగాంధయే. ఏవిధంగానైనా వరూధినిని పొందాలి అనే కోరిక గంధర్వునికి కలదు ఏవిధంగానైనా ప్రవరుని పొందాలి అనే కోరిక వరూధినికీ గలదు. ఇద్దరి మనో రథాలు ఒక్కటే. ఇద్దరూ దేవ జాతులే. వాళ్ళ వృత్తిలోనూ ప్రవృత్తిలోనూ ఎలాంటి భేదం లేదు ఇక వారి సంయోగానికి అడ్డు తగిలేది గంధర్వుని భౌతిక రూపం వరూధినికి కావలసింది కూడా ప్రవరుని భౌతిక రూపమే. అతని ప్రవృత్తి కాదు గంధర్వునికి కావలిసింది కూడా వరూధిని భౌతిక రూపమే కాని ఆమె ప్రవృత్తి కాదు ఆమె వరుని వలచిందని గంధర్వునికి తెలుసు అయినా అతనికి కావలిసింది. ఆమె భౌతిక శరీరమే! ప్రవరుడు 'గృహస్థుడను, వ్రతిని' అని చెప్పుకొన్నాడు కాని వరూధిని అతని మాటలు చెవిని బెట్టక అతని భౌతిక శరీరాన్నే కోరి అతనిపై బడి అధరం ఆసించింది

వరూధినీ గంధర్వుల మనోవృత్తులలో ఏ మాత్రం భేదం లేదు. కాని వరూధిని అనన్యకాంత ప్రవరుని తప్ప అన్యుని ఒల్లదు ఈ సంగతి గంధర్వునికి తెలుసు. కాబట్టి తన భౌతిక రూపాన్ని మరుగు పరచి ప్రవర రూపాన్ని ధరించాడు వరూధిని ముందు ప్రవరుడు తన స్వత్వాన్ని నిలబెట్టుకొన్నాడు. వరూధిని అదివ్యుడైన ప్రవరునికి అనుకూలంగా మారింది అయినా తిరస్కృత అయింది. తను కామాంధయై ఏ పురుషునైనా కోరడం లేదు అనన్యకాంతయై ప్రవరునే కోరుతుంది ఇంతకు పూర్వమే వరూధినిచే తిరస్కృతుడైన

గంధర్వుడు ఇప్పుడు పురస్కృతుడు కావడం కోసం తన స్వత్వాన్ని వీడి, రూపాన్నే మార్చుకొని, దివి నుండి భువికి దిగి, భావను మార్చి మానవత్వంతో ఆమె ముందు నిలిచాడు. ప్రవరుని ముందు వరూధిని భౌతికంగా పూర్తిగా మారలేదు. కొన్ని సహజగుణాల్ని మార్చుకుంది. వరూధిని ముందు గంధర్వుడు తన భావ భౌతిక రూపం అన్నీ మార్చుకొన్నాడు. ఈ మూడు పాత్రలలోనూ మేరునగధీరుడు ప్రవరుడు కించిదూన నాయిక వరూధిని ఈ ఇద్దరి తర్వాత నిలవ దగ్గవాడు గంధర్వుడు. ఈ పాత్రల ప్రవృత్తులకు అనుకూలంగానే ప్రబంధంలో వాటి ప్రవేశం జరిగింది. తన ప్రయోగ నిర్వహణంలో పెద్దనగారు పాత్రల వరంగా ఒక్కొక్క మెట్టు కిందికి దిగినట్లు కనిపించినా, నిజానికి ఒక్కొక మెట్టుపైకి ఎక్కారు పాత్రల వరంగా దిగినట్లు కనిపించడం భ్రాంతి మాత్రమే ఇక్కడ పాఠకులను భ్రాంతిమంతుల్ని చేసి అక్కడ వరూధినిని మాయా ప్రవరుణ్ణి చూసి ప్రవరునిగా భ్రాంతి పడేట్లు చేసారు. ఈ 'భ్రాంతి' లోనే జవజీవాలు ఉన్నాయి ఎందరో మహానుబావులు ఈ ప్రపంచం'మాయ' అని చెబుతున్నా మనం 'నిజం' అని భ్రాంతి పడుతున్నట్లే మాయా ప్రవరుణ్ణి వరూధిని ప్రవరునిగా భ్రాంతి పడింది. పెద్దన గారు ఒక్కొక్క మెట్టు దిగినట్లు మనం భ్రాంతి పడుతున్నాం కాని వరూధిని భ్రాంతి తొలగ కుండే లాగున, ప్రవర రూపం ఆమెలో స్థిర పడేలాగున పెద్దనగారు చేయగలిగారు. ఈ విషయాన్ని గ్రహిస్తే మనలో కలిగిన భ్రాంతి పటాపంచలై పోయి ప్రవర, వరూధినీ, గంధర్వులాధారంగా ఈ మట్టంలో పెద్దనగారు చివరి మెట్టు ఎక్కారని మనం గ్రహించగలం

ఈ మాయా ప్రవరుడెవరో మనకు తెలిసింది ఈ పాత్రను గ్రహించడం వల్ల కవికి మూడు ప్రయోజనాలు నెరవేరాయి

1. వరూధిని ప్రవరునిపై గెలవడం

2. వరూధిని యొక్క ప్రవర భావనా బలంచే ఉత్తముడైన మనువు జన్మించడానికి బీజం నాటడం

3 దివ్యాదివ్య పాత్రల సమ్మేళనంచే తన శృంగార ప్రయోగాన్ని నిర్వహించడం.

ఈ ఘట్టంలో పాత్రల ద్వారా నిర్వహించిన ప్రయోగంలో ఒక గొప్ప మెలకువ చూపించాడు కవి వరూధినిలో 'రతి'ని ఉద్భవింపజేసి, ప్రవరుని మాటలతో దాన్ని రెచ్చ గొట్టించి, వరూధినిని 'అవశ'ను చేసాడు కవి అవశత్వంలో వరూధిని ప్రవరుని భౌతిక రూపాన్నే కోరుతుంది కాని అతడు విజాతీయుడు విజాతీయ సంయోగం కవికి ఇష్టంకాదు అందుకే ప్రవరుని అక్కడ నుండి తప్పించాడు అలా తప్పించి, సజాతీయుడైన గంధర్వుని ప్రవేశ పెట్టాడు ఈ గంధర్వుడు దానిని కోరి తిరస్కృతుడై కామాంధతలో ఉన్నవాడు. వరూధినీ కామాంధయే కాని ప్రవరుని తప్ప అన్యుని ఒల్లదు అందుకే గంధర్వునికి ప్రవరుని

భౌతిక రూపాన్ని ఇచ్చి సజాతీయులు, కామాంధులు అయిన వారికి సంయోగం కలిగించాడు కవి. ధర్మ స్వరూపుడైన ప్రవరుని తప్పించి, 'ధర్మచ్యుతి' కలుగ కుండా చేసాడు. అసలు కవికి ఇక్కడ కావలసింది ధార్మికుడైన ప్రవరుని స్వరూపమే. ఆ స్వరూపంతోనే తక్కిన ఇతివృత్తాన్ని నడిపాడు. ధర్మానికి గ్లాని కలుగుతున్నపుడు ధార్మికుడైన ప్రవరుడు ప్రతి ఘటించాడు ధర్మం ధర్మమే శృంగారం శృంగారమే. రెండింటినీ చక్కగా నిర్వహించి తన ప్రయోగానికి వన్నెతెచ్చారు కవిగారు వీటిలో ఒకటి వీగి పోవడం గాని, మరొకటి గెలవడంగాని జరుగలేదు. రెండూ గెలిచాయి ప్రతిభావంతుడైన కవి రెండు భిన్న మార్గాలలో ఒకే మారుపయనింప దలచినా సక్రమంగానే వయనిస్తాడు మనమే ఏదో ఒక మార్గంలో పక్షపాతులమై 'ఇది గెలిచింది అది ఓడి పోయింది' 'అది గెలిచింది ఇది ఓడి పోయింది' అని వాదిస్తూ ఉంటాం. సమ్యక్ దృష్టితో చూస్తే ఇలాంటి వాదాలు పుట్టడానికి అవకాశాలు తక్కువ

'ప్రయోగ బుద్ధి' అయిన పెద్దనగారు తన ప్రణాళికానుసారంగా మొదటి ఘట్టం అయిన వరూధినీ ప్రవర ఘట్టంలో మాయా ప్రవర పాత్రను ఆలంబనంగా గ్రహించి ప్రవర వరూధినీ శృంగారాన్ని, నిమ్నోన్నతాలు కలిగి ఉన్నా చివరకు గమ్యస్థానం చేరేట్లు చేసారు ఆటంకాల్ని పాత్రల స్వరూప స్వబావాల్ని ఆధారంగా చేసికొని తొలగిస్తూ తిలతండుల న్యాయాన ధర్మవీరాన్ని శృంగారాన్ని ఈ ఘట్టంలో చక్కగా పోషించారు. ఈ ఘట్టంలో ధర్మవీరం శృంగారానికి రెట్టింపు ప్రోత్సాహం కలిగించినట్లుగా పెద్దనగారు చిత్రించారు

ప్రవర - వరూధినీ ఘట్టంలో పాత్ర చిత్రణ కంటె పాత్ర పోషణ ద్వారా తన ప్రయోగ ప్రావీణ్యాన్ని చాటుకొన్న పెద్దన గారు. ఆ పాత్రల్ని ఆధారంగా చేసుకొని ఏర్పరిచిన సన్నివేశాలు ఆయన ప్రయోగాలను మరింత విస్పష్టంగా విశదపరుస్తున్నాయి ఈ ఘట్టంలో దివ్యమానవ శృంగార నిర్వహణలో పెద్దనగారు అతి చాకచక్యంతో వ్యవహరిస్తారని ఇంతకు ముందే తెలిసికొని ఉన్నాం ప్రవర నిష్క్రమణ అనంతరం మాయా ప్రవర పాత్రను (ప్రతిబింబాన్ని) ప్రవేశ పెట్టి మర్త్యాప్సరస్సంభోగాన్ని పరిహరించి మానవధార్మిక విలువల్ని కాపాడుతూనే గంధర్వాప్సరస్సంభోగాన్ని కల్పించడానికై ఆయన ఏర్పరచిన సన్నివేశం శృంగారంలో ఆయన చేయతలపెట్టిన అద్వితీయ ప్రయోగానికి ఒక మచ్చుతునక. ఒకే రసానికి ఆలంబనాలు కావలసిన నాయికా నాయకులైన వరూధినీ ప్రవర పాత్రల్ని గ్రహించి, ఒక పాత్ర ముఖాన శృంగారాన్ని, మరొక పాత్ర ద్వారా ధర్మ వీరాన్ని సమ ఉజ్జీలుగా నడిపి ఆకాల మర్యాదను అతిక్రమిస్తూ, అతి సాహసంతో కూడిన నూతన ప్రయోగాన్ని చేసారని చెప్పవచ్చు ఇలాంటి సన్నివేశ కల్పన అతిసమర్థుడైన కవి మాత్రమే చేయగలడు ఈ మొదటి ఘట్టంలో పెద్దనగారు చేసిన సన్నివేశగత ప్రయోగాలలో తిరస్కృత పునస్సమాగమం ఒకటి. వరూధిని ప్రవర తిరస్కృత. గంధర్వుడు వరూధినీ తిరస్కృతుడు ఇద్దరు తిరస్కృతులకు

సమాగమం కల్పించడానికి పెద్దనగారు గంధర్వుని బాహ్య రూపాన్ని మార్చారు. మర్త్యలోక ధార్మిక విలువల్ని కాపాడడానికి ప్రవరునికి దైవశక్తిని తోడుగా ఇచ్చారు. మళ్ళీ ప్రవరుడు కనిపించడు. వరూధిని గర్భవతి అయి, తన కోరిక తీరిన తర్వాత మంచి తనంతో ఆమెను ఒప్పించి వెళ్ళిన మాయా ప్రవరుడు కూడా కనిపించడు కాని వాళ్ళ భౌతిక స్వరూపప్రభావాలు వరూధినీ గర్భస్థ శిశువుపై బడి దివ్య మానవ సమ్మేళనంగా స్వరోచి ఉద్భవించాడు (సంభోగ సమయంలో మాయా ప్రవరుడు తన గంధర్వరూపంలోనే ఉంటాడు అందుకే సంభోగ సమయంలో ఆమె కనులు మూసుకొని ఉండేలా నియమం పెట్టి ఒప్పించాడు దీంతో ఇది దివ్య సమ్మేళనమే అవుతుంది వరూధిని మనసులో మాత్రం దివ్య మానవం అవుతుంది ) అతడు పుట్టడంతో వరూధిని (పాత్ర) కర్తవ్యం నెరవేరింది మనువును కనడానికి అర్హుడైన కుమారుణ్ణిగని ఆమె కూడా తెరమరుగైంది. ఈ మొదటి మట్టంలోని సన్ని వేశాల ద్వారా సాధించిన ఫలం ఇదే

పాత్ర పోషణ, సన్ని వేశ కల్పనల ద్వారా పెద్దనగారు శృంగారంలో ప్రాచీన నవ్య రీతులు మేళవించి ఒక గొప్ప మిశ్ర ప్రయోగాన్ని చేసారు ప్రవర, వరూధినుల వాదరంగంలో ధర్మవీర, శృంగార భావాలు సమ ఉజ్జీలుగా పోషింప బడ్డాయి. చివరకు శృంగార మూర్తి అయిన వరూధిని విజృంభించగా ధర్మమూర్తి అయిన ప్రవరుడు ఆమెను తిరస్కరించి, హవ్యవాహనుని ఆవాహనం చేసుకొని స్వస్థలానికి వెళ్ళాడు అతడు వెళ్ళి పోయిన సంగతి వరూధినికి తెలియదు తనను తిరస్కరించాడని అవజ్ఞ పొందింది. కాని ఆశ విడువలేదు ఆ సన్నివేశాన్ని మనో నేత్రంతో దర్శిస్తున్న సామాజికుడు శృంగారం ఆబాసం అయిందని తలచే అవకాశం ఉంది

అలాతలవడానికి కవి మాయా ప్రవర ప్రవేశానికి కొంత వ్యవధానం కల్పించాడు ఈ వ్యవధాన సమయంలో వరూధినికి కలిగిన విప్రలంభం చిత్రించబడింది వారి సమాగమానికి పూర్వం చిత్రింపబడింది కాబట్టి ఇది అభిలాష విప్రలంభం. ఈ అభిలాష విప్రలంభ చిత్రణం వల్ల వరూధినికి ప్రవరునిపై ఇంకా అభిలాష (కోరిక) కలదని తెలుస్తుంది ప్రవరుడు వెళ్ళిపోయిన విషయం వరూధినికి తెలియకున్నా సామాజికునికి తెలుసు కాబట్టి వారి సంగమం అసంభవం అని తలుస్తాడు. వరూధినికి ప్రత్యాశ ఉండడం వల్ల ఆమె విప్రలంభం అనుభవించడం సహజమే అయినా సామాజికుని దృష్టిలో అది 'ఏకత్రానురాగం'గా ముద్రవేసుకొంది అందువల్ల ఇది ఆభాసం అనే సామాజికుడు తలుస్తాడు సామాజికుడు తలవడం ఎందుకు? నిజానికి అది ఆభాసమే ప్రవరుడు ఎలాగూ రాడుకదా! వారిద్దరూ ఏకం అయ్యే అవకాశాలు లేవు కదా! ఇక అది ఆభాసం కాక రసం ఎలా అవుతుంది? అనుమానం లేదు. ఆభాసమే ఇలాంటి ఆభాసాన్ని అంటే ఏకత్రానురాగాన్ని చిత్రించడం ఆది కాలం నుండి వస్తున్నదే. దీంట్లో కొత్తదనం ఏమీలేదు. ఇది ప్రాచీన కవుల, ఆలంకారికులను అనుసరించి చేసిన ప్రయోగమే. కాని దీని వల్ల ప్రబంధ ప్రయోజనం

నెరవేరుతుందా? రససిద్ధి కలుగుతుందా? అలా కలుగాలంటే ఆభాసం పరిహారం కావాలి ఆభాసం పరిహారం కావడం ఏమిటి? ప్రవరుడు తిరిగివచ్చి వరూధినితో కలవడమా? అలా కలిస్తే ఇది ఆభాసం ఎలా అవుతుంది? కాబట్టి ప్రవరుడు తిరిగి రారాదు ఆభాసం పరిహారం కావాలి కవి గారు దీనికి ఒక ఉపాయాంతరాన్ని ఆలోచించాడు మరొక ప్రవరుని రంగం మీదికి తీసికొని వచ్చాడు మరొక ప్రవరుడా? అయితే ఇద్దరు ప్రవరులున్నారా? లేరు ప్రవరుడు ఒక్కడే వరూధినితో రమించాలనే కోరికతో ఆమె దరిచేరి తిరస్కృతుడైన ఒక గంధర్వుని మరొక ప్రవరునిగా కవి తీర్చిదిద్దారు. అతడు గంధర్వుడు కామరూపుడు కాబట్టి కవి కార్యం సఫలం అయింది. అతడే మాయా ప్రవరుడు వరూధినికి నిజమైన ప్రవరుడే. మనకు మాత్రం మాయా ప్రవరుడు అతడు కాముకుడు వరూధిని కూడా కాముకి ఇద్దరి బావాలూ తుల్యబలాలు ఇలా ఆభాసాన్ని పరిహరించి శృంగారాన్ని కొనసాగించడం పెద్దన గారు చేసిన నవ్య ప్రయోగం, దీంట్లో 'మాయ' చోటు చేసుకొంది కాబట్టి శృంగారం స్థాయి కొంత తగ్గిందని మనం అంగీకరించినా దోషంలేదు. పండితులే దీనిని 'ఔపచారిక శృంగారం' అని వ్యవహరించారు ఏదైనా శృంగారమే కదా! ఆబాసం, విప్రలంభాల్ని దాటి సంబోగ శృంగారానికి దారి ఏర్పడింది ఈ విధంగా ఆభాసాన్ని పరిహరించి వియోగాన్ని విసర్జించి సంబోగ శృంగారాన్ని చిత్రించడం వినూత్న ప్రయోగం ఆద్యంతాల్లో ప్రాచీన మార్గాన్ని, మధ్యలో నవ్య మార్గాన్ని అనుసరించి ఆద్యంతాల్ని ఏకం చేసి రససిద్ధి కలిగించడానికి ఇక్కడ మిశ్ర ప్రయోగాన్ని చేసి కృతకృత్యులయ్యారు పెద్దనగారు

స్వరోచి ఉద్భవించిన తర్వాత మొదటి ఘట్టం, అందలి పాత్రలు పూర్తిగా కనుమరుగయినాయి మళ్ళీ ఎక్కడా వాళ్ళ ప్రసక్తి ఉండదు మొదటి ఘట్టానికి రెండవ ఘట్టానికి సంబంధం కూడా అంతంత మాత్రమే ఆ సంబంధానికి కూడా స్వరోచి పాత్ర మాత్రమే ఆధారం ఇలా విడివిడి ఘట్టాలుండడం వల్లనే దీనిలో వస్త్వైక్యం లేదని కొందరు పండితులు భావించారు కాని "వస్తువులో ఐక్యత కంటె ఏకవాక్యత ప్రధానం"12 అని కూడా పండితులు భావించారు

2 స్వరోచి - మనోరమ (విభావసి, కళావతుల) ఘట్టం:-

రెండవ ఘట్టంలో స్వరోచి నాయకుడు మనోరమ, విభావసి, కళావతులు ముగ్గురు నాయికలు. 'ఏకత్రానురాగం' గల ఘట్టం మొదటి దానిలో చూసాం తర్వాత ఘట్టంలో 'తిర్యగ్గతం' అయిన శృంగార ఘట్టాన్ని చూస్తాం ప్రస్తుత ఘట్టంలో 'యోషితో బహుసక్తశ్చేత్' అనే దానికి ప్రతి రూపం అయిన శృంగార ఘట్టం చిత్రించబడింది. ఈ వాక్యం వల్ల ఒక స్త్రీకి అనేక పురుషులపై అనురాగం కలిగినట్లు చిత్రించడం ఆభాసమని తెలుస్తుంది అలాగే ఒక పురుషునికి అనేక మంది స్త్రీలపై అనురాగం ఉన్నట్లు చిత్రించినా ఆభాసమే అవుతుంది. దీన్ని కొందరు ఆలంకారికులు, పండితులు కూడా అంగీకరించే ఉన్నారు. స్వరోచి ధీరోదాత్త

నాయకుడు. అతడు రాక్షసునితో వీరోచితంగా పోరాడాడు. ఇతడు ఇద్దరు దివ్యుల కలయిక వల్ల పుట్టినా, వరూధిని మానవుడైన ప్రవరుని మనస్సులో నిలపడంవల్ల స్వరోచిలో అదివ్యాంశ (మానవత్వం) అధికంగా ఉంది. అతడు బోయలకు రాజు కాబట్టి ఇతడు దివ్యాంశ గల అదివ్యుడని చెప్పవచ్చును ఇలాంటి స్వరోచి రాక్షసునితో పోరి అతన్ని సంహరింపగా రాక్షసరూపు పోయి ఇందీవరాక్షుడు అనే గంధర్వుడు ప్రత్యక్షమై తన కూతురైన మనోరమను అతనికిచ్చి విధి విధానంగా వివాహం చేసాడు. గంధర్వుని కూతురు కాబట్టి మనోరమ కూడా దివ్యనాయిక దివ్యాదివ్యుడైన స్వరోచి ఆమెను పరిగ్రహించడం యుక్తి యుక్తంగానే ఉంది అలా వివాహమాడిన మనోరమను చెలికత్తెలు పడకటింట్లో చేర్చి ఏదో నెపంతో అంతా నిష్క్రమించారు. అపుడు సంగమానికి తొందర పడుతున్న స్వరోచి,

"దట్టంబు నీకట్టినట్టి చెంగావికి బాగుగాదని కేల బయట నిమిరె
గోరంటో గోళ్ళ నిక్కువపు గెంపోయని చెయిపట్టి నయమున సెజ్జసేర్చె
నగరు ధూపము చేత నయ్యోతనూవల్లి సెగనోకునని యెద జెయ్యివెట్టె
మృగనాభికా మకరికల గ్రమము మించె నని మూరు కొనుచు జుంబన మొనర్చె
హారమణులిట నూపునాయణుత నున్న
హార మణులకు గాంతి నీడౌనొ కావొ
యనుచు నక్కున గదియించు నానెపమున
గంపమును బొందు సతిమేను గౌగిలించె"14

ఇంత తొందర పడుతున్న స్వరోచికి సంభోగ సుఖాన్ని ఇవ్వక మనోరమ అన్యథా ప్రవర్తించింది ఇది అనౌచిత్యం అని చెప్పక తప్పదు

"ఇట్లు కవియం దమకించి త్రస్తరుల గుస్తరింప నింపు గలిగియు మునుమున్న మనంబునం బొడమి యుండు నడలప్పుడు తలంపునం బాఱిన సమర్థుండగు నతనిచే నది తీర్పించు కొనం గలదియై నవేధ గావున మాటలందేటపడం శంకించి స్త్రీ స్వభావంబునం దొరగు కన్నీరు కంకణ కేంకృతులు మీఱ గోరబాఱ మీటుచు నూరక యున్నం గనుంగొని - ............ నేమి సాధింప వలయు జెప్పుమది వేధచే నున్న సాధించెద ..."14

అని స్వరోచి అడిగితే మనోరమ చెప్పిన విషయం ఇది.

"అక్కట నాయెదన్మిగుల నక్కర గల్గి చరించు నెచ్చెలుల్
చిక్కిమునీంద్ర శాపహతి జెందిన దుర్దమ రోగ బాధలం
బొక్కుచు నున్నవారు వనభూముల దద్దశ మాన్పవేని నా
కెక్కడి సౌఖ్యమన్న ............ "15

చెలికత్తెల రోగం మాన్పుమని ఏడవడానికి ఇదా సమయం? పడక గదిలో సం భోగ వేళ చెబితేగాని అతడాపని చేయడా? ఒక వేళ మనోరమ అలా కోరినా స్వరోచి ఆమెను ఊరడించి తర్వాత ఆమె నెచ్చెలుల రోగాన్ని పోగొడితే కొంత సమంజసంగానే ఉండేది. కాని వెంటనే దారి చూపుమని స్వరోచి ఆమె వెంట చెలికత్తెలు ఉన్న వనానికి బయలు దేరాడు. వారికి చికిత్స చేసి వారిని పరిగ్రహించాడు. తర్వాత ముగ్గురితో సౌఖ్యాన్ని అనుభవించాడు. సంభోగం చిత్రించే సమయంలో దాన్ని వదలి కథను అన్యధామరల్చడంలో పెద్దనగారి ఉద్దేశం ఏమిటి? పెద్దన లాంటి కవి ఇచట అనౌచిత్యానికి పాల్పడతాడా? పాల్పడినట్లే కనబడుతుంది కాని కాదు. ఈ ముగ్గురు నాయికలూ పైకి వేర్వేరు నాయికలుగా కనిపించినా ముగ్గుర్ని కూడా ఒకే నాయిక యొక్క భిన్నాంశాలుగా కవి పరిగణించాడు అందుకే వారు విడివిడిగా ఉన్నపుడు వారికి స్వరోచికి సంభోగం కలుగ నివ్వలేదు. అలా కలుగ నివ్వక పోవడంలో స్వరోచిలో సంయోగాత్రుత, ఔత్సుక్యాన్ని పెంపొందించడమేగాక నాయికా త్రయం ఏక నాయిక భిన్నాంశాలు కాబట్టి వారు ఏకత్ర సమకూడి నప్పుడే స్వరోచికి సంగమం సిద్ధించింది విభావసి మందారుడు అనే విద్యాధరుని కూతురు. కళావతి పారుడు అనే బ్రహ్మర్షికి పుంజిక స్థల అనే అప్సరసకు పుట్టిన కూతురు. ఈ ఇద్దరు నాయికలు గూడా దివ్యాంశ సంభూతులే మనోరమ కూడా అంతే. కాబట్టి వీళ్ళను దివ్య నాయిక యొక్క విభిన్నాంశాలుగా మనం పరిగణించ వచ్చు. కవి గూడా అలాగే తలచి ఉంటాడు. లేకుంటే పెద్దనగారు శృంగార రస నిర్వహణలో అనౌచిత్యానికి పాల్పడి ఉంటాడా?

మనం ఇలా సమర్థించు కొన్నా గూడా మనోరమ, విభావసి, కళావతి అనే మూడు పేర్లతో ముగ్గురు నాయికలు భౌతికంగా కనిపిస్తూనే ఉన్నారు కాబట్టి 'యోషితో బహుసక్తశ్చేదో' అనే మాటను ఆధారంగా గ్రహించి ఇక్కడ 'ఆభాసం' సంభవించిందని మనం చెప్పవచ్చును ఈ ఆభాస నిర్వహణలో కూడా పెద్దనగారు అప్రమత్తులుగానే వ్యవహరించారు ఈ ఆభాసం కూడా ఆభాసమే పైవిధంగా అంతర్గత సాక్ష్యాలతో సమర్థించినా ఈ ఆభాసం పరిహారమౌతుంది మొదటి ఘట్టంలో మాయా ప్రవరుని ప్రవేశపెట్టి ఆబాసాన్ని పరిహారం చేసాడు కవి. ఆభాస పరిహార ప్రణాళిక ఇక్కడ కూడా ఉన్నా పై పద్ధతిని ఇక్కడ అనుసరించలేదు. ఇక్కడ అలంకారికంగా ఆభాస పరిహారానికి అవకాశం కలిగించాడు ఎలా అంటే బహు నాయికలతో వ్యవహరించే స్వరోచిని అలంకార శాస్త్రానుసారంగా 'దక్షిణ నాయకుడు' అని చెబితే ఇక్కడ కలిగిన ఆభాసం పరిహారమై నిరంతర శృంగారానికి అవకాశం లభిస్తుంది. ఆముగ్గురు నాయికల్ని ఒకరి భిన్నాంశాలని సమర్థించు కొన్నా, స్వరోచి దక్షిణ నాయకుడని చెప్పుకొన్నా ఆభాసం పరిహారమై సంభోగం సిద్ధిస్తుంది ఆభాస నిర్వహణ తత్పరిహారం, సంభోగ సిద్ధి అనే క్రమంలో మొదటి దానికి దీనికీ ఎలాంటి భేదం లేదు. కాని ఇక్కడ కలిగిన ఆభాసం, తత్పరిహారం కాక తాళీయంగా కనిపిస్తున్నా అలంకారిక మైందే. మొదటి దానిలో కలిగిన ఆభాసం ప్రకృతి సిద్ధం, తత్పరిహారం ప్రయత్న (పూర్వక)

సిద్ధం. కాబట్టి మొదటి ఘట్ట నిర్వహణలో ఉపజ్ఞ కలిగిన పెద్దనగారు మిక్కిలి ప్రజ్ఞను ఉపయోగిం చాల్సి వచ్చింది. ఈ ఘట్టంలో, చెప్పబోయే ఘట్టంలో కూడా సాంప్రదాయిక పద్ధతిని అనుసరించే పెద్దనగారు ప్రయోగాన్ని నిర్వహించారు. ఆభాస పరిహార లక్షణం వీటిలో కూడా కనబడుతుంది. కాబట్టి ఇది నవ్య ప్రయోగం అందువల్ల మొదటి ఘట్టంలో లాగా ఈ ప్రయోగాలు కూడా మిశ్ర ప్రయోగాలే. నాయికా నాయకులలో దివ్యాదివ్యత్వ మేళనం మొదటి రెండు ఘట్టాల్లో ఉన్నా స్వరోచిలో ఆలక్షణాలు ప్రస్ఫుటంగా కనబడుతున్నాయి మొదటి ఘట్టంలో వరూధినీ ప్రవరులకు కలిగిన సంఘర్షణ బీజాలు స్వరోచిలోనూ కనబడుతున్నాయి. అలా ఇద్దరి లక్షణాలను స్వరోచి పుణికి పుచ్చుకున్నా అతనిలో అధిక స్థానం సంపాదించు కొన్నవి వరూధినిలోని లక్షణాలే. ఆ ప్రభావం వల్లనే స్వరోచిలో బోగతృష్ణ అధికంగా కనబడుతుంది. ప్రవరుని లక్షణాలు అతనిపై చూపిన ప్రభావం అతనిలో అంతర్గతంగా అణగి ఉండి ఆలక్షణాలు స్వరోచితనూభవుడైన స్వారోచిమనిలో రూపుగట్టుకొన్నాయి మొదటి బీజరూప ప్రబావం ఫలిత రూపంలో కనబడడానికి దీనిలో మూడు తరాల కథ నిర్మించ బడింది ఇక రెండవ ఘట్టంలోనిది ఆభాసం అని మనం చెప్పుకోవడానికి పెద్దనగారి మనుచరిత్రలోని పద్యాన్నే ఆధారంగా గ్రహించవచ్చు ఆపద్యం ఇది.

"వలువుర యందు నొక్కనికి బ్రీతియు నొక్కనియందు జాడన
గ్గల మగు ప్రేమ పల్వురకు గల్గుట యద్భుత మట్లుగానయి
వ్వెలదుల యందు గూర్మిపస వీనికి నేమియు లేదు వీనియం
దలవడ గల్గదీ జలరుహాక్షులకుం బ్రియమెవ్విధంబునన్"16

3 స్వరోచి వనదేవతల ఘట్టం:-

ఇక మూడవ ఘట్టం కూడా స్వరోచికి సంబంధించిందే అయినా దానికి విశేష ప్రతిపత్తి ఇవ్వవలసి ఉంది. స్వరోచి శృంగార వృక్షానికి శాంత ఫలాన్ని ఇచ్చింది ఈ ఘట్టమే. ఇది స్వరోచి - వనదేవతలకు సంబంధించింది. దీనిలో తిర్యగ్గత శృంగారం చిత్రించబడింది 'తిర్యజ్మ్లేచ్ఛగతోzపివా' అనే ఆలంకారిక వాక్యాన్ని అనుసరించి, తిర్యక్కైన లేడిక, స్వరోచికి సంబంధించి చిత్రించబడ్డ శృంగారం కాబట్టి ఇందు కూడా ఆభాసమే నిర్వహింప బడింది ఆలేడి స్వరోచిని కౌగిలించు కొమ్మని కోరింది ఆలింగన, చుంబనాదులన్నీ సంబోగ శృంగార భేదాలే కదా! అతడు దాన్ని కౌగిలించు కొన్నాడు. అతని స్పర్శతో అది స్త్రీ రూపాన్ని ధరించింది తను వనదేవతనని చెప్పుకొంది. ఈ వనదేవత కూడ మనోరమాది తక్కిన నాయికల లాగా దివ్యనాయికే అయినా మనువును కనడానికి దేవతల ప్రార్థనపై అతని కడకు వచ్చింది. స్వరోచిలో అంతర్గతంగా ఉన్న ప్రవర తేజం వనదేవతలో మనువు ఉద్భవించడానికి తోడ్పడింది స్వరోచిలో అతి మిక్కుటం గా ఉన్న 'వరూధినీ 'రిరంస'

ప్రభావా'న్ని మనోరమ, విభావసి, కళావతులనే ముగ్గురు నాయికలతో తీర్చుకొన్నాడు. ప్రవర తేజం ద్వారా వనదేవతలో మనువును కన్నాడు.

ఈ ఘట్టంలో తిర్యగ్గతి చిత్రించబడడం వల్ల ఇది ఆభాసం. పెద్దనగారి శృంగార ప్రయోగ ప్రణాళిక ప్రకారం ఆ ఆభాసాన్ని పరిహరించాలి. దీనికి పెద్ద శ్రమ లేకుండానే స్వరోచి స్పర్శతో ఆ లేడి స్త్రీ రూపాన్ని ధరించడంతో ఆ ఆభాసం పరిహారమై వారి సంబోగం సిద్ధించింది. ఈ మూడు ఘట్టాలలోని పాత్రలన్నీ దివ్యాంశ కలిగినట్టివి. వాటి ద్వారా ఆభాసం, తత్పరిహారం, సంభోగ సిద్ధి అనే ప్రణాళికను అనుసరించి మిశ్ర ప్రయోగం చేయబడింది ప్రణాళికానుసారంగా ఈ మూడు ఘట్టాలలో సమతూకం ఉన్నా, మొదటి మట్టానికీ, తక్కిన రెండు ఘట్టాలకూ చాలా అంతరం గలదు. మొదటి ఘట్టంలో పెద్దనగారు ప్రయత్న పూర్వకంగా శృంగార, ధర్మ వీరాలకు సంఘర్షణ సృష్టించి, తద్వారా ఆభాసాన్ని సృష్టించారు. ఆ ఆబాసం పరిహారం కాకుంటే శృంగార రస సిద్ధి ఉండదు కాబట్టి తత్పరిహారానికై మరో పాత్రను ఊతంగా గ్రహించి, అతనికి ప్రవర రూపాన్నిచ్చి, ఆభాసాన్ని పరిహరించి, వరూధిని వియోగాన్ని విసర్జించి సంబోగ సిద్ధి కలిగించారు ఇలాంటి ప్రయోగాన్ని నిర్వహించడానికి కవి ఎంతో ప్రతిభావ్యుత్పత్తులు కలవాడై ఉండాలి. తక్కిన మట్టాలలోని ప్రయోగాలు ఈ ప్రదమ ఘట్ట ప్రణాళికానుసారంగా చేయబడినా, వాటిని ఏ ఇతర కవులైనా చేయగలరు మొదటి మట్టంలోని ప్రయోగమే అనన్య సాధారణమైంది తక్కిన రెండూ సర్వకవి సాధారణాలు మొదటిది ప్రయత్నజం తక్కినవి అప్రయత్నజాలు

4. పారర్షి - పుంజికస్థలల ఘట్టం:-

ఇక మిగిలింది నాలుగవ ఘట్టం. పారర్షి పుంజిక స్థలలకు సంబంధించింది. దీంట్లో పారుదు ఋషి పుంజిక స్థల అప్సరస. దేవవేశ్య మొదటి ఘట్టంలో ధర్మవీర, శృంగారాలకు ఘర్షణ కలిగించిన విధంగానే ఇక్కడ కూడా శాంత శృంగారాలకు ఘర్షణ కలిగించడానికి అవకాశం ఉంది కాని ఇక్కడ అలా చేయాల్సిన అవసరంలేదు ఇది కవితాను వేసుకొన్న ప్రణాళికా బద్ధ ఘట్టాలలో ఒకటికాదు అదీగాక రెండవ ఘట్టంలోని కళావతి జన్మ వృత్తాంతాన్ని చెప్పడానికి ఏర్పడ్డ ప్రాసంగిక ఘట్టం దీనిలో కూడా పాత్రల ప్రణాళిక పక్కకు తొలగలేదు నాయికా నాయకులు దివ్యాదివ్యులు ఇక్కడ శృంగారానిదే పైచేయిగా చిత్రించబడింది. పారుదు బ్రహ్మర్షి అయినా, కాముని బారి నుండి తప్పించుకోలేక పోయాదు ప్రకృతి గతమైన వాతావరణం, పుంజికస్థల సౌందర్యం అతని మనస్సు (తపస్సు)ను భగ్నం చేసాయి తన స్వత్వం వీడి పుంజిక స్థల వద్దకు పోయి పారుదు,

"మేను గరు పాఱ దమిన
మ్మౌని జపము దపము దన్ను మరచి యనంగ

గ్లాని బడి కదిసి వడకుచు
హీన స్వర మెసగ బ్రోవవే నన్నుచున్"17

ఆమె చేయి పట్టాడు. ఆమె శిరసు వంచి అవశలాగా అతనిపై వ్రాలింది. ఆమెను పర్ణశాలలోకి చేర్చి కందర్పకేళిలో తేలాడు ఇది భారతంలోని శకుంతల జన్మ వృత్తాంత ఘట్టాన్ని (విశ్వామిత్ర, మేనకల శృంగారం) తలపిస్తూ ఉంది. దీని ప్రయోజనం ఇంతే ఇది గతాను గతిక మైన శృంగార చిత్రణమే అయినా దీన్ని కూడా సాంప్రదాయిక ప్రయోగంగా మనం చెప్పుకోవచ్చు. కాని మొదటి మూడు ఘట్టాలే ప్రయోగ శబ్ద అర్థాలు. అదీగాక కవి వృత్యులకంలో తాను చేయ తలపెట్టిన ప్రయోగాల గూర్చిన ఒక ప్రణాళిక ముద్రితమయ్యే ఉంటుంది. ఆ ముద్రిత ప్రణాళిక ఆ కవి చేసిన ప్రయోగాల్ని వింగడించి, విశ్లేషించి నప్పుడు మనకు స్పష్టంగా కనబడుతుంది. అలాంటి ప్రణాళిక పై మూడు ఘట్టాల్లోనూ క్రమం తప్పకుండా నిర్వహించ బడింది.

ఆభాసం, తత్పరిహారం, సంభోగ (లేదా నిరంతర) శృంగారం - అనే ప్రణాళికను అనుసరించి, ప్రవర వరూధినీ ఘట్టం, స్వరోచి, మనో రమాదుల ఘట్టం; స్వరోచి, వనదేవతల ఘట్టాలలో సాంప్రదాయిక, నవ్య పద్ధతుల్ని మేళవించి, చక్కటి మిశ్ర ప్రయోగం చేయబడింది.

ఈ ప్రయోగ విధానాన్ని అనుసరించీ, దీన్ని మనసులో పెట్టుకొనీ, వీటి కంటే విభిన్నంగా లేదా అను కూలంగా ప్రయోగాలు చేయాలని ఎంచి పెద్దనగారి తర్వాత ప్రబంధ కర్తలంతా ఏదో ఒక విధమైన ప్రయోగాలను, లేదా ప్రయోగాన్ని చేసారు వాటన్నిటినీ విశ్లేషిస్తే ఆంధ్ర ప్రబంధాలలో చేయబడ్డ ప్రధాన ప్రయోగాలు, అప్రధాన ప్రయోగాలు ఏవో మనం గుర్తించవచ్చు.

### 5. తిమ్మన ప్రయోగాలు:-

పారిజాతాపహరణకర్త అయిన నంది తిమ్మనగారు సాంప్రదాయిక మార్గంలోనే ఒక విశిష్ట ప్రయోగాన్ని చేసారు. అలంకార శాస్త్రాలలో చెప్పబడ్డ 'మాన విప్రలంభా'న్ని ఆధారంగా చేసుకొని చక్కటి సాంత్వన సన్నివేశాన్ని ఏర్పరచి తద్వారా శృంగారంలో ఒక చక్కటి ప్రయోగాన్ని చేసారు. మానం ద్వివిధం ప్రణయ మానం, ఈర్ష్యామానం అని. భార్యా భర్త లిద్దరికీ సరస ప్రవర్తనలో కలిగే మానం ప్రణయ మానం ఇది నాయికా నాయకు లిద్దరకూ కలుగవచ్చు ఇది రమ్యమైన సన్నివేశం దీని కంటే రమ్యతరం ఈర్ష్యామానం. ఇది నాయికకు మాత్రమే కలుగుతుంది. ప్రణయ మానం ఏదో ఒక స్వల్పకారణం వల్ల కలిగి స్వల్పంగానే (అంటే స్వల్ప సాంత్వన విధానం వల్లనే) తొలగి పోతుంది దీని కంటే బలవత్తరమైంది ఈర్ష్యామానం. ఇది తొలగడానికి కాల వ్యవధి అవసరం కావడమే గాక షడ్విధాలైన మాన

4. శల్యాసుర - (అభినవ కౌముదుల) ఏకత్రాను రాగ ఘట్టం.

5. మధురలాలస, అభినవ కౌముదులతో కళాపూర్ణుని దాంపత్య శృంగార ఘట్టం

ఈ అయిదింటిలో సరస్వతీ చతుర్ముఖుల ఘట్టంలో శల్యాసుర అభినవ కౌముదుల ఘట్టంలో, మధురలాలస, అభినవ కౌముదులతో కళాపూర్ణుని దాంపత్య శృంగార ఘట్టంలో సాంప్రదాయిక ప్రయోగాలు చేయబడ్డాయి. ఈ మూడు ప్రయోగాల్లోనూ చక్కటి వైవిధ్యం ఉంది. తక్కిన రెండు ఘట్టాలలో అంటే కలభాషిణీ మణికంధరుల, రంభానల కూబరుల ప్రణయ ఘట్టంలోనూ; సుగాత్రీ శాలీనుల, సుముఖాసత్తి మణిస్తంభుల శృంగార ఘట్టంలోనూ నవ్య ప్రయోగాలు చేయబడ్డాయి. ఈ ప్రయోగాల్ని క్రమంగా పరిశీలిస్తే వాటి స్వరూప, స్వభావాలు సువ్యక్తం అవుతాయి.

## A. సాంప్రదాయిక ప్రయోగాలు:-

### 1. సరస్వతీ చతుర్ముఖుల ప్రణయ మట్టం:- (ప్రణయమానం)

సరస్వతీ చతుర్ముఖుల ఘట్టంలో నాయకుడు సృష్టికర్త అయిన బ్రహ్మ నాయిక చదువుల తల్లిగా రాణకెక్కిన వాణి. ఈ రెండూ దివ్య పాత్రలే వారి శృంగారం కూడా దివ్య శృంగారమే. ఈ దివ్య శృంగారంలో కూడా సం యోగ వియోగాలు రెండూ ఉన్నాయి. వారి సంయోగం మిక్కిలి రుచికరంగా ఉండడానికి స్వల్ప వియోగం కల్పింప బడింది ఇక్కడ వారికి కలిగింది మాన విప్రలంభం ఈ మానం కూడా ప్రణయమానం బ్రహ్మతన నాలుగు ముఖాలతో ఒక్కసారే సరస్వతి ముఖం చుంబింప యత్నింపగా ఆమె అధరానికి చేతిని అడ్డుపెట్టుకొని, కోపాన్ని ప్రదర్శించింది. కాని అజాడు బలవంతంగా ఆమె పెదవిపై దంతక్షతం కావించాడు అప్పుడు ఆమె కంఠంలో ఒక్క మధుర శబ్దం (మణితం) కలిగింది.

"అంత నావాగ్దేవి యావిధంబున నొదవిన కళామర్మ భేదన సామ్రాజ్య సంపదను భావావస్థ మాన లాఘవ శంకను ప్రకా శంబుగా గడిపి పుచ్చుట కుపాయంబు జింతించి తద్విరోధ కారిణియైన విభుని యభిమత కేళికి విఘాతంబుగ నధర పీడనా సహత్వ నాటితకంబున నలుక గల్పించుకొని యవ్వ లి మొగంబుగా బొరలె ......"30

దీంతో వారికి విరహం ఆరంభమైంది ప్రణయ సన్నివేశంలో వాణికి మానం (అలుక) కలిగింది. కాబట్టి ఇది ప్రణయమానం. ఈ మానం పోతే కాని ఆమె ప్రసన్న కాదు ఆమె ప్రసన్న అయితే కాని చతుర్ముఖునికి సరస్వతితో ప్రణయ లీలలో తేలడం సాధ్యం కాదు. దాని కోసం అతడు మాన ఉపశమన ఉపాయాన్ని ఆలోచించాడు అలిగిన వారి అలక తీరాలంటే, ఆ అలకకు కారణం అయిన వారిని సుముఖులనుగా చేసుకొంటారు. ఇది లోకంలో ఉన్న పద్ధతి.

ఈ పద్ధతినే బ్రహ్మ ఇక్కడ అనుసరించాడు. అక్కడే ఉన్న చిలుకతో ఉబుసు పోకకు ఓ కథ చెప్పమన్నాడు. ఆ చిలుక 'నావల్ల గాదు. మీరే చెప్పండి' అంది. బ్రహ్మ మొదలెట్టాడు. ప్రస్తుత, అప్రస్తుతాలు స్ఫురించేట్లు కళాపూర్ణుని కథను చెబుతున్నాడు. (కళపూర్ణుడంటే సరస్వతి ముఖం) దాన్ని తన వర్ణనగా గ్రహించిన వాణి చిలుకతో 'ఆ కళాపూర్ణుడు ఏమయ్యాడు? అతడికి తల్లిదండ్రులెవరు?' అని అడుగమంది అప్పుడు ఆ ప్రశ్నకు సమాధానంగా, " . ..... 'అ తనికి సుముఖాసత్తి యనునది తండ్రియు మఱి మణిస్తంభు డనెడి వాడు తల్లియు' నన వాణి హాసంబుతో గ్రక్కున గ్రమ్మఱి కౌగిలించినది. "31

స్త్రీ తండ్రి అనీ, పురుమడు తల్లి అనీ విపరీతంగా చెప్పడం వల్ల సరస్వతికి నవ్వు వచ్చింది ఆహాస్యాన్ని పట్ట లేక బ్రహ్మను కౌగిలించింది. ఇప్పుడు ఆమెలోని ప్రణయ మానం తుడిచి పెట్టుకు పోయింది శృంగారంలో అన్య రసాన్ని ఆధారంగా చేసికొని మానాన్ని ఉపశమింప చేయడాన్ని ఆలంకారికులు 'రసాంతరం' అంటారు. సామాది మానోపశమన షడ్విధ ఉపాయాలలో ఈ 'రసాంతరం' ఒకటి ఇక్కడ 'రసాంతరం' తో వాణి అలకను తీర్చి విరహాన్ని దూరం చేసి సరస్వతితో బ్రహ్మ సంపూర్ణ బోగాన్ని అనుభవించాడు.

"ఆనర్మ లీల చేత శ
తానందుండధిక సంభృతానందుండై
తానును మేలొప్పగన
మ్మానిని మెడ కౌగిలించి మక్కువ మీఱన్"32

"వదనములు నాలుగింటికి వరుస గలియ
మెలపుతోదన కంఠంబు మలచి మలచి
యొసగె దదధర పాన మహోత్సవంబు
గళము కౌగిలి తోన చెక్కులు నిమురుచు"33

సృష్టికర్త సంబోగ శృంగారంలో ఓలలాడాడు మళ్ళీ సరస్వతి కోపాన్ని తెచ్చుకొని తక్కిన కథ సాగించుమంది. అతడు చెప్పాడు. ఆమె విమర్శ పూర్వకంగా అంతా విప్పి చెప్పింది ఆనంద రసమగ్నుడై శతానందుడు ఆమెతో సంయోగ సుఖాన్ని అనుభవించాడు

" ---- - -- ------ తన ప్రియభా
మిని పలుకులకును బ్రమోద మేదుర హృదయుం
డును దత్పురి రంభణ వరు
డునునైయా పద్మజాడు. గడుం బొలు పొందెన్"34

ఈ విధంగా సంయోగ వియోగాత్మకం అయిన శృంగారాన్ని ఈ ఘట్టంలో ఆలంకారిక మర్యాదను అనుసరించి ప్రయోగాత్మకంగా చిత్రించాడు కవి అంతేకాక ఎప్పుడు సరస్వతికి

కోపం వస్తే అప్పుడు హాస్య సంభాషణతో ఆమె కోపాన్ని పోగొడుతూ మాటి మాటికి ఆమెతో సంభోగ సుఖాన్ని అనుభవించాడు బ్రహ్మ అసలు శృంగార తత్వరహస్యమే ఇది. ఈ విషయం ఈ ప్రయోగం ద్వారా లోకులకు ఉపదేశించాడు కవి.

## 2. శల్యాసుర - అభినవ కౌముదుల ఘట్టం (ఏకత్రానురాగం):-

కళాపూర్ణోదయంలో పింగళి సూరన సాంప్రదాయిక ప్రయోగం చేసిన ద్వితీయ ఘట్టం శల్యాసుర అభినవ కౌముదులది. దీనిలో ఏకత్రానురాగం చిత్రించబడింది. శల్యాసురుడు అభినవ కౌముదిని చూడడంతోనే అతనిలో అనురాగం అంకురించింది అభినవ కౌముదికి మాత్రం అతనిపై అలాంటి భావంలేదు ఆమె గంధర్వ కన్య. అతడు రాక్షసుడు కాబట్టి దీనిని దివ్య రాక్షస శృంగారం అనరాదు ఇచట రాక్షసునికి ఒక్కనికే అనురాగం కలిగింది కాబట్టి ఇది ఏకత్రానురాగం ఆభాసం. ఈ ఆభాస నిర్వహణ శిల్పంలో గూడా రాక్షసుని ప్రవర్తనను (నాయికయెడ) మృదుమధురంగా చిత్రించాడు రాక్షసుడైనా అభినవ కౌముదితో తనను వరింపుమని నయమున, భయమున చెప్పిచూసాడు. కాని రాక్షసంగా ప్రవర్తించలేదు. అతని 'అనునయ' విధానం ఆశ్చర్యం కలిగిస్తుంది.

ఘోరమైన శలల వృష్టిని కురిపించేప్పుడు కూడా దానిచే ఆమెకు బాధ కలుగకుండా ఉండేట్లు చేసాడు

"ఇత్తెఱంగున దనశక్తి యెఱుక పఱచి
యిక వరింపక చనియదే యీవుచనిన
చోటు లన్నియు నాబలస్ఫూర్తి చేత
బిడుగు పాఱిన డొంకయై పెంపడంగు "35

"దాననఖిల భయని దానంబ వగుదునీ
యన్వయమున లేనియట్టి తెట్టు
కుడువనీకు దగునె కోమలి? యది యెంచి
యైన నను వరింపు మనుచు బలికె "36

ఈ విధంగా సాగింది అతని ప్రేమ భాషణం కాని అభినవ కౌముది అతని యెడ విరక్త అతన్ని చంపించడానికే నిశ్చయించుకొని, మృగేంద్ర వాహన అనుగ్రహంతో మణికంధరుని వల్ల అతన్ని చంపింప గలిగింది. ఆ రాక్షసుడు తన ప్రేమాంధత్వంలో ప్రాణాలే కోల్పోయాడు తన్ను వరింపుమనే అతని వేడ్కోలు మనలో కూడా కరుణ భావాన్ని రేకెత్తిస్తుంది. ఇలా చిత్రించబడ్డ ఈ శృంగారం భావ పరిపుష్టత లేక ఆభాస రూపంతో అంతమైంది. ఈ విధంగా సూరనగారు సాంప్రదాయిక పద్ధతిలో ఆభాసంలో గూడా ఒక ప్రయోగాన్ని చేసి వదిలారు

**3. మధురలాలస అభినవ కౌముదులతో కళాపూర్ణుని దాంపత్య శృంగార ఘట్టం:- (అభిలాష, మాన విప్రలంభ సహిత సంభోగ శృంగారం)**

సాంప్రదాయిక పద్ధతిలో సంపూర్ణంగా శాస్త్రీయంగా ప్రయోగం చేయబడ్డ చివరి ఘట్టం మధుర లాలస, అభినవ కౌముదిలతో కళాపూర్ణుని శృంగారం దీనిలో ప్రబంధ సాధారణ రీతిలో శృంగారం శాస్త్రీయంగా ప్రయోగింపబడింది

గంధర్వ కన్య అయిన అభినవ కౌముదిని కళాపూర్ణుడు గాంధర్వ విధిన వివాహం చేసుకున్నాడు ఆమె 'దివంబునకుం జనక యావజ్జీవంబు నవ్విభుండునిచిన చోటున యునికికి నొడంబడిం'ది ఆమెతో కళాపూర్ణుడు దాంపత్య సుఖాన్ని అనుభవిస్తూ ఉన్నాడు

రూపానుభూతి, మదాశయుల కూతురైన మధురలాలస పూర్వజన్మ వశాత్తు కలిగిన ప్రేమచే చిన్న నాటి నుండీ కళాపూర్ణునిపై అనురాగం గలిగి ఉంది. కాబట్టి యౌవనం రాగానే కళాపూర్ణునిపై ప్రేమతో ఆయన సంయోగం కలుగక పోవడంతో విప్రలంబాన్ని అనుభవించింది. ఆ విప్రలంభం వారి కలయికకు పూర్వం కలిగింది కాబట్టి ఇది అభిలాష విప్రలంభం. ఈ అభిలాష విప్రలంభంలో దశవిధ మన్మథావస్థలు సలక్షణంగా చిత్రింప బడ్డాయి. ఆమెధ్యాసను అన్యథా మరల్చడానికి చెలులు ఆమెను వన విహారానికి తీసుకెళ్ళారు. వేగవేట కారణంగా కళాపూర్ణుడు అక్కడికి వచ్చాడు మధురలాలస తన ప్రియుని ఇప్పటి వరకు తన మనో నేత్రంతో దర్శిస్తూ ఉంది ఇప్పుడు చర్మచక్షువులచే అతని రూప సౌందర్యాల్ని చూరగొంది అతడు వెళ్ళాడు ఆమె విరహం అతిశయించింది చెలులు ఆమెకు శైత్యోపచారాలు చేయవలసి వచ్చింది అంటే ఆమె విరహం తారా స్థాయిని అందుకొంది. తదితర ప్రబంధ నాయికల లాగా మధురలాలస కూడా చంద్రోపాలంభనం చేసింది. మన్మథ పరివారంలో ఒకడైన శుకాన్ని ఉపాలంభించింది. కాని ఈ ఉపాలంభనం స్వల్పంగా ఉండి రమ్యంగా జరిగింది.

మధురలాలసను చూసి పోయినప్పటి నుండి కళాపూర్ణుని మనసు మనసులో లేదు అతడు కూడా విరహానికి అగ్గలమైనాడు. ఒక వృద్ధ విప్రునికి తన వ్యాధ్గత విషయాన్ని వివరించాడు. ఆ విప్రుడా మధురలాలస విషయాన్ని విశదీకరించి వారి వివాహ ముహూర్తాన్ని గూడా నిశ్చయించాడు రాజు అభినవ కౌముది అనుమతిని కూడా పొంది మధురలాలసను వివాహమాడి వారిని ఆవరించి ఉన్న వియోగానికి వియోగం కలిగించాడు తర్వాత వారిద్దరికీ సంయోగం సిద్ధించింది ఈ విధంగా నిర్వహించబడ్డ సాంప్రదాయిక అభిలాష విప్రలంభయుత సంభోగ శృంగార ప్రయోగంలో విభావాదులన్నీ సక్రమంగా పోషింపబడ్డాయి ఈ విధంగా మధుర లాలసా కళాపూర్ణులకు అభిలాష విప్రలంభాన్ని చిత్రించి కూడా మళ్ళీ అభినవ కౌముది, మధురలాలసలకు మాన విప్రలంభాలు కలిగినట్లు

చిత్రించాడు కవి. ఇక్కడ చిత్రింప బడ్డ మానం సరస్వతీ చతుర్ముఖుల ఘట్టంలో చిత్రింపబడ్డ ప్రణయ మానం లాంటిది కాదు. ఇక్కడ చిత్రింపబడింది ఈర్ష్యామానం.

వీణల ప్రసంగంలో సంతోషంగా పాల్గొనిన అభినవ కౌముదికి ఆమె చెలికత్తెలు కావాలని మధురలాలసపై ఈర్ష్యను కలిగించారు ఇక్కడ చెప్పుడు మాటల చేత అభినవ కౌముదికి ఈర్ష్యామానం కలిగింది. తర్వాత ఆ రాత్రి సాత్వికంగా మౌనపూర్వక నిరసనను అభినవ కౌముది తన భర్తకు తెలియ జేసింది. ఆమె ప్రవర్తనకు కారణం ఏమిటి? అని అతడు ప్రశ్నించగా,

"పాటల గెల్చినట్టి సతి పల్కులు పల్కులు గాక యిట్టునే
దోటమి నున్న మాపలుకులో నృపయేటికి నీకు! వట్టి యీ
మాటలకేమి పోదు! మది మక్కువ వేఱొక చోట నుండగా
బోటు దనాలు చన్నె మిము బోంట్లకు దక్కిన వారికిన్ బలెన్"37అని సమాధానం ఇచ్చింది.

ఇప్పుడు ఆమెను కళాపూర్ణుడు అనునయించాడు మానఉపశమన ఉపాయాలలో సామాది అయిదు ఉపాయాలు పని చేయకుండడం వల్ల 'నతి' అనే దాన్ని అనుసరించి 'పతినాతి పదాబ్జము వట్టి'నాడు 'విచిత్ర వల్లకి' తెచ్చి ఇస్తానని ఆమె మానాన్ని ఉపశమింప జేసాడు ఈ విషయాన్ని విన్న మధురలాలస కూడా మానమూనింది అక్కడికి కూడా వెళ్ళి కళాపూర్ణుడు ఆమె పాదాలపై కూడాపడి ఆమె మానాన్ని ఉపశమింప జేసాడు ఈ సాంత్వన ఘట్టాలు నిర్వహించడంలో సూరనగారు తిమ్మనగారిని మనసులో ఉంచుకొన్నా పారిజాతాపహరణంలోని సాంత్వన నిర్వహణలో ఉన్న రమ్యత ఇక్కడ లేదనే చెప్పాల్సి ఉంటుంది ఏది ఏమైనా సూరనగారు ఈ ఘట్టంలో అభిలాష విప్రలంభం, మాన విప్రలంభంతో కూడిన శృంగారాన్ని చిత్రించాడు సరస్వతీ చతుర్ముఖుల ఘట్టంలో ప్రణయమానం, శల్యాసుర ఘట్టంలో ఏకత్రానురాగం (ఆభాసం), ఈ ఘట్టంలో అభిలాష విప్రలంభం, ఈర్ష్యామానాన్ని చిత్రించి సాంప్రదాయిక మార్గంలో త్రివిధ ప్రయోగాల్ని నిర్వహించడంలో కృతకృత్యుడైనాడు

**B) నవ్య ప్రయోగాలు:-**

శృంగారంలో సాంప్రదాయిక ప్రయోగాల్ని నిర్వహించి కూడా, నవ్య ప్రయోగాలకు ఆద్యుడయ్యాడు సూరన కళాపూర్ణోదయంలోని కలభాషిణీ, మణికంధరుల, రంభానలకూబరుల ప్రణయ ఘట్టంలోనూ, సుగాత్రీ శాలీనుల సుముఖా సత్త్వ మణి స్తంభుల శృంగార ఘట్టంలోనూ మూడు విధాలైన నవ్య ప్రయోగాలు చేయబడ్డాయి. ఈ ప్రయోగాలు ఆలంకారిక మార్గానికి భిన్నంగా చేయబడ్డాయి కాబట్టే వీటిని నవ్య ప్రయోగాలు అంటున్నాం.

1. కలభాషిణి మణి కంధర, రంభానలకూబరుల ఘట్టం (విచిత్ర శృంగారం):-

వీటిలో కలభాషిణీ మణికంధర, రంభానలకూబర ఘట్టంలో 'విచిత్ర' శృంగారం పోషింపబడింది శృంగారంలో అద్భుతత్వ మేళనం వల్ల 'విచిత్రత' ఏర్పడింది. ఈ విచిత్ర శృంగార నిర్వహణకు సమతూకం కలిగిన నాలుగు పాత్రల్ని కవి ఎన్ను కొన్నాడు. వారికి గల సమతౌల్యాన్ని ఆధారంగా చేసుకొనే బింబ ప్రతిబింబత్వం కల్పింపబడింది. వారి రూపం, గుణాలు కూడా సమానమైనవే కలభాషిణి మానవ వేశ్య. రంభ దేవవేశ్య నలకూబరుని మోహించి అతనితో సుఖాన్ని పొందింది దేవ వేశ్య రంభ మణి కంధరుని మోహించి నారద శాప భీతిచే తన హృదయ భావాన్ని మరుగు పరచింది కలభాషిణి నలకూబరునిలో మణికంధరుని రూపు రేఖల్నిగని మోహచిత్త అయింది కలభాషిణి. వాసవాజ్ఞచే రంభ మణికంధరుని వద్దకు వెళ్ళి, తపోభంగం కావించి, అతనితో రమించినా, స్వప్రవృత్తిచే అతని సంగమంలో కూడా నలకూబరునే పలవరించింది. ఈ వేశ్య లిద్దరి పట్టుదలలూ సమానమైనవే అని ఏక రూపంలో ఉన్న వారు వాదించుకొన్నప్పుడు తేలి పోయింది ఇక నాయకులూ నాయికల లాగా సమతౌల్యం కలిగిన వారే మణి కంధరుడు భక్తుడు, రక్తుడు రంభ రూప విలాసాలకు లొంగి ఆమెతో రమించి ఆనందపు అంచులు చూసాడు. రంభ, నలకూబరుని సంగమ కాలంలో పలవరించడం వల్ల నలకూబరాకారంలో ఆమెకు తృప్తి కలిగింప తలచి, అతని రూపాన్ని ధరించి, ఆమెను రతుల దేల్చాడు మాయారంభ రూపంలో ఉన్న కలబాషిణితో కూడా సంగమించాడు ఇక నలకూబరుడు నిరంతరం రంభా సంగమం ఇచ్చగించే వాడు.

ఇలాంటి నాయికా నాయకులను గ్రహించి, అడుగడుగునా సంభోగం చిత్రిస్తూ, ఆ సంభోగ నిర్వహణలో అనేక విచిత్ర రీతులు పొందు పరచ బడ్డాయి. ఆ విచిత్ర రీతులలో నాయికా నాయకులకు స్వల్ప విరహాలు చిత్రిం చబడ్డాయి ఆ విరహాన్ని మనం 'విరహం' అని భావించలేని రీతిలో చిత్రించబడింది.

కలభాషిణి నలకూబరుని కూటమిక్తై ఎదురు చూడడంలో విరహం కలదు. ఇద్దరు రంభలు ఇద్దరు నలకూబరులు ప్రత్యక్షం అయినపుడు ఆ ముగ్గురిలో ఒక్కరికి స్వల్ప విరహం సంభవించింది ఇద్దరు రంభల వాగ్వివాదం అంతా విరహకాలమే. ఇద్దరునలకూబరుల ఘటనలో వాస్తవం వెల్లడి అయ్యే వరకు నలకూబరునికి విరహం కలిగిందని చెప్పవచ్చు ఈ విరహం అంతా ఆలంకారిక పద్ధతిలో ఉన్న విరహం కాదు ఇదంతా తత్కాల పరిస్థితుల్ని బట్టి మనం విశ్లేషించు కొన్నదే రంభా మణి కంధరుల, మాయారంభా మాయా నలకూబరుల, మాయానలకూబర రంభల సంభోగ శృంగారం చక్కగా చిత్రించబడింది. మాయారంభ, రంభ, మాయానలకూబర, నలకూబర మొదలైన సన్నివేశాలలో అద్భుతరస మిళితమైన శృంగారం చక్కగా ప్రయోగింప బడింది. ఇలాంటి

సన్నివేశాలు పాఠకుని ఉత్కంఠను విపరీతంగా పెంచుతాయి. విచిత్రరీతిలో ప్రయోగింపబడ్డ ఈ శృంగారం మనకు విచిత్రమైన ఆనందాన్ని కలిగిస్తుంది. అద్భుత (రస) మేళనం వల్ల శృంగారానికి విచిత్ర లక్షణం ఏర్పడింది. ఆలంకారిక సూత్రాలు ఇలాంటి చోట్ల అంతర్గతంగా భాసిస్తాయి కాని బహిర్గతంగా విశ్లేషించడానికి వీలుకాదు కాబట్టే ఇది నవ్య ప్రయోగం ఇక్కడ ప్రయోగింపబడింది విచిత్ర శృంగారం. దీన్ని విశ్లేషించిన జి. వి. కృష్ణారావుగారు రంభామణి కంధరులది అర్థ శృంగారం అన్నారు అర్థం అంటే ప్రయోజనం. ఒక ప్రయోజనాన్ని ఉద్దేశించి చిత్రించబడ్డ శృంగారం అని పిండితార్థం ఈ ప్రయోగపు మౌలికాంశాలు అర్థకామాలయినా శృంగారంలో ఇది విచిత్ర ప్రయోగమే. ఇక్కడ ప్రయోగింప బడింది విచిత్ర శృంగారమే

ఈ ప్రయోగంలో నాయికలుగా వేశ్యల్ని స్వీకరించినా వారి ప్రవర్తన మాత్రం విలక్షణమైంది. కలభాషిణికి నలకూబరుని కూడాలనే కోరిక నారదమహర్షి ఆశీర్వచనం వల్లనే వృద్ధినొందింది అతడు కూడా కలభాషిణిని చెరపదలచలేదు.

"కొమ్మ నీవాత్మలో మును గోరునట్టి
కాంతు రంభో మనోహరాకారుడగుచు
మెఱయు వానిని గూడి రమింప గలవు ...."38

అని నారదుడు అన్నాడు 'ఆమె ఆత్మలో మునుగోరునట్టి కాంతుడు' మణికంధరుడు 'అతడు నలకూబరాకారుడై మెరయు నపుడు అతనితో గూడి రమింప గలవు' అని నారదుని మాట 'ఆమె ఆత్మలో మునుగోరునట్టి కాంతుడు' నలకూబరుడని చెప్పుకుంటే అతడు 'రంభామనోహరాకారుడగుచు మెఱయు'ట ఏమిటి? ఈ మెరువు అనే పదం ప్రయోగించడం వల్ల మణి కంధరుడు నలకూబరుని రూపంలో మెరసి పోవాలనేది కవిభావం కృత్రిమాలైన వాటిలోనే మెరువు అధికం అనే విషయం సర్వజన విదితం కాబట్టి ఈ మెరువు అనే పద ప్రయోగం వల్ల 'నలకూబర రూపంలో ఉన్న మణికంధరుని' అని ధ్వనిస్తుంది. నాలుగు పాత్రలతో ఒక విచిత్ర రీతిలో శృంగారాన్ని ప్రయోగించడానికి వాటికి బింబ, ప్రతిబింబ భావం కల్పించి చమత్కారావహంగా ఆ ప్రయోగాన్ని నిర్వహించాడు కవి.

**2. సుగాత్రీ శాలీనుల; సుముఖా సత్త్రి మణిస్తంభుల శృంగారం (వినూత్న, విపరీత శృంగారాలు):-**

ఇక సుగాత్రీ శాలీనుల, సుముఖాసత్తి మణిస్తంభుల ఘట్టంలో గల శృంగారంలో అతిమనోహరాలైన రెండు నవ్య ప్రయోగాలు చేయబడ్డాయి. మొదటి ప్రయోగాన్ని వినూత్న శృంగారం అనీ, రెండవ దాన్ని విపరీత శృంగారం అనీ చెప్పవచ్చు.

మొదటి ప్రయోగంలోని నాయికా నాయకులు మానవులు సామాన్య కుటుంబీకులు. నాయిక సుగాత్రి. పూజారికి ఏకైక కూతురు. శాలీనుడు ఇల్లరికం అల్లుడు. ఈ ఇల్లరికం పద్ధతి పురుష సంతానం లేని మధ్య తరగతి కుటుంబీకులలో సహజం. లోకంలో ఇల్లరికం అల్లుడనగానే ఆ అల్లుడు తన వ్యక్తిత్వాన్ని కొంత వరకైనా వదులు కోవాల్సి ఉంటుంది. అలాకాకుంటే ఆ కుటుంబంలో తగవులు తప్పవు. శాలీనుడు ఇల్లరికం అల్లుడు. సాత్విక స్వభావం కలవాడు. కాని అతని మనస్తత్వం మాత్రం ప్రత్యేకమైంది సుగాత్రి సాధారణ స్త్రీలాగా కనబడే అసాధారణ నాయిక. ఇంగితజ్ఞ పతినే తన దైవంగా భావించే ఉత్తమ సాంప్రదాయిక కుటుంబీకురాలు. తన మాంగల్యమే తన సౌభాగ్యానికి మూలం అని తలచే ఆ ఉత్తమురాలు భర్త అడుగు జాడలే తనకు శరణ్యమని భావించింది. సుగాత్రి పతివ్రత

సుగాత్రి చెలికత్తెలు మొదటి శోభనపు రాత్రి ఆమెను సర్వాభరణాలంకృతను చేసి భర్త గదిలోకి పంపారు ఆమె అలంకారాల్ని జూసి శాలీనుడు బెంబేలెత్తి పోయాడు. ఇక్కడ సూరనగారు చక్కటి అంతస్సంఘర్షణ ఏర్పరిచారు సుగాత్రి అలంకారం ప్రాచీన సంప్రదాయానికి ప్రతీక. శాలీనుని మనస్తత్వం ఆధునికత్వానికి ప్రతీక ఇక్కడ సంప్రదాయానికి, ఆధునికతకు సంఘర్షణ ఏర్పడింది ఈ సంఘర్షణలో సంప్రదాయంపై ఆధునికతకు విజయం లభించింది సుగాత్రి తలపులన్నీ మాటుపరచి తలుపు వద్దనే నిలిచి పోయింది,తెల్లవారి ఆమె లక్షణాల్ని కనిపెట్టిన ఆమె చెలులు అతనికి సపర్యలు చేయుమని ప్రోత్సహించారు ఆమె అలాగే చేసింది కాని అతనిలోని భావం పైకిరాలేదు. అతనిలో భావం ఉంటే కదా రావడానికి అలంకృత అయిన తన బార్యయెడ అతని కెలాంటి భావమూలేదు. ఇలా కాలం గడుస్తూ ఉంది కాని కాపురం చక్క బడడంలేదు

సుగాత్రి తన మంగళ సూత్రమే తనకు సౌభాగ్యం అనుకొంది తనకు అంతపాటి అదృష్టమే చాలు అనుకుంది ఆమె అలా సర్దుకొని పోయినా లోకం, ఆమె తల్లి ఊరకుంటారా? లోకం లాగానే ఆమె తల్లి కూడా శాలీనుని వట్టి గొడ్డు మనిషి అని భావించి తోట పనికి నియోగించింది. శారదా దేవి భక్తుడూ సాత్త్వికుడూ అయిన శాలీనుడు తన తల్లి సేవకు ఈ పని పనికి వచ్చేదే అని అంగీకరించాడు. తోట పని విధేయతతో చేస్తూ ఉన్నాడు ఒకనాడు వర్షం బ్రహ్మాండంగా కురిసింది సుగాత్రి భయపడింది శారదా దేవిని ప్రార్థించింది ఆమె దయవల్ల తోటకు, శాలీనునకు ఏమీకాలేదు తర్వాత తోటకు వచ్చి నగలన్నీ ఊడ్చి మూట కట్టి, మరుగున పెట్టి తోట పనికి దిగింది తవ్వడం, మడవలు గట్టడం, మోపులు మోయడం మొదలగు పనులు చేయడంలో సుగాత్రి సహజ సౌందర్యం శాలీనుని హృదయంలో సుషుప్తమై ఉన్న 'రతి' భావాన్ని ఉద్బుద్ధం చేసింది అతడు భావోన్ముఖుడై ఆమె వద్దకు వెళ్లి 'నీకెందుకీ శ్రమ' అంటూ ఆమెకు పట్టిన చెమటను తన ఉత్తరీయపు కొంగుతోతుడుస్తూ మొదటిసారిగా ఆమెను స్పృశించాడు అతడు తుడుస్తూ ఉంటే స్వేదం మళ్లీ మళ్ళీపైకి వచ్చింది. అది మామూలు స్వేదం కాదుకదా! సాత్త్విక స్వేదం ఆమె కూడా అతనితో

సంభోగానికి సిద్ధమైందని ఆమె స్వేదమే చాటుతూఉంది. ఆమెను పొదరింటిచాటుకు తీసికెళ్ళాడు. ఇద్దరూ భోగించారు ఇన్నాళ్ళూ వాళ్ళకు ఏర్పడ్డ వియోగం నేడు తీరిపోయింది. తన ప్రియుడు తనకు చేరువయ్యాడనే సంతోషంతో సుగాత్రి ఇల్లు చేరింది. అందరూ ఆ విషయాన్ని గ్రహించారు ఆ రాత్రి మళ్ళీ సుగాత్రి సర్వాలంకార శోభిత అయి భర్తకడకు వెళ్ళింది కాని శాలీనుడు తోటలోని ఆమె రూపాన్నే ధ్యానిస్తూ ఉన్నాడు అతడు గొడ్డు మనిషి కాదని, అత్యంత సరసుడని తెలిసిన సుగాత్రి ఇప్పుడు మాత్రం కొంత రెచ్చి పోయింది. ఇది మానవ (స్త్రీ) సహజం. వేరొకతెపై మనసుంటే చెప్పమంది. మీకు లాగా ఆమెకు కూడా సేవలు చేస్తానంది. కాని ప్రత్యుత్తరం లేదు అతని మనస్తత్వమే అతనిది తొణకడు బెణకడు ఆ తర్వాత అతనికి 'భూషణాలు ఇష్టం లేవనీ, సహజ సౌందర్యమే ఇష్టమనీ' తెలుసుకొని నెమ్మదిగా తన కాపురాన్ని తానే చక్కదిద్దుకొంది.

ఇలాంటి ప్రయోగం తెలుగు సాహిత్యంలోనే అత్యంత వినూత్నమైందని చెప్పవచ్చు మనస్తత్వానికి ప్రాధాన్యం ఇచ్చి ప్రయోగింపబడ్డ ఈ శృంగారం వినూత్న శృంగారం అనడంలో సంశయం లేదు సుగాత్రీ శాలీనులు ఇద్దరూ ఒకరిపై ఒకరు అత్యంత అనురాగం కలవారు శారదాదేవి భక్తులు. ఆమె వారిలో ఏ ఒక్కరిని కూడా తోసిపుచ్చజాలదు. అందుకే వారిద్దరికీ విపరీతమైన వరాలను ప్రసాదించింది సుగాత్రి అందం చెడకుండా ఉండడానికి ఆమెకు సంతానాన్ని ఇవ్వవద్దని శాలీనుడు కోరాడు తన భర్త వల్ల తనకు ఉత్తమ గుణ సంపన్నుడైన కుమారుడు కలగాలని సుగాత్రి కోరింది ఈ రెండు వరాలనూ శారదాదేవి అనుగ్రహించింది కాని దీనిలో ఒకటి నెరవేరితే మరొకటి నెరవేరడానికి వీల్లేదు. కాబట్టి ముందు శాలీనుని కోరికను తీర్చి తర్వాత సుగాత్రి కోరికనుకూడా నెరవేర్చింది సుగాత్రీ శాలీనుల రూపంలో ఉన్నపుడు శాలీనుని కోరిక నెరవేరింది. వారు హ్రదంలో దూకిన తర్వాత అతడు మణిస్తంభుడుగా, ఆమె సుముఖాసత్తిగా మారారు ఈసారి సుగాత్రి కోరిక నెరవేర్చ బడింది

సుముఖాసత్తి మణిస్తంభులు మృగేంద్ర వాహనాలయంలో విచిత్ర రీతిలో కలుసుకొని అక్కడ కొంతకాలం ఉన్న తర్వాత అక్కడి నుండి వెళ్ళి ఒకవనంలో,

"రతి సలిపిరందు సిద్ధుడోయతివ
నీవు పురుమడవుగమ్ము నారీత్వమును భజింతు
నేననుచు విపరీత రతేచ్ఛబలికె
బలుకుటయు నాదరమున నజ్జలజ ముఖియు"39

"స్త్రీత్వము నీవొందుము పురుషత్వము నే
దాల్తునని నిజప్రియు బలికెన్
సత్వరతనట్లు వారల స్త్రీత్వము
పురుషత్వము విపరీతము లయ్యేన్" 40

ఈవిధంగా సుముఖాసత్తి, మణిస్తంభులకు విపరీత సురతేచ్ఛ కలిగింది. ఇలా లోకంలో చాలామందికి కలగవచ్చు కాని అది నెరవేరడం దుర్లభం శారదాదేవి అనుగ్రహ సంపాదకులైన వారికే అది నెరవేరుతుంది.

"అదియునుగాక యంగనల కంగజ సంగర కేళికావిశే
ష దశల యందు నెక్కుడట సౌఖ్యగతుల్ మగవారికంటె నా
కిదియు నెఱింగికో నిపుడ భీష్టము గావున నిట్టయుండగో
రెదనొక కొన్ని నాళ్ళు విహరింపుము నీవును పూరుషాకృతిన్" 41

స్త్రీకిగాని, పురుషునికిగాని విడివిడిగా సంపూర్ణ సంభోగ ఫలసిద్ధి లభించదు ఇద్దరి ఆనంద సమగ్ర స్వరూపమే శృంగారం ఇది కామ శాస్త్ర సిద్ధం ద్విముఖమైన ఈ ఆనందాన్ని ఒకరే అనుభవించడం అసాధ్యం కాని సుముఖాసత్తి మణిస్తంభులకు అది సిద్ధించింది- విపరీత పద్ధతిలో లింగరూప వ్యత్యయ ప్రయోగం వల్ల సంభోగ శృంగారానికి సంపూర్ణత్వం సిద్ధించింది వారు విపరీత రూపాల్ని పొందడం కృత్రిమంగా జరుగలేదు ఆ రూపాలు వారికి సహజంగానే సిద్ధించాయి వాళ్ళలో ఏ మాత్రం పలుకు, ప్రవర్తనలలో భేదం లేదనే విషయాన్ని విపరీత రూపాన్ని పొందిన మణిస్తంభుని స్త్రీ రూపాన్ని చూసి సత్వదాత్ముడనే రాజు మోహాన్ని పొందిన సంఘటన చాటి చెబుతూంది రూప వినిమయంలో కూడా ఆ దంపతులు సహజ స్త్రీ పురుష దంపతులుగానే భాసించారు ఈవిధంగా విపరీత రూపాలతో కామ పురుషార్థాన్ని సాధించడంలో వారికి కళాపుర్ణోదయమైంది అలా కళాపూర్ణుడు ఉదయించడంతో శారదాదేవి సుగాత్రికి ఇచ్చిన వరం నెరవేరింది

ఇలా ఒకే నాయికానాయకులకు రెండు రూపాల్ని ఇచ్చి ద్విముఖంగా ఉన్న శృంగారాన్ని ఏకముఖంగా వారు అనుభవించడానికి వీలు కల్పించి విపరీత శృంగారాన్ని ప్రయోగించడంలో సూరన గారు విజయాన్ని సాధించారు విచిత్ర శృంగారంలో లాగా వినూత్న, విపరీత శృంగారాలలో కూడా చక్కటి ప్రయోగాలు చేసి ఆధునిక శృంగార ప్రయోక్తగా సూరనగారు నిలచారు

మొత్తం ఆరుప్రయోగాలలో మూడిటిని సంప్రదాయ రీతిలోనూ, మూడిటిని నవ్యపద్ధతిలోనూ నిర్వహించి, శృంగార రస ప్రయోగంలో సవ్యసాచిగా నిలిచి కీర్తి గడించారు సూరన గారు దీనిలోని కొన్ని సంప్రదాయ ప్రయోగాలు మనకు పటిష్ఠంగా కనబడక పోవచ్చు ఆయన సంప్రదాయ ప్రయోగ ప్రావీణ్యాన్ని పటిష్ఠతను చూడాలంటే 'ప్రభావతీ ప్రద్యుమ్నం' అనే సూరన గారి ప్రబంధాన్ని పరిశీలించాలి

## ప్రభావతీ ప్రద్యుమ్నం - సాంప్రదాయిక ప్రయోగం :-

పింగళి సూరన గారు కళాపూర్ణోదయంలో వినూత్న, విచిత్ర మార్గాలలో ప్రయోగాల్ని నిర్వహించినా 'ప్రభావతీ ప్రద్యుమ్నం' లో మాత్రం తత్కాల కవి, పండిత వరేణ్యుల కోవలో నిలవడానికి సకలభావ సంభరితమైన సంప్రదాయ శృంగారాన్ని ప్రయోగించాడు. దీనిలో ఆలంకారిక నియమాను సారంగా రెండు రకాలైన శృంగారం ప్రయోగింపబడింది. మొదటిది అభిలాష విప్రలంభ పూర్వక సంబోగం రెండవది మాన విప్రలంభ పూర్వక సంభోగం.

ప్రభావతీ ప్రద్యుమ్నంలో నాయిక రాక్షస రాజపుత్రి ప్రభావతి నాయకుడు మానవుడు శ్రీకృష్ణ పుత్రుడైన ప్రద్యుమ్నుడు. మానవ దానవుల శృంగారం కావడంవల్ల అది విజాతీయ శృంగారంగా భాసిస్తూంది సకల సద్గుణవతి అయిన ప్రభావతికి పార్వతీ దేవి ప్రేరణ వల్లనే ప్రద్యుమ్నునిపై ప్రేమ కలిగింది పార్వతీదేవి ప్రభావతి స్వప్నంలో కనబడి ప్రద్యుమ్నుని చిత్ర ఫలకాన్ని ఇచ్చి ఇతడే నీ భర్త కాగలడని చెప్పింది . ఆ చిత్రఫలకాన్ని చూడగానే ప్రభావతిలో 'రతి' ఉద్బుద్ధమైంది అంటే ప్రద్యుమ్నునిపై ఆమెకు ప్రేమ కలిగింది 'కనుకలి' చే ఇక్కడ నాయికకు ప్రేమ కలిగింది. ఇక నాయకుడు తన వ్యాసంగంలో తానుండగా దేవకార్యార్థి, ప్రభావతీ ప్రణయకార్య నిర్వహణార్థి అయిన శుచిముఖి తనంతట తాను అవకాశాన్ని కల్పించుకొని అతని వద్దకు చేరి సమయానుగుణంగా ప్రభావతి యొక్క అంగాంగ సౌందర్యాన్ని వర్ణించి, ఆమె ప్రేమలో ప్రద్యుమ్నుడు పడేటట్టు చేయగలిగింది 'వినుకలి' చేతనే ప్రద్యుమ్నునిలో రతి అంకురించింది ప్రభావతిలో పార్వతి వల్ల ప్రేమ కలుగగా, ఆమె ప్రేమను ఆసరాగా చేసికొని శుచిముఖి అనే హంస ప్రద్యుమ్నునిలో ప్రేమను అంకురింప జేసింది ఇలా ప్రభావతీ ప్రద్యుమ్నుల ప్రణయ సారథులుగా పార్వతీ శుచిముఖులు కన్పడినా, శుచిముఖే వారి సంగమ పర్యంతం శ్రమించి, తత్కార్యాన్ని నిర్వహించిన ప్రత్యక్ష ప్రణయ సారథి. శృంగార నిర్వహణలో ఒక పక్షిని సాధనంగా వాడుకోవడం, ఆ పక్షిని అతి తెలివైనదానినిగా చిత్రించి, తద్వారా తన ప్రణాళిక నిర్వహించడం అనే విషయం కూడా సూరనగారు కొత్తగా చేసిన ప్రయోగమే అని చెప్పాల్సి ఉంది. కాళిదాసు మేఘదూతం మొదలు సూరన దాకా గల కవులందరిలో ఏ కొందరైనా దౌత్యానికి మానవుల్ని, మానవేతరాలైన పశు పక్ష్యాదుల్ని ఉపయోగించుకొన్నారు. కాని సూరన మాత్రం శుచిముఖిని కేవలం 'దౌత్యాని'కి మాత్రమే వాడుకోలేదు, శుచిముఖి ఘటనాఘటన సమర్థురాలుగా ఉండి ప్రభావతీ ప్రద్యుమ్నుల ప్రణయాన్ని అతిచాకచక్యంగా ఫలింపచేసింది. ప్రద్యుమ్నునితో బాటు అతని సోదరులైన గదసాంబులకు సునాభుని కూతులకు మధ్యగల ప్రణయం కూడా ఫలవంతం కావడానికి తానే కారణమై నిలచింది. సూరన ఇక్కడ సంప్రదాయ మార్గంలో పయనించినా, దానికి వన్నె గూర్చడానికే శుచిముఖి గైకొనబడింది దీనివల్ల సంప్రదాయ ప్రయోగంలో కూడా పాత పద్ధతే కాక అందొక మెరుపులాగా నూత్న పద్ధతి ప్రవేశ పెట్టబడి సంప్రదాయ ప్రయోగానికి వన్నె తేబడింది.

ప్రభావతీ ప్రద్యుమ్నులలో ప్రేమ అంకురించింది. అలా అంకురించినతర్వాత వారు కలవడానికి వీలు లేకుండా నాయికా నాయకులు భిన్న ప్రదేశాలలో - భిన్న రాజ్యాలలో ఉన్నారు దర్శన, స్పర్శనాదు లేవీ వారికి కలుగలేదు కలగడానికి ప్రస్తుతం వీలూలేదు. అందుకే వారు విరహం పాలయ్యారు. ఇద్దరూ పరస్పరానురాగ బద్ధులవడం వల్ల వారికి తీవ్రమైన విరహం సంభవించింది సంగమానికి ముందు కలిగిన విప్రలంభం కాబట్టి దీన్ని పూర్వ రాగ విప్రలంభం అని లేదా అభిలాష విప్రలంభం అని అంటారు. ఈవిప్రలంభంలో కలిగే అవస్థ లన్నిటినీ వారు పొందారు వీరిలో విరహ తీవ్రత వల్ల అనేక భావాలు పెల్లుబికాయి అవి శృంగార నిర్వహణలో చక్కగా సహకరించాయి.

విరహాన్ని పొందిన ప్రద్యుమ్నుడు ఉద్యానంలోకి వెళ్ళి అక్కడి వస్తువులన్నింటిలోనూ ప్రభావతే కనిపించగా విరహార్తుడయ్యాడు దాన్ని సహించ జాలక ఒక చిలుక ద్వారా లేఖ నొక దాన్ని శుచిముఖి పేర తన పరిస్థితిని వివరిస్తూ వ్రాసి పంపాడు అక్కడ ప్రభావతి కూడా మిక్కిలి విరహార్త అయింది. ఈ లేఖ ఆ తరుణంలో అక్కడికి చేరడం వల్ల ఆమెకు తాత్కాలికంగానైనా కొంత ఉపశమనం కలిగింది

ఆ తర్వాత శుచిముఖి భద్రనట వేషంలో ప్రద్యుమ్నుని వజ్రనాభ పురిలో ప్రవేశింప జేసింది అతడు కూడా మిక్కిలి చాతుర్యంతో వజ్రనాభుని కళ్ళుగప్పి ప్రభావతి కడకు చేరుకున్నాడు ఆ తర్వాత వారి నిరంతర సంభోగానికై ప్రద్యుమ్నుడు ఒకభూవివరాన్ని ఏర్పరిచాడు. ఆనారంగం ద్వారా ఆతని రాకపోకలు అవిచ్ఛిన్నంగా సాగాయి శుచిముఖి కోరికపై గదసాంబుల్ని కూడా ఆ నారంగం ద్వారా వచ్చి వారి ప్రణయాన్ని ఫలింప జేసికొననిచ్చాడు ఈ విధంగా వారి అభిలాష విప్రలంభం తొలగి సంబోగ సుఖాన్ని అనుభవిస్తూ ఉండిరి

ఆ తర్వాత సూరన కవి ఆ నిరంతర సంబోగంలో మళ్ళీ ఒక స్వల్ప విరహాన్ని ఏర్పరిచాడు గోత్రస్ఖలనం వల్ల ఇది ఏర్పడింది ప్రద్యుమ్నుడు ప్రభావతితో రమిస్తూ, ఆనందపారవశ్యంలో 'రతి'ని స్మరించాడు ఆ మాటను ప్రభావతి వింది దానితో ఆమెలో ఈర్ష్య పెల్లుబికింది.

"ప్రద్యుమ్నుండు ప్రభావతీ రతి విహార ప్రౌఢిసారస్యసం
పద్యుక్తిన్ గదుజొక్కి దక్కతి రతీ మత్ప్రాణమా నీకునం
చుద్యత్ప్రేమ సమృద్ధి బల్కెనది యాయోషాలలామన్ శ్రవ
స్సద్యః పాతనిశాత శూల సమమై చాలంగ నొంచెన్వెసన్" 42

ప్రద్యుమ్నుడు పలికిన మాటల్ని 'రతీదేవి' ని స్మరించినట్లుగా భావించి మాత్సర్యాన్ని బూని శయ్యాంతరా నశయనించి, ప్రద్యుమ్నునికి విరహాన్ని కలిగించింది ప్రభావతి.

ప్రద్యుమ్నుడు ఆమెను అనేక సామ వచనాలతో అనునయించాడు. ఆమె నిష్ఠురంగా మాట్లాడింది. సహించాడు ఇంతలో ప్రద్యుమ్నుడు అక్కడ నుండి వినవచ్చే కలకలం విని అక్కడి నుండి వెళ్ళిపోయాడు. ప్రభావతి అతని పోకడను గమనించి, తనను ఉపేక్షించి పోతున్నాడని అతని వెనుకనే కొంత దూరం పోయింది. కాని అతడు వెనుదిరిగి చూడలేదు ప్రద్యుమ్నునికి తెలియ కుండానే మాన ఉపశమన ఉపాయాలలో 'ఉపేక్ష' అనేది ప్రయోగింపబడింది దీంతో అతనికి కోపం కలిగిందని భావించి ప్రభావతి విరహార్త అయింది తన్ను నిందించు కొంది. ఆ తర్వాత రాగవల్లరి ప్రవేశించింది ప్రభావతికి తెలియకుండానే ప్రద్యుమ్నుడు అక్కడికి చేరాడు. ఆమె రాగవల్లరి తొడను దిండుగా చేసికొని పడుకొని ఉండగా ఉపాయంతో రాగవల్లరి ప్రద్యుమ్నుని ఆ స్థానంలో ఉంచి తాను వెళ్ళిపోయింది. చెలికత్తె రాగవల్లరే అనుకొని మెడపై చేయివేసి తన వద్దకు తీసికోగా ప్రద్యుమ్నుడు ప్రత్యక్షం అయ్యాడు ఆమెకు అలక పోయిఅతిలజ్జ ఆవహించింది 'నేను నీ పతిని కాదా'! అని ప్రద్యుమ్నుడు ఆమెను కౌగిట చేర్చాడు. ఇలా వారి విప్రలంభం తొలగిపోయి మళ్ళీ సంభోగం సిద్ధించింది. అభిలాష విప్రలంబంలో చంద్ర, మలయానిలుల ఉపాలంబానికి అవకాశం దొరకలేదు కాని మాన విప్రలంభంలో మంచి అవకాశం దొరికింది. ఈ విధంగా రెండు విప్రలంబాలను, రెండు సంభోగ శృంగారాల్ని ప్రయోగించి సంప్రదాయ రీతిలో సూరన ప్రభావతీ ప్రద్యుమ్నంలో దన ప్రయోగ ప్రావీణ్యతను చాటుకొన్నాడు

7. రాయల ప్రయోగాలు:-

పెద్దన గారంత స్పష్టంగా కాకున్నా రాయలవారు కూడా సంప్రదాయ మార్గంలోనే శృంగారాన్ని ప్రయోగిస్తూ నవ్య మార్గంలో అడుగు పెట్టారని చెప్పవచ్చు. సంప్రదాయ శృంగార లక్షణాలు అధికంగా ఉండి కొన్ని నవ్య శృంగార లక్షణాలు కూడా ఇందుండడం వల్ల రాయల వారిది కూడా మిశ్ర ప్రయోగమని చెప్పడానికి వీలుగలదు పెద్దనాదులు పాత్రలలో దివ్యాదివ్యత్వ మేళనం చేసారు ఆ ప్రణాళిక కూడా ఇందులో ఉంది కాని ఇందు దివ్యుడు అంటే సాక్షాత్ శ్రీ మహావిష్ణువే నాయకుడుగా, ఆయనచే విష్ణు చిత్తునికి దత్తయైన గోదాదేవి మానవకన్య నాయికగాస్వీకరింప బడ్డారు.

ఈ గోదాదేవి పూర్వజన్మలో సత్యభామ ఆయన సరేసరి శ్రీకృష్ణుడు ఈ మెకు ప్రాగ్జన్మ సంస్కారం కలదు వారి ప్రణయానికి ఈ సంస్కారమే కారణంగా చెప్పబడింది. గోదాదేవి యౌవన ఆవిర్భావం కాగానే వలపు అంకురించింది ప్రాగ్జన్మ సంస్కారం వల్ల కలిగిన వలపు కాబట్టి అది బలవత్తరమై ఆమె విరహంలో పడింది. విరహ తీవ్రతచే నాయికలంతా చంద్రుని మలయానిలుని, మన్మథుని ఉపాలంభించే వారు ఈ పద్ధతికి రాయలు స్వస్తి చెప్పారు. నాయిక నాయకుని వ్యాజనింద చేసింది. ఆమె తీరును చూసిన చెలులు ఆమె సత్యభామ అనీ తాము నాగకన్యలం అనీ వివరించారు ఈ తెలివిడి వల్ల ఆమె విరహంమరింత తీవ్రరూపాన్ని

దాల్చింది. తనువు త్యజించి అయినా స్వామిని చేరుతాననే నిశ్చయానికి వచ్చింది. ఆమె ప్రయత్నాన్ని చెలులు వారించి 'హరిని భజింపు'మని చెప్పారు హరిసేవతో ఆమె విరహం తారాస్థాయి నందుకొంది ఉన్మాదావస్థకు చేరుకొంది విష్ణుచిత్తుడు విస్మయం చెంది ఆమె విషయాన్ని స్వామికి నివేదించాడు. ఆయన విష్ణుచిత్తుని సమాధాన పరచి శ్రీరంగానికి శ్రీరంగని సేవించడానికి ఆమెను తోడ్కొని పొమ్మని చెప్పాడు.

ఈ విధంగానాయిక విరహంలో మగ్గుతున్నా నాయకుడు విరహార్తుడు కానట్లుగానే మనకు కనబడుతుంది. కాని అతడు కూడా విరహాన్ని పొందుతున్నాడనీ, అది అవ్యక్తంగా గూఢంగా ఉన్నదనీ గోదాదేవిని శ్రీరంగానికి శ్రీరంగని సేవించడానికి తోడ్కొని పొమ్మనడంలోనే తెలుస్తూంది ఆయన మహాసత్త్వం భంజకం కాకుండే విధంగాఆయన విరహంఇక్కడ వ్యంజింప బడింది. అంతేకాదు. తనవద్దకు వచ్చిన గోదాదేవిరూపం, లేత వయస్సులను సాభిప్రాయంగా చూసి స్వామి ఉవ్విళ్ళూరాడట దీన్ని బట్టి ఆయన కూడా ఆమెపై గల వలపుతో వేగుతున్నాడని గ్రహించవచ్చు ఇలా విరహాన్ని అనుభవిస్తూ ఉండడంవల్లనే తదుపశమనానికై తమకాన్ని ఆపలేని స్వామి తిరస్కరణీ విద్యచే గోదాదేవిని తన అంతఃపురంలో చేర్చి, ఇతరులు ఎరుగకుండే విధంగా ఒక మాయాకన్యను అక్కడ ఉంచాడు

విష్ణుచిత్తుడు ఆమెను పల్లకీలో తీసికొని ఇంటికెళ్ళాడు. ఆ పల్లకీ తెర తొలగించగా ఆమె కనబడలేదు దుఃఖితమతి అయిన విష్ణుచిత్తుడు రంగభర్త మోసం చేసాడని మిత్రులలో చెప్పాడు క్షుభితుడైన విష్ణుచిత్తుని మాటలు విన్న స్వామి, "ముదిమది తప్పి మాట్లాడెదవేల? మీ పిల్ల మీ ఇంట్లోనే ఉంది సరిగాచూసి లేనప్పుడు అనుము. మేం ఒప్పుకొంటాం. వృధాగా మమ్ముల్ని దూరెదవేల?" అని అతి లౌక్యంగా మాట్లాడాడు "ఎంతేవేడుకయైన బెండ్లగుటకీనే" 43 అని విష్ణుచిత్తుడు అనడం వల్ల గోదాశ్రీరంగేశుల కల్యాణం నిశ్చయమైంది దీంతో వారి విరహం తీరిపోతుంది కళ్యాణం కోసం స్వామి 'బ్రాహ్మీబ్రహ్మల, గౌరీరుద్రుల'ను అడగడానికి పంపించాడు. వరుడే తన పట్నానికి వస్తే కన్యను ఇస్తానన్నాడు. అలాగే వచ్చి స్వామి గోదాదేవిని చేపట్టాడు.

ఇక్కడ ప్రయోగింపబడ్డ విప్రలంభం అభిలాష విప్రలంభం అది నాయికకు వాచ్యంగానూ, నాయకునికి వ్యంగ్యం గానూ కలిగినట్లు చిత్రించబడింది గోదాదేవికి కలిగిన అభిలాష విప్రలంభ చిత్రణంలో రాయలు అనేక నవ్య ప్రయోగాలను చేసాడు ఆమె విరహానికి ఉద్దీపనంగా కాలాన్ని, ప్రకృతిని స్వీకరించాడు చంద్రాది ఉపాలంభాన్ని ఉజ్జగించి, నాయకుని వ్యాజ నింద చేయించి నూత్న రీతిని ప్రవేశపెట్టాడు నాయకుడు దివ్యుడైనా 'భ్రమరకీటన్యాయం' ఆధారంగా, నాయిక అదివ్య కాబట్టి ఆ లక్షణాలను నాయకునిలో కొన్నిచోట్ల భాసింపజేసాడు తన భక్తుడైన విష్ణుచిత్తునిచే తన మనోభీష్టాన్ని

నెరవేర్చు కొనడంలో భక్తిని ప్రధాన అంగంగా గ్రహించి, శృంగారానికి లౌకిక దోషం అంటకుండే విధంగా చేసికొన్నారు. సంభోగ శృంగారాన్ని అతిగా చిత్రించక ఒకే పద్యంలో ధ్వనింపజేసి కవి ఔచిత్యాన్ని పాటించాడు ఈవిధంగా రాయలు నూతన పద్ధతులతో కూడిన సంప్రదాయబద్ధమైన అభిలాష విప్రలంభాన్ని, సంభోగాన్ని, ఆముక్తమాల్యదలో చక్కగా ప్రయోగించాడు

## 8.భట్టుమూర్తి ప్రయోగాలు:-

ఏ మార్పులూ, చేర్పులూ లేకుండా సశాస్త్రీయ సంప్రదాయ శృంగారం ప్రయోగింపబడింది వసుచరిత్రలోనే. విభావాలు, అనుభావాలు, సాత్త్విక భావాలు, వ్యభిచారి భావాలు, దశవిధ మన్మథావస్థలు మొదలైనవన్నీ సక్రమంగా చిత్రించబడ్డాయి. నాయికా నాయకులకు అనురాగం కలగడం స్మరణ మననాలచే వారిలో విరహం కలగడం, అది తీవ్రం కాగా గిరిక చెలికత్తె అయిన మంజువాణి దౌత్యంతో అది శమించడం తర్వాత ఇంద్రాదులతో వారి వివాహం సశాస్త్రీయంగా జరుపబడడం తర్వాత నాయికా నాయకుల సంభోగ శృంగారం అనేవి క్రమంగా చిత్రింపబడి 'రతి ' యొక్క అంకురితాది అవస్థలు చిత్రింపబడ్డాయి. దీనివల్ల ఆలంకారిక పద్ధతిలో శృంగారం పోషించడానికి భట్టుమూర్తికి వీలుగలిగింది ఇందు వారికి కలిగిన అభిలాష విప్రలంభం సాంగోపాంగంగా ప్రయోగింపబడింది మన్మథాది ఉపాలంభనాలు యధావిధిగా ఉన్నాయి. సూరన దౌత్యకర్తగా శుచిముఖి అనే హంసిని(ప్రభావతీప్రద్యుమ్నంలో) వాడుకొన్నాడు రామరాజభూషణుడు తన వసుచరిత్రలో మంజువాణి అనే చెలికత్తెను దూతగావాడుకొన్నాడు శుచిముఖి అంతటి కార్యాన్ని నిర్వహించక పోయినా మంజువాణి గూడా గిరికావసురాజుల విరహబాధను ఉపశమింప జేసి వారి సంయోగానికి వారధి నిర్మించింది వసుచరిత్రలో శృంగార పోషణ గురించి వివరించిన విషయాన్ని పరికిస్తే దీనిలో ప్రయోగింపబడ్డ సంప్రదాయబద్ధ శృంగారం సువ్యక్తమౌతుంది నాయిక జన్మ వృత్తాంతంలో రసాభాస ప్రయోగం చేయబడింది.

వసుచరిత్ర లోని నాయకుడు దివ్య సంబంధం గల మానవుడు. నాయిక నదీపర్వతుల పుత్రిక. ఆమె ప్రకృతి స్వరూపిణి ఇతడు పురుష స్వరూపుడు. వసురాజు వీరుడు శుక్తిమతీ నదిపై బడి జలోపద్రవాన్ని కలిగించిన కోలాహలుని తన కాలిగోటితో మీటాడు వసురాజు అలాంటి అతడు తన క్రీడాశైలంపై నర్మసచివునితో కూడా విహరిస్తూ ఒకానొక మధుర గానపు పిలుపుచే అచ్చటికి చేరాడు. అపుడు నాయికా నాయకులకు పరస్పర దర్శనం వల్ల రతి ఉద్భవించింది. అంతకు ముందే మారు వేషంలో ఉన్న నర్మసచివుడు వసురాజు గిరికకు భర్త కాగలడు అని చెప్పి ఉన్నాడు. కాబట్టి ఇప్పుడు వారి అనురాగం పరస్పర అవలంబితమైగాఢత నొందింది. తర్వాత తన రాజధానికి చేరుకొన్నాడు. ఇక్కడ గిరిక, అక్కడ వసురాజు విరహవేదనా దోదూయమాన మానసులయ్యారు. వారి సంగమానికి

పూర్వం కలిగిన విప్రలంభం కాబట్టి ఇది అభిలాషా విప్రలంభం. తక్కిన విప్రలంభాల కంటే ఇది తీవ్రమైంది, విచిత్రమైంది సంగమానంతర విప్రలంభాలలో దీనిలో ఉన్నంత మధురత్వం ఉండదు. కలుగబోయే సంగమ సుఖాన్ని ఊహిస్తూ మధురమైన భాధను అనుభవిస్తూండడం దీనిలో కలదు నాయిక దశవిధ మన్మధావస్థల్ని పొందడం, నాయకుడూ అలాంటి స్థితినే పొందడం ఇందుంటుంది తమ తాపాన్ని అధికం చేసే మన్మధ, చంద్ర వసంతాదుల్ని తిట్టడం ఇందుంటుంది. ఇది మనోహరమైన భావం నాయిక విరహ తాపానికి వాడివత్తలౌతుంది. ఆమెకు చెలులు శైత్యోపచారాలు చేస్తారు ఆ శీతల వస్తువులన్నీ ఆమె తాపాన్ని అధికం చేస్తుంటాయి. అప్పుడు ఆమె చెలికత్తె ఒక ఉపాయం ఆలోచించి నాయికానాయకుల్ని కలపడానికి యత్నిస్తుంది ఆ యత్నం కూడా మనలో ఉత్కంఠను కలిగిస్తుంది వసుచరిత్రలో మంజువాణి ఆకాశ గమనంతో అతని మేడలో ప్రవేశించడం, బొమ్మలలో ఒకతె అయి నిలచి, విరహ తాపాన్ని పొందుతున్న వసురాజుపై గిరిక కంఠహారాన్ని వేయడం, అతడు దానివల్ల ఆనందం పొంది, తాపాన్ని తగ్గించుకోవడం, అతని ప్రేమను తెలుసుకొని మంజువాణి అతనికి గిరిక విరహాన్ని వివరించి తిరిగి రావడం, గిరిక ఆ విషయాలన్నీ విని తాపోపశమనం కాగా తేజరిల్లడం మున్నగు అంశాలన్నీ దౌత్యంలోనివే ఈ విధంగా నాయికా నాయకుల మధ్య చెలులు దౌత్యం నెరపడం పూర్వం నుండి ఉన్నదే. ఇదీ సంప్రదాయ సిద్ధమైందే

వారి వివాహానంతరం విరహం తీరిపోయి వారు స్మరకేళిలో తేలారు దీనిలో విప్రలంభ శృంగారం లాగానే సంభోగ శృంగారం కూడా చక్కగా ప్రయోగించబడింది కావ్య పరనం వల్ల బ్రహ్మానంద సహోదరానందం మనకు కలుగుతుండగా గిరికా వసురాజులు ఏకమై అనంగసుఖాన్ని అనుభవిస్తూ (బ్రహ్మాండమైన) బ్రహ్మానందంలో ఓలలాడారు ఈ విషయాన్ని కవే ఒక పద్యంలో వాచ్యం గానే చెప్పాడు నాయికా నాయకులకు ఇలాంటి బ్రహ్మానందం కలగడమే సంభోగ శృంగారం యొక్క పరమావధి

ఈ విధంగా సంప్రదాయసిద్ధ శృంగారాన్ని ప్రయోగించడంలో భట్టుమూర్తి ఆది మధ్యాంతాలలో సలక్షణంగా దాన్ని నిర్వహిస్తూ ఎలాంటి లోపం లేకుండా తీర్చిదిద్ది ప్రబంధ కవులలో తనతో సమానంగా ఎవ్వరూ సంప్రదాయ ప్రయోగాన్ని శృంగారంలో చేయలేరని నిరూపించుకొన్నాడు

రసాభాస ప్రయోగం:- రసాభాసం కూడా రసం లాగా సాహిత్యంలో ఉన్నత స్థానం సంపాదించు కొనిఉంది, భట్టుమూర్తి గూడా రసాభాస శిల్పప్రయో గంలో మేటిగా నిల్చాడు. ఇందు ప్రయోగింపబడ్డ రసాభాసం ఆభాస మాత్రంగా నిలచి ఆభాసుపాలు కాలేదు దానికి ఫలంగా ప్రబంధ నాయికే ప్రభవించింది

శుక్తిమతిని గాంచిన కోలాహలుడు ఆమెను సమీపించాడు. ఆమె అతన్ని సగౌరవంగా సంభావించింది. అతడు ఆమెను కోరాడు. ఆమె అతని ఉన్నతత్వాన్ని, తన నీచత్వాన్ని ఎత్తిచూపి, సవినయంగా అతన్ని తిరస్కరించింది. కాని అతడు మోహాంధుడై ఆమెపై బడి తన కోరికను తీర్చుకొన్నాడు. అతని బలాత్కారం వల్ల జలోపప్లవం సంభవించి ప్రజలు కడగండ్లపాలయ్యారు. వారు వసురాజు వద్ద కెళ్ళి మొరపెట్టుకొన్నారు వారి మొరను ఆలకించి వసురాజు వచ్చి తన కాలి గోటితో ఆకోలాహలుని మీటాడు. అతడు ఆ నది ఒడ్డున పడిపోయాడు వారి సంగమానికి ఫలంగా గిరిక, వసుపదులు పుట్టారు

ఇక్కడ శుక్తిమతికి అనురాగం లేదు. కోలాహలునికి ఉంది. కాబట్టి ఇది ఏకత్రానురాగం. అయినా కోలాహలుడు సంభోగసుఖాన్ని పొంది తద్వారా సంతాన ఫలాన్ని కూడ పొందాడు శుక్తిమతి కోలాహలులకు పరస్పర అనురాగంలేకున్నా కోలాహలుని బలాత్కారంవల్ల సంతానాన్ని పొందింది. ఆ సంతానం కోసం అయినా వారిని తల్లిదండ్రులుగ వ్యవహరించ వలసి ఉంది ఇచటి ఆభాస ప్రయోగం కూడా ఫలసహితంగా ఉంది ఇలా ఆభాస ప్రయోగ ఫలితంగా పుట్టిన గిరికే తర్వాతి అభిలాషవిప్రలంబ శృంగార ప్రయోగంలోనూ, సంభోగ శృంగార ప్రయోగంలోనూ, నాయిక అయి నిలచింది ఇలాఆభాస సృష్టికర్తలైన శుక్తిమతికోలాహలులుకూతురైన గిరిక పెండ్లిని విధివిధానంగా చేసారు కాబట్టి ఇక్కడచిత్రింపబడ్డ ఆభాసం తర్వాత వారి దాంపత్య జీవనంతో పరిహారమై తర్వాత నిరంతర సంభోగం సిద్ధించింది. ఈ ప్రయోగ నిర్వహణంలో భట్టుమూర్తి పెద్దనను అనుసరించాడు కాని పెద్దన గారి ప్రయోగాలంతటి తీవ్రతను ఇది పొందలేదు. ధ్వన్యాత్మకంగా మాత్రమే ఇట మిశ్రప్రయోగం వ్యంజింపబడింది

మొత్తం మీద వసుచరిత్రకారుడు అభిలాష విప్రలంబ సంభోగ శృంగారాలతో రసాభాసాన్ని కూడా చక్కగా ప్రయోగించి సంప్రదాయ ప్రయోగాలన్నింటా విజయాన్ని పొందాడు.

## 9. మల్లన ప్రయోగాలు:-

రాజశేఖర చరిత్రంలో సంప్రదాయబద్ధమైన శృంగారమే ప్రయోగింపబడింది. రాజశేఖరుడు అదివ్యుడు. కాంతిమతి శాపవశాన భూమిపై జన్మించిన గంధర్వ కన్య ఆలంబనంలో దివ్యాదివ్యత్వ మేళనం, ఇతర ప్రబంధాలలో లాగా దీనిలోనూ ఉంది. కాంతి మతి రాజశేఖరులు పరస్పరం చూసుకోవడంవల్ల అంటే 'కనుకలి' వల్ల వారిలో అనురాగం అంకురించింది. రాజశేఖరుని వద్ద ఉన్న చిలుక, కాంతిమతి చెలికత్తెలవల్ల వారి అనురాగం తీగలుసాగి వారు విరహంలో పడేట్లు చేసింది. సంగమానికి ముందే వారికి 'అభిలాషవిప్రలంభం' కలిగింది. కాంతిమతి రాజశేఖరులు విరహంలో మగ్గిపోయారు.

నాయిక చేయవలసిన చంద్రోపాలంభనాన్ని దీనిలో విరహతీవ్రతతో నాయకుడే చేసాడు. నాయికకు చెలులు శైత్యోపచారాలు చేసారు.

వారి విషయాన్ని తెలుసుకొన్న కాంతిమతి తండ్రి రాజశేఖరుని వద్దకు వచ్చి మాట్లాడి వివాహ ముహూర్తాన్ని నిశ్చయించి తర్వాత రాజోచితంగా వివాహం చేసాడు ఆతర్వాత కూతుర్ని అత్తవారింటికి పంపారు దీనితో వారి విరహం తీరిపోయింది ఇంత విరహం పొందిన వారి సంభోగ శృంగారం కేవలం ఒక్క పద్యంలోనే చిత్రించబడింది ఇది కవిగారి సంయమనానికి చిహ్నం అని భావించవచ్చు ఈవిధంగా మాదయగారిమల్లన తన రాజశేఖర చరిత్రలో ఆలంకారిక మర్యాదాను సారంగా అభిలాష విప్రలంభం, సంబోగ శృంగారం చిత్రించాడు

## 10. రాదామాధవ కవి ప్రయోగాలు:-

చింతలపూడి ఎల్లనార్యుడు కూడా తన రాధామాధవంలో సంప్రదాయ శృంగారంలో ప్రయోగాలు చేసాడు

శివుడు, శ్రీమహావిష్ణువును లక్ష్మీసమేతంగా భూమిపై అవతరించి, ఆమెతో క్రీడించుమని కోరాడు విష్ణువు యశోదానందులకు తనయుడుగా ద్వారకలో పుట్టాడు లక్ష్మీదేవి సహస్రగోపునకు రాధయై జన్మించింది వారు భార్యాభర్తలు దివ్యులు భువిపై మర్త్యులుగా జన్మించారు కాబట్టి వారు నాయికా నాయకులైన రాధాకృష్ణులు దివ్యాదివ్యులని చెప్పవచ్చు నారదుడు సహస్రగోపుని ఇంటికి వచ్చి, రాధ కృష్ణుని సతి కాగలదని చెప్పాడు కృష్ణుని రూపాన్ని, గొప్పతనాన్ని కూడా వర్ణించాడు ఈ 'వినుకలి' వల్ల రాధ మదిలో కృష్ణుడు నిలిచి ఆమెలో వలపు రేపాడు

రాధలో వలపు కలగడానికి బీజం నాటిన నారదుడు కృష్ణుని వద్దకు కూడా వచ్చి, రాధ సౌందర్యాన్ని వర్ణించి శ్రీకృష్ణునిలో కూడా వలపు రేపాడు ఈ 'వినుకలి' కృష్ణునిలో తీవ్రవిరహాన్ని కలిగించింది ఆకృష్ణుడు తన ప్రియురాలి వద్దకి దౌత్యం కోసం వాణిని స్మరించగా ఆమె మధురవాణి అయి రాధ వద్దకెళ్ళి, ఆమె కృష్ణాసక్తఅని తెలుసుకొని, ఆమెకు కృష్ణుని గుణగణాల్ని వివరంగా చెప్పింది దీనిలో రాధకు తీవ్రమైనవిప్రలంభం కలిగింది. అటు కృష్ణునికి, ఇటు రాధకు అభిలాషవిప్రలంభం కలిగింది

ఆమె విరహపు వేడిని, వాడిని తగ్గించడానికిఆమె చెలులు ఆమెను ఉద్యానవనానికి తీసికెళ్ళారు అక్కడ వారు పుష్పాపచయం చేసి, రాధతో మన్మథ పూజ చేయించారు ఆమెవిరహంరెట్టింపయింది ఆమె విరహ కారకులని భావించబడ్డ మన్మధ, చంద్రులు చెలికత్తెలతో ఉపాలంభింపబడ్డారు. రాధ విరహబాధ తాళలేక మూర్ఛపోయింది చెలులు ఆమెను ఇల్లు

చేర్చారు రాధ విరహాన్ని తెలుసుకొన్న తండ్రి సహస్రగోపుడు ఆమెను కృష్ణునికి ఇస్తానని సబలో ప్రకటించాడు కాని రాధ సోదరుడైన భద్రకుడు మాత్రం అందుకు అంగీకరించలేదు. దీనికి సహస్రగోపుడు వ్యాకులత చెందాడు.

రాధాకృష్ణుల కళ్యాణం ప్రకటించగానే వారి విరహానికి అవసాన దశ వచ్చినట్లయింది కాని బద్రకుడు వ్యతిరేకించడంవ ల్ల వారి విరహంమరికొంత కాలం కొనసాగింది సహస్రగోపుడు శివుని గురించి తపస్సు చేసిఆయన సలహాపై స్వయంవరాన్ని ప్రకటించాడు రాధ కృష్ణుని వరించింది కాని కృష్ణుడామెను వీరోచితంగా పరిగ్రహించాల్సి వచ్చింది. ఆతర్వాత వారు విరహాన్ని విడిచి సంబోగాన్ననుభవించారు తెలుగు సాహిత్యంలో రాధ పరకీయగా చిత్రింపబడి పరకీయా వ్యామోహ శృంగారానికి ప్రశస్తి వహించింది. రాధికా సాంత్వనాలు, తదితర కావ్యాలలోనూ రాధ పరకీయే. ప్రకృతి ప్రతీక అయిన రాధ, లక్ష్మి అవతారంగా, స్వీయానాయికగా రాధామాధవంలోచిత్రింపబడింది ఇలాంటి మార్పుచేసి, రాధ కృష్ణుల వలపును చిత్రించి, వారికి మొదట అభిలాష విప్రలంభాన్ని, అనంతరం సంబోగాన్ని చిత్రించాడు కవి

నారద ప్రేరణ, వాణి దౌత్యం భద్రుకుని వ్యతిరేకత అనే నిమ్నోన్నతులచే అభిలాష విప్రలంభం చక్కగా పోషించబడింది

విరహానంతరం వారి సంభోగశృంగారం కూడా చక్కగానే ప్రయోగించ బడింది కాని ఇతర కవుల లాగా నిగ్రహంతో సంభోగాన్ని చిత్రించ లేదు దాంపత్య శృంగారమైనా అతిగా చిత్రింపబడి కొన్నిచోట్ల అవధులు దాటినట్లు కనిపిస్తుంది ఏది ఏమైనాసంప్రదాయ బద్ధంగా విప్రలంభ, సంబోగాలు చక్కగానే చిత్రించ బడ్డాయనిచెప్పవచ్చు

## 11. రామభద్ర కవి ప్రయోగాలు :-

అయ్యలరాజు రామభద్రుని 'రామాభ్యుదయ' ప్రబంధం లో కూడా ప్రవాస విప్రలంభం, సంబోగ శృంగారం అనే రెండు విధాలైన సంప్రదాయ శృంగార ప్రయోగాలు చేయబడ్డాయి

సంబోగ శృంగారాన్ని ప్రయోగించడానికి ఇందు రెండు ఘట్టాలు స్వీకరించబడ్డాయి దశరధుని (భార్యలతో) సంభోగ శృంగారం 2.సీతారాముల సంబోగ శృంగారం దశరథుడు తన భార్యలతో వన విహారం సల్పిన చోట దర్శన, స్పర్శనాదికమైన సంబోగ శృంగారం చిత్రించబడింది ఇక సీతారాముల సంభోగ శృంగారం వాచ్యంగానే చిత్రించబడింది

"చేకొనెగక్మసీమలు విచిత్ర గతింగుచశైల దుర్గముల్
చేకొనె మధ్య దేశమును జేకొనె నూరు యగంబులోనుగా

బైకొనె బాహుశక్తి సతి బల్మి ఋనాలమునన్ బెనంగిర
త్నాకర మేఖలా స్థలము నవ్విభుడంతయు జేకొనెందుదిన్"44

"ఇట్లు వివిధ బంధ విశేషంబులం జొక్కి యక్కన్య కౌగిటందక్కి యిట్టనియె" 45

ఇలాంటి సంభోగ సుఖాన్ని అనుభవించే సీతారాములకు తీవ్రమైన విప్రలంభం కలిగింది సంభోగానంతరం కలిగిన విప్రలంబం కాబట్టి, నాయికానాయకులు వేరు వేరు ప్రదేశాలలో ఉండి విరహాన్ని అనుభవించారు కాబట్టి, ఇక్కడ ప్రయోగింపబడింది ప్రవాస విప్రలంభ శృంగారం

ఈ ప్రవాస విప్రలంభాన్ని సీతారాములు ఇద్దరూ అనుభవించారు. రాముడు శోకాకులుడయ్యాడు సీత కూడా దుఃఖితమతి అయింది విరహ తీవ్రతచే వారికి దుఃఖం కలిగింది ఇక్కడ శోకాన్ని స్థాయిగా గ్రహించి, కరుణరసం కలదని చెప్పడంసముచితంకాదు ఇష్టజన శాశ్వత వియోగం, తదితర దుఃఖ కారణాలేవీ ఇందు పొందుపరచ బడలేదు భార్యాభర్తలు ఎడబాటును పొందడం చేత వారుఅన్యదేశాలలో ఉండడం చేత తొందరగా వారికి సంయోగం కలడానికి వీలు లేకుండడం చెత వారి విప్రలంభం విజృంభించి శోక పర్యంతమైంది.

" . . . జనక తనయా వియోగ వేదనాధీన మానసుండై రమువరుండు సౌమిత్రి కిట్టనియె" 46

"వానల సీతా విరహ ద
వానల సంతాప మంతకంతకు నధికం
బైనది శమింప దించుక
యైన దటేద్వప్నాయుతము లొటనే చెపుమా" 47

శ్రీరాముడు విరహబాధకు తాళలేక చంద్రాదుల్ని ఉపాలంభించాడు. అశోకవనిలో సీత అనుభవించిన శోకాకులిత విరహం అంతా ప్రవాసవిప్రలంభమే ఇలా సంభోగ, ప్రవాసవిప్రలంభ శృంగారాల్నిచిత్రించినరామభద్రుడు శ్రీరామునిపై శూర్పణఖకు కలిగిన మోహాన్ని, రావణునికిసీతపై వ్యామోహం ఉన్నట్లు చిత్రించి వ్యామోహ శృంగారాన్ని కూడా ప్రయోగించాడు రావణునిది ఏకత్రాను రాగం అని చెప్పడానికి వీలులేదు అది కేవలం వ్యామోహం గాని అనురాగం కాదు

## 12. రుద్రకవి ప్రయోగాలు:-

కందుకూరి రుద్రకవి తన నిరంకుశోపాఖ్యానంలో విచిత్రమైన విప్రలంభ శృంగారాన్ని, వ్యామోహ భరిత సంభోగ శృంగారాన్ని ప్రయోగించి ఉన్నాడు దీనిలోని నాయకుడు

నిరంకుశుడు నాయిక అతని భార్య కాని ఇద్దరు వేశ్యలు కూడా ఇందు నాయికలుగా స్థానాన్ని సంపాదించుకొన్నారు ఒకరు మానవవేశ్యచంపకగంధి. మరొకరు దేవవేశ్య రంభ. అగ్నిసాక్షిగా వివాహంచేసుకొన్న నిరంకుశుడు విటచర్య కు దిగి, తన భార్యను విరహం పాలు చెసి, వెశ్యలిండ్లలో సంభోగ సుఖాన్ని అనుభవించాడు. అతని భార్య మాత్రం అతడు మారి తనను దరి జేర్చేవరకు వివిధ విరహాల్ని అనుభవిస్తూ ప్రత్యాశతో కాలంగడిపి, చివరకు అతనితోకలిసే వరకు ఆమె దీర్ఘ విప్రలంభాన్ని అనుభవించింది.

విరంకుశుడు విధ్యుక్తంగా ఆమె పాణిగ్రహణమొనర్చడంలో ధర్మ శృంగారం ఆరంభమై, అతని వేశ్యాలోలత్వాన తిరస్కృతంగాక అతని ధర్మపత్నిలో నిలచి కావ్యాంతాన ఆమెను స్వీకరించే వరకు ఉండి ఫలవంత మైంది. కాబట్టి ఇందలి శృంగారం ధర్మబద్ధమైన సంప్రదాయ శృంగారం అని చెప్పవచ్చు. నిరంకుశుని ధర్మపత్ని అనుభవించిన నిగ్రహంతో కూడిన విప్రలంభం విశిష్టమైందీ, విచిత్రమైందీ కూడా దీనిలో విరహ, ప్రవాస విప్రలంభ లక్షణాలుమిళితమై ఉన్నాయి తన ధర్మపత్నితోనిరంకుశుడు ఒక్కసారి భోగించిన లక్షణాలు కూడా ఇందు కనబడడంలేదు కాబట్టి అభిలాషవిప్రలంభ లక్షణాలు, అతడు ఆమెను నిరాకరించగా బాధపడి ఆమె చంపకగంధి భాగ్యాన్ని మెచ్చుకొనడంలో మానవిప్రలంభ లక్షణాలూ ఈషద్వ్యక్తంగా ఉన్నాయి కాబట్టి అన్ని రకాలైన విప్రలంభాల్ని నిరంకుశుని ధర్మపత్ని అనుభవించింది ఇలాంటి విప్రలంబాన్ని ప్రబంధ కవులలో ప్రయోగించిన వాడు ఒక్క రుద్రకవే అని చెప్పవచ్చు

నిరంకుశుడు వ్యామోహంతో డబ్బిచ్చి చంపకగంధిని భోగించే చోట అర్థ శృంగారం కలదు అతని రంభాసంభోగం కూడా ఇలాంటిదనే చెప్పవచ్చు కాని దానిలో ఇంచుక విశేషం ఉంది నిరంకుశుని దీక్ష, ఉపాయశాలిత్వం, వివేకాలు రంభను సంపాదించడంలో స్పష్టమైనాయి శివునితో పాచికలాడి పందెంలో రంభనుగెలిచాడు ఇంద్ర శాపం వల్ల పాషాణమైన రంభను మళ్ళీరంబగా మార్చి నిరంతరం ఆమెను భోగించేలాగున ఇంద్రునిచే వరం పొందాడు ఇలా వ్యామోహంతో విటునిగా ప్రవర్తించినా చివరిలో మళ్ళీ భార్యను చేరదీసి ధర్మ శృంగారానికి పట్టం గట్టాడు కాబట్టి ఇందలిది సంప్రదాయబద్ధ శృంగారం అనిచెప్పు వచ్చు

## 13. తెనాలి ప్రయోగాలు:-

తెనాలి రామకృష్ణుని కృతులలో శృంగారంలో ఎలాంటి విశిష్ట ప్రయోగాలు చేయబడ లేదు కాని అతడు మాత్రం శృంగారాన్ని స్పృశింపక వదలలేదు ఘటికాచల మాహాత్మ్యంలోని ద్వితీయాశ్వాసంలో హరిశర్మ తరళల శృంగారం చిత్రించబడింది హరిశర్మ బ్రాహ్మణుడు. తరళ పనిపిల్ల అతనిపై జాలిపడి అతనితో సంబోగానికిఅంగీకరించింది. ఆ ఇద్దరికీ

అనురాగం బలిసి శారీరక సంబంధంనిలచిపోయింది. వారు వివాహం చేసుకోలేదు. ఈ కొద్ది కథలోనే అభిలాషవిప్రలంభం సంభోగ శృంగారం ధ్వన్యాత్మకంగా ప్రయోగింప బడ్డాయి దీనిలోనే సప్తఋ షుల తపోభంగం చేయడానికి వచ్చిన రంభాదుల విలాసాలు, ప్రకృతిగత వాతావరణం శృంగారాను కూలంగా చిత్రించబడినా, అవి రస పర్యవసాయులు కాలేదు.

పాండురంగ మాహాత్మ్యంలో నిగమశర్మ కథలో మోహ శృంగారం ప్రయోగింప బడింది నిగమశర్మ తనకు ఉపకారం చేసిన కాపు కోడలితో రహస్య సంబంధం పెట్టుకుని తర్వాత అమెతో లేచి పోయాడు. కొన్నాళ్ళకు అమె మరణించింది తర్వాత మరొక చండాలకన్యను చేపట్టి పుత్రులగన్నాడు కాని అపవిత్రమైన అతని సంసార బంధాన్ని అగ్నిహోత్రుడు దహించి వేసాడు ఈ విధంగా నిగమ శర్మ వ్యామోహ శృంగారం పాండురంగ మాహాత్మ్యంలో ప్రయోగింపబడింది

ఇక ఉద్భటారాధ్య చరిత్రలో కూడా మదాలసుని వ్యామోహ శృంగారం ప్రయోగింపబడింది ఇందు మదాలసుడు కనకలతతో భోగించాడు ఆమె భోగం కోసం మదాలసుడు బ్రాహ్మణులైన తండ్రి, కుమారులిద్దరినీ సంహరించాడు ఈ విధంగా పాపవర్తనుడైనా నిగమశర్మ లాగా ఇతడూ క్షేత్రమాహాత్మ్యం వల్ల పరమపదం పొందాడు.

తెనాలి రామలింగడు తన మూడు ప్రబంధాలలోనూ క్షేత్ర మాహాత్మ్యాలను, పుణ్యపురుషుల చరిత్రను చెప్పడానికి ఉద్దేశించి తన రచన సాగించాడు ఆ క్షేత్రాల మహిమ ఇంత గొప్పదని నిరూపించడానికే బ్రాహ్మణ కుమారులను విటుల్నిగా, నీచుల్నిగా చేసి వారి దుష్టవర్తనం వల్ల గాక వారు పుణ్యక్షేత్రాలలో మరణించడం వల్ల వారికి పరమ పదాన్ని ఇచ్చాడు ఈ విధంగా మోహ శృంగారం ప్రయోగింపబడింది ఆ మోహంఎంత తీవ్రంగా చిత్రించబడితే అంత గొప్పగా క్షేత్రమాహాత్మ్యం ఉండి తీరుతుంది ఈ శృంగార ప్రయోజనం ఇంతే.

## 14. ధూర్జటి - తదితరుల ప్రయోగాలు:-

ధూర్జటి తన కాళహస్తి మాహాత్మ్యంలో దాసి - మిండ జంగం కథలో సంభోగ శృంగారాన్ని చక్కగా ప్రయోగించాడు కాని దీని ప్రయోజనం దైవ మాహాత్మ్యాన్ని తెలుపుటే

సంకుసాల నృసింహ కవి తన కవికర్ణ రసాయనంలో సంప్రదాయ బద్ధమైన, వియోగ సంయోగాత్మకమైన శృంగారాన్నే ప్రయోగించాడు

యయాతి చరిత్ర, తపతీ సంవరణోపాఖ్యానం, చంద్ర భాను చరిత్రాలలో కూడా సంయోగ వియోగాత్మకమైన సంప్రదాయ శృంగారమే ప్రయోగించబడింది.

తెనాలి అన్నయ్య సుదక్షిణాపరిణయం, సారంగు తమ్మయ్య వైజయంతీ విలాసం, చదలువాడమల్లన విప్రనారాయణ చరిత్ర, ఎడపాటి ఎఱ్ఱన మల్హణ చరిత్ర మున్నగుప్రబంధాలలో సంప్రదాయ శృంగారమే ప్రయోగించ బడింది (కొన్నిటిలోవేశ్యలు నాయికలుగా ఉండి మోహ శృంగారం కూడా చిత్రించబడి ఉంది)

మొత్తంమీద ప్రబంధ కవులలో మిశ్ర నవ్యప్రయోగాల్ని చేసి, అల్లసాని పెద్దనగారు, పింగళిసూరన గారు అగ్ర స్థానంలో ఉన్నారు తర్వాత సాంప్రదాయిక ప్రయోగాల్ని చేసి, నంది తిమ్మన, రామరాజ భూషణుడు, కృష్ణదేవరాయలు మొదలగు వారు వారి వరుసలో నిలబడ దగి ఉన్నారు క్షేత్ర మాహాత్మ్యాలు, భగవత్తత్వ ప్రతిపాదకాలైన రచనలు చేసి, వ్యామోహ శృంగారాన్ని ప్రయోగించిన కవులు రెండవ స్థానంలో నిలువదగి ఉన్నారు పైవారిని అనుకరించి ప్రయోగాలు చెసిన వాళ్ళు కూడా ద్వితీయ స్థానంలో ఉండదగిన వారే ప్రబంధ కవులంతా ఏదోవిధంగా శృంగార సన్నివేశాలను సృష్టించి, తద్వారా ఏదో విధమైన ప్రయోగాల్ని చేసే ఉన్నారని చెప్పాల్సిఉంది ఇంకా సూక్ష్మంగా పరిశీలిస్తే వారుచేసిన ప్రయోగాలనేకం వెలికితీయవచ్చు నా పరిశోధనలో కొన్ని ముఖ్యమైన ప్రయోగాల్ని మాత్రమే పరిశీలిం చి వాటిని వారు ప్రయోగించిన తీరుతెన్నులను పరిశీలించాను ఇంకావిశ్లేషిస్తే తరతమ బేదాలు కలిగిన ప్రయోగ బేదాలు ఎన్నింటినోనిరూపించడానికి వీలుంది ప్రబంధ కవుల ప్రయోగ ప్రావీణ్యం అలాంటిది వారి ప్రయోగాల్ని దర్శించి మనం ఆనంద ఆశ్చర్యాల్ని పొందక తప్పదు

ప్రయోగ బేద వృక్షాల్ని దీని వెనుక ఇస్తున్నాను ప్రధాన ప్రయోగాలు సాంప్రదాయిక, ఆధునిక, మిశ్ర ప్రయోగాలనేవి మూడు. వీటిలో ఇంకాఅనేక భేదాలు ఉన్నాయి వాటిని ప్రయోగ భేద వృక్షాలలో చూడవచ్చు.

